**mana bhaasha**

(A collection of essays on the structure of Telugu Language)

**Dr. D.Chandrasekhara Reddy**



First Published December, 2001

*Typesetting & Cover Design*
Vivid Design Ventures
✆ 040-658 8819

*Printed at*
Akruthi Offset Printers
✆ 040-766 4525

*For Copies*

- **Media House Publications**
  1-9-289/4, Behind Post Office
  Vidyanagar, Hyderabad - 500 044.
  ✆· 760 7307

- **Visaalaandhra Book House**
  All Branches

Price: **Rs. 100**




## మీ

## ఋణం తీర్చలేనిది, ప్రేమ మరువలేనిది



కీ॥ శే॥ నాగారెడ్డి హరిశేషా రెడ్డి
గారికీ



కీ॥ శే॥ మెట్టు సుందరరామి రెడ్డి
గారికీ

# విషయసూచిక

# పరిచయం

తెలుగు మన భాష అది మన భాష కాబట్టి మనకు తెలిసే ఉంటుంది బాగా తెలుసు కాబట్టి ఇంకా తెలుసుకోవలసిన పనిలేదు మన భాషను గురించి పూర్తిగా విశదంగా తెలుసుకోవాలంటే సమగ్ర నిఘంటువులేదు సువిస్తృత వ్యాకరణ గ్రంథం లేదు వాటిని సిద్ధం చేసుకోవాలన్న ఆకాంక్ష అప్పుడప్పుడూ పుడుతుంది కాని మన ఆరంభ శూరత్వంవల్ల ఆ భావం, శ్రద్ధా ఎంతో కాలం నిలవవు మనవి విశాలహృదయాలు కాబట్టి మనవి కాని వాటిమీద మనకు భక్తి తాత్పర్యాలు హెచ్చు మనదే అయిన భాషమీద అతిపరిచయకారణంగా నిరాదరణ, అవజ్ఞ తెలుగుజాతి భిన్నప్రాంతాల్లో, దేశాల్లో విభక్తమై ఉందికాబట్టి మనకు ఏకసూత్రత కుదరదు అన్యభాషల వాళ్ళు మనల్ని అవమానిస్తున్నారనుకొన్నప్పుడు, మనమీద పెత్తనం చేస్తున్నారను కొన్నప్పుడు తెలుగుతేజం చూపాలనిపించి విశాలాంధ్ర కాకపోయినా ఆంధ్రప్రదేశాన్ని సాధించాం అంతటితో మన రాజకీయావసరాలు తీరాయి ఈ కాలంలో మనిషి రాజకీయ పశువని ఇంగ్లీషువాడు చెప్పి, బోధపరిచి పోయాడు మనకామాట నచ్చింది కాబట్టి రాజకీయా లకు మాత్రం తెలుగును పరిమితంచేసి అప్పుడప్పుడు మనం తెలుగువాళ్ళమని చెప్పుకుంటూ తెలుగుభాషను, అది ప్రతిఫలించే, ప్రతిబింబించే తెలుగు సంస్కృతిని ఆదరించటానికి ఏదో కొన్ని పదవులు, కొందరికి ఉపాధి సౌకర్యాలూ కల్పించి చేతులు దులుపుకుంటాం లేదా కడుక్కొని తుడుచుకుంటాం ఇదే తెలుగుదనం ఇది మనజాతి సాధారణ లక్షణం

మన సంఖ్యాబలం తెగ పెరిగిపోతున్నది ముక్కోటి ఆంధ్రులు, ఎనిమిదికోట్ల మందైనారు ప్రభుత్వంవారి లెక్కల ప్రకారం మనలో సగం మందికి పైగా అక్షరాస్యులున్నారు మనదేమో స్వర్ణాంధ్రదేశం కాబోతూ అభివృద్ధి పథంలో పరుగులు తీస్తున్నది. మన సంగతి ఖండాంతరాల్లో మోగిపోతున్నది అయినా అన్ని తెలుగు పత్రికలకూ కలిసి పది లక్షల మంది చందాదారులు లేరు ఇది దినపత్రికల విషయం తెలుగుభాషకంటూ ప్రత్యేక పత్రికలు లేవు సాహిత్యాన్ని ప్రచారం చేసే పత్రికలు స్థాపిస్తుంటాం – సాధ్యమైనంత త్వరలో అవి మూతపడేందుకు తోడ్ప డతాం. ఇలాంటి దేశంలో, కాలంలో, జాతిలో కొంతమంది అమాయకులు మన భాషను గురించి, సాహిత్యాన్ని గురించి తమకు తెలిసిన విషయాలనూ కనీసం యువతీ యువకులైనా తెలుసుకోవటం మంచిదనిపించిన విశేషాలనూ, పత్రికా ముఖంగానో, పుస్తక రూపంలోనో ప్రచురిస్తున్నారు– ఆత్మతృప్తికోసం, భాషాభిమానం చంపుకోలేక అటువంటి మరో ప్రయత్నమే మన భాష' అనే శీర్షికతో వార్తాపత్రిక 'వార్త'లో ధారావాహికంగా డాక్టర్ డి చంద్రశేఖరరెడ్డి రాసిన వ్యాసపరంపర బహుకాలం అధ్యాపన వృత్తిలో ఉండడమేగాక పరిశోధన ప్రవృత్తిగా కూడా ఉన్న వాడు కాబట్టి మన భాషను గురించి మనవాళ్లకు సాధ్యమైనంత సూటిగా తెలియ జెప్పాలని ఆరాటపడ్డాడు – పడుతున్నాడు

మనకు సాంప్రదాయకంగా అందుబాటులో ఉన్న వ్యాకరణ గ్రంథాలు సూత్ర పద్ధతిలో రాసినవి ఆధునిక భాషాశాస్త్రజ్ఞులు రాసినవి బీజగణితంలో రేఖా గణితాదులు కలిపి రాసినవి వాటిని చదివి మన భాషను గురించి దాని లక్షణాలను గురించి తెలుసుకోవాలంటే తరగతి

గదుల్లో కూర్చొని గురుముఖతః అధ్యయనం చెయ్యక తప్పదు అందుకు కావలసిన విశ్రాంతి, అర్హత, వయోధర్మం వగైరాలు అందరికీ ఉండవు మన నిఘంటువులు ఒక పట్టాన దొరకవు దొరికే వాటిని కొనటానికి చాలామందికి (ఆర్థిక) శక్తి చాలదు సాధ్యమైనంత ఎక్కువ మందికి అందుబాటులో ఉంచగలిగినవి వార్తాపత్రికల్లో ధారావాహికంగా వెలువరించగలవే ఈ వాస్తవం తెలిసిన డాక్టర్ చంద్రశేఖరరెడ్డి ఆ విధంగా వెలువరించిన వ్యాసపరంపరకు ఈ విధంగా గ్రంథ రూపమిచ్చి భాషాభిమానమున్న కొద్దిమంది తెలుగువాళ్ళకైనా సేవచేసిన పుణ్యం పొందాలని తాపత్రయపడుతున్నాడు ఈ ప్రయత్నాన్ని అభినందించాలి మన భాషను గురించి మనవాడు మనకు వివరించటం, మనం చదివి లాభపడటం రెండూ హర్షించవలసిన విషయాలే

తెలుగు రాయటంలో, ఉచ్చరించటంలో సాధారణంగా కనిపిస్తున్న లోపాలను పేర్కొని వాటిని సరిదిద్దటంతో రచన ఆరంభమవుతుంది ఒత్తు లెక్కడున్నవో తేలక బాధపడే వాళ్ళు మనలో చాలామంది ఉన్నారు సంధులెలా చేస్తే సరిగా ఉంటుందో తెలుసుకోవటం మంచిది మన భాషమీద అన్యభాషల ప్రభావం ఏ మేరకు మార్పులు తెచ్చిందో తెలియటం మెరుగు ఒకే పదం విశేష్యంగా క్రియగా విశేషణంగా ఉన్న సందర్భాలనేకం అవేమిటో తెలియటం అవసరం మాటలకున్న అర్థాల్లో ఎన్నో విధాల మార్పులు వస్తుంటాయి స్థూలంగానైనా వాటిని గమనించక తప్పదు పర్యాయపదాలనిపించేవి కొన్ని అయితే నానార్థాల్లో వినిపించేవి మరికొన్ని వాటిని గుర్తించటం అవసరం ఇవన్నీ ఒక ఎత్తయితే సంస్కృతం నుంచి తెలుగులోకి పెద్ద మార్పు ల్లేకుండా వచ్చి చేరిన మాటల గురించి చేసిన విశ్లేషణ మరోఎత్తు. ఏ ఉపసర్గ చేరినప్పుడు ఏ ధాతురూపానికి ఏ అర్థవిశేషం వస్తుందో రచయిత చాలా విపులంగా వివరించాడు సంస్కృత తద్ధిత ప్రత్యయాలనూ, రూపాలనూ విశదీకరించాడు ఈ వివరాలకోసం నిఘంటు వ్యాకరణాలను గాలించవలసివస్తుంది పాఠకులకు ఆ శ్రమ తప్పించటానికి చంద్రశేఖరరెడ్డిగారు తాము పరిశ్రమించారు రచనా ధోరణి చూస్తుంటే కృత్ప్రత్యయాదులనూ, ఇతర వ్యాకరణాంశా లనూ విశదీకరిస్తూ మరో గ్రంథం వెలువరించబోతున్నట్లుంది. అలాగే జరుగుగాక!

గ్రంథంలోని అన్ని అంశాలనూ ప్రస్తావించటం పరిచయోద్దేశం కాదు స్థాలీపులాకంగా రచనలోని విలక్షణతనూ, ప్రయోజనాన్నీ ప్రస్తావించింది రచయిత పాండితీ పరిశ్రమలను పాఠకుల దృష్టికి తేవటానికే. ఇంత మంచి రచనను పరిచయం చేసే అవకాశం నాకు కల్పించి నందుకు రచయితకు నేను ఋణపడ్డాను మనభాష విశ్వరూపాన్ని ప్రదర్శించేందుకు మరో గ్రంథం త్వరలో వెలువడుతుందని ఆశిస్తూ, వెలువరించమని అర్థిస్తూ, భాషాపరిజ్ఞాన సాధనలో ఈ రచన చాలా ఉపకారకమని పాఠకులకు తెలియబరుస్తున్నాను భాషాభిమానులు ఈ గ్రంథాన్ని సమాదరిస్తారని ఆకాంక్షిస్తున్నాను

–బూదరాజు రాధాకృష్ణ

# నిరంతర ప్రవాహం భాష

మానవ విజ్ఞానం బహుముఖంగా అనంతంగా విస్తరిస్తూ ఉంది ఈ విజ్ఞాన విస్తరణకు వాహిక భాష. ఎంత సాంకేతికాభివృద్ధి జరిగినా, ఎన్ని యంత్రాలు వచ్చినా భాష ఉపయోగం పెరిగేదే కాని తరిగేది కాదు. భాషాభివృద్ధికి ఎటువంటి అడ్డంకులూ ఉండవు భాష దినదిన ప్రవర్ధమానం భాషా స్వభావం గురించీ, భాషా నిర్మాణం గురించీ ఎంతో పరిశోధన జరిగింది ప్రపంచంలో అనేక భాషలకు వ్యాకరణాలు వచ్చాయి. సంస్కృత భాషకు పాణిని రచించిన అష్టాధ్యాయి అన్న వ్యాకరణం అసమానమైనదిగా ప్రపంచ భాషా శాస్త్రవేత్తలు వేనోళ్ళ కొనియాడుతున్నారు. ఏ భాషకైనా సమగ్రమైన నిర్దుష్టమైన, నిర్దిష్టమైన వ్యాకరణ రచన ఒక ఆదర్శమే భాష కాల పరిణామంలో పొందిన అభివృద్ధినీ, మార్పులనూ విశ్లేషిస్తూ నిరంతరంగా వ్యాకరణరచన కూడా కొనసాగుతూ ఉండాలి. వ్యాకరణం కంటే కూడా క్షణక్షణ పరిణామాలకు లోనయ్యేది నిఘంటువు. మన విజ్ఞానం పెరిగేకొద్దీ నిఘంటువులో కొత్త మాటలు వచ్చి చేరుతూ ఉంటాయి. మన భాషలో ఉన్న పదజాలంతోనే చిరుమార్పులతో కొత్త పదాలను సృష్టించుకోవచ్చు. పదాల కూర్పుతో, మార్పులతో కొత్త భావాలను ప్రకటించవచ్చు అవసరమైనప్పుడు అరువు తెచ్చుకోవచ్చు ప్రతిభాషలోనూ పెరుగుదలకు విస్తృతమైన అవకాశం ఉంటుంది.

మన భాషకు ఏడెనిమిది వందల సంవత్సరాల నుండి లిఖిత వ్యాకరణాలున్నాయి. గత శతాబ్దం వరకు కంఠస్థం చేయడానికి అనుగుణంగా పద్యాలలో వ్యాకరణాలను రచిస్తే గత శతాబ్దం నుండి వచనంలో సూత్ర వ్యాకరణాల రచన ప్రారంభమయింది. అయితే ఈ వ్యాకరణాలలో ఎక్కువ భాగం మన కావ్య భాషను వర్ణించేవి. వాడుక భాషను వర్ణించేవి కావు. గత శతాబ్దం వరకు మన నిఘంటువులు కూడా పద్య రూపంలోనే ఉండేవి. ఇవి పర్యాయ పద నిఘంటువులు. అర్థ వివరణ వీటిలో ఉండదు. ఈ నిఘంటువుల పరిమాణం కూడా పరిమిత మయిందే. గత శతాబ్దంలో అకారాది క్రమంతో అర్థ వివరణాత్మకమయిన వచన నిఘంటువులు ప్రారంభమయ్యాయి.

తెలుగు భాషకు అటు కావ్యభాషకు కాని, ఇటు వాడుక భాషకు గాని లిఖిత రూపంలో ఒక సమగ్ర వ్యాకరణం కాని, ఒక సమగ్ర నిఘంటువు కాని లేవు. కిందటి శతాబ్దం చివరి పాదంలో మహామహుల ఉద్యమాల ఫలితంగా వాడుకభాష రచనా

భాషగా రూపొందింది ఆధునిక రచనాభాష/ ప్రమాణభాష రూపుదిద్దుకొంది ఈ ఆధునిక రచనాభాషకు ఒక మంచి వ్యాకరణమూ, ఒక మంచి నిఘంటువూ రావలసిన అవసరం ఎంతో ఉంది. అట్లాగే భాషా పరిణామాన్ని నిరూపించే వ్యాకరణాలూ, నిఘంటువులూ రావాలి

భాషా ప్రాధాన్యం మనకు తెలుసు అయినా భాషా ప్రయోగంలో మనం తగినంత శ్రద్ధ చూపించడం లేదు. ఈ అశ్రద్ధ రాయడంలోనూ ఉంది. సలక్షణమయిన భాషను నిరూపించడంలోనూ ఉంది ఒక ఇంగ్లీషు మాటను రాసేటప్పుడు ఆ మాట వర్ణక్రమం (స్పెల్లింగు)లోనూ, ఔచిత్యవంతమయిన ప్రయోగంలోనూ ఎంతో జాగ్రత్తగా ఉంటాం సంస్కృతమయినా, హిందీ అయినా మరే ఇతర భాష అయినా అంతే మాతృభాషను వాడడంలో మనకు కొంత నిర్లక్ష్యం ఉందనడంలో సందేహం లేదు. దుకాణాల పేర్ల బోర్డులు కానీ, గోడలమీద రాసిన నినాదాలు, అడ్వర్టయిజుమెంట్లుగాని, పోస్టర్లుకాని, కరపత్రాలు కాని చూసినప్పుడు ఈ విషయం అర్థమవుతుంది ఇప్పుడు కొంత మెరుగుదల కనిపిస్తున్నా ఇంకా ఎంతో మార్పు రావలసిన అవసరం ఉంది ఇంతమంది తెలుగు వారిలో ఆధునిక రచనాభాషను సలక్షణంగా వాడగలిగిన వారి సంఖ్య పరిమితమే మన ఉపన్యాసాలు కూడా అటు గ్రాంథికమూ, ఇటు వ్యావహారికమూ కాని సంకర భాషలో ఉంటాయి ప్రతి తెలుగు వాడూ చక్కని తెలుగు మాట్లాడగల, రాయగల సామర్థ్యాన్ని సాధించాలి సర్వ సామర్థ్యాలకూ మూలం భాషా సామర్థ్యం. మన పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ భాషా బోధనకు ప్రాధాన్యం ఇవ్వాలి. ఏ భాషను విషయంగా తీసుకుంటే ఎక్కువ మార్కులు వస్తాయి అన్న దృష్టితో మనం వ్యవహరించడం దురదృష్టకరం ఏ భాషను నేర్చుకోవడమూ దోషం కాదు. కాని మాతృభాషను వదిలిపెట్టడం సరికాదు

పాఠశాలల్లో భాషా బోధనకు ఎక్కువ సమయం వినియోగించాలి భాషా బోధనలో అధ్యాపకులకు మంచి శిక్షణ ఇవ్వాలి, ముఖ్యంగా ప్రాథమిక పాఠశాలల్లో ఏ అధ్యాపకుడయినా భాషను బోధించవచ్చునన్న అభిప్రాయాన్ని మార్చుకోవాలి. ప్రాథమిక పాఠశాలల్లోనే ఎక్కువ సామర్థ్యం ఉన్న, శిక్షణ పొందిన ఉపాధ్యాయుల అవసరం ఉంటుంది ఈ ఉపాధ్యాయులను ప్రోత్సహించవలసిన అవసరం చాలా ఉంది ప్రపంచ వ్యాప్తంగా భాషా బోధనలో జరుగుతున్న పరిశోధనల ఫలితాలను ఎప్పటికప్పుడు వీరికి అందించవలసిన అవసరం ఉంది. పత్రికలు సమాచారాన్ని అందించడమే కాక ప్రజల భాషా సామర్థ్యాలను పెంచగలవు కూడా అందువల్ల

పత్రికలు తాము అందించే భాష విషయంలో తగినంత జాగ్రత్త వహించాలి

వార్త'లో 'మన భాష' శీర్షికను ప్రారంభించినప్పుడు మన మాటల వర్ణక్రమమూ, పదనిర్మాణమూ గురించి చెప్పాలనుకున్నాను పద నిర్మాణంతో పాటు ఆ పదాల అర్థచ్ఛాయలూ, వాడుకా కూడా కొంతవరకు తెలిపే ప్రయత్నం చేశాను కొంత చమత్కారమూ, హాస్యమూ, కథన ధోరణీ ఉంటే తప్ప సామాన్య పాఠకులకు ఆకర్షణీయంగా ఉండదన్న అభిప్రాయం ఒకటి ఉంది కాని వ్యక్తిగతంగానూ, పత్రికాముఖంగానూ ఉత్తరాలు రాసి చాలామంది పాఠకులు ప్రోత్సహించారు. భాషను గురించి ఎంతచెప్పినా తరిగేదికాదు చదువుతున్న కొద్దీ, ఆలోచిస్తున్న కొద్దీ ఎన్నో కొత్త విషయాలు స్ఫురిస్తుంటాయి పాత విషయాలను మళ్ళీ గుర్తు చేసుకోవడం. కొత్త వాటిని గురించి ఆలోచించడం నిరంతరమూ జరగవలసిందే మన అభిప్రాయాలను నలుగురితోనూ పంచుకోవడానికి పత్రికలు బాగా ఉపయోగ పడతాయి.

'వార్త'లో 'మనభాష'కు స్థానం కల్పించి నూరు వారాలపాటు కొనసాగించిన 'వార్త' యాజమాన్యానికీ, సంపాదకులు శ్రీ కె రామచంద్రమూర్తి గారికీ కృతజ్ఞతలు బద్ధకించకుండా ప్రోత్సహించిన కృష్ణకూ, గుడిపాటికీ కృతజ్ఞతలు చెప్పాలి.

'మనభాష' పుస్తకం రూపంలో రావాలని మిత్రులూ, విద్యార్థులూ, ముఖ్యంగా అధ్యాపకులు చాలామంది కోరిక వెలిబుచ్చారు. మీడియాహౌస్ పబ్లికేషన్స్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ డా॥ గోవిందరాజు చక్రధర్ దీనికి పుస్తకరూపం ఇచ్చారు. భాషా సాహిత్యవేత్త, గురుతుల్యులు డా॥ బూదరాజు రాధాకృష్ణగారు అభిమానంతో 'పరిచయం' అందించారు. వారికి నా హార్దిక కృతజ్ఞతలు.

నా రచనావ్యాసంగానికి నిరంతరం ప్రోత్సాహం ఇచ్చే మిత్రులు డా॥ కాకాని చక్రపాణిగారు, ఆచార్య ఏ.ఉషాదేవిగారు, డా॥ కె లక్ష్మీనారాయణశర్మగారు, నా అర్ధాంగి డా॥ రాజ్యలక్ష్మి, పిల్లలు హిమ, పావన్‌లు.

'వార్త'లో ధారావాహికంగా వస్తున్నప్పుడు ప్రోత్సహించిన అసంఖ్యాక విద్యార్థి మిత్రులూ, అధ్యాపక మిత్రులూ, సహృదయ పాఠకులూ అందరికీ కృతజ్ఞతలు భాషాజ్ఞానానికి ఈ రచన ఏమాత్రం తోడ్పడినా కృతార్థుణ్ణి.

–డి. చంద్రశేఖర రెడ్డి

# మీడియా హౌస్ పబ్లికేషన్స్ ప్రచురణలు

| | | | రూ |
|---|---|---|---|
| 1. | జర్నలిస్టులకోసం | గోవిందరాజు చక్రధర్ | 70 |
| 2. | అనువదించడం ఎలా? | గోవిందరాజు చక్రధర్ | 90 |
| 3 | ప్రచారం పొందడం ఎలా? | గోవిందరాజు చక్రధర్ | 70 |
| 4. | వ్యాసప్రభ | డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వర రావు | 150 |
| 5 | చింతన | డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వర రావు | 50 |
| 6 | చిరస్మరణీయులు | డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వర రావు | 50 |
| 7 | విన్నంత కన్నంత | బూదరాజు రాధాకృష్ణ | 100 |
| 8. | మంచి జర్నలిస్టు కావాలంటే | బూదరాజు రాధాకృష్ణ | 75 |
| 9. | సొంత కథ | రాంభట్ల కృష్ణమూర్తి | 80 |
| 10. | మన భాష | డాక్టర్ డి చంద్రశేఖర రెడ్డి | 100 |
| 11. | సంహిత (సాహిత్య వ్యాసాలు) | డాక్టర్ డి చంద్రశేఖర రెడ్డి | 100 |
| 12. | బలవంతులు (అనువాద కవితలు) | డాక్టర్ డి చంద్రశేఖర రెడ్డి | 30 |
| 13. | పతిత పావని, ధ్రిల్లింత | కాకాని చక్రపాణి (ఒక్కో సంపుటి) కథల సంకలనాలు | 50 |
| 14. | ది ఘోస్ట్ (నవల) | కాకాని చక్రపాణి, గోవిందరాజు చక్రధర్ | 60 |
| 15. | గోరంతదీపం (నవల) | కాకాని చక్రపాణి, గోవిందరాజు చక్రధర్ | 30 |
| 16. | Damodaram Sanjivayya and his times | Dr G Venkat Rajam | 450 |

ప్రతులకు

**Media House Publications**

1-9-289/4, Behind Post Office, Vidyanagar,

Hyderabad - 500 044

✆ 760 7307

# ఇది వచనయుగం

మాతృబాష మాట్లాడడంలో ఎవరికీ కష్టం ఉండదు ప్రతి వ్యక్తీ తన సామాజిక పరిధిలో భాషను తన అవసరాలకు అనుగుణంగా ఉపయోగించగలడు కాని కొన్ని ప్రత్యేక పరిస్థితులలో భాషను అందరూ ఒకేవిధంగా ప్రయోగించలేరు మామూలుగా బాగా మాట్లాడే వ్యక్తి వేదికనెక్కి మాట్లాడ వలసివస్తే నోటమాటరాకపోవచ్చు ఇటువంటి పరిస్థితికి సభాకంపం ఒక కారణమయితే, తను సరిగా మాట్లాడుతున్నాడో లేదోనన్న అనుమానం మరో కారణం మాట్లాడడంలో ఏ సమస్యా లేనివారికి రాసేటప్పుడు సమస్యలు వస్తాయి రాసేభాషకూ మాట్లాడే భాషకూ తేడా ఉండడమే దీనికి కారణం ప్రతిభాషలోనూ ఈ తేడా ఉంటుంది

తల్లిదండ్రులనుండీ, పరిసరాలనుండీ పిల్లలు భాష మాట్లాడడం సహజంగా నేర్చుకుంటారు రాయడం ఇలా అప్రయత్నంగా వచ్చేది కాదు ప్రయత్నించి నేర్చుకోవాలి ప్రయత్నించి నేర్చుకొనే ఏ విషయమయినా ఎంత నేర్చుకుంటామన్నది నేర్చుకొనే వ్యక్తి అవస రాన్నిబట్టి, సామర్థ్యాన్నిబట్టి ఉంటుంది పూర్వం చదువుకున్న వాళ్ళు అంటే గురువుద్వారా ఏదో ఒక శాస్త్రాన్ని అధ్యయనం చేసినవాళ్ళు వాళ్ళకు రాయడమూ, చదవడమూ రాకపోయినా పండితులే కాని ఇప్పుడు చదువుకున్నవాళ్ళు అంటే రాయడమూ, చదవడమూ వచ్చినవాళ్ళని అర్థం సంతకం పెట్టడం వస్తే అక్షరాస్యులయిపోయే కాలంకదా ఇది అందువల్ల రాతకు చాలా ప్రాదాన్యం ఉంది

ప్రాచీన కాలంలో విద్యాభ్యాసం అంతా మౌఖికంగా జరిగేది శాస్త్రం తేలికగా కంఠస్థం కావాలంటే పద్యరూపంలో ఉండాలి అందువల్ల శాస్త్రరచన కూడా పద్యంలోనే జరిగేది బహుశా ఆ రోజుల్లో పత్రికలుండి ఉంటే అవికూడా పద్యరూపంలో వచ్చి ఉండేవేమో శాస్త్రవేత్తలు కూడా ఛందస్సు నేర్చుకుని ఛందోబద్ధంగా శాస్త్రరచనలు చేశారు ముద్రణ లేదు కాబట్టి పుస్తకాలు అందుబాటులో ఉండేవికాదు చదువుకొనేవాళ్ళ సంఖ్య కూడా చాలా పరిమితంగా ఉండేది ఇప్పుడట్లాకాదు కదా ఇది సార్వజనీన విద్య అందరూ చదువుకోవాలి వివిధ భాషల్లో కోట్ల గ్రంథాలు ప్రచురితమై ప్రపంచమంతటా వ్యాప్తిలో ఉన్నాయి రకరకాల గ్రంథాలతోపాటు అసం ఖ్యాకంగా పత్రికలూ వ్యాప్తిలో ఉన్నాయి చదివే విషయ బాహుళ్యం వల్ల చదివిందంతా కంఠస్థం చేయడం సాధ్యంకాదు అందువల్ల పద్యంలోనే రచన చేయవలసిన అవసరం పోయింది

ఆనాడు చదువుకున్న ప్రతి వ్యక్తికీ పద్యరచన తెలుసుకాబట్టి కవిత్వంతో పాటు అన్ని విషయాలు పద్యంలో ఉండేవి గద్యం కూడా ఒక సాహిత్య ప్రక్రియగానే ప్రధానంగా వాడుకలో ఉంది తెలుగుకవులు పద్యరచనలో ఎన్నో నియమాలు పెట్టుకున్నారు, పద్యం ఎంతక్లిష్టంగా ఉంటే అంత గొప్ప కందం రాసినవాడే కవి అన్న నానుడి అందుకే ఏర్పడింది కంద పద్యానికి నియమాలు ఎక్కువ కవులు భాషతో ఆటలాడుకున్నారు పద్యంలో కవిత్వం ఉన్నాలేకపోయినా అందులో ఉండే లయవల్ల అందంగా ఉంటుంది వినేవాడికి అందులో ఏదో గుణం కనిపించక పోదు. వచనం అట్లాకాదు వచనం రాసి మెప్పించడం కష్టం అందుకే 'గద్యం కవీనాం నికషం వదంతి' అనే నానుడి ఏర్పడింది

ఇది వచన యుగం పద్యం కవిత్వానికే పరిమితమయింది కవిత్వం కూడా ఛందోనియ

మాల్ని విడిచిపెట్టి వచన రూపం తీసుకున్న కాలం అందువల్ల నేటి అవసరం వచనరచన పుస్తకాలూ, పత్రికలూ విస్తారంగా పెరిగాయి కాబట్టి రాయవలసిన అవసరమూ, రాసేవాళ్ళ అవసరమూ కూడా పెరిగింది

తెలుగులో వెయ్యేళ్ళ లిఖిత సాహిత్యం ఉంది వెయ్యేళ్ళ కింద స్థిరపడిన రచనాబాష ఎటువంటి అవాంతరాలూ లేకుండా ఈ శతాబ్దం ప్రారంభందాకా కొనసాగింది ఛందోబద్ధమైన పద్యరచన నేటికీ కొనసాగుతూనే ఉంది ఈ శైలి ఆధునిక అవసరాలకు సరిపోదనే అభిప్రాయంతో గత శతాబ్దాంతంలో వ్యావహారిక భాషోద్యమం ప్రారంభమయింది ప్రస్తుతం గ్రాంధికభాషలో వచన రచన చేసేవాళ్ళను వేళ్ళమీద లెక్కించవచ్చు అదునిక రచనాభాష ఈ వందేళ్ళలోనూ అభివృద్ధి చెందింది

పూర్వం సంస్కృతం విద్యామాధ్యమంగా ఉండడంవల్లా, తెలుగులో సాహిత్యరచన చాలా వరకు సంస్కృత సాహిత్యం మీద ఆధారపడడంవల్లా వేలకొద్దీ సంస్కృత పదాలు తెలుగులోకి వచ్చి చేరాయి పూర్వం దక్షిణాపథం అంతా ఒకేపాలనలో ఉండడంవల్ల కొన్ని ప్రాకృత పదాలు వచ్చిచేరాయి మధ్యయుగాలలో కొన్ని తమిళ, కన్నడ పదాలు చేరాయి పదమూడో శతాబ్దం నుండి ఉర్దూ, అరబిక్, పర్షియన్ పదాలూ దచ్చి, పోర్చుగీసు, ఫ్రెంచి, ఇంగ్లీషు పదాలు చేరాయి ఈ ఆధునిక కాలంలో శాస్త్రరచనలో పరిభాషను కల్పించుకోవడంలో మనం ఇంకా సంస్కృతం మీదే ఆధారపడి ఉన్నాం అట్లాగే ఇంగ్లీషు నుండి కూడా యథేచ్ఛగా పదాలు అరువుతెచ్చు కుంటున్నాం

ఇప్పుడు తెలుగులో రాస్తున్న వాళ్ళు చాలామంది ముఖ్యంగా పత్రికారచయితలు కొన్ని సమస్యలు ఎదుర్కోవలసి వస్తున్నది గత వెయ్యేళ్ళ గ్రాంధిక భాషా ప్రభావం నుండి బయట పడడం ఒక సమస్య ఇతర భాషల నుండి అరువుతెచ్చుకున్న, తెచ్చుకుంటున్న మాటల్ని తెలుగులో రాసేపద్ధతి రెండో సమస్య అవసరమయిన కొత్త పదాల్ని కల్పించుకోవడం ఎలా అన్నది మూడో సమస్య తెలుగు రచయితలకు తెలుగుభాషా సంప్రదాయంతోపాటు, కొంత సంస్కృత భాషా సంప్రదాయం కూడా తెలిసి ఉండాలి సంస్కృత పదాలు, పదబంధాలు విస్తృతంగా వాడతారు కాబట్టి సంస్కృత పదనిర్మాణం, సంధి, సమాస నిర్మాణాలకు సంబంధించిన మౌలిక పరిజ్ఞానం తెలుగురచయితకు అదనపు భారం దీనితోపాటు ఆధునిక రచనాభాషా సంప్రదాయాన్ని తెలుసుకోవడానికి అవసరమయిన సామగ్రి కూడా అంతంతమాత్రమే వాళ్ళు ఎక్కువగా తాము చదివిన జ్ఞాపకంమీద తమ వివేచనాశక్తి మీదే ఆధారపడవలసి వస్తుంది పొరపాట్లూ దొర్లుతూ ఉంటాయి అందువల్ల ఆధునిక రచనాభాషకు ఒక నిర్దుష్ట సంప్రదాయం ఏర్పడ వలసిన అవసరం ఉంది

☆

# రాతలో దొర్లే పొరపాట్లు

చదవడమూ, రాయడమూ చదువుకున్నవాళ్ళ పని మాట్లాడేటప్పుడు ఎదుటివాళ్ళకు అర్థమయితే చాలు కాబట్టి అంతవరకూ జాగ్రత్తపడతాం మనం మాట్లాడిన విషయంలో కొంచెం అటూఇటూ అయినా ఎదుటివాడు అర్థం చేసుకోగలుగుతాడు మరీ అపార్థం కలిగేటట్లుంటే వెంటనే మనమే సరిచేసుకుంటాం కానీ రాసేటప్పుడు అటువంటి అవకాశం ఉండదు కాబట్టి చాలా జాగ్రత్తగా ఉంటాం అయితే మాట్లాడేటప్పుడు లేని సమస్యలు కొన్ని రాసేటప్పుడు ఏర్పడుతూ ఉంటాయి మనం సరిగ్గానే రాస్తున్నామా అని చాలాసార్లు అనుమానం వస్తూ ఉంటుంది ఈ అనుమానంవల్ల పొరపాట్లు కూడా దొర్లుతూ ఉంటాయి

'ఋ', ౠ'లు తెలుగు మాటల్లో ఉండవు వీటి ఉచ్చారణ రి', రీ, రు, రూ లతో సమానంగా ఉంటుంది అందువల్ల సంస్కృత పదాలను ఉచ్చరించేటప్పుడు ఈ రెండు రకాల ఉచ్చారణా కనిపిస్తుంది ఉదాహరణకు కృష్ణను కొంత మంది క్రిష్ణ' అనీ, కొంతమంది క్రుష్ణ' అనీ ఉచ్చరిస్తారు ఋ'తో మొదలయ్యే మాటలను 'రు'తో రాయడం సంప్రదాయంగా కూడా మారిపోయింది ఋణం', ఋతువు లను రుణం', రుతువు అని రాస్తున్నారు తెలుగులో ఋ లేదు కాబట్టి పరవాలేదు మార్చుకున్నాం అనుకోవచ్చు తెలుగు మాటల్లో ఋ' రాసినప్పుడే సమస్య వస్తుంది

'మంత్రి పదవి పోవడంతో ఆయన ఎంతో కృంగిపోయారు – వంటి వాక్యాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి భూమిలోకి కృంగిపోయింది', 'కృంగి, కృశించిపోయారు వంటివీ కనిపిస్తాయి 'కృశించి'లోని 'ఋ' ప్రభావమేమో కృంగడానికి క్రుంగు' అనేది తెలుగుమాట తెలుగు మాటల్లో ఋ' ఉండకూడదు కదా 'క్రుంగు లో రకారంపోయి కుంగు అవుతుంది కుంగింది, కుంగిపోయారు అని రాయవచ్చు 'కుంగడం' తప్పనుకొని దాన్ని కృంగడం' చేశారు ఈ పద్ధతే కొనసాగితే 'తుంచడం', 'తృంచడం' కావచ్చు 'కుక్కడం', కృక్కడం' కావచ్చు 'తుళ్ళిపడు, 'తృళ్ళిపడు' కావచ్చు

తెలుగు మాటల్లోనూ సంస్కృతపదాల్లోనూ ఋ రు'లను ఒకదాని బదులు ఒకటి రాయడం అలవాటయిపోతూ ఉంది తృటిలో తప్పిపోయిన రైలు ప్రమాదం అని రాస్తున్నారు 'త్రుటి అన్నది సరయిన మాట తామర రేకులో తీక్షణమయిన సూది దిగడానికి పట్టేకాలం అని అర్థం ఒక లఘువును ఉచ్చరించడానికి పట్టే కాలంలో నాలుగోవంతు కాలం అని కూడా అంటారు కనురెప్పపాటు, కన్నుమూసి తెరిచేంత తక్కువ సమయంలో అన్న అర్థంలో ఈ మాటను వాడుతున్నాం ఇది తెలుగుమాట కాదు అందుకే ర కారంపోయి 'తుటి అని కాదు, 'త్రుటి' అనే ఉంటుంది

'రాజకీయ నాయకులు పదవులకోసం ఆతృతతో ఎదురు చూస్తున్నారు' వంటి వాక్యాలూ కనబడతాయి ఆత్రం అంటే 'తొందర, త్వర అనీ, విపత్తు అనీ అర్థం ఆత్రపడు' అంటే 'త్వరపడు', కళవళపడు' అని అర్థం ఆతురపడు అన్నా అదే అర్థం సంస్కృతంలో 'ఆతురమ్, 'విద్యాతురాణాం న సుఖం న నిద్రా' అంటారు 'ఆతురుడు' అంటే తొందరపడేవాడు వ్యాధిగ్రస్తుడు', 'పీడితుడు' అని కూడా అర్థాలున్నాయి ఆతురత ఆత్రుత అని రాయవచ్చు ఆతృత

సరయిందికాదు

సర్టిఫికెట్ అన్న మాటకు సమానార్థంలో ధృవపత్రం', 'ధృవీకరణ పత్రం' అని వాడుతున్నారు ఈ వార్తను ధృవీకరించారు' అని రాస్తున్నారు '(ధ్రువం' అంటే కదలనిది, 'శాశ్వతమైనది', 'నిశ్చితమయినది' అని అర్థం ధ్రువ నక్షత్రం ఉంది ఉత్తర ధ్రువం, దక్షిణ ధ్రువం ఉన్నాయి సంగీతంలో పధ్నాలుగక్షరాల కాలం కలిగిన తాళం ధ్రువతాళం ఈ అన్ని సందర్భాలలోనూ '(ధ్రువం' అన్నదే సరయిన మాట, 'ధృవం'కాదు కొంతమంది 'శతృవు' అనీ, 'శతృస్థావరం' అనీ రాస్తుంటారు శత్రువు, శత్రుస్థావరం సరయిన రూపాలు ఉచ్చారణలో భేదం లేకపోవడంవల్ల రాతలో ఇటువంటి పొరపాట్లు దొర్లుతుంటాయి దీనివల్ల పెద్ద నష్టమేమీ లేకపోయినా ఆ మాటలకు అర్థాలు తెలియనప్పుడు నిఘంటువులో వెతుక్కుంటే దొరకకపోవడం ఒక కష్టం ఈ మాటలు తెలిసిన వారికి తప్పు రూపాలు వికారంగా కనిపిస్తాయి తెలియని పాఠకులు ఇవే సరయిన మాటలనుకొని వీటికి మరింత ప్రచారం కలిగిస్తారు అందువల్ల సరయిన రూపం తెలుసుకొని వాడడం మంచిది

☆

# ఋ ౠలు

సంస్కృతం నుండి తెలుగులోకి వచ్చిన పదాల్లో ఋ, ౠ, ఌ, ౡ అనే అచ్చులు ఉన్నాయి వీటిలో ౡతో వచ్చే మాటలు సంస్కృతంలోనే వాడుకలో లేవు ఌ తో వచ్చే మాట 'కౢప్తం' మాత్రమే తెలుగులో వాడుకలో ఉంది దీన్ని 'క్లుప్తం' అని రాస్తున్నాం అందువల్ల ఌ ౡలతో సమస్యలేదు ఋ, ౠలలో కూడా ౠతో వచ్చే మాటలు లేవు క్రూర, భ్రూ, భ్రూకుటి, భ్రూణ వంటి మాటలు ఎట్లా రాయాలన్న సందేహం అవసరంలేదు వీటిలో ౠ లేదు కాబట్టి రకారం తోనే రాయాలి

ఋ కారంతో ఉండే మాటలు తెలుగులో గణనీయంగానే వచ్చి చేరాయి తెలుగువారి ఉచ్చారణలో ఋ కారానికి రి, రు అనే ఉచ్చారణలుంటాయి అందుకే తెలుగు ఛందస్సులలో ఋ కారానికి రిరీ రెరేలతో యతి చెల్లుతుంది ఋ–రులకు యతిని లాక్షణికులు అంగీకరించక పోయినా కొందరు కవులు మాత్రం ప్రయోగించారు ఋ'కి ర కారంతో ప్రాస చెల్లుతుంది దీనికి కారణం ఉచ్చారణలో సామ్యమే. ఋకారంతో ఉండే మాటలను ఋ కారంతోనే రాయాలా రకారంతో కూడా రాయవచ్చా అన్న అనుమానం వస్తుంది ఋ కారానికి రకార లక్షణం కూడా ఉంది సంస్కృతంలో యణాదేశ సంధిలోనూ, మరికొన్ని చోట్లా ఋ కారం రకారంగా మారుతుంది ఈ కారణాలవల్ల ఋ'ను 'ర'గా రాస్తే తప్పేముంది అన్న భావన కలుగుతుంది

ఒక్కొక్క భాషకు ఒక్కొక్క ధ్వని వ్యవస్థ ఉంటుంది పరాయి భాషల నుండి మాటలను అరువుతెచ్చుకొనేటప్పుడు అవి మన భాషా ధ్వని వ్యవస్థలో ఇమిడితే మంచిదే అట్లా ఇమడ నప్పుడు ఏం చేస్తాం? మన భాషలోని ధ్వనులకు అనుగుణంగా మార్చుకుంటాం ఏవో కొన్ని మాటలే అయితే సాధారణంగా ఈ మార్పు జరుగుతుంది చదువుకున్నవాళ్ళు అన్యభాషా పదాలను ఆ భాషలోని ఉచ్చారణతోనే పలకడానికి ప్రయత్నిస్తారు సామాన్యులు తమ భాషా ధ్వనులకు అనుగుణంగా ఉచ్చరిస్తారు ఈ అన్యభాషతో పరిచయం ఎక్కువయితే ఆ భాషా పదాలతోపాటు వాటి ఉచ్చారణను కూడా తీసుకుంటాం సంస్కృత పదాలు మన భాషలోకి ఈ రెండు విధాలుగానూ వచ్చినా ఆధునిక కాలంలో మార్పు లేకుండా తెచ్చుకోవడానికే ప్రయత్ని స్తున్నాం ఇంగ్లీషు మాటల విషయంలోనూ అదేవిధంగా జరుగుతోంది ఉదాహరణకు హాస్పిటల్ అన్న ఇంగ్లీషు మాట తెలుగువారి ఉచ్చారణలో ఆసుపత్రిగా మారింది కాని ఇప్పుడు చాలా మంది హాస్పిటల్ అనే అంటున్నారు కొంతకాలంపోతే ఆసుపత్రి వ్యవహారంలో తగ్గిపోయి హాస్పిటల్ సాధారణమైపోతుంది

సంస్కృతం నుండి తెలుగులోకి వచ్చిన మాటల్లో పూర్వమే వచ్చినవి మార్పులు పొందకుండానూ వచ్చాయి, మార్పులు పొందీ వచ్చాయి ఇప్పుడు వచ్చి చేరుతున్న మాటలు మార్పు చెందకుండానే వస్తున్నాయి ప్రస్తుతం తెలుగులో చేరుతున్న సంస్కృతపదాలు రెండు రకాలు ఒకటి, సాధారణ భాషలో వాడుకలోకి వచ్చేవి రెండు, వివిధ శాస్త్రాలలో పరిభాషగా వచ్చేవి పత్రికాభాషలో కూడా ఇంగ్లీషు మాటల్ని అనువాదం చేసుకోవడంలో ఎన్నో సంస్కృత పదాలు, పదబంధాలు తెలుగులో ఏర్పడుతున్నాయి ఇంత విస్తృతమయిన పదజాలం సంస్కృతం నుండి తెలుగులోకి వస్తూ ఉంది కాబట్టి రాతలో నిర్దుష్టతను అవలంబించాల్సిన అవసరం ఉంది

ఇక ఋ కారంతో తెలుగులోకి వచ్చిన మాటల విషయానికి వద్దాం 'ఋ'తో మొదలయ్యే మాటల్లో ముఖ్యమైనవి - ఋతువు, ఋణం, ఋషి, ఋత్విక్కు, ఋజువు (చక్కనిది) ఈ మాటల్ని ఇలాగే రాయడం మంచిదే రుతువు, రుణం, రుషి, రుత్విక్కు, రుజువు అని రాయడం కూడా పరిపాటి అయింది అర్థ భేదమేమీ లేదు కాబట్టి ఇట్లా రాయడంలో నష్టంలేదు 'కృష్ణ' అనే పదం కొంతమంది పేర్లలో క్రిష్ణగా మారింది దీనికి ఉచ్చారణ ఒక కారణమయితే ఇంగ్లీషు వర్ణక్రమం మరొక కారణం అయితే అన్ని మాటలూ ఇట్లా మారలేదు

మనం ప్రస్తుతం వాడుతున్న కొన్ని మాటలు చూడండి

కృతం అంటే చేయబడినది 'రామాయణం వాల్మీకి కృతం' అంటాం కృతి అంటే కావ్యం రచన కృప అంటే దయ, కరుణ, జాలి కృపాణం అంటే కత్తి కృశ అంటే సన్నబడడం, చిక్కిపోవడం కృషి అంటే వ్యవసాయం గృధ్రం అంటే గద్ద గృహం అంటే ఇల్లు జృంభణం అంటే శరీరానికి సంకోచ వికాసాదులను పొందించేది దీన్ని 'వి' అనే ఉపసర్గ చేర్చి విజృంభణ, విజృంభించు అని వాడుతున్నాం తృణం అంటే గడ్డి తృతీయ అంటే మూడవ తృప్తి అంటే తనివి తృష్ణ అంటే దప్పిక, కోరిక దృఢం అంటే బలమైనది దృశ్యం అంటే కనిపించేది దృష్టి అంటే చూపు ధృతి అంటే ధరించడం, ధైర్యం నృ అంటే మనిషి దీనినుండే నరుడు ఆంత్రపాలజీని నృశాస్త్రం అని కూడా అంటారు

నృత్యం అంటే నర్తనం నృపుడు అంటే రాజు పృథక్ అంటే వేరవడం పృథ్వి అంటే భూమి పృథు అంటే విశాలమైన భృతి అంటే భరణం, కూలి భృత్యుడు అంటే పోషింపదగిన వాడు, సేవకుడు మృగం అంటే జింక, వేటగాళ్ళు వెదికేది, జంతువు అనే సామాన్యార్థం కూడా ఏర్పడింది మృగమదం అంటే కస్తూరి మృగతృష్ణ అంటే ఎండమావి మృగయా అంటే వేట, మృణాలం అంటే తామరతూడు మృత్ అంటే మట్టి, మృతి అంటే చావు మృత్యువు అన్నా చావే మృదంగం అంటే మద్దెల మృదు అంటే మెత్తని, కోమలం మృదులం అన్నా అదే అర్థం మృష అంటే అసత్యం మృష్టం అంటే శుద్ధమైనది

వృకం అంటే తోడేలు వృక్షం అంటే చెట్టు, వృత్తం అంటే గుండ్రనిది, వార్త, జనశ్రుతి వృత్తాంతం అంటే జరిగినది వృత్తి అంటే జీవనోపాయం వృథా అంటే వ్యర్థం వృద్ధత్వం అంటే ముసలితనం వృంతం అంటే తొడిమ వృశ్చికం అంటే తేలు వృషభం అంటే ఎద్దు వృష్టి అంటే వర్షం, వాన శృంఖల అంటే మొలనూలు, గొలుసు, సంకెల శృంగం అంటే శిఖరం, కొమ్ము, కొన శృంగారం ఒక రసం అలంకరణ అన్న అర్థంలో కూడా వాడుతున్నాం సృష్టి అంటే సృజింపబడేది హృదయం అంటే గుండెకాయ హృద్యం అంటే హృదయానికి ప్రియమైనది ఈ అన్ని మాటలతోనూ మరెన్నో మాటలు తయారవుతాయి వ్యాకరణ నియమాలననుసరించి కొన్నిచోట్ల 'ఋ'కారం ఉంటుంది మరికొన్ని చోట్ల 'ర'కారం ఉంటుంది

పైవన్నీ మనం సాధారణంగా తెలుగులో వాడే మాటలే వీటన్నింటినీ ఋ కారంతోనే రాయాలి కొన్ని మాటల వాడుక విచిత్రంగా ఉంటుంది ఋతం అంటే నిజం ఈ మాటకు తెలుగులో వాడుక తక్కువ కాని దీని వ్యతిరేకార్థక పదం అనృతం వాడుకలో విస్తృతంగానే ఉంది ఉపసర్గలు వాడి ఈ మాటలతో మరెన్నో మాటలను తయారు చేసుకోవచ్చు ప్రకృతి, వికృతి, అనుకృతి ప్రవృత్తి, నివృత్తి, ఆవృత్తి మొదలయిన విధంగా చాలా పదాలు ఏర్పడతాయి

శృతి, అపశృతి అని తెలుగులో వాడుకలో కనిపిస్తుంది కాని శ్రుతి, అనుశ్రుతం, అపశ్రుతి అన్నవి సరయిన రూపాలు ఎక్కడ ఋ కారమో, ఎక్కడ ర కారమో గుర్తించి రాయాలి ☆

# అచ్చుతో ఎందుకు రాయాలి

మన భాష అజంత భాష అంటే పదాలన్నీ అజంతంగా ఉంటాయని అర్థం పదం చివర అచ్చు ఉంటుంది, హల్లు ఉండదు అయితే ఆధునిక బాషలో పూర్ణబిందువుతో అంతమయ్యే మాటలెన్నో వాడుతున్నాం ముఖ్యంగా 'ము'తో అంతమయ్యే తత్సమ పదాలన్నింటినీ బిందువుతోనే ఉచ్చ రిస్తున్నాం, రాస్తున్నాం పుస్తకం, అంతం, వనం బలం మొదలయినవి ఇటువంటివి తెలుగు మాటల్లో మనం, మేం అనే సర్వనామాలను మాత్రం బిందువుతో రాస్తున్నాం ఏం అన్న ప్రశ్నార్థక సర్వనామాన్నీ బిందువుతో రాస్తున్నాం ము తో అంతమయ్యే సార్వనామిక విశేష్యాలు అంద రము, చేసేవాళ్ళము మొదలయినవీ, ము తో అంతమయ్యే క్రియలనూ బిందువుతో రాస్తున్నాం ఉదాహరణకు వచ్చాం, తిన్నాం మొదలయినవి ఈ మాటల్లో 'ము' పురుషబోధక ప్రత్యయం ఈ మాటలన్నింటినీ హలంత పదాలు అనవచ్చు ఇవికాక ఇంగ్లీషు, ఉర్దూ బాషల నుండి అరువు తెచ్చుకున్న మాటలెన్నింటినో ప్రస్తుతం హలంతాలుగా రాస్తున్నారు ఈ మాటల్ని విడిచిపెడితే అధికశాతం మాటలు అజంతాలే

అచ్చుతో అంతమయ్యే మాటలు ఎక్కువగా ఉండడం వల్ల ఒకమాట తర్వాత మరోమాట వచ్చినప్పుడు ఆ మాట అచ్చుతో మొదలయిన మాట అయినప్పుడు రెండు అచ్చులు వరుసగా వస్తాయి ఇటువంటి సందర్భంలో సంది జరుగుతుంది తెలుగులో సంది జరగడం అంటే మొదటి పదం చివరి అచ్చు లోపించడం అన్నమాట సంధి జరగకపోతే ఈ రెండు అచ్చుల మధ్యా ఒక హల్లు చేరుతుంది ఆ హల్లు యు' అని వ్యాకర్తలు చెప్పారు ప్రాచీన సాహిత్యంలో యడాగమమే కనిపిస్తుంది అయితే ఉచ్చారణలో వ' కూడా వినిపిస్తుంది మా ఊరును కావ్య భాషలో మాయూరు అంటే వాడుకభాషలో మావూరు అంటారు 'మా' ఊరు' అనే రెండు మాటల మధ్య వ' ఉచ్చారణలో వినిపిస్తుందన్నమాట అట్లాగే పెద్ద ఎత్తున అన్నప్పుడు 'పెద్ద', 'ఎత్తున మధ్య య' వినిపిస్తుంది పెద్దయెత్తున అని

పదాలమధ్య వినిపించే ఈ య, వ ల వల్ల తెలుగులో ఒక ప్రశ్న తలెత్తింది ఇ, ఈ, ఎ, ఏ లను యి, యీ, యె, యే అనీ, ఉ, ఊ, ఒ, ఓలను వు, వూ, వొ, వో లనీ ఎందుకు రాయకూడదూ అన్నది ఈ ప్రశ్న కొంత మంది ఇల్లును యిల్లు అనీ, ఈతను యీత అనీ, ఎవరును యెవరు, యవరు అనీ, ఏదిని యేది అనీ రాయడమూ, ఉట్టిని వుట్టి అనీ, ఊరును వూరు అనీ. ఒకటిని వొకటి, వకటి అనీ, ఓటమిని వోటమి అనీ రాయడమూ కనిపిస్తుంది ఒకప్పుడు ఇట్లా రాయడమే వ్యావహారిక భాషా లక్షణమని కూడా కొందరు భావించారు అయితే అజాది పదాలను అంటే అచ్చుతో మొదలయ్యే మాటలను హల్లుతో రాయడం వల్ల చేకూరే ప్రయోజన మేమిటి? సృజనాత్మక సాహిత్యంలో పాత్రోచితంగా ఉచ్చారణకు అనుగుణంగా రాయాలను కున్నప్పుడు రాయవచ్చు మాండలిక భాషలో రచనలు చేసేటప్పుడు ఆ మాండలికంలో ఆ విధమైన ఉచ్చారణ ఉంటే రాతలో కూడా సూచించవచ్చు కాని ఆధునిక ప్రమాణ భాషలో ఈ విధంగా రాయడం అవసరమా? అంటే అవసరం లేదనే చెప్పవచ్చు

యకారం, వువూ వొవోలు తెలుగు మాటలకు ముందు లేవు అంటే యకారంతో మొద లయ్యే మాటలు తెలుగు మాటలు కావు అట్లాగే వువూ వొవోలతో మొదలయ్యే మాటలు కూడా

తెలుగు మాటలు కావు యమున, యతి, యజ్ఞం వంటి మాటలు సంస్కృతం వాక్యాదిలో అచ్చుతో మొదలయ్యే పదాన్ని హల్లుతో రాయడం వల్ల కలిగే ప్రయోజనమేమీ లేదు కాబట్టి దాన్ని అచ్చుతో రాయడమే మంచిది వాక్యం మధ్యలో సంగతేమిటి? సమాసంలో రూఢమయిన రూపాలను యధాతథంగా వాడక తప్పదు పేదరాలు పేదరాలే వేపాకు వేపాకే మేనత్తకు కావ్య భాషలో మేనయత్త అనికూడా రూపం ఆధునిక భాషలో మేనయత్త అని రాయవలసిన అవసరం లేదు వెలయాలు మొదలయినవి అట్లాగే వాడాలి సమాసంలో కాకుండా విడిగా ఉన్నప్పుడు సంధి చేయవలసిన చోట సంధి చేయాలి సంధి చేయడానికి వీలు లేనప్పుడు అజాదిగానే రాయవచ్చు యడాగమం చేయవలసిన పనిలేదు ఉదాహరణకు మనిషి ఉన్నాడు అనే రాయవచ్చు, మనిషి యున్నాడు అని రాయవలసిన అవసరంలేదు మనిషి వున్నాడు అనీ రాయవచ్చు

సంప్రదాయ పద్ధతిలో చేసే పద్య రచనలో యడాగమం అవసరం కావచ్చు ఆధునిక ప్రమాణ భాషలో, వచనంలో దాని అవసరంలేదు అట్లాగే వడాగమం కూడా, అందువల్ల అజాది పదాలను హలాదులుగా రాయకపోవడం మంచిది హలాదులుగా రాసినట్లయితే పదం సహజ స్వరూపం తెలియకుండా పోతుంది అనుద్దిష్టమయిన రూపాలు ఏర్పడతాయి ఒక క్రమబద్ధత లేకపోవడం వల్ల హల్లు రాయవలసిన చోట అచ్చూ, అచ్చు రాయవలసిన చోట హల్లూ రాయడం జరుగుతుంది వడ్డీ అనడానికి ఒడ్డీ, వంతెన అనడానికి ఒంతెన, వద్దు అనడానికి ఒద్దు, వగరు అనడానికి ఒగరు అని రాయడం ప్రామాణికం కాదు అట్లాగే 'ఒడలు'కు 'వడలు', 'ఒడి'కి 'వడి, 'ఒంటరి'కి వంటరి', 'ఒక'కు 'వక', 'ఒప్పుకొను'కు వప్పుకొను', 'ఒప్పగించు'కు 'వప్పగించు' 'ఒత్తిడి'కి, 'వత్తిడి', 'ఒద్దు'కు 'వద్దు', 'ఒడ్డాణం'కు 'వడ్డాణం', 'ఒడిసెల'కు 'వడిసెల' రాయడం సరికాదు ఒగరు – వగరు, ఒడి – వడి, ఒక్క – వక్క, ఒందు – వందు, ఒత్తి – వత్తి, ఒదలు – వదలు, ఒనరు – వనరు, ఒమ్ము – వమ్ము మొదలయిన మాటలకు అర్థభేదం ఉంది అందువల్ల వీటిని ఒకదానికి బదులు ఒకటి వాడకూడదు అజాది శబ్దాన్ని అజాదిగా, హలాది శబ్దాన్ని హలాదిగా రాయడం వల్ల పదాల లేఖనంలో ద్వైరూపకతను కూడా తొలగించవచ్చు

☆

# ఏది తెలుగు - ఏది సంస్కృతం

సంస్కృతంలో ఎ, ఒలు లేవు మనం తెలుగులో వాడే సంస్కృత పదాలలో కూడా ఎ, ఒలు ఉండవు ఎ, ఒలు ఉన్న మాటలన్నీ తెలుగు దేశ్య శబ్దాలు కాని, అన్య దేశ్యాలు కాని అయి ఉంటాయి ఇంగ్లీషు, ఉర్దూ, తమిళం, కన్నడం నుంచి అరువు తెచ్చుకున్న మాటల్లో ఇవి ఉంటాయి ఎ, ఒలు వచ్చే మాటలకు సంస్కృత వ్యాకరణ పద్ధతిలో సంధి చేయకూడదు అంటే ఈ పదాలకు సవర్ణ దీర్ఘసంధి, గుణ సంధి వంటివి రావు తెలుగు వ్యాకరణాలలో ఒక వింత సంప్రదాయం కనిపిస్తుంది మొదలైన అన్న అర్థంలో ఆది అనే మాటతో సంస్కృత సంధి చేసి ప్రయోగిస్తారు ఉదాహరణకు పదు మొదలయిన అనడానికి పద్వాదులు (పదు + ఆదులు) అని వాడుక ఉంది వ్యాకరణ శాస్త్రంలో వ్యాకర్తలు పాటించిన ఒక సంప్రదాయంగానే దీన్ని గుర్తిం చాలి తప్ప సాధారణీకరించి అన్ని చోట్లా వాడకూడదు పెను, వెల, వెలి, చెల్లు, ఎండ వంటి మాటలు సంస్కృతం కావని తెలిస్తే వాటికి సంస్కృత సంధి చేయకుండా ఉండవచ్చు పదంలోని ఎ, ఒలు ఆ పదం సంస్కృతం కాదని తెలుసుకోవడానికి ఉపయోగపడతాయి

తెలుగులో ఐ, ఔలు ప్రత్యేక వర్ణాలు కావు అంటే వీటిని అయ్, అవ్ అని కూడా రాయ వచ్చు ఐదును అయిదు అని రాయవచ్చు ఐదువ - అయిదువ, ఐరేని - అయిరేని, ఐపు - అయిపు, తెలుగులో 'అగు' ధాతువు నుండి వచ్చిన మాటలను ఐ, ఔలతో రాయడం జరుగు తుంది అగు – అయిన, అయితే, అయి, అయినా వీటిని ఐన, ఐతే, ఐ, ఐనా అని కూడా రాస్తాం అందమైన, అర్థమైతే అని సంధిలో కూడా రాయవచ్చు లేకపోతే అందమయిన, అర్థమయితే అనేవిధంగా రాయవచ్చు ఈ రెండు విధాల లేఖనం తెలుగులో ఈ ఉచ్చారణ కలిగిన అన్ని మాటల్లోనూ ఉంటుంది 'కై'ని 'కయి' అనవచ్చు కైకూడు – కయికూడు, కైకొను – కయికొను, కైదండ – కయిదండ, కైపు – కయిపు, కైవసం – కయివసం, కైవారం – కయివారం, రైక – రయిక, దైవారు – దయివారు, పైరు – పయిరు, పైకం – పయికం, పైన – పయిన, ఈ విధంగా తెలుగు మాటల్లో ఐ – అయిలు సర్వత్రా ఒకదానికొకటి రాయవచ్చు

సంస్కృతం నుండి ఇతర భాషల నుండి తెలుగులోకి వచ్చిన మాటల్లో కూడా కొన్ని చోట్ల ఈ రెండు రకాల లేఖనమూ ఉంటుంది ఇది సంస్కృత పదాల విషయంలో తద్భవాలలో సాధ్యమవుతుంది ఉదాహరణకు 'కవిత' అనే మాట తెలుగులో కయిత' అయింది దీన్నికైత అని కూడా రాస్తాం

అన్య దేశ్యాలలో ఖైద్ అనే మాట తీసుకోవచ్చు దీన్ని ఖైదు' అనీ 'ఖయిదు' అనీ రాస్తున్నాం 'కైదు', 'కయిదు' అని కూడా రాయవచ్చు అట్లాగే రైతు – రయితు

'ఐ'ని 'అయ్'గా రాసినట్లే 'ఔ'ను 'అవ్'గా రాయడం కూడా ఉంది ఉదా ఔడు – అవుడు, ఔదల– అవుదల, ఔరా – అవురా, ఔను – అవును 'అగు'ధాతు రూపాలు 'అవు'గా ఏర్పడతాయి అగు నుండే అవును, అవుట ఏర్పడ్డాయి వీటి ఔను, ఔట అని కూడా రాయవచ్చు కౌగిలి – కవుగిలి అని రాయవచ్చు ఇటువంటి మాటలెన్నో ఉన్నాయి వాటిలో కొన్ని, కౌజు – కవుజు, కౌను– కవును, గౌద– గవుద, గౌళి– గవుళి, గౌసెన – గవుసెన, చౌక – చవుక, చౌడు – చవుడు, చౌలం – చవులం, తౌడు – తవుడు, దౌడు – దవుడు, దౌడ – దవడ తెలుగు మాటల్లో కొన్ని

చోట్ల గ - వ అవుతుంది ఉదాహరణకు రగులు - రవులు అవుతుంది, తగులు - తవులు అవుతుంది ఇటువంటి సందర్భాల్లో `రవులు ను రౌలు అనీ, తవులు ను తౌలు అనీ రాయడం కూడా జరిగింది ప్రస్తుతం రగులు, తగులు రూపాలె ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి అరువు తెచ్చుకున్న మాటల్లో కూడా ఔ అవ్ కావడం ఉంది ఉదాహరణకు సంస్కృతం నుండి వచ్చిన రాహుత్తు తెలుగులో రౌతు అయి రవుతుగా కూడా మారుతుంది నౌబత్తు - నవుబత్తు అని కూడా వాడుక ఫౌజ్ తెలుగులో ఫౌజు అయింది దీన్నే పవుజు అని కూడా రాశారు అట్లాగే కౌలు కు కవులు అన్న రూపం ఇంగ్లీషు నుండి వచ్చిన ఔట్ ను ఔటు- అవులు అని రెండు రకాలుగానూ రాస్తున్నాం

ఐ ని అయ్'గా, `ఔ ను అవ్'గా రాయడం సంస్కృత పదాలలో కుదరదు సంస్కృతంలో అనేక అర్థాలలో పదం మొదట ఉన్న అచ్చుకు వృద్ధి వస్తుంది అంటే ఇ, ఈలు ఐ అవుతాయి ఉ, ఊలు ఔ అవుతాయి ఉదాహరణకు కుంతి కొడుకులు కౌంతేయులు, కురు వంశజులు కౌరవులు ఉరస్యుడు - ఔరసుడు అంటే కన్నకొడుకు పురుషుడు చేసినది పౌరుషేయం విమానంతో దాటేవాడు వైమానికుడు ఇంద్రజాలం చేసేవాడు ఐంద్రజాలికుడు ఈవిధంగా అసంఖ్యాకమయిన పదాలు తయారవుతాయి యువ - యౌవనం, కుమార - కౌమారం, మూల - మౌలిక, చేతన- చైతన్య, కుతూహల - కౌతూహల, చిత్ర - చైత్ర తిల - తైల, దితి - దైత్య, నీల - నైల్య, పుత్ర- పౌత్ర, జిన - జైన, బుద్ధ - బౌద్ధ మొదలైనవి ఇట్లా ఏర్పడ్డవే వీటిని సాధారణంగా ఐ, ఔలతోనే రాస్తాం మవులిక, చయితన్య, చయిత్ర, తయిల, బవుద్ధ అని రాయం కాని కొన్ని మాటల్లో రెండు రకాల లేఖనం కనిపిస్తుంది ఉదాహరణకు యౌవనం - యవ్వనం తెలుగులో ఊయల- ఉయ్యాల, తీయని - తియ్యని, చేయి - చెయ్యి, నేయి - నెయ్యి, నేయడం - నెయ్యడం వంటి వాటి సామ్యం వల్ల ఇది జరిగి ఉండవచ్చు `యౌవనం' అన్నదే సరయిన రూపం సంస్కృతంలో అయ్, అవ్‌లతో మొదలయ్యే మాటలను ఐ, ఔలతో రాయడం కూడా సరికాదు ఉదాహరణకు అయస్కాంతాన్ని ఐస్కాంతం అని కానీ అవసరాన్ని ఔసరం అని కానీ రాయడం సరయింది కాదు

సంస్కృత పదాలలో ఐ, ఔలను యథాతథంగా వాడాలి అయ్ - ఐ, అవ్ - ఔలను ఒక దానిబదులు ఒకటి వాడకూడదు తెలుగులో రెండు రకాలుగానూ రాయవచ్చు

☆

# విసర్గ ఎక్కడ వాడాలి

తెలుగులో విసర్గ (ః) లేదు సంస్కృత పదాలతో పాటు ఇది తెలుగులో వాడుకలోకి వచ్చింది విసర్గకు హకారోచ్చారణ ఉంటుంది సంస్కృతంలో పదాంతంలో ప్రత్యయ రూపంలో దీనికి వాడుక ఎక్కువ సమాసంలో రెండు మాటలు కలిసినప్పుడు మొదటిమాట చివర ఉన్న విసర్గకు సాధారణంగా లోపం వస్తుంది ఇది సకారమో రకారమోగా కూడా మారుతుంది కొన్ని చోట్ల మార్పు లేకుండా విసర్గ అట్లాగే ఉండిపోవచ్చు

సంస్కృత పదాలు తెలుగులోకి వచ్చినప్పుడు వాటి చివర ఉన్న విసర్గ లోపిస్తుంది తెలుగు ప్రత్యయం వచ్చి చేరుతుంది పదంలో భాగంగా ఉండి మరోరకంగా వాడడానికి వీల్లేని మాటలు మాత్రం చాలా తక్కువ అటువంటి మాటల్లో ముఖ్యమైంది దుఃఖం దీనికి బదులుగా దుక్ఖం, దుక్కం, దుఖ్ఖం అని వ్యవహారం ఉంది సృజనాత్మక రచనల్లో ఇటువంటి లేఖనం ఉంది. కాని దుఃఖం అన్న రూపమే చాలా ప్రచారంలో ఉంది

విసర్గ చివర ఉండే మాటలు కూడా తెలుగులో వాడుతూ ఉన్నాం వాటిలో పునః, వస్తుతః స్వతః, బహుశః, ప్రాయశః అన్యతః మొదలయినవి ముఖ్యమైనవి పునః అంటే మళ్ళీ అని అర్థం మళ్ళీ మళ్ళీ అన్న అర్థంలో పునః పునః అని వాడతాం పౌనఃపున్యంగా అని కూడా ప్రయోగిస్తాం పునఃపరిశీలన, పునఃప్రయత్నం, పునఃప్రక్షాళన, పునఃపరీక్ష మొదలయిన విధంగా పునః ప్రయోగించవచ్చు

వస్తుతః అంటే స్వభావరీత్యా అని అర్థం వాడి గుణం అది స్వతః అన్నా కూడా అదే అర్థం స్వతహాగా అని విసర్గకు బదులు హకారంతో వాడుక ఉంది స్వభావతః అని కూడా అనవచ్చు

బహుశః అన్నమాటకు తెలుగులో వాడుక ఎక్కువ బహుశః అనీ బహుశా అనీ కూడా రాస్తాం చాలావరకు అని అర్థం ప్రాయశః అన్న మాట కూడా ఇటువంటిదే తరచుగా అని దీనికి అర్థం

అన్యతః అంటే మరోవిధంగా అని అర్థం సద్యః అంటే వెంటనే అని అర్థం సద్యః పర నిర్వృతి అంటే వెంటనే కలిగే నిరతిశయమయిన ఆనందం అని అర్థం కావ్యం చదవడం వల్ల సద్యః పరనిర్వృతి కలుగుతుందట ప్రథమతః మొదటిగా అని అర్థం క్రమశః అంటే వరుసగా అని అర్థం ఈ అర్థంలోనే క్రమేణ అనీ, క్రమేపి అని కూడా వాడతాం

జన్మతః అంటే పుట్టుక నుండీ అని అర్థం సర్వతః అంటే అన్ని విధాలా అని అర్థం సమాసంలో కొన్నిచోట్ల విసర్గ యథాతథంగా ఉంటుంది సాధారణంగా క, ఖ, ప, ఫల ముందు విసర్గ మారదు ఇటువంటి సమాసాలు సంస్కృతంలో బాగానే ఉన్నాయి వాటిని తెలుగులో కూడా అట్లాగే వాడుతున్నాం తెలుగులో ఇటీవల విస్తృతంగా వాడుతున్న సమాసపదం వయః పరిమితి చాలా సందర్భాలలో వయోపరిమితి అని రాస్తున్నారు ఇక్కడ విసర్గకు బదులు 'ఓ' రాదు వయఃపరిమితి అనే అనాలి అట్లాగే వయఃపరిణతి కూడా వయఃపరిపాకం అనవచ్చు

మనస్ అన్న మాట కూడా సమాసంలో క, ఖ, ప, ఫ ల ముందు మనః అవుతుంది. మనః ప్రవృత్తి మనః పరిణతి, మనః కమలం, మనఃఖేదం, మనఃక్షోభ, మనఃఫలకం మొదలయినవన్నీ మనం సాధారణంగా వాడేవే

అంతఃపురం అన్నమాట కూడా మనం ఎక్కువగా వాడేదే దీనిలాగే అంతఃకరణం కూడా అంతఃకరణం అన్న మాటను మనస్సు అనే అర్థంలో వాడుతున్నాం ఈ రెండూ పూర్తిగా సమానార్థకాలు కాకపోయినా వాడి అంతఃకరణంలో ఏముందో!', 'వాడి అంతఃకరణాన్ని అడిగితే తెలుస్తుంది' వంటి వాక్యాలలో మనస్సు, అంతరాత్మ అనే అర్థాలే తోస్తాయి

ప్రాతఃకాలం అంటే వేకువ సమయం, తెల్లవారుజాము పొద్దున లేవగానే స్మరించుకోవలసిన వ్యక్తిని ప్రాతఃస్మరణీయుడు అంటాం

మెప్పుకోలుగా తల పంకించడం శిరఃకంపం చేయడం, మంత్రులందరిలో ముఖ్యుడు శిరః ప్రధాని

తపస్సు వల్ల కలిగిన ఫలం తపఃఫలం కన్నులకు ఆనందం చక్షుఃప్రీతి యశస్సు అనే శరీరం కలిగినవాడు యశఃకాయుడు కీర్తిశేషుడన్నమాట కీర్తికాయుడు అని కూడా అంటాం ఇనుపముద్ద అయఃపిండం కాశీఖండం అయఃపిండం అని నానుడి శ్రీనాధుని కాశీఖండం అయఃపిండం లాంటిదన్న మాట ఉషస్సమయంలోని కిరణాలు ఉషఃకిరణాలు

పాలు తాగడం పయఃపానం సముద్రుణ్ణి యాదఃపతి అని కూడా అంటారు జలచరాలన్నిటికీ రాజని అర్థం ఛందస్సును ప్రస్తరించడం ఛందఃప్రస్తారం

కొన్ని మాటల్లో విసర్గతోనూ ప్రయోగం ఉంటుంది పైమాటతో కలిపి సంధి చేయడమూ ఉంటుంది మనఃశాంతి అనీ అనవచ్చు మనశ్శాంతి అనీ అనవచ్చు అదేవిధంగా దోఃశక్తి - దోశ్శక్తి, భుజబలం అన్నమాట చతుఃషష్టి అనీ రాయవచ్చు, చతుష్షష్టి అనీ రాయవచ్చు నమస్కారం, తిరస్కారం అన్నవాటిని నమఃకారం తిరః కారం అనీ అనవచ్చు కాని తెలుగులో నమస్కారం, తిరస్కారం అన్నవే వాడుకలో ఉన్నాయి. అహఃపతి అంటే సూర్యుడు పగలుకు అధిపతి అహర్పతి అని కూడా అనవచ్చు గీఃపతి అంటే బృహస్పతి గీర్పతి, గీష్పతి అని కూడా ప్రయోగించవచ్చు

క, ఖ, ప, ఫ ల ముందు సకారాంత పదాల సకారం విసర్గ కావడం అన్ని చోట్లా జరగదు ఉదాహరణకు శ్రేయస్+కాముడు శ్రేయస్కాముడు అవుతుంది శ్రేయఃకాముడు కాదు అట్లాగే అయస్కాంతం, బహిష్కారం, భాస్కరుడు, దివస్పతి, సుయశస్కుడు, ధనుష్ఖండం, నిష్కారణం, దుష్కృతి, దుష్కార్యం, ధనుష్కోటి, చతుష్పథం మొదలయిన మాటలిటువంటివి

☆

# సున్నా ఎక్కడ

గణితంలో లాగానే మన లిపిలోనూ బిందువుకు చాలా ప్రాముఖ్యం ఉంది తెలుగులో బిందువు రెండు రకాలు అర్ధబిందువు, పూర్ణబిందువు బిందువును అనుస్వారం అని కూడా అంటాం సున్న/సున్నా అనీ అంటాం మనలిపిలో పూర్వం అర్ధ, పూర్ణ బిందువులకు ప్రత్యేకంగా లిపి చిహ్నా లుండేవికావు ముద్రణ వచ్చిం తర్వాతే అరసున్నాకి ҫ అనే లిపి చిహ్నం ఏర్పడింది అంతకు ముందు నిండు సున్నానే రాసేవారు దాని తరువాత ఉన్న హల్లునుద్విరుక్తంగా రాస్తే అది పూర్ణబిందువు ఉదా కొండ్డ అద్విరుక్తంగా రాస్తే అది అర్ధబిందువు ఉదా నాండు

తెలుగు మాటల్లో బిందువు పరుష సరళాలకు ముందే ఉంటుంది అంటే కచటతప, గజడదబ అనే వర్ణాలకు ముందే ఉంటుంది వంక, కొంగ, కొంచెం, గుంజ, గంట, కొండ, కంత, కంద, కంప, చెంబు వంటి మాటలలోనే ఉంటుందన్న మాట ఇవి అయిదు వర్గాల హల్లులు ప్రతి వర్గంలోనూ ఒక అనునాసికం ఉంటుంది ఆ హల్లు ముందు ఆ వర్గ అను నాసికమే వస్తుందన్నమాట వంక అంటే వఙ్క గింట అంటే గణ్ట, కొంచెం అంటే కొఞ్చెం, కంత అంటే కన్త, కంప అంటే కమ్ప అని ఈ రెండు రకాలుగానూ రాయవచ్చు కాని ప్రాచీన కాలంలోనే ఈ అనునాసికాల స్థానంలో బిందువును రాసే సంప్రదాయం ఏర్పడింది వర్గహల్లుల ముందు ఆయా వర్గాల అనునాసికాల స్థానంలో బిందువును రాయడం ఇప్పుడు మన భాషలో సార్వత్రికం అయింది

కచటతప, గజడదబలు తప్ప బిందువు తరువాత ఇతర హల్లులలో ఏది ఉన్నా ఆ మాట తెలుగుమాట కాదని చెప్పాలి తెలుగులో అనునాసికాలలో న, మ లు మాత్రమే ద్విత్వాలుగా వస్తాయి ఇటువంటి సందర్భాల్లో పూర్వం శాసనాలలో అంన్న, అంమ్మ వంటి లేఖనం కని పిస్తుంది తక్కిన చోట్ల బిందువును రాసే సంప్రదాయం ప్రభావం ఇది భాష రాయడం నేర్చుకునే దశలో చాలామంది పిల్లలు అంన అంమ అని రాయడం గమనించవచ్చు

సంయమనం, సంయమి వంటి మాటలు సంస్కృతం సంవత్సరం, సంవాదం కూడా సంస్కృతం మాటలే సంరంభం కూడా సంస్కృతమే వంశం, హంసలు కూడా సంస్కృతాలే సంలబ్ధి కూడా సంస్కృతమే సంహారమూ సంస్కృతమే

మహాప్రాణవర్గాలు అంటే ఖ, ఘ వంటి ఒత్తక్షరాలు ఎలాగూ తెలుగులో లేవు కాబట్టి బిందువు తరువాత ఇవి వచ్చినప్పుడు తెలుగుమాటలు కావని ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు శంఖం, సంఘం వంటి మాటలు సంస్కృతాలే

మన భాషను అజంత భాష అనీ, సంగీతానికి చాలా అనుకూలమైన భాష అనీ, తీయని భాష అనీ చెప్పొకుంటూ ఉంటాం హలంతంగా ఉన్న మాట మీద అచ్చు చేర్చుకొని దాన్ని అజం తంగా మార్చుకుంటాం అందువల్లే అనేక సంస్కృత పదాలూ, అన్యభాషా పదాలూ ఆ భాషల్లో హలంతాలై ఉండీ తెలుగులోకి వచ్చినప్పుడు అజంతాలైపోతాయి ఫలమ్ – ఫలము అవుతుంది ధనమ్– ధనము అవుతుంది హృదయమ్– హృదయము అవుతుంది డాక్టర్– డాక్టరు అవు తుంది జమీందార్, జమీందారు అవుతుంది అన్యదేశ్యాల మకారాంత శబ్దాలు కూడా అజంతా లవుతాయి. ఉదా ప్లాటినమ్ – ప్లాటినము, ఇస్లామ్ – ఇస్లాము, ముస్లిమ్ – ముస్లిము.

వాడుక భాషలో ఈ మాటలను ముఖ్యంగా మకారాంతాలను మకారాంతాలుగానె ఎక్కువగా వాడుతున్నాం ఉచ్చారణలోనూ రాతలోనూ కూడా వీటిని హలంతాలుగానె వాడుతున్నాం పత్రం, పుష్పం పలం, ప్లాటినం, ఇస్లాం, ముస్లిం అని ఇతర హల్లుల విషయంలో హలంత అజంత రూపాలు రెండూ వాడుతున్నాం ఉదా స్కూల్ – స్కూలు, బెల్ – బెల్లు, పాన్ – పాను సుల్తాన్ – సుల్తాను

పూర్వం మన పేర్లు హలంతాలుగా ఉండేవికావు ఇప్పుడు హలంతాలుగా పేర్లు పెట్టుకోవడం నాగరికం అయిపోయింది స్త్రీల పేర్లు మాత్రం మనవాళ్ళవి ఇంకా హలంతాలు కాలేదు మగవాళ్ళ పేర్లు కొంత ఇంగ్లీషు వర్ణక్రమం వల్లా, కొంత బెంగాలీ ప్రభావం వల్లా హలంతాలుగా మారుతున్నాయి

సుబ్రహ్మణ్యము సత్యము, రామబ్రహ్మము వంటి పేర్లు కూడా హలంతాలై సుబ్రహ్మణ్యం సత్యం, రామబ్రహ్మంగా మారిపోయాయి స్త్రీల పేర్లలో ము' చివర ఉండేవి హలంతాలయ్యాయి సూర్యకాంతము – సూర్యకాంతం అయింది నాగరత్నము – నాగరత్నం అయింది

సర్వనామాలలో కూడా మేము – మేం అయింది మనము – మనం అయింది క్రియలలో కూడా వచ్చాము– వచ్చాం అయింది ఉత్తమ పురుష క్రియలన్నీ ఈ విధంగానే హలంతాలయ్యాయి వస్తాం, వస్తున్నాం, రాం, తినం మొదలయినవి తనము, రికము వంటి ప్రత్యాయాలలో కూడా చివరి అచ్చు లోపించి తనం, రికం అయ్యాయి

పదమధ్యంలో ఉండే బిందువు వర్గానునాసికం అయితే పదాంతంలోని బిందువు మకారం మీద అచ్చులోపించడం వల్ల ఏర్పడ్డది పదాంతంలో అర్ధబిందువు ఉండదు ఆధునికభాషలో అర్ధబిందువుకు ప్రయోగం లేదు బిందువు అచ్చుకు తరువాతే వస్తుంది అందువల్ల సున్నాతో మొదలయ్యే మాటలుండవు కేవలం బిందువు అక్షరం కాదు దాని ముందున్న వర్ణంతో కలిసి అది అక్షరం అవుతుంది అందుకే తెలుగువారి లేఖన సంప్రదాయంలో పదంలో బిందువు దగ్గర విరిచి బిందువును తరువాత పంక్తిలో రాయడం కుదరదు పదాన్ని విరచవచ్చుకాని, అక్షరాన్ని విరవకూడదు

ం ☆

# తద్భవాలా - తత్సమాలా

ప్రపంచంలోని ఏ భాష అయినా ఇతర భాషల నుండి పదాలను అరువు తెచ్చుకోకుండా ఉండదు అట్లాగే మన భాష కూడా సంస్కృతం ప్రాకృతం మొదలయిన భారతీయ ఆర్య భాషల నుండే తమిళం కన్నడం వంటి సోదర ద్రావిడ భాషల నుండీ ఎన్నో మాటలు అరువు తెచ్చుకుంది పన్నెండో శతాబ్దం తర్వాత పర్షియన్, అరబిక్ పదాలెన్నో తెలుగులోకి వచ్చి చేరాయి 15 16 శతాబ్దాల నుండి పోర్చుగీసు డచ్చి ఫ్రెంచి ఇంగ్లీషు భాషల నుండి చాలా పదాలు వచ్చి చేరాయి ఎన్ని భాషల నుండి ఎన్ని పదాలు వచ్చినా సంస్కృతభాష మనకందించిన పదజాలంతో పోల్చినప్పుడు వాటి సంఖ్య వెలవెలపోక తప్పదు ఒక దీర్ఘకాల పరిమాణంలో ఆర్యద్రావిడ ప్రజల మధ్య జరిగిన సమ్మేళనం దీనికి ప్రధాన కారణం ఆర్యసంస్కృతిని ద్రావిడులు సొంతం చేసుకున్నారు మతం శాస్త్రాలు, సాహిత్యం ఆ సంస్కృతిలో భాగాలే గత శతాబ్దం వరకూ మన విద్యాభ్యాసమంతా సంస్కృతంలోనే జరిగింది అందువల్ల సంస్కృత పదజాలం తెలుగులో అనివార్యమైన భాగమైపోయింది

సంస్కృత పదాలతో పరిచయం సాధారణమయిన విషయం కాబట్టి తెలుగువారిలో చదువుకున్నవాళ్ళూ, చదువుకోనివాళ్ళూ అన్న భేదం లేకుండా సంస్కృత పదాలను సంస్కృతంలో మాదిరిగానే ఉచ్చరించగలుగుతారు అయినా మనభాషా ధ్వనులకు అనుగుణంగా కొన్ని మాటలు మారివచ్చాయి చాలామాటల మారిన రూపాలూ, మారని రూపాలూ రెండూ వాడుకలో ఉన్నాయి పుణ్యమూ ఉంది, పున్నెమూ ఉంది ద్యూతం ఉంది జూదం ఉంది తెలుగు కవులు రకరకాలుగా తద్భవాలు ఏర్పరచుకున్నారు మృత్యువును మిత్తి చేసుకున్నారు భక్తిని బత్తి చేసుకున్నారు భాష బాస అయింది రథం అరదమయింది అయితే ఆధునిక కాలంలో ఈ ప్రక్రియ చాలా వరకు తగ్గిపోయింది పూర్వం కూడా కేవలం దేశ్యపదాలతోనూ, తద్భవాలతోనూ రాసిన కావ్యాలు అంతగా ప్రచారం పొందలేదు ఆ భాష పాఠకులకు కృతకంగా కనిపించింది ఇది నిజంగా విచిత్రమయిన పరిస్థితే

తెలుగులో మహాప్రాణవర్ణాలు అంటే ఒత్తక్షరాలు లేవు కాబట్టి అన్యభాషా పదాలలో ఆ ధ్వనులు ఉంటే అవి అల్పప్రాణాలుగా మారడం సహజం ఖ – క కావాలి, ఘ – గ కావాలి, ఛ – చ కావాలి ఝ – జ కావాలి ఇట్లాగే తక్కినవి కూడా

కవిత్వ రచనలో ఛందస్సుకు అనుగుణంగా ఉండడానికి అంటే గణాలు యతి, ప్రాసలు కలవడానికి పదాలను అవసరమైన రీతిలో మార్చుకొనేవాళ్ళు అట్లాగే శబ్దాలంకార ప్రయోగంలో కూడా ఈ మార్పులు అవసరమయ్యేవి అందువల్ల వ్యవహారంలో ఉచ్చారణ భేదాలతో పాటు కవులు తమ అవసరాలకనుగుణంగా చేసిన మార్పులతో ఒక పదానికి ఒకటి కంటే ఎక్కువ రూపాలు ఏర్పడే అవకాశం కలిగింది ఇటువంటి సందర్భాలలో కొన్ని ప్రయోగాలు కవుల రచనల్లో మాత్రమే కనిపించడమూ సామాన్యుల వాడుకలో లేకపోవడమూ సహజమే

ఆధునిక వచన రచనలో ఇటువంటి మార్పుల అవసరం లేదు సృజనాత్మక రచనల్లో వ్యవహారంలో ఉన్న ఉచ్చారణ భేదాలను చూపించవచ్చు కాని, తక్కిన రచనల్లో ప్రామాణిక రూపమే, బహుళ ప్రచారంలో ఉన్న రూపమే వాడవచ్చు కొన్ని మాటలను మన భాషాధ్వని

వ్యవస్థకు అనుగుణంగా మార్చుకోవడం వల్ల కొన్ని ఇబ్బందులు కూడా కలుగుతాయి ఉదాహరణకు ఖరము అనే మాటను తీసుకోవచ్చు ఖరము అంటే గాడిద తెలుగు ధ్వని వ్యవస్థలో ఖ లేదు కాబట్టి ఖరము , కరము కావచ్చు కరము అనే సంస్కృత పదానికి చేయి అని అర్థం కరము అనే తెలుగుమాటకు మిక్కిలి అని అర్థం ఖ-క కావడం వల్ల ఖరము-కరము అనే మాటల భేదం తొలగిపోతూ ఉంది కదా అందువల్ల ఇక్కడ ఖ-కగా మారడం నష్టమే

పత్రికలలో విలేకరి, విలేఖరి అనే మాటలు విస్తృతంగా కనిపిస్తుంటాయి బహువచనంలో విలేకరులు - విలేఖరులు విలేఖరుడు వంటి ఏకవచనరూపం కూడా ఉండవచ్చు ఇక్కడ లిఖ్ అన్నది ధాతువు అందువల్ల విలేఖరి అనే రూపం ఏర్పడుతుంది దీనిలో ఖర శబ్దాన్ని విరిచి గాడిదలని చమత్కరించడానికి వీలుంటుందన్న భయంతోనేమో కొంతమంది విలేకరి అనేమాటకు ప్రచారం కలిగించారు చంద్రశేఖర, రాజశేఖర, గుణశేఖర వంటి పేర్లలో కూడా ఈ విధమయిన విరుపునకు అవకాశం ఉంది అట్లా అని ఈ పేర్లు పెట్టుకోవడం మానలేదు కదా ఈ భయం తప్పితే విలేఖరిని విలేకరి అనడానికి కారణం కనిపించదు ఖ-క అయి విలేకరి అనే తద్భవపదం ఏర్పడడంలో అసహజమేమీ లేదు కాని, ఆధునిక రచనా భాషలో మనం ఇటువంటి తద్భవ రూపాలను ఏర్పరచుకోవడం లేదు విలేఖరి అని రాయడానికి సందేహించవలసిన అవసరమేమీ లేదు

వాడుకలో స్థిరపడిపోయిన తద్భవాలను వాడడం మాని వాటి తత్సమరూపాలను వాడవలసిన అవసరం కూడా లేదు ఇటువంటి మాటల్లో తత్సమ, తద్భవ రూపాలు రెండింటినీ ఉపయోగించవచ్చు శృంఖల తెలుగులో సంకెల అయింది శృంఖల అన్న మాట కంటే సంకెలకే ప్రచారం ఎక్కువ అట్లాగే వేత్ర - బెత్తెం సంధి - సందు కాష్ఠ - కట్టె, లాక్ష - లక్క

ముఖం అనే మాటకు మొకం, మొగం అనే రూపాలు, సుఖానికి సుకం, శిఖకు సిక, ఇచ్ఛకు ఇచ్చ, కథకు కత, వ్యథకు వెత మొదలయిన తద్భవ రూపాలు వాడుకలో ఉన్నప్పటికీ తత్సమ రూపాలకే ప్రచారం ఎక్కువ

ఆధునిక రచనాభాషలో తత్సమ శబ్దాలకు ప్రయోగం ఎక్కువ తద్భవాలకు ప్రయోగం తక్కువ అవుతున్నది పూర్వకవులు వాడిన అనేక తద్భవ రూపాలు వాడుకలో నుండి తొలగిపోయాయి

☆

# ఎక్కడ అల్పప్రాణం - ఎక్కడ మహాప్రాణం

సంస్కృతం నుండి అరువు తెచ్చుకున్న మాటల్లో మహాప్రాణాలు అంటే ఒత్తక్షరాలు ఉంటాయి మన భాషలో అవిలేవు కాబట్టి ఈ మహాప్రాణాలు అల్పప్రాణాలుగా మారవచ్చు అంటే ఖ-క కావచ్చు అయితే ఈ సంస్కృత పదాలతో విస్తృతమయిన పరిచయం మనకు ఏర్పడింది అందు వల్ల అటువంటి మార్పులేకుండా వాటిని ఉన్నదున్నట్లుగా వాడడం అలవాటయిపోయింది కాని చాలా మాటలలో మహాప్రాణం ఉందో లేదో, ఉంటే మాటలోని ఏ అక్షరం మహాప్రాణమో అన్న విషయంలో సందేహం కలగవచ్చు ఈ సందేహంవల్ల పొరపాట్లు దొర్లడానికి అవకాశాలు న్నాయి ఉదాహరణకు బాధ భేదం అనే రెండు మాటలను తీసుకోవచ్చు కొంతమంది భాద అని రాయడమూ, బేధం అని రాయడమూ కనిపిస్తుంది ఎవరయినా భాధ, భేధం అని రెండింటికీ ఒత్తులు పెట్టి రాసినా రాయవచ్చు మనం ఈనాడు రాస్తున్న భాషలో ఇటువంటి పదాలెన్నో ఉన్నాయి సంస్కృత భాషాజ్ఞానం బాగా ఉన్నవారికి ఇటువంటి మాటలను రాయడంలో సమస్య ఏమీ ఉండదు కాని శబ్దస్వరూపం తెలియకపోతే వర్ణక్రమం విషయంలో అనుమానాలు వస్తూనే ఉంటాయి

ఈ మాటలను రాయడంలో ప్రధానంగా మూడు రకాల పొరపాట్లు జరగవచ్చు వీటిలో మొదటిది ఒత్తు అవసరం లేనిచోట పెట్టడం దీనివల్ల అర్థభంగం కూడా కలగవచ్చు ఉదా హరణకు ప్రదానం అనేమాటను ప్రధానం అనిరాస్తే అర్థమే మారిపోతుంది ప్రధానం అంటే ముఖ్యం అని అర్థం అదే ప్రదానం అంటే ఇవ్వడం అని అర్థం వీటిని ఒక దానికి బదులు ఒకటి వాడడంవల్ల అర్థభంగం కలుగుతుంది బహుమతి ప్రదానం, పట్టప్రదానం మొదలయిన విధంగా ఈ ప్రదాన శబ్దానికి ప్రయోగం ఎక్కువ ప్రదాన శబ్దం దద ధాతువునుండి ఏర్పడితే ప్రధాన శబ్దం దధ ధాతువు నుండి ఏర్పడింది ప్ర – ఉపసర్గ ప్రకృష్టమైనదని అర్థం ఈ రెండు మాటలకు అర్థంలో ఇంతభేదం ఉంది

ప్రబలడం అనేమాటకు తెలుగులో వాడుక ఎక్కువే 'అవినీతి ప్రబలుతోంది', 'ప్రబలమైన శత్రువు', 'కోరిక ప్రబలంగా ఉంది' వంటి ప్రయోగాలు చేస్తాం దీన్ని క్రియగా, విశేషణంగా, క్రియావిశేషణంగా, నామవాచకంగా కూడా వాడతాం ప్రబలం ప్రాబల్యం అన్నవి నామవాచక రూపాలు ఈ మాటను ప్రభలం ప్రాభల్యం అని మహాప్రాణంతో రాయకూడదు

అవలంబించు అనే మాటలో కూడా మహాప్రాణంలేదు అవలంభించు అన్న ప్రయోగం సరయింది కాదు అవలంబన, ఆలంబన పదాలు కూడా ఇంతే

విదితం అంటే అవగతం, తెలిసినది దీన్ని విధితం అని రాయకూడదు విధింపబడినది అని అనుకొనే ప్రమాదం ఉంది విధి అనే మాటనుండి విధ్యుక్త ధర్మం అనే పదబంధం ఏర్పడు తుంది విధి చెప్పినటువంటి ధర్మం, కర్తవ్యం అని దీనికి అర్థం దీన్ని విద్యుక్త ధర్మం అనరాదు

రోదన అంటే ఏడుపు, రోదించు అంటే ఏడ్చు దీన్ని రోధించు అనిరాస్తే అడ్డుపెట్టు అని అర్థం వస్తుంది నిరోధించు 'ని' అనే ఉపసర్గ చేర్చడంవల్ల ఏర్పడింది

వదాన్యుడు అంటే దాత దీన్ని వధాన్యుడు అని మహాప్రాణంతో రాయకూడదు

శాకాహారం, శంకుస్థాపన అనే పదాలను చాలా మంది శాఖాహారం, శంఖుస్థాపన అని

రాస్తుంటారు శాకాహారం మాంసాహారానికి వ్యతిరేకం వెజిటేరియన్ అన్నమాట శాఖ అంటే కొమ్మ అనే అర్థం ఉంది కాబట్టి కొమ్మలనుండి అంటె చెట్ల నుండి వచ్చిన ఆహారం అని అనుకోవడం వల్లనేమో దీన్ని శాఖాహారం అనడం సర్వత్రా కనిపిస్తుంది మన రాష్ట్రంలోని ఏ వెజిటేరియన్ హోటల్ బోర్డు చూసినా దానిమీద శాఖాహార హోటల్ అన్న ప్రయోగం కనిపించకతప్పదు

అట్లాగే శంకుస్థాపన కూడా ఏదైనా కట్టడాన్ని నిర్మించాలని తలపెట్టినప్పుడు శంకుస్థాపన చేస్తారు ఇక్కడ శంఖానికి కాని, శంఖువుకుకాని స్థానంలేదు అయినా ఈ శంకు శబ్దమెమిటో తెలియకపోవడం వల్లా, శంఖ శబ్దం బాగా పరిచితమై ఉండడంవల్లా ఈ పదబంధంలో మొదటి పదం శంఖ' అనుకోవడమే చాలా మంది శంఖుస్థాపన అని రాయడానికి కారణం

ఉచ్చారణలో కూడా మహాప్రాణం లేదు ఉచ్చారణ అని రాయడం సరికాదు అట్లాగే జటిలం, జాడ్యం సరయినవి జఠిల, ఝాడ్యం సరికావు

ఒక్కొక్కసారి సమాసంలో ఒక పదంలో మహాప్రాణం ఉంటే తరువాతి మాటలో మహాప్రాణం లేకపోయినా మొదటిపదం ప్రభావంతో అందులో కూడా మహాప్రాణం రాస్తూ ఉంటాం ఉదాహరణకు ధూపదీప నైవేద్యాలు అన్న సమాసాన్ని తీసికోవచ్చు ఈ సమాసంలో మూడు మాటలున్నాయి దూపం, దీపం, నైవేద్యం ఈ దూపం ప్రభావంవల్ల దూపదీప అని రాసే ప్రమాదం ఉంటుంది నైవేద్యం కూడా నైవేద్యం అయినా కావచ్చు

ఇదమిత్థం అనే పదబంధంలో ఇదమ్, ఇత్థమ్ అనే రెండు మాటలున్నాయి ఇది ఇది అని అర్థం ఇదమిత్థంగా తేల్చిచెప్పడం లేదు అంటాం ఇదీ అని కచ్చితంగా తేల్చిచెప్పడం లేదు అని అర్థం

అస్తవ్యస్తం అంటే గందరగోళం, చిందరవందర, గట్టిగా చెప్పాలన్న ఉద్దేశమేమో అస్థవ్యస్థం అని రాస్తుంటారు ఇది సరికాదు

దశాబ్ది అంటే పదేళ్ళు, శతాబ్ది అంటే నూరేళ్ళు, సహస్రాబ్ది అంటే వెయ్యేళ్ళు అబ్దశబ్దానికి సంవత్సరమనీ, మేఘమనీ అర్థాలు అప్ అంటే నీరు నీరు ఇస్తుంది కాబట్టి మేఘం అబ్దం దశాబ్ది మొదలయిన పదాలలో అబ్ద శబ్దానికి సంవత్సరమనే అర్థం దశాబ్దికి బదులు దశాబ్ధి అని రాస్తే అర్థం మారిపోతుంది అబ్ధి అంటే సముద్రం అందువల్ల ఈ రెండింటినీ ఒకదాని ఒకటి వాడకూడదు

మనస్తాపంలో మనస్, తాపం అనే రెండు మాటలున్నాయి కలిపితే మనస్తాపం అవుతుంది మహాప్రాణంతో మనస్థాపం అనిరాయడం సరికాదు

మద్యం మధ్యం వేరువేరు మాటలు మద్యం అంటే మదిర దీనికి సుర అనీ, ఇరా అనీ, కాదంబరి అనీ ఇంకా చాలా పేర్లున్నాయి దీనివల్ల మదిస్తారు కాబట్టి ఇది మద్యం బాగా పుచ్చుకుంటారు కాబట్టి సుర దీనివల్ల తిరుగుతారు కాబట్టి ఇర గోమంత పర్వతంలో కదంబవృక్షం తొర్రలో పుట్టింది కాబట్టి కాదంబరి మదిరకూ మద్యానికీ ఒకటే వ్యుత్పత్తి మధ్యం అంటే నడిమిభాగం అని అర్థం

ఇట్లా అల్పప్రాణాలు మహాప్రాణాలుగా రాయడం తెలుగు మాటలకూ, అన్యదేశ్యాలకూ కూడా వ్యాపించింది జాము ఝాము అయింది దీటు ధీటు అయింది దరఖాస్తు ధరఖాస్తు అయింది వీటిలో మహాప్రాణాలు లేవు ☆

# 'మహాప్రాణా'లు తారుమారు చేయవద్దు

ఒక సంస్కృత పదంలో ఏ వర్ణం మహాప్రాణమో సందేహం కలగడం వల్ల ఒకదానికి బదులు మరోదానికి ఒత్తు ఇవ్వడం జరుగుతుంది ఇటువంటి పొరపాటు మహాప్రాణాల విషయంలో రెండోరకం ఇది రెండక్షరాల మాటల్లో కూడా జరగవచ్చు ఉదాహరణకు బాద అనే మాటను తీసుకోవచ్చు ఈ మాటలో ద మహాప్రాణం కాని కొందరి ఉచ్చారణలో మొదటి అక్షరం మహాప్రాణమై బాద' ఏర్పడుతుంది ఇది బాధ నుండి ఏర్పడ్డ మాటలన్నింటిలోనూ జరగవచ్చు బాధితుడు, బాదితురాలు క్రియగా బాదించు ఇది బాదా శబ్దం బాధృ దాతువు విలోదనం అంటే కలియబెట్టడం అని అర్థం దీనివల్ల కలియబెట్టబడలారు కాబట్టి బాద బాద, పీడ వ్యథ దుఃఖం, అమనస్యం, ప్రసూతిజం అన్న ఆరూ మనఃపీడకూ, కష్టం కృచ్ఛ్రం, అభీలం అన్నవి శరీర పీడకూ పేర్లంటారు ఈ తొమ్మిదింటినీ దుఃఖానికే పేర్లుగా వాడతారు బాధ్యం, బాధ్యత వంటి మాటలు కూడా ఇటువంటివే

బాధలాగే మహాప్రాణాన్ని తారుమారుచేసే మరోమాట బేదం భిదిర్ ధాతువు కలిసి ఉన్నవాటిని వేరుచేయడం భేదం సామ, దాన, బేద, దండోపాయాలన్న నాలుగు ఉపాయాలలో భేదం ఒకటి దీనికి ఉపసర్గలు చేరి విభేదం, ప్రభేదం వంటి మాటలు ఏర్పడతాయి భేదించు అనే క్రియాపదం ఏర్పడుతుంది బేద్యం, అబేద్యం, దుర్భేద్యం, భేదకం వంటి చాలా మాటలను ఉత్పన్నం చేసుకోవచ్చు

మరొకమాట బోధన, బుధ ధాతువు తెలియడం దీనినుండే బుద్ధి బోదకులు అంటే మేలుకొలిపేవాళ్ళు బోధన అంటే మేలుకొల్పడం, చదువుచెప్పడం, ఉపదేశం చేయడం అన్న అర్థంలో వాడుతున్నాం బోధకులు అంటే మతప్రచారకులు అనే అర్థం కూడా ప్రచారంలో ఉంది బుధ ధాతువు నుండి వచ్చిన ఎన్నో మాటల్లో సంబోధన ప్రబోధం, విబుధులు, బుధులు, ఉద్బోధం, బోధి, బుద్ధుడు, సంబుద్ధి మొదలయినవి ముఖ్యమైనవి బోధించు, సంబోధించు, ప్రబోధించు, ఉద్బోధించు అని క్రియారూపాలు కూడా వాడుకలో ఉన్నాయి

బంధం అన్నమాటకు కూడా పొరపాటుగా భందం అని రాయవచ్చు బంధ ధాతువు బంధం అంటే కట్టు బందనం అంటే కట్టివేయడం అనీ, కట్టే సాధనం అనీ అర్థం దిగ్బందం దిగ్బంధనం నాలుగువైపుల నుండీ కట్టి వేయడం ప్రబంధం అంటె ప్రకృష్టమైన బంధం మను చరిత్ర, వసుచరిత్ర లాంటివి నిర్బందం అంటే గట్టిగా బంధించడం, బలాత్కారం సంబంధం, అనుబంధం మొదలయిన మాటలెన్నో ఈ బంధం నుండి ఏర్పడతాయి బందితుడు బంధితురాలు, నిర్బంధితుడు, నిర్బంధితురాలు, సంబంధితుడు లాంటి పదాలను ఏర్పరచుకోవచ్చు బంధించు, నిర్బంధించు, అనుబంధించు మొదలయిన విధంగా క్రియాపదాలుగా వీటిని వాడవచ్చు బంధువు, బాంధవుడు అన్న మాటలు సగోత్రత్వాన్ని తెలుపుతాయి బాంధవ్యం దీని నుండి వచ్చింది

ఛేదనలో ఛిదిర్ ధాతువు ఛిదిర్ అంటే రెండుగా చేయడం, చీల్చడం, నరకడం దీనినుండే విచ్ఛేదన ఛేదించు అనే క్రియ కూడా ఏర్పడుతుంది

దగ్ధంలో మొదటి ద కారాన్ని మహాప్రాణంగా రాయకూడదు ఈ మాటలో దహ ధాతువు

అందువల్ల మొదటి 'ద' అల్పప్రాణమే ఈ ధాతువుకు భస్మీకరణం, బూడిదగా చేయడం అని అర్థం దగ్ధం అంటే కాల్చబడినది

బీభత్సం అన్నమాటను బీభత్సం అనీ భీబత్సం అనీ రాస్తుంటారు బీభత్సం శృంగారవీర కరుణ అద్భుతహాస్య భయానక బీభత్స రౌద్ర శాంత అనే తొమ్మిది రసాలలో ఒకటి బీభత్స అంటే నింద నిందకలిగినది బీభత్సం మనస్సును కష్టపెట్టేది జుగుప్స ఈ రసానికి స్థాయీభావం జుగుప్స అంటే రోత, బీబత్స దృశ్యం అంటే రోత కలిగించే దృశ్యం అర్జునునికి బీభత్సుడు అని పేరు ఇది వికృతి అయి విచ్చుడు అయింది

దృఢం అంటే బలమైనది దీనిలో ధాతువు దృహ దృహ అంటే వృద్ధి దీని నుండే దార్వ్యం దారుఢ్యం అనే మాటలు వచ్చాయి బాగా బలమైనది అనే అర్థంలో సుదృఢం అని వాడవచ్చు

సందిగ్ధలో దిహ ధాతువు సందిగ్ధం అంటే అస్పష్టం, అనుమానం దీని వ్యతిరేకార్థక పదం అసందిగ్ధం స్పష్టం, నిశ్చయాత్మకం అని అర్థం

స్తంభం అంటే మ్రాన్పాటు చేష్ట లేకుండా ఉండడం కంబం అని కూడా అర్థం కంబం అన్నమాట స్తంభానికి వికృతి స్తంభం అంటే స్థిరంగా ఉండేది చెట్టు వేళ్ళకూ కొమ్మలకూ మధ్య భాగాన్ని కూడా స్తంభం అంటారు దీన్ని ప్రకాండం అని కూడా అంటారు పూర్తిగా నిలిచిపోవడాన్ని స్తంభించిపోయాయని వర్ణిస్తున్నాం స్తంభన అన్నమాట కూడా ఉంది

స్తబ్ధం అన్నా కదలికలేకుండా ఉండడమే స్తబ్ధరోముడు అంటే నిక్కపొడుచుకున్న వెంట్రుకలు కలవాడని అర్థం

స్వచ్ఛందం అనేమాటను తనకు తానుగా అన్న అర్థంలో ఉపయోగిస్తున్నాం ఇతరుల ప్రోద్బలం లేకుండా, బలవంతం లేకుండా అన్న అర్థంలో వాడుతున్నాం ఇటీవలి కాలంలో స్వచ్ఛంద సేవాసంస్థల సంఖ్య విస్తృతంగా పెరిగింది స్వచ్ఛందం అంటే స్వతంత్రం, ఎటువంటి అడ్డుబాటూ లేకపోవడం, స్వకీయమయిన అభిప్రాయం కలిగి ఉండడం అస్వచ్ఛందుడు అన్న మాట కూడ ఉంది అస్వతంత్రుడని అర్థం తెలుగులో ఈ మాటకు అంతగా ప్రయోగంలేదు

మహాప్రాణాలున్న మాటలను రాయడంలో జరిగే మూడో రకమయిన పొరపాటు మహాప్రాణం బదులు అల్పప్రాణం రాయడం ఇటువంటి సందర్భాలలో వాటిని వికృతులని సరిపెట్టుకోవచ్చు కాని, పదం మొత్తం మారనప్పుడు అది సాధ్యంకాదు ఉదాహరణకు ఛిన్నాభిన్నం అన్నమాటను తీసుకోవచ్చు చిన్నాబిన్నం అంటే తద్భవం అని సర్దుకోవచ్చు కాని, చిన్నాభిన్నం అనిగాని, ఛిన్నాబిన్నం అనికాని రాస్తే సమర్థించుకోవడం కష్టం ఈ పదబంధంలోని రెండు మాటలూ మహాప్రాణంతో ఉన్నవే ఇటువంటి మాటే సాధక బాధకాలు రెండు మాటల్లోనూ మహాప్రాణం ఉంది సాధకమూ, బాధకమూ అన్నమాట అభ్యర్థిలో రెండు మహాప్రాణాలున్నాయి అభి, అర్థి కలిసి అభ్యర్థి. విద్యార్థిలోని విద్యలో మహాప్రాణం లేదు కాబట్టి విద్యార్థి అని మాత్రమే అవుతుంది మధ్యాహ్నం, అధ్వాన్నం ఈ రెండింటిలోనూ ఒత్తక్షరాలే ఉన్నాయి లబ్ధి, లబ్ధం, లోభి, లుబ్ధుడు మొదలయిన మాటల్లోనూ మహాప్రాణాలే ఉన్నాయి

ఈ పొరపాట్లు మన పేర్లలోకి కూడా ఎక్కాయి జనార్దన శబ్దంలో మహాప్రాణం లేదు అట్లాగే మల్లికార్జునలోనూ మహాప్రాణం లేదు జనార్ధన, మల్లిఖార్జున అని రాయడం చాలా మందికి అలవాటయిపోయింది ☆

# ట కాదు ఠ

తత్సమ పదాలలో ట, ఠ లతో ఉండే మాటలెన్నో ఉన్నాయి అయితే ఈ మాటలలో ట, ఠ ల వ్యత్యయం అర్థభేదానికి కారణమవుతుంది అందువల్ల వీటి భేదాన్ని పాటించవలసి ఉంటుంది ఉదాహరణకు మనం చాలా ఎక్కువగా వాడే షష్టి షష్ఠి అనే మాటలను తీసుకోవచ్చు షష్టి అంటె అరవై, షష్ఠి అంటే ఆరు షష్టి పూర్తి, షష్ట్యబ్దపూర్తి అని అరవై సంవత్సరాలు నిండిన సందర్భంగా పండుగ చేసికోవడం మనకు తెలిసిందే

ఇటీవలి కాలంలో ఈ షష్టిపూర్తులు బాగా పెరిగాయి కొంతకాలం కిందటి వరకు కుటుం బం వరకు మాత్రమే పరిమితమై ఉండిన ఈ ఉత్సవం ఇప్పుడు జనంలో పడి చందాలు పోగు చేయడానికి ఒక సదవకాశం అయిపోయింది మహాప్రాణం ఉంటే అరవై అనుకొని షష్ఠి పూర్తి మహోత్సవాహ్వానం అని పత్రికలు పంచడం కూడా కనిపిస్తుంది కాని షష్ఠి అంటే ఆరుమాత్రమే

సంస్కృతపదాలలో ట, ఠ, డ, ఢ లు సాధారణంగా సంధిప్రక్రియలో ఏర్పడతాయి పదంలో భాగంగా ఈ ధ్వనులున్నప్పుడు ఆ పదం సాధారణంగా అరువు తెచ్చుకున్నమాట అయి ఉంటుంది ఇటువంటి పదాలసంఖ్య పరిమితంగానే ఉంటుంది

కఠినం అన్నా కఠోరం అన్నా దృఢమైనదని అర్థం కఠినం అన్నమాటను గట్టి అనే అర్థంతో పాటు క్లిష్టమన్న అర్థంలో కూడా వాడుతున్నాం జఠరం అంటే ఉదరం ఇదీ దృఢమైందే ఇందు లో మృదువైన వస్తువులు అరుగుతాయి కంఠం అంటే గళం, కుత్తుక, ధ్వనిస్తుంది కాబట్టి కంఠం కఠధాతువు కమఠం అంటే తాబేలు కుఠారం అంటే గొడ్డలి కుంఠితం అంటే మందగించినది

కంటకం అంటే సూదిమొన అనీ, క్షుద్రుడైన శత్రువనీ, ముల్లు అనీ, రోమాంచం అని అర్థాలు కటకం అంటే పర్వత మధ్యప్రదేశం అనీ, కంకణం అనీ, రాష్ట్రమనీ అర్థాలు మనుచరిత్ర లోని కటక చరత్కరేణు కరకంపిత సాలము' అన్న ప్రయోగంలో దీనికి పర్వత మధ్యప్రదేశమని అర్థం

పఠ ధాతువుకు చదవడం అని అర్థం దీనినుండే పాఠం అనే మాట వచ్చింది పఠించే వాడు పాఠకుడు స్త్రీ అయితే పాఠకురాలు పఠించు అని క్రియగా కూడా వాడతాం మనకు ఘనాపాఠులున్నారు స్తోత్రం చేసేవారు స్తోత్రపాఠులు పూర్వం తాటాకు పుస్తకాలలో మన కవులు రాసిన పద్యాలలో కొన్నిచోట్ల ఒక్కొక్క ప్రతిలో ఒక్కొక్కరూపం ఉండేది ప్రతి రాసుకునే వాళ్ళు చేసే పొరపాట్ల వల్ల ఇటువంటి పర్యాయరూపాలు ఏర్పడతాయి వీటిని పాఠభేదాలు అంటాం వాచకం అనే అర్థంలో పాఠ్యగ్రంథం, పాఠ్యపుస్తకం అంటున్నాం

ఉత్కంఠ అంటే తహతహ కావాలని కోరుకున్నది లభించడంలో ఆలస్యమైనప్పుడు కలిగే తహతహ పాఠకులకు ఉత్కంఠ కలిగించే రచనలకోసం పత్రికలు పాట్లు పడుతున్నాయి వార్తలు కూడా అట్లా రాయాలనే ప్రయత్నమూ కనిపిస్తూ ఉంటుంది

పీఠం అంటే ఆసనం, పీట, ఉన్నతస్థలం ఉన్నతస్థానం నుండి గ్రంథాన్ని పరిచయం చేస్తారు కాబట్టే 'ముందుమాట'కు పీఠిక అనిపేరు

ఓష్ఠం అంటే పెదవి పెదవుల నుండి పుట్టే ధ్వనులు ఓష్ఠ్యాలు ఉ, ఊ, ఒ, ఓ లు ప, ఫ, బ, భ, మ లు ఓష్ఠ్యాలు.

అంగుష్ఠం అంటే బొటనవ్రేలు నిష్ఠురం అంటే కఠినం కఠినుడు అన్న అర్థంలో నిష్ఠురుడు అనవచ్చు నిష్ఠురం ఆడడం కఠినమైన మాట అనడం

తిష్ఠ వేసుకొని కూర్చున్నాడంటాం స్థిరంగా ఉన్నాడని అర్థం వదిలి వెళ్ళడం లేదని భావం తెలుగులో ఈ మాటకు నిందార్థమే ఉంది ప్రతిష్ఠ అంటే గౌరవం అని అర్థం స్థాపించడం అనీ శాశ్వతంగా నెలకొల్పడం అనీ కూడా అర్థం ఇదే అర్థంలో ప్రతిష్ఠాపన అన్న మాటను వాడుతున్నాం ప్రతిష్ఠించు, ప్రతిష్ఠాపించు, ప్రతిష్ఠ చేయు అని క్రియగా కూడా దీన్ని వాడుతున్నాం మంచి కీర్తి అన్న అర్థంలో సుప్రతిష్ఠ అనీ, దృఢంగా నెలకొల్పబడ్డవాడు అన్న అర్థంలో సుప్రతిష్ఠితుడు అనీ వాడుకలో ఉంది

కాష్ఠ శబ్దానికి కొయ్య అని అర్థం అగ్నితో కూడి ప్రకాశించేది ఈ మాటకు ఉత్కర్ష మర్యాద, దిక్కు అని కూడా అర్థాలున్నాయి మర్యాద అంటే హద్దు ఈ అర్థంలోనే పరాకాష్ఠ అన్నమాట ఏర్పడింది పరాకాష్ఠ అంటే తుదిహద్దు

దుష్ఠు అంటే ఇది చెడ్డది అని అర్థం సుష్ఠు అంటే మంచిది దీనినుండే సౌష్ఠవం అన్నమాట ఏర్పడింది

రోజూ పత్రికలలో కనిపించేమాట అధిష్ఠానం అదిష్ఠానం అంటే ఆక్రమించడం పైన కూర్చొని ఉండడం ఇవ్వాళ రాజకీయ పార్టీలలో అన్ని నిర్ణయాలు చేసే అధికారం చేతిలో ఉన్న వారు అధిష్ఠానవర్గం కోష్ఠం అంటే కడుపు, గాదె, లోపలి ఇల్లు ప్రకోష్ఠం అంటే ముంజేయి గోష్ఠం అంటే కొట్టం, గోవులుండే చోటు గోష్ఠి అంటే సభ ప్రోష్ఠం అంటే ఎద్దు ధనిష్ఠ, శ్రవిష్ఠ అన్నవి ధనిష్ఠా నక్షత్రం పేర్లు నిష్ఠ్యూతి, నిష్ఠీవనమ్, నిష్ఠేవనమ్ అన్నవి ఉమ్మివేయడానికి పేర్లు

పృష్ఠం అంటే వీపు పృష్ఠాస్థి అంటే వెన్నెముక మంజిష్ఠ అంటే మనోజ్ఞమైన రంగు పరమేష్ఠి ఉత్కృష్టమైన స్థానంలో ఉన్నవాడు, భగవంతుడు

నిష్ఠ అంటే నియతమైన స్థితి

కనిష్ఠ అంటే చిటికెనవ్రేలు. కనిష్ఠిక అని కూడా అంటాం అన్నిటికన్న చిన్న, తక్కువ అని అర్థం కనిష్ఠుడు అంటే తమ్ముడు గరిష్ఠ అంటే మిక్కిలి బరువైనది అన్నిటికన్నా ఎక్కువ అన్న అర్థంలో కూడా వాడుతున్నాం వరిష్ఠ అంటే మిక్కిలి విరివి అయినది, శ్రేష్ఠమైనది శ్రేష్ఠం అంటే అతిప్రశస్తమైనది, మిక్కిలి కొనియాడదగింది ద్రాఘిష్ఠ అంటే మిక్కిలి పొడవైంది హ్రసిష్ఠ అంటే మిక్కిలి పొట్టిది బలిష్ఠ అంటే మిక్కిలి బలమైంది భూయిష్ఠం అంటే మిక్కిలి బహుళమైనది విస్తృతం సాధిష్ఠం అంటే మిక్కిలి పదిలమైంది. స్థవిష్ఠం అంటే మిక్కిలి బలిసినది ప్రేష్ఠం అంటే మిక్కిలి ప్రియమైనది క్షేపిష్ఠం అంటే అత్యంతవేగం కలది అని అర్థం క్షోధిష్ఠం అంటే అత్యంత క్షుద్రమైనది బంహిష్ఠం అంటే మిక్కిలి తరచైనది నేదిష్ఠం అంటే మిక్కిలి సమీపమైనది

కోపిష్ఠి మిక్కిలి కోపం కలిగినవాడు గర్విష్ఠి మిక్కిలి గర్వం కలిగినవాడు కర్మిష్ఠి అంటే క్రియాసామర్థ్యం కలిగినవాడు పాపిష్ఠి అంటే మిక్కిలి పాపంతో కూడుకొన్నవాడు బర్హిష్ఠం అంటే వృద్ధిపొందేది ప్రష్ఠ అంటే అగ్రేసరుడు, ముందునడిచేవాడు

☆

# 'ఠ'కారం కాదు... 'ట'కారమే!

అష్ట అంటే ఎనిమిది బుద్ధునిది అష్టాంగమార్గం అంటే ఎనిమిది ప్రధాన అంశాలు కలిగిన మార్గం సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పం, సమ్యగ్వాక్కు, సమ్యక్కర్మ, సమ్యగ్జీవనం, సమ్యగ్వ్యాయామం, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి బౌద్ధ ధర్మంలో ఈ ఎనిమిదీ అంగాలయితే ఒక్కో శాస్త్రంలో ఒక్కోవిధంగా అష్టాంగాలున్నాయి యమ నియమాది అష్టాంగాలు యోగశాస్త్ర సంబంధమైనవి శల్య శాలాక్యాదులు వైద్యశాస్త్ర సంబంధమైనవి ఇట్లాగే గాయత్రీ మంత్రానికి సంబంధించి, చికిత్సకు సంబంధించి, ధర్మానికి సంబంధించి సైన్యానికి సంబంధించి, పూజకు సంబంధించి, రాజ్యానికి సంబంధించి అష్టాంగాలున్నాయి ఎనిమిది శరీరావయవాలతోనూ చేసే నమస్కారం సాష్టాంగనమస్కారం

అష్టాగ్నులు, అష్టైశ్వర్యాలు, అష్టకష్టాలు అష్టకర్మలు, అష్టగణపతులు, అష్టలక్ష్ములు, అష్టదిక్కులు, అష్టదిక్పాలకులు, అష్టదిగ్గజాలు, అష్టనాయికలు, అష్ట ప్రధానులు, అష్టభాషలు ఈ విధంగా అష్ట సంఖ్యతో ఉండే అంశాలెన్నో ఉన్నాయి పూర్వకాలంలో బహుభాషా పండితులను అష్టభాషా పండితులనేవాళ్ళు సంస్కృతం, ప్రాకృతం, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికా పైశాచి అపభ్రంశం, తెలుగు అన్నవి ఆ అష్టభాషలు ఓం నమో నారాయణాయ అన్నది అష్టాక్షరి పాణిని రచించిన ఎనిమిది అధ్యాయాల వ్యాకరణ గ్రంథం అష్టాధ్యాయి ఇటీవలి కాలంలో అవధానాలు మళ్ళీ ప్రాచుర్యంలోకి వచ్చాయి అష్టావధానం వాటిలో ఒకరకం

అష్టకం అంటే ఎనిమిది పద్యాల కావ్యభేదం జనార్దనాష్టకం అనే సుప్రసిద్ధ అష్టకకావ్యం ఉంది

ఇష్టం అంటే యజ్ఞంలో హోమదానాది క్రియ ఇషు ధాతువు నుండి వచ్చింది ఇచ్ఛ కోరిక అని కూడా అర్థం తెలుగులో ఇప్పుడు ఈ అర్థంలోనే వాడుతున్నాం మనకిష్టమైనవాడు ఇష్టుడు ఇష్టి అంటే యజ్ఞం, కోరిక అభీష్టం అంటే వాంఛ, మనోరథం

ఉష్ట్రం అంటే ఒంటె ఎప్పుడూ ఎండలో తపిస్తుంది కాబట్టి ఉష్ట్రం ఇదే కారణంవల్ల నిప్పుకోడి ఉష్ట్రపక్షి తెలుగువాళ్ళు ఈ మాటను తిట్టుగా కూడా వాడుతున్నారు

ఉచ్ఛిష్టం అంటే ఎంగిలి ఉచ్ఛిష్ట భోజనం అష్టకష్టాల్లో ఒకటి బాణోచ్ఛిష్టం జగత్సర్వం అని నానుడి సంస్కృతంలో బాణకవి వాడని పదమేలేదట

కృష్ట శబ్దానికి దున్నిన భూమి అని అర్థం ప్రకృష్టం అంటే బాగుగా దున్నినభూమి ప్రకృష్ట శబ్దాన్ని శ్రేష్ఠమైన అన్న అర్థంలో తెలుగులో వాడుతున్నాం ఆకృష్టం అంటే ఆకర్షింపబడినదని అర్థం ఉత్కృష్టం అంటే గొప్పది నికృష్టం అంటే నీచమైంది

క్లిష్ట శబ్దానికి పీడింపబడినదని అర్థం సంక్లిష్టం అంటే మిక్కిలి పీడింపబడినదని అర్థం క్లేశం, కష్టం అన్నఅర్థంలో వాడుతున్నాం కష్టం కూడా అంతే చొరరానిది, హింసించేది అని అర్థం

చతుష్టయం అంటే నలుగురి సమూహం దుష్టచతుష్టయం సుప్రసిద్ధమే కదా

త్వష్ట అంటే బ్రహ్మ చెక్కేవాడు నిర్మించేవాడు

విష్టపమ్ అంటే స్వర్గం త్రివిష్టపమ్ అంటే మూడోస్వర్గం ఇప్పటి టిబెట్ అన్నమాట

తుష్టి అంటే ఆనందం సంతుష్టి అంటే సంతోషం అసంతుష్టి అసంతోషం

దుష్టం అంటే దోషం కలిగింది నిర్దుష్టం అంటే దోషం లేనిది నిర్దిష్ట, నిర్దుష్ట అనే రెండు మాటలకూ భేదం ఉంది నిర్దిష్టం అంటే నిర్ణీతమైన కచ్చితమైన అని అర్థం

దృష్టం అంటే చూడబడినది అదృష్టం అంటే కనిపించనిది ఎవడి అదృష్టం వాడిది అంటే ఎవడి భాగ్యం వాడిది విధాతరాత అన్నమాట దృష్టి అంటే చూపు దృష్టాంతం అంటే ఉదాహరణ

ధృష్టుడు అంటే దిట్టతనం కలిగినవాడు నలుగురు శృంగార నాయకులలో ఒకడు అధృష్టుడు అంటే దిట్టతనం లేనివాడు, సిగ్గు కలిగినవాడు

నష్టం అంటే కనపడకుండా పోయింది కానరానిది

పుష్టం అంటే పోషింపబడినది దీనినుండే పుష్టి, పౌష్టికాహారం పిష్టం అంటే పిండి పిష్టకం అంటే పిండితో చేసినవంట పిష్టపేషణమనే ప్రయోగం ఉంది పిష్టం అంటే పిండి, పేషణం అంటే పిండికొట్టడం పిండిని పిండి కొట్టడం ఏమిటి? వృథా అన్నమాట చెప్పిందే చెప్పడం

ప్రతిష్టంభన అంటే ప్రతిబంధం, అడ్డుపడడం, కార్యవిఘాతం

భ్రష్టం అంటే జారిపడినది భ్రష్టుడు అంటే జారిపడినవాడు సామాజిక విలువల నుండి దిగజారినవాడు అన్న అర్థంలో వాడుతున్నాం

ముష్టి అంటే పిడికిలి పిడికిలితో బిచ్చం వేస్తాం కాబట్టి ముష్టికి బిచ్చం అనే అర్థం కూడా తెలుగులో ఏర్పడింది ముష్టివాడు అంటే బిచ్చగాడు ముష్టిఘాతం అంటే పిడికిలిదెబ్బ ముష్టియుద్ధం అంటే బాక్సింగ్ బాక్సరును ముష్టియోధుడనీ, బాక్సింగును ముష్టియుద్ధమనీ మనం వాడుకోవచ్చు

మృష్టం అంటే శోధింపబడినవస్తువు స్వచ్ఛమైంది శుభ్రమైంది మృష్టాన్నం అంటే శుభ్రమైన భోజనం సంమృష్టం అంటే బాగా శుద్ధిచేసింది

యష్టి అంటే కోల, కర్ర. భారయష్టి అంటే కావడిబద్ద యష్ట అంటే యాగంచేసేవాడు ఆదేష్ట అంటే యజ్ఞవిషయం బోధించేవాడు

విష్టి అంటే వెట్టి, వృష్టి అంటే వర్షం అతివృష్టి అంటే అవసరమైన దానికంటే ఎక్కువ వర్షం అనావృష్టి అంటే అవసరమైనదానికంటే తక్కువ వర్షం వేష్టితం అంటే చుట్టబడినది అని అర్థం పర్యవేష్టితం, సమావేష్టితం దీనినుండే వచ్చాయి

వ్యష్టి అంటే విడి సమష్టి అంటే మొత్తం రిష్టం అంటే శుభం, అశుభం అని రెండర్థాలూ ఉన్నాయి అరిష్టం అన్నా అంతే అరిష్టం అంటే పురుటిల్లు, కుంకుడు, వేప, వెల్లుల్లి, మజ్జిగ, ఆసన్నమరణం అన్న అర్థాలు కూడా ఉన్నాయి

శిష్టం అంటే మిగిలింది తక్కిన వాటినుండి విడిగా ప్రత్యేకమైంది. విశిష్టం మిక్కిలి ప్రత్యేకత కలిగింది వైశిష్ట్యం అంటే ప్రత్యేకత పరిశిష్టం అన్నా, అవశిష్టం అన్నా మిగిలింది అనే అర్థం

సృష్టం అంటే నిశ్చయింపబడినది, బహుళమైనది సృష్టి సృజింపబడేది

స్పష్టం అంటే వెల్లడి అయినది స్ఫుటమైనది దీనికి వ్యతిరేకం అస్పష్టం విస్పష్టం మిక్కిలి స్పష్టం హృష్టం అంటే సంతోషించినది హృష్టి అంటే సంతోషం

ఈ మాటలన్నిటిలోనూ 'ట'కారమే ఉంది 'ఠ'కారం లేదు ☆

# అక్షరాలు తారుమారయితే

సంస్కృతం నుండి మనం అరువు తెచ్చుకున్న మాటల్లో ధ, థలతో ఉండే మాటలెన్నో ఉన్నాయి అయితే ఈ రెండింటి మధ్యా భేదాన్ని పాటించడంలో పొరపాట్లు దొర్లుతుంటాయి ఒకదాని బదులు ఒకటి రాయడమో, లేకపోతే అన్నిచోట్లా ఒకటే రాయడమో కూడా పరిపాటి కొన్నిచోట్ల వీటిని తారుమారు చేయడంవల్ల అర్థభంగం వాటిల్లుతుంది తక్కినచోట్ల ఉచ్చారణలో భేదం పోతుంది

ఉదాహరణకు అర్ధ– అర్థ శబ్దాలను తీసికోవచ్చు అర్ధ అంటే సగం, అర్థ అంటే కోరబడేది, ధనం, వస్తువు, ప్రయోజనం– శబ్దానికి ఉండే అర్థం అర్థశాస్త్రం అన్నప్పుడు భూమి, బంగారం, ధనం సంపాదించే మార్గం తెలిపేది చాణక్యుని నీతిశాస్త్రం అర్థశాస్త్రం పదార్థం అన్నప్పుడు వస్తువు కీర్త్యర్థం అన్నప్పుడు కీర్తికోసం అని అర్థం శబ్దార్థాలు అన్నప్పుడు పదమూ అది బోధించే విషయమూ అర్థశాస్త్రం అన్న మాటను ఈనాడు ధన సంబంధమైన విషయాలకు సంబంధించిన శాస్త్రంగా వాడుతున్నారు అర్థ సంబంధమైనది ఆర్థికం అర్థించు అంటే కోరడం అర్థి అంటే అడిగేవాడు అర్థన అంటే అడగడం అభ్యర్థి, విద్యార్థి, ప్రత్యర్థి మొదలయిన పదాలన్నీ అంతే సార్థకం అంటే ప్రయోజనవంతం నిరర్థకం అంటే ప్రయోజన రహితం సగం అన్న అర్థంలో తప్ప అర్ధ అనే మాటకు ప్రయోగంలేదు కాబట్టి తక్కిన అన్ని సందర్భాలలోనూ అర్థ అనే మాటనే వాడాలి

అధి ఉపసర్గ అధిక, అధికార, అధిక్షేప, అధిప, అధిపతి, అధిరోహణ, అధిష్ఠాన, అధ్యక్ష, అధ్యాత్మ మొదలయిన పదాలన్నీ ఈ ఉపసర్గతో వచ్చేవే ఈ పదాల నుండి ఆధిక్యం, ఆధిపత్యం, అధ్యాత్మికం వంటి మాటలు వచ్చాయి అధస్ అంటే కింద, అధోలోకం అంటే కింద ఉండేలోకం అధమ, అధర అనే మాటలు అధస్ నుండే వచ్చాయి అధముడు కిందివాడు. అధరం అంటే దిగువన ఉండేది కింది పెదవి

ఉపాధ్యాయుడు, అధ్యాపకుడు అధ్యయనం చేయించే వాళ్ళు వేదం చదివించే వారని అప్పటి అర్థం ఇప్పుడు గురువు, చదువు చెప్పేవాడు అన్న అర్థంలో వాడుతున్నాం

అధీనుడు అంటే స్వతంత్రం లేనివాడు, పరాధీనుడు స్వాధీనం అంటే తన అధీనంలోనే ఉన్నది స్వాధీనుడు అంటే స్వతంత్రుడు అధునా అంటే ఇప్పుడు అధునాతనం అంటే ఇప్పటిది దీనినుండే ఆధునికం ఏర్పడింది

అగాధం అంటే మిక్కిలి లోతైనది

అధ్వరం, అవధానం, అనురోధం, అంతర్ధానం, అపరాధం, అభిధానం మొదలయిన మాటలన్నింటిలోనూ ధకారమే ఉంది అంధ శబ్దానికి చూపు లేకపోవడం అని అర్థం అంధత్వం, ఆంధ్యం, అంధకారం దీనినుండే వచ్చాయి

అవధి అంటే హద్దు ఆధి అంటే మానసిక వ్యథ

ఆధార, ఆయుధ, ఆరాధన, ఇంధన, ఊర్ధ్వ, ఓషధి, ఔషధ, కంధర, కబంధ, స్కంధ, స్కంధావార, బంధు, బాంధవ, క్రోధ, క్షుధ, గంధ, ప్రధాన, బంధ, ప్రబంధ, బంధన, యోధ, విధ, బాధ, బుధ, నిధి, ప్రతినిధి, ప్రాతినిధ్యం, సన్నిధి, నిధన, నిబంధ, నిబంధన, పరిధి,

పరిదాన నంది నంద్య వ్యాద, వ్యాపి వర్ధన బోదన బదిర బందుర, విది, విదాన విదేయ విదాత, మదు మధుప మదుకర మద్య మాదవ వంధ్య బుధ, విబుధ, వద వధూ మూర్ధ మేదా, రాద, రుదిర వివిద విరోద, శోదన, సాధారణ సాధు, సాధ్వి, సుదా, సుధీ, సౌద, సాధ్య సాధన సిందు సైందవ, సైరంధ్రి మొదలయిన శబ్దాలన్నింటిలో ధకారమే ఉంది

పదాదిలో ధ కారమే ఉంటుంది ధకారం ఉండదు అందువల్ల ధర దరణి, ధర్మ, ధూర్త, ధన, ధాన్య ధ్వజ, ధార, ధరిత్రి, ధవళ దాత దాత్రి, ధ్రువ, ద్వని, ద్వంస, ధీ, దీర, ధూళి, దూసర మొదలయిన మాటలన్నీ ద కారాదులే దర అంటే భూమి అని అర్థం ధృఞ్ ధాతువు ధరించేది అని అర్థం భూమిని ధరించేది భూధరం అట్లాగే పయోధరం, మహీధరం గంగాదరుడు, చక్రధరుడు, గదాధరుడు విద్యాధరుడు మొదలయిన మాటలన్నీ ఇటువంటివే

కథ అంటే రచింపబడేది కథ అనేక రకాలు ఉపరి కథ, ఖండకథ ఉపకథ, బృహత్కథ చిన్న కథను కథానిక అంటున్నాం కూర్చబడినది గ్రంథం గ్రథనం అంటే కూర్చడం గ్రదితం అంటే కూర్చబడింది గ్రంది అంటే వెదురు కణుపు తిథిలో థకారం ఉంటుంది తిది నుండే అతిథి, ఆతిథ్యం వచ్చాయి

తథా అంటే ఆవిధంగా, అట్లా, యథా అంటే ఏవిధంగా, ఎట్లా, తథ్యం అంటే సత్యం యథార్థం అన్నా యథాతథం అన్నా సత్యమే యథాతథం అంటే ఉన్నదున్నట్లుగా అన్న అర్థంలో వాడుతున్నాం తథాగతుడంటే బుద్ధుడు ఏ విధంగా మునులు మోక్షం పొందారో ఆవిధంగా మోక్షం పొందినవాడనీ, మంచిజ్ఞానం కలవాడనీ అర్థం

తీర్థం అంటే బావిదగ్గర ఉండే నీళ్ళ తొట్టి, శాస్త్రం, ఋషులు సేవించిన జలాశయం గురువు తరింపజేసేది కాబట్టి తీర్థం పథం అంటే తోవ పథికుడు అంటే తోవలో నడిచేవాడు త్రిపథగ అంటే గంగ మూడు తోవలలో నడచినది పంథ అన్నా మార్గమే పాంథుడు అంటే బాటసారి పథ్యం అంటే రోగం లేని మంచిమార్గం పృథు అంటే విపులం, విశాలం, పెద్దది పృథ్వి బహు ప్రయోజనాలను కలిగించేది పృథివి, పార్థివ శబ్దాలు దీనినుండే వచ్చాయి పృథక్ అంటే వేరుచేయడం ప్రథమ అంటే తొలి దీనినుండే ప్రాథమిక, ప్రాథమ్యం వృథా అంటే వ్యర్థం వ్యథ అంటే బాధ నిశీథం అంటే అర్ధరాత్రి నిశీథిని అంటే రాత్రి నేపథ్యం, నైపథ్యం అంటే నేత్రాలకు హితమైనది భూమిక అన్న అర్థంలో వాడుతున్నాం సమర్థ, శపథం, వీథి, మిథునం, మథనం, మంథనం, మిథ్యా, మన్మథ, రథ, సారథి, మనోరథ, భాగీరథి, భీమరథి మొదలయిన మాటల్లో థ కారమే ఉంది కచటతపలకు థ ఒత్తే ఉంటుంది గజడదబలకు ధ ఒత్తే ఉంటుంది అశ్వత్థ, ఉత్థాన, కపిత్థ, సక్థిలలో థ కారం, ఉద్ధారణ, బద్ధ, బుద్ధ, వృద్ధ, ప్రసిద్ధ, సిద్ధ, శుద్ధ, సిద్ధాంత, సగ్ధి, దగ్ధ, దుగ్ధలలో ధ కారం ఉంటాయి సకారంతో థకారమే ఉంటుంది, ధ కారం ఉండదు అస్థి, స్థూల, స్థితి, స్థాన, అవస్థ, స్థాలి, ప్రస్థాన మొదలయినవి ఉదాహరణలు నాథ శబ్దానికి మాత్రం నాధ అన్న రూపాంతరం ఉంది

☆

# శ షలు తెలుగులో లేవు

సంస్కృతంలో శ, ష, స లు మూడూ ఉన్నాయి తెలుగుమాటల్లో స మాత్రమే ఉంటుంది అందుకే శ, షలు ఉన్న సంస్కృత పదాలు తెలుగులోకి వస్తే స గా మారతాయి ఉదాహరణకు ఆశ ఆస అవుతుంది `బాష బాస అవుతుంది తత్సమ శబ్దాలలో ఈ మూడు ధ్వనులకూ భేదం పాటిస్తున్నాం సంస్కృత పదాలలో వీటిని ఒకదాని బదులు ఒకటి వాడడానికి వీలులేదు ఉదాహరణకు కొన్ని మాటలు చూడవచ్చు సకలం అంటే బాగాలతో కూడుకొన్నది, అఖండమైనది అంతా సర్వం అని అర్థం శకలం అంటే ముక్క తునుక స, శ ల మార్పువల్ల పూర్తిగా భిన్నమైన అర్థం ఏర్పడింది సంకరం అంటే చీపురుతో ఊడ్చిన దుమ్ము విబిన్న వస్తువుల మిశ్రాన్ని సంకరం అని వాడుతున్నాం శంకర శబ్దానికి శివుడు, ఈశ్వరుడని అర్థం సమశబ్దానికి సమానం, తుల్యమని అర్థమైతే శమ శబ్దానికి శాంతి అనీ, కామక్రోధాదులు లేకపోవడమనీ అర్థం

సాల శబ్దానికి కోట అనీ చెట్టు అనీ అర్థం మద్దిచెట్టును కూడా సాలవృక్షం అంటారు శాల అంటే జనం గుమికూడి ఉండేది, సభ పాఠశాల, వైద్యశాల, పాంథశాల, పానశాల, యాగశాల పాకశాల, పశుశాల ఈవిధంగా దీనికి విస్తృతమైన ప్రయోగం ఉంది స్రుతం అంటే కారినది శ్రుతం అంటే వినబడినది ఈ విధంగా అర్థభేదాన్ని కలిగించే వర్ణాలు కాబట్టి వీటి భేదాన్ని పాటించాలి

ష కారంతో మొదలయ్యే మాటలు చాలా తక్కువ షండం అంటే సమూహం, ఆబోతు అనే అర్థాలున్నాయి షష్ఠి అంటే ఆరు, షష్టి అంటే అరవై షడ్జం అంటే ఆరుస్థానాలలో పుట్టేది మయూరధ్వని షట్పదం అంటే ఆరుకాళ్ళు కలిగినది, తుమ్మెద షట్పది అంటే ఆరు పాదాలుండే పద్యం షడాననుడు, షణ్ముఖుడు అంటే ఆరు ముఖాలు కలిగిన కుమారస్వామి షాణ్మాతురుడు అన్నా కుమారస్వామే ఆరుగురు తల్లులు కలిగినవాడు ష కారాది పదాలలో ఎక్కువభాగం షట్ (ఆరు) అనే పూర్వపదంతో కూడి ఉండడం గమనించవచ్చు

స, శ లతో మొదలయ్యే మాటలలో కొన్నింటిని గుర్తించే అవకాశం ఉంది ఉదాహరణకు `శం' తర్వాత క, ఖ, గ, ఘు, చ, ఛ, జ, ఝ, ట, ర, డ, ద, త, ధ, ద, ధ, ప, ఫ, బ, భ లలో ఏదో ఒకటే ఉంటుంది అంటే శకారం తర్వాత మనం సున్నారాసేచోట వర్గానునాసికం మాత్రమే ఉంటుంది శంకను శఙ్క అనీ, శంభును శమ్భు అనీ రాయవచ్చు `సం' తర్వాత ఏ హల్లయినా రావచ్చు ఉదాహరణకు సంశయం అనే మాటను తీసుకోవచ్చు శంశయం అని కానీ శంసయం అని కానీ ఉండదు సంయమనం అని ఉండవచ్చు శంయమనం అని ఉండదు సంవాదం అని ఉండవచ్చు శంవాదం అని ఉండదు సంరంభం అని ఉండవచ్చు కాని శంరంభం అని ఉండదు సంలాపం అని ఉంటుంది కాని శంలాపం అని ఉండదు సంసిద్ధి ఉండవచ్చు, శంసిద్ధి ఉండదు సంహారం ఉండవచ్చు కానీ శంహారం ఉండదు అంటే సం' తర్వాత య, ర, ల, వ, శ, ష, స, హ అనే హల్లులు కూడా వస్తాయి కాని, 'శం' తర్వాత అవి రావు తక్కిన సందర్భాలలో శబ్దస్వరూపాన్ని బట్టే తెలుసుకోవాలి అంసమంటే భుజం అంశమంటే భాగం

ఆశంస అంటే కోరిక తనకు లేని వస్తువును కావాలని కోరుకోవడం, నృశంసుడు అంటే మనుష్యులను పీడించేవాడు ప్రశంస అంటే మెచ్చుకోలు ప్రశస్తం అంటే స్తోత్రం చేయబడేది,

శ్రేష్ఠమైనది ప్రశస్తి అంటే గొప్పదనం

అశని అంటే పిడుగు అశనిపాతం అంటే పిడుగుపాటు ఆశు అంటే తొందర ఆశు కవిత్వం అంటే తొందరగా చెప్పే కవిత్వం అశనం అంటే ఆహారం నిరశనం అంటే నిరాహారం తినకుండా ఉండడం నిరసనం అంటే తిరస్కారం మన తిరస్కారాన్ని, నిరాకృతిని తెలియ చెప్పడం నిరసనను తెలియజేయడం నిరశనదీక్ష అంటే నిరాహారదీక్ష

కాస అంటే దగ్గు కాశ అంటే రెల్లుగడ్డి దాశుడు అంటే జాలరి దాసుడు అంటే సేవకుడు నాశం, నాశనం అంటే నశించడం, కనిపించకుండా పోవడం నాస, నాసిక అంటే ముక్కు నిశ అంటే రాత్రి నిశాటనం అంటే రాత్రిపూట తిరిగేది, గుడ్లగూబ నిశితం అంటే పదునైనది అరగ దీసి సన్నగా, వాడిగా చేయబడింది కాబట్టి నిశితం

పశ్చాత్ అంటే పడమటి దిక్కు దీనినుండే పాశ్చాత్య ఏర్పడింది పడమటి దిక్కుకు సంబంధించిన అని అర్థం ప్రాచ్య అంటే తూర్పుదిక్కుకు సంబంధించిన అని అర్థం రాశి అంటే పోగు ధాన్యరాశి అంటే ధాన్యపు కుప్ప విసర్జన అన్నమాటకు త్యాగం అని అర్థం ఉత్సర్జనం అన్నా త్యాగమే విసర్జనం, విసర్జించు అంటే విడిచిపెట్టడం అన్న అర్థం తెలుగులో బాగా వాడు కలో ఉంది రవీంద్రనాథ ఠాగూరు రచించిన ఒక నాటికను బెజవాడ గోపాలరెడ్డిగారు విసర్జన అన్న పేర అనువాదం చేశారు ఒకప్పుడిది డిగ్రీ తరగతికి పాఠ్యాంశంగా ఉండేది తెలుగు అధ్యాపకులకీమాట అంతగా నచ్చేదికాదు సృజన అంటే సృష్టించడం సదృశం అంటే సమాన మైనది. సాదృశ్యం అంటే పోలిక అసదృశం అంటే అసమానమైనది కీదృశం అంటే ఎటు వంటిది అని అర్థం. తాదృశం అంటే అటువంటిది అని అర్థం మాదృశులు అంటే మావంటి వారు, మాతో సమానమైన వారు అని అర్థం

శుచి, శుక్ర, శుక్ల, శిబిర, శిఖ, శుభ, శీతల, శ్వేత, శోధన, శాఖ శృంగ, శిఖర, శోభన, శిల, శూర, శీర్ష మొదలయిన మాటలలో 'శ'కారం ఉంది శశము అంటే కుందేలు శశి అంటే చంద్రుడు శిశువు, శిశిరం, శాశ్వతం, శ్మశానం మొదలయిన మాటల్లో రెండేసి 'శ'కారా లున్నాయి స కారం ఇ, ఈ, ఎ, ఏ, ఐలతో ఉన్నప్పుడు ఒక్కొక్కసారి శ కారమేమోనన్న అను మానం రావచ్చు. సిత, సీత, సికతాతలం, సింహం, సింహాసనం, సింధు, స్వేద, సైంధవ, సైన్య, సైరిక, సేన, సేవక, సేవ వంటి మాటల్లో సకారమే ఉంది శ్చ్యోతనం అంటే కారడం శ్మశానం అంటే శవాలు శయనించే ప్రదేశం శ్మశ్రువు అంటే గడ్డం మీసాలు ఇటువంటి రెండు మూడు పదాలు విడిచిపెడితే, పదాదిలో శ కారంతో సంయుక్తాక్షరంలో రెండో హల్లుగా య, ర, ల, వ,లు మాత్రమే ఉంటాయి కాని స కారంతో ఇతర హల్లులు కూడా సంయుక్తమవుతాయి స్కంద, స్ఖలన, స్తుతి, స్థాన, స్నాన, స్పృష్ట, స్ఫుట, స్మర, స్రవంతి, స్వప్న, స్యందన మొదలయిన మాటలను గమనించవచ్చు స కార ల కార సంయుక్తం ఉండదు

☆

# మన పేర్లు

సంస్కృతం నుండి మాటలు తెలుగులోకి వచ్చినప్పుడు కొన్ని మార్పులు పొందుతాయి సంస్కృతమే కాదు ఏ బాష నుండి మరే భాషలోకి పదాలు వెళ్ళినా ఆ బాషా స్వభావానికి అనుగుణంగా కొన్ని మార్పులు పొందితీరుతాయి సంస్కృతంలొ ప్రతి పదమూ ప్రత్యయాంతమై ఉంటుంది అంటే పదం చివర ప్రత్యయం ఉంటుంది ఉదాహరణకు ఏదైనా ఒక నామవాచకాన్ని తీసికొన్నామనుకోండి ఆ నామవాచకం ప్రధమావిబక్తిలో ఉందా మరేదైనా విభక్తిలో ఉందా పుంలింగమా, స్త్రీలింగమా, నపుంసకలింగమా, ఏక వచనంలో ఉందా, ద్వివచనంలో ఉందా, బహువచనంలో ఉందా అన్నదాన్ని బట్టి దాని రూపం ఉంటుంది విబక్తి, లింగం, వచనం తెలిపే ప్రత్యయం పదం చివర ఉంటుందన్నమాట ఈ ప్రత్యయంతో ఉన్నపదాన్ని తెలుగులోకి యధాతధంగా తెచ్చుకోము కదా ఆ మాటను తెలుగువాక్యంలో తెలుగు మాటలాగా వాడుకోవాలి అందుకోసం ఆ మాటకు తెలుగు ప్రత్యయం చేర్చుకోవాలి లేకపోతే తెలుగుమాటల రూపం కల్పించుకోవాలి

సంస్కృతంలో ఒక పదం పుంలింగమా, స్త్రీలింగమా, నపుంసక లింగమా అనేది పదం స్వరూపం మీద ఆధారపడి ఉంటుంది అర్ధానికి సంబంధం లేదు దారా అంటే బార్య ఇది పుంలింగం భార్య అనేమాట స్త్రీలింగం కళత్రం అన్నా భార్యే ఇది నపుంసకలింగం వృక్ష శబ్దానికి చెట్టు అని అర్ధం ఇది పుంలింగం. నాసిక అంటే ముక్కు ఇది స్త్రీ లింగం విద్యా అంటే చదువు ఇది స్త్రీలింగం మిత్ర శబ్దం నపుంసకలింగం

తెలుగులో లింగం అర్ధాన్ని బట్టి ఉంటుంది పురుషుణ్ణి బోధించే పదాలను మహత్తులనీ, తక్కినవాటిని అమహత్తులనీ అంటాం సంస్కృతంలో పుంలింగం అయి ఉండీ పురుషుణ్ణి బోధించని మాట తెలుగులో అమహత్తే అవుతుంది సంస్కృతంలో నపుంసక లింగమయినా పురుషుణ్ణి బోధించేదయితే తెలుగులో మహత్తు అవుతుంది ఈ కారణాలవల్ల సంస్కృత పదాలు తెలుగులో మార్పులను పొందుతాయి

సంస్కృతం నుండి తెలుగులోకి వచ్చిన పురుషవాచకశబ్దాల చివర 'దు'ప్రత్యయం చేరుతుంది రాముడు, కృష్ణుడు, భీముడు మొదలయిన పేర్లెన్నయినా చూపవచ్చు ఇది అకారాంత శబ్దాలలో జరుగుతుంది 'రామ'కు 'దు' చేరి రామ లో మకారం మీది అత్వం ఉత్వం కావడం వల్ల రాముడు ఏర్పడుతుంది ప్రాచీనకాలపు శాసనాలలో రామండు, భీమండు వంటి రూపాలు కూడా కనిపిస్తాయి పదం చివరి 'అ', 'ఉ'గా మారి 'డు చేరని రూపాలు కూడా కనిపిస్తాయి ఉదాహరణకు పండరంగు

పూర్వం మనవాళ్ళ పేర్లు అయ/అయ్య, అన/అన్న, అప/అప్ప వంటి అనుబంధ పదాలతో కూడి ఉండేవి నన్నయ, తిక్కన, కేతన, మారన, ఎర్రన, సోమన వంటి మన కవుల పేర్లు ఇందుకు ఉదాహరణలు అధర్వణుడు, భాస్కరుడు, శ్రీనాధుడు, రామభద్రుడు, రామరాజభూషణుడు వంటి పేర్లు తరువాతి కాలంలో ప్రచారంలోకి వచ్చినా ఇప్పటికీ అయ్య/అన్న/అప్పలతో అంతమయ్యే పేర్లే ఎక్కువ

కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'రాజశేఖర చరిత్ర' నవలలోని నాయకుడు రాజశేఖరుడు ఇప్పటికీ కొన్ని ప్రాంతాలలో దు ప్రత్యయాంతమయిన పేర్లు పెట్టుకుంటూనే ఉన్నారు

రాముడు లక్ష్మణుడు, చక్రధరుడు వంటి పేర్లు కనిపిస్తూనే ఉంటాయి యనమల రామకృష్ణుడు గారి పేరు ఇందుకు మంచి ఉదాహరణ రామకృష్ణయ్య, రామకృష్ణప్ప రామకృష్ణరావు, రామకృష్ణశర్మ, రామకృష్ణమూర్తి, రామకృష్ణశాస్త్రి రామకృష్ణుడు మొదలయిన విధంగా పేర్లు పెట్టుకో వచ్చు కాని ఇప్పుడు రామకృష్ణ, రామచంద్ర, నారాయణ, కృష్ణ వంటి పేర్లు ఎక్కువగా కనిపిస్తున్నాయి శ్రీనివాస్ శంకర్, లక్ష్మణ్, ప్రసాద్ వంటి హలంతమయిన పేర్లు కూడా ఎక్కువవుతున్నాయి ప్రసాద్‌ని అజంతం చేసి ప్రసాదు అంటున్నాం ప్రసాదం, ప్రసాదరావు, ప్రసాదుడు మొదలయిన వాటికి ముందు సామాన్యంగా 'వర' అనేమాట ఉంటుంది వరప్రసాదం, వర ప్రసాదరావు, వరప్రసాదుడులాగా ఎవరి వరం? అని ప్రశ్నించుకుంటే సత్యనారాయణ వర ప్రసాద్, కృష్ణవరప్రసాద్, వీరవేంకటసత్య వరప్రసాద్ వంటి పేర్లలో సమాధానం కనిపిస్తుంది వర లేకుండా కేవలం కృష్ణప్రసాద్, రాంప్రసాద్, శివప్రసాద్, దుర్గాప్రసాద్ అని కూడా ఉంటాయి ప్రసాదు అన్న మాటను సంక్షిప్తలేఖనంగా కొంతకాలం కిందట చమత్కరించిన వాళ్ళూ లేకపోలేదు

ఏది ఏమయినా అయ్య/ అన్న/ అప్ప/ రావు/ రెడ్డి/ నాయుడు/ శర్మ/ శాస్త్రి/ మూర్తి/ చౌదరి/ బాబు/ ఆచార్యులు వంటి అనుబంధ పదాలు కాని డు ప్రత్యయం కాని లేని ఇటువంటి పేర్లు మన భాషకు సహజమయినవి కావేమో

'డు ప్రత్యయం లేకుండా గౌరవార్థకంగా బహువచన ప్రత్యయం లు' చేర్చి పేరు పెట్టుకొనే పద్ధతి కూడా ఉంది శ్రీరాములు, వేంకటేశ్వర్లు, అంజనేయులు, శ్రీనివాసులు వంటి పేర్లు ఇటువంటివి

పై మాటలన్నీ పేర్లకు సంబంధించినవి ఇవి కాకుండా 'డు ప్రత్యయం చేరేమాటలెన్నో ఉన్నాయి నాయకుడు, భక్తుడు, వీరుడు, దీరుడు, బుద్ధిమంతుడు, శక్తిమంతుడు, జ్ఞానవంతుడు, సాహసికుడు, బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు, వైద్యుడు, ఉపాధ్యాయుడు, అధ్యాపకుడు, ఆచార్యుడు మొదలైనవన్నీ డు'ప్రత్యయం చేరి తత్సమాలయిన శబ్దాలే

మంచినడవడి కలవాడు సచ్చరిత్రుడు, చెడు నడవడి కలవాడు దుశ్చరిత్రుడు. విమర్శ చేసేవాడు విమర్శకుడు సమీక్ష చేసేవాడు సమీక్షకుడు సభలో పాల్గొనేవాడు సభ్యుడు ఇప్పుడు చాలామంది ఈ అర్థంలో వాడుతూ ఉన్న 'సభికుడు' అన్న మాటకు జూదగాడు అని అర్థం సభ్యుడు, సదస్యుడు, సభాసదుడు అన్నమాటలు వాడవచ్చు నటించేవాడు నటుడు దర్శనం తెలిసినవాడు దార్శనికుడు ఇట్లా అసంఖ్యాకంగా పదాలు ఏర్పరచుకోవచ్చు

☆

# తత్సమాలు ఏర్పడే పద్ధతి

సంస్కృతంలో ఇ కారాంత శబ్దాలు తెలుగులో ఇ కారాంతాలుగానే ఉంటాయి సంస్కృత ప్రత్యయం లోపిస్తుందంతే హరి గిరి, అక్షి వంటి మాటలు దీనికి ఉదాహరణలు కపి కుక్షి, కీర్తి ఖ్యాతి క్షితి, జాతి, చితి, బుద్ధి, సిద్ధి, మతి, తిథి, వ్యాధి త్రుటి, శ్రుతి, దృష్టి, ముక్తి సమాధి వ్యక్తి మొదలయిన శబ్దాలన్నీ ఇటువంటివే

సంస్కృతంలో దీర్ఘాంత శబ్దాలు తెలుగులో హ్రస్వాంతాలవుతాయి రమా రమ అవు తుంది వనితా వనిత అవుతుంది లక్ష్మీ లక్ష్మి అవుతుంది శిఖ, జ్వాల, కద విద్య అన్వేషణ, ఈర్ష్య, అసూయ, ఓషధి, కస్తూరి, కుమారి, కృప క్రియ, గంగ, చికిత్స, జిహ్వ జ్యోత్స్న, టీక, తార, త్రయి, దశ ధార, నది, నటి, నిశ, నాస, నాసిక, పట్టిక, పద్మ, పృధ్వి, ప్రజ, ప్రద, దేవత, మిధ్య, మేదిని, యాచన, యాతన శాఖ, శోభ, సభ సంస్థ, సీత, సేవ, సేనాని, హింస, హేష వంటి మాటలన్నీ పదాంతంలో దీర్ఘం హ్రస్వం కాగా ఏర్పడ్డవే

సంస్కృతంలో ఏకాక్షర పదాలు దీర్ఘాంతాలయినా తెలుగులో హ్రస్వాంతాలుగా మారవు క్ష్మా, మా శ్రీ, స్త్రీ, హ్రీ, ధీ వంటివి దీర్ఘాంతాలుగానే ఉంటాయి

ఉ కారాంత పదాల చివర తెలుగులో వు చేరుతుంది అంబువు అంటే నీరు అంశువు అంటే కిరణం అణువు, అసువు, అశ్రువు, ఆయువు, ఆశువు ఈర్ష్యాళువు, ఇక్షువు, ఊరువు, ఋజువు, కటువు, కాకువు, క్రతువు, గురువు చక్షువు, జంతువు, జన్యువు, తంతువు, తనువు, తాలువు, దారువు, దేనువు, తరువు, పటువు బందువు, బిందువు బీరువు పశువు ప్రభువు మనువు, మదువు మృదువు, వటువు, వధువు, వస్తువు లఘువు, శంకువు, శత్రువు, సింధువు సేతువు, హేతువు మొదలయిన మాటలు వు ప్రత్యయం చేరగా ఏర్పడినవి పురుష వాచకాలయినప్పుడు వీటిలో కొన్ని మాటలపై 'డు ప్రత్యయం కూడా చేరుతుంది 'వు' చేరిన రూపమూ, డు' చేరిన రూపమూ రెండూ ఉంటాయన్నమాట గురువు – గురుడు, బంధువు – బంధుడు, భీరువు – భీరుడు, ప్రభువు – ప్రభుడు, శత్రువు – శత్రుడు, విష్ణువు – విష్ణుడు, శంభువు – శంభుడు, వసువు – వసుడు అని రెండు రకాల రూపాలూ వాడుకలో ఉన్నాయి ఆధునిక భాషలో 'వు'తో ఉన్న రూపాలే ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి

గో శబ్దం గోవు అవుతుంది

సంస్కృతంలో నపుంసకలింగ శబ్దాలు సాధారణంగా మకారాంతాలుగా ఉంటాయి ఈ మకారం లోపించి తెలుగులో 'ము' ప్రత్యయం చేరుతుంది మిత్రమ్ – మిత్రము, దైవమ్ – దైవము, అపత్యమ్ – అపత్యము లోచనం, నయనం, నేత్రం, వక్త్రం, కాయం, కారణం, ధర్మం, వదనం, చిబుకం, ఓష్ఠం మొదలయినవన్నీ ఇంతే ఆధునికభాషలో పదాంతంలోని 'ము'లో అచ్చు లోపింపచేయడం వల్ల ఇవి ఏర్పడుతున్నాయి సంస్కృతంలో నపుంసక లింగశబ్దాలు కాక పోయినా తెలుగులో అమహత్తును అంటే పురుషేతరమైన వాటిని బోధించే శబ్దాల చివర ము ప్రత్యయం చేరుతుంది ఖడ్గః అన్నమాట సంస్కృతంలో పుంలింగం కాని తెలుగులో అమహత్తు తెలుగులోకి వచ్చినప్పుడు ఈ మాట ఖడ్గం అవుతుంది అట్లాగే ఇదే అర్థాన్ని ఇచ్చేమాటలు చంద్రహాసం, కరవాలం, కృపాణం మొదలయినవి

పణః పుంలింగం తెలుగులో పణం అంటే పందెం మయూఖ శబ్దం కూడా

పుంలింగమే తెలుగులో మయూఖం అంటే కిరణం మేష శబ్దానికి మేక అని అర్థం సంస్కృ తంలో ఇది పుంలింగం తెలుగులోకి వచ్చి మేషం అయింది లోక శబ్దం పుంలింగం తెలుగులో లోకం అయింది అట్లాగే శ్లోకం కూడా

వ్యాజశబ్దం కూడా పుంలింగమే తెలుగులో వ్యాజం ఈ విధంగా సంస్కృతంలో పుంలిం గంలో ఉన్నమాటలు తెలుగులోకి అమహత్తులుగా వస్తాయి వస్తువులు, జంతువులు, భావాలు తెలిపే మాటలనేకం ఇటువంటివే తెలుగులో లింగబోధకు అర్థం ప్రధానం కాబట్టి ఒక పదాన్ని చూసి ఇది ఏ లింగంలో ఉంది అని సందేహించవలసిన అవసరం లేదు అర్థం తెలిస్తే చాలు క్రియతో అన్వయిస్తుంది కాబట్టి కర్తగా ఉన్న నామవాచకాన్ని గుర్తించడం తెలుగులో కష్టంకాదు

కొన్నిమాటలు ము ప్రత్యయం చేరీ, చేరకా కూడా వాడుకలో ఉన్నాయి చరిత్ర - చరిత్రం, చరిత - చరితం, అభిలాష - అభిలాషం, అక్షత - అక్షతం, ఘోష - ఘోషం, భ్రమ - భ్రమం, విజృంభణ- విజృంభణం, వధ- వధం, స్ఫురణ- స్ఫురణం, హంస- హంసం, అన్వే షణ - అన్వేషణం, ప్రార్థన - ప్రార్థనం, ప్రవర్తన - ప్రవర్తనం మొదలయినవి కాని ఆధునిక భాషలో ఈ మాటలను 'ము' ప్రత్యయం లేకుండానే ఎక్కువగా వాడుతున్నారు

వాక్, దృక్, త్వక్, ఋక్ శబ్దాలు తెలుగులో వాక్కు, దృక్కు, త్వక్కు, ఋక్కు అవుతాయి అవాక్ అవాక్కు అవుతుంది

రాట్, విరాట్, స్వరాట్, సమ్రాట్ శబ్దాలు రాట్టు, విరాట్టు, స్వరాట్టు, సమ్రాట్టు అవుతాయి

ఆపత్ ఆపత్తు అవుతుంది ఆపద కూడా అవుతుంది ఈషత్ ఈషత్తు అవుతుంది కదాచిత్ కదాచిత్తు అవుతుంది క్షుత్- క్షుత్తు అవుతుంది పరిషద్ పరిషత్తు అవుతుంది శరద్ శరత్తు అవుతుంది మృత్, యావత్, సత్, అసత్, సరిత్, హరిత్‌లు మృత్తు, యావత్తు, సత్తు, అసత్తు, సరిత్తు, హరిత్తులవుతాయి భిషజ్ భిషక్కు అవుతుంది గిడుగు రామమూర్తిగారి 'ఆంధ్రపండిత భిషక్కుల భాషాభేషజం' సుప్రసిద్ధం సకృత్ సకృత్తు అవుతుంది సుహృద్ - సుహృత్తు అవు తుంది జగత్ జగత్తు అవుతుంది జగం అనే రూపం కూడా ఉంది.

ఉషస్, ఓజస్, స్రోతస్, వచస్, వర్చస్, హవిస్, పయస్, వయస్, సరస్ శబ్దాలు ఉషస్సు, ఓజస్సు, స్రోతస్సు, వచస్సు, వర్చస్సు, హవిస్సు, పయస్సు, వయస్సు, సరస్సు అవుతాయి

మనస్, శిరస్, సదస్ శబ్దాలు మనము/ మనసు/ మనస్సు, శిరము/ శిరసు/ శిరస్సు, సదసు/ సదస్సు అవుతాయి

ఉరస్, వక్షస్, తపస్, తమస్, ఛందస్, తేజస్, నభస్, నమస్, రజస్ శబ్దాలు ఉరము/ ఉరస్సు, వక్షము/ వక్షస్సు, తపము/ తపస్సు, తమము/ తమస్సు, ఛందము/ ఛందస్సు, తేజము/ తేజస్సు, నభము/ నభస్సు, నమము/ నమస్సు, రజము/ రజస్సు అవుతాయి ధనుస్, ఆయుస్‌లు ధనువు/ ధనుస్సు, ఆయువు/ ఆయుస్సు అవుతాయి.

భూ భువి అవుతుంది. ద్యు దివి అవుతుంది నౌ నావ అవుతుంది.

కర్తృ, జనయితృ స్త్రీవాచకాలయినప్పుడు కర్త్రి. జనయిత్రి అవుతాయి వనజముఖి, వనజముఖ, చంద్రముఖి, చంద్రముఖ అని రెండు రూపాలు ఉండవచ్చు. మీననేత్ర పద్మనేత్ర అన్నవి సరయిన రూపాలు. మీననేత్రి, పద్మనేత్రి సరయినవి కావు ఇక్కడ చేపల వంటి కన్నులు కలిగినది, పద్మము వంటి కన్నులు కలిగినది అని అర్థం. నేత్ర శబ్దం నేతృ శబ్దానికి నాయ కత్వమని అర్థం నేత్రి అంటే నాయకురాలు అభినేత్రి, అధినేత్రి మొదలయిన వాటిలో అర్థం ఇదే!

☆

# పేరులోనే ఉంది పెన్నిధి

పేరులో ఏముంది పెన్నిది అని కొందరంటే పేరులోనే ఉంది పెన్నిది అంటారు మరికొందరు రవీంద్రనాథ టాగూరు 'సూక్ష్మ విచారణ' అన్న ఒక హాస్య వ్యంగ్య నాటికలో పేరు గురించి పెద్ద చర్చ చేశాడు అసలు పేరంటే ఏమిటి? అని ప్రశ్న వేసి సాగలాగి 'భాష ద్వారా ఒక స్వతంత్ర పదార్థపు అస్తిత్వాన్ని నిర్దేశించడానికి పనికివచ్చే కృత్రిమ సాధనాన్ని నామకరణం అంటారు' అని నిర్వచించి ఈ నిర్వచనంలోని ఒక్కొక్క అంశం గురించీ అనేకతర్కాలు చేయవచ్చునంటాడు అవతలి మనిషి ఈ తర్కం బాధపడలేక పారిపోయేంత వరకూ వస్తుంది

మనం పెట్టుకునే పేర్లలో ఎక్కువబాగం దేవతల పేర్లు కొన్ని వస్తువుల పేర్లు, మరికొన్ని భావాల పేర్లు తెలుగు వాళ్ళం ఏ పేరునైనా అమ్మ, అయ్య వంటి అనుబంధ పదం చేర్చి స్త్రీవాచ కంగానైనా, పురుష వాచకంగానైనా వాడుకుంటాం రమణయ్య – రమణమ్మ, ఎల్లయ్య – ఎల్లమ్మ, నరసయ్య – నరసమ్మ ఈవిధంగా పేర్లు పెట్టుకుంటాం అక్క – అన్న చేర్చి కూడా పేర్లు పెట్టుకోవచ్చు నేటికాలంలో కుమార్ – కుమారి అన్న అనుబంధాలను చేర్చి కూడా పేర్లు పెట్టు కుంటున్నాం

ఒకే ప్రత్యయంతో స్త్రీ, పురుష బోధకంగా పేర్లు ప్రాచీనకాలంలో కనిపిస్తాయి తాతమ్మ పురుషుడి పేరయితే కుర్రమ్మ స్త్రీ పేరు అమ్మ, ఆండి, ఆలు, పోరి వంటివి శాసనాలలో ఉన్నాయి అధునిక కాలంలో కూడా బాలకృష్ణమ్మ, నాయుడమ్మ వంటి పేర్లు పురుషనామాలుగా ఉన్నాయి

రెడ్డి, రావు, నాయుడు, మూర్తి, శాస్త్రి, చౌదరి వంటి అనుబంధ పదాలతో కూడా స్త్రీ పురుష నామాలు వాడుకలో ఉన్నాయి. స్త్రీ, పురుష బోధక ప్రత్యయాలు కాని, అనుబంధ పదాలు కాని చేరని పేర్లు కూడా విస్తృతంగానే ఉన్నాయి ఇటువంటి పేర్లవల్ల పేరును బట్టి స్త్రీయో, పురుషుడో తెలుసుకోవడం కష్టమవుతుంది నారాయణ, వెంకటరమణ వంటి పేర్లు సర్వసామాన్యమే

సంస్కృతంలో నపుంసక లింగ శబ్దాలను పేర్లుగా పెట్టుకున్నప్పుడు వాటి చివర 'ము' చేరుతుంది. 'రత్న' శబ్దం తీసుకుంటే 'రత్నము అవుతుంది ఇప్పుడు దీన్ని హలంతం చేసి రత్నం అంటున్నాం రాజరత్నం, వెంకటరత్నం, మణిరత్నం, ఏసురత్నం మొదలయిన పేర్లన్నీ ఇటు వంటివే 'కాంత' శబ్దం కూడా ఇటువంటిదే సూర్యకాంతం, లక్ష్మీకాంతం, చంద్రకాంతం వగ యిరా సత్యం, శివం, సుందరం మొదలయిన శబ్దాలు కూడా అంతే శివుడు అని 'డు' ప్రత్య యంతో కూడా పేరు వాడుకలో ఉంది వెంకటరత్నం, లక్ష్మీకాంతం వంటి పేర్లు స్త్రీలకూ, పురుషులకూ కూడా వర్తిస్తాయి మాణిక్యం అన్న పేరు కూడా ఇటువంటిదే

చంద్రశేఖర, రాజశేఖర, బాలేందు శేఖర, శేఖర శబ్దాలు పుంలింగ శబ్దాలు అయినా చంద్రశేఖరం, రాజశేఖరం, బాలేందుశేఖరం, శేఖరం అని పేర్లు పెట్టుకుంటున్నాం

రామ శబ్దం పుంలింగం రామం అని పేరు పెట్టుకుంటున్నాం శంకర శబ్దం పుంలింగం శంకరం అని పేరు పెట్టుకుంటున్నాం వేంకటేశ, రాజేశ, రామేశ శబ్దాలు కూడా పుంలింగ శబ్దాలే వెంకటేశం, రాజేశం, రామేశం అని పేర్లు పెట్టుకుంటున్నాం

రామానుజ, సుబ్రహ్మణ్య, సుదర్శన శబ్దాలు కూడా పుంలింగ శబ్దాలే రామానుజం, సుబ్ర హ్మణ్యం, సుదర్శనం అని పేర్లు పెట్టుకుంటున్నాం నరసింహ శబ్దం కూడా ఇంతే నరసింహం

అని పేరు పెట్టుకుంటున్నాం ఈ పేర్లన్నీ మకారాంతంగా ఎందుకు పెట్టుకుంటున్నాం? ఇ కొంచెం ఆలోచించవలసిన విషయమే నమశ్శివాయ అనే పేరు కూడా ఉంది శివుని కొరక నమస్కారం అని అర్థం ఈ పేరు పిలవడం వల్ల శివునికి నమస్కారం చేసినట్లవుతుందని ఆ పేరుపెట్టే వారి ఆశయం కావచ్చు ఇంట్లో పిల్లవాణ్ణి ఎన్నిసార్లు పిలిస్తే అన్నిసార్లు భగవంతుని నమస్కరించినట్లే అన్న ఆశాభావం దీనికి కారణం కావచ్చు

శేఖరం, శంకరం, రామం వేంకటేశం, రామానుజం, సుదర్శనం, సుబ్రహ్మణ్యం నర సింహం మొదలయినవి ద్వితీయావిభక్త్యంత రూపాలు వీటితో నమామి వందే వంటి క్రియా శబ్దాలుంటాయి నమస్కరిస్తున్నాను అన్నమాట క్రియతో కూడా కలిపితే నమశ్శివాయ వంటి వాక్యాలవుతాయివి వాక్యాన్ని ముక్కలు చేసి ప్రథమా రూపం కాకుండా ద్వితీయాది విభక్త్యంత రూపాన్ని పేరుగా పెట్టుకుంటున్నామన్నమాట

రాజ్యం, రంజనం నపుంసక లింగ శబ్దాలు రాజ్యం సాధారణంగా స్త్రీలు పెట్టుకొనే పేరు రంజనం పురుషులు పెట్టుకొనే పేరు

అవతారం అమహత్తు కాబట్టి రామావతారం, శేషావతారం అని పేర్లు పెట్టుకుంటున్నాం

రామరాజభూషణుడు సుప్రసిద్ధ తెలుగుకవి ఈయన అసలుపేరు భట్టుమూర్తి రామరాజ భూషణుడు అన్నది బిరుదు అళియరామరాయలకు ఈయన అలంకారం వంటివాడు కాబట్టి రామరాజభూషణుడు అన్న బిరుదం వచ్చింది ఆ కాలంలో ఇటువంటి బిరుదులున్నాయి వేంకటరాయ భూషణుడనే కవి కూడా ఉన్నాడు నాగభూషణం అని పేరు పెట్టుకుంటున్నాం పాము అనే అలంకారమని అర్థం నాగభూషణుడు అంటే పాము అలంకారంగా కలిగినవాడు

కృష్ణంరాజు వంటి పేర్లలో పూర్వశబ్దం కృష్ణమ్మ, ఇదే కృష్ణమ అయి తర్వాత కృష్ణం అయింది

బహువచన ప్రత్యయంతో స్త్రీ పురుష నామాలు రెండూ ఉంటాయి సీతారాములు, రాములు, సుబ్బులు వంటి పేర్లు ఇద్దరికీ ఉంటాయి

☆

# పదాది సంయుక్తాలు

ప్రతిభాషలోనూ ధ్వనులుంటాయి  లిపి ఉన్న భాషల్లో ఈ ధ్వనులకు లిపి సంకేతాలుంటాయి ప్రతి భాషలోనూ మనం ఉచ్చరించే ధ్వనులన్నిటికీ లిపి చిహ్నాలుండవు  ప్రధానమయిన వాటికి మాత్రమే ఉంటాయి  ప్రధానమయిన ధ్వనులు అంటే అర్థభేదక సామర్థ్యం ఉన్నవి  అంటే ఒక ధ్వని బదులు మరో ధ్వనిని ఉచ్చరిస్తే ఆ మాటకుండే అర్థం మారిపోతుందన్నమాట  తెలుగులో ఆ విధమయిన ప్రధాన ధ్వనులేమిటని పరిశీలిస్తే పది అచ్చులున్నాయి  అవి అ ఆ ఇ ఈ ఉ, ఊ ఎ ఏ ఒ, ఓ  పందొమ్మిది హల్లులున్నాయి  అవి క, చ, ట త ప గ, జ డ ద బ, ణ న మ, య ర, ల, ళ, వ, స  తక్కిన అచ్చులూ హల్లులూ ఇప్పుడు మనం వాడుతూ ఉన్నవి ఇతర భాషా పదాలతో వచ్చినవి  ఆ పదాలు రాయడానికి అవి కావాలి

ఈ వర్ణాలన్నీ పదంలో అన్ని పరిసరాలలోనూ రావు  కొన్ని పదాదిలో రాకపోవచ్చు  కొన్ని కొన్నిటితోనే సంయుక్తాలు కావచ్చు  తక్కిన వాటితో కలవకపోవచ్చు  తెలుగులో వర్ణాలు ఏయే పరిసరాలలో ఎలా వస్తాయో పరిశీలిద్దాం

తెలుగుమాటల్లో ణ, ళ, య పదం మొదట ఉండవు  వు, వూ, వొ, వో కూడా పదం మొదట ఉండవు  అంటే పదం మొదట ఉ, ఊ, ఒ, ఓ అని అచ్చుతోనే ఇవి ఉంటాయన్నమాట

ఒకేమాటలో రెండచ్చులు వరుసగా ఉండవు  అంటే అఇతే (అయితే), ఆఉ (ఆవు), ఏఓ (ఏవో) వంటి రూపాలు ఉండవు  రాఇ (రాయి), రేఉ (రేవు) వంటి రూపాలు ఉండవు

మాట మొదట ద్విరుక్తం ఉండదు  అంటే క్క, గ్గ, చ్చ వంటి వాటితో పదం మొదలుకాదు

పదాదిలో సంయుక్త వర్ణాలు తక్కువ  సంయుక్త వర్ణం అంటే రెండు కాని అంతకంటే ఎక్కువగాని హల్లులు కలిసిన వర్ణం  అయితే తెలుగులో పదం మొదట రెండు హల్లుల సంయుక్తాలు మాత్రమే ఉంటాయి  అంతకంటే ఎక్కువవి ఉండవు  ఆ రెండు హల్లుల్లోనూ రెండో హల్లు ర కారమే అయి ఉంటుంది  ఇతర హల్లులుండవు  ర కారం రెండో హల్లుగా ఉండే పదాది సంయుక్తాలలో మొదటి హల్లు క గ త, ద, ప, బ మ, వ లలో ఒకటి అయి ఉంటుంది  ఈ ఎనిమిది హల్లులు తప్ప ఈ సంయుక్తంలో మొదటి హల్లుగా మరే హల్లూ రాదు  దీనినిబట్టి స్తుతి, స్థితి, స్నేహం, క్లేశం, స్యందనం  న్యస్తం, వ్యవసాయం, స్వేదం, స్మరణ, త్వర వంటి మాటలు తెలుగు మాటలు కావని గుర్తించవచ్చు

తెలుగులో పదాదిలో ఉన్న సంయుక్తాలు కూడా ఒక అచ్చు లోపించడం వల్ల ఏర్పడ్డవే మ్రోగు – మొరగు వంటి మాటలను చూస్తే ఇది అర్థమవుతుంది  గ్రుడ్డి – కురుడు, మ్రాను – మరమ్ వంటివి మరికొన్ని ఉదాహరణలు  ఆధునిక భాషలో ఈ సంయుక్తాలలో ఒక హల్లు లోపిస్తున్నది  సాధారణంగా ఈ హల్లు ర కారమే

కొన్ని మాటలలో ఆధునికభాషలో ర కారం లోపించిన రూపాలనే ఎక్కువగా వాడుతున్నాం  క్రంప–కంప, క్రక్కు–కక్కు, క్రమ్ము–కమ్ము, క్రయ్య–కయ్య, క్రాక–కాక, క్రింద–కింద, క్రిక్కిరియు–కిక్కిరియు, క్రుంకు–కుంకు, క్రుంగు–కుంగు, క్రుక్కు–కుక్కు క్రుమ్మరించు–కుమ్మరించు, క్రుమ్ము–కుమ్ము, క్రుళ్ళు–కుళ్ళు, క్రొంకి–కొంకి, క్రొత్త–కొత్త, క్రొవ్వు–కొవ్వు క్రోతి–కోతి, గ్రచ్చకాయ–గచ్చకాయ, గ్రుంత–గుంత, గ్రుక్క–గుక్క గ్రుచ్చు–గుచ్చు గ్రుడ్డి–గుడ్డి,

గ్రుడ్డు-గుడ్డు, గ్రుద్దు-గుద్దు, గ్రువ్వ-గువ్వ, త్రంపి-తంపి, త్రట్టు-తట్టు, త్రవ్వు-తవ్వు, త్రాచు-తాచు త్రాగు-తాగు, త్రాడు-తాడు, త్రిప్పట-తిప్పట, త్రిప్పు-తిప్పు, త్రుక్కు-తుక్కు త్రుప్పు-తుప్పు, త్రుట్టె-తుట్టె, త్రుళ్ళు-తుళ్ళు త్రెగు-తెగు, త్రెళ్ళు-తెళ్ళు, త్రేన్పు-తేన్పు, త్రొక్కు-తొక్కు త్రోయు-తోయు, త్రోలు-తోలు (తోలడం), త్రోవ-తోవ, ద్రబ్బ-దబ్బ, ద్రిండు-దిండు, ద్రొబ్బు-దొబ్బు, ప్రక్క-పక్క ప్రగ్గం-పగ్గం, ప్రత్తి-పత్తి, ప్రాకు-పాకు, ప్రాచి-పాచి, ప్రాత-పాత, ప్రాతు-పాతు. ప్రాక-పాక ప్రాము-పాము (రుద్దు), ప్రుచ్చు-పుచ్చు, ప్రేగు-పేగు, ప్రేము-పేము, ప్రేలు-పేలు, ప్రేలాలు-పేలాలు, ప్రేలిక-పేలిక, ప్రొద్దు-పొద్దు, ప్రొయ్యి-పొయ్యి, ప్రోగు-పోగు (కుప్ప. కమ్మ), బ్రతుకు-బతుకు, మ్రగ్గు- మగ్గు, మ్రబ్బు-మబ్బు, మ్రాకు, మ్రాను - మాకు మాను, మ్రాగన్ను-మాగన్ను, మ్రాగు-మాగు, మ్రింగు-మింగు, మ్రుక్క-ముక్క మ్రుక్కు-ముక్కు (సారహీనం ముక్కబియ్యంలాగా), మ్రుగ్గు-ముగ్గు, మ్రుచ్చు-ముచ్చు, మ్రొక్కు-మొక్కు మ్రొగ్గ-మొగ్గ, మ్రోగు-మోగు, మ్రోడు-మోడు, వ్రంత-వంత, వ్రేకటి-వేకటి, వ్రేగు-వేగు. వ్రేటు-వేటు, వ్రేలు-వేలు (వేలాడడం, చేతివేలు)

పదాది సంయుక్తాలుగా ఉండే కొన్ని మాటలకు వాడుక తగ్గింది అవి పద్యరచనలో మాత్రమే కనిపిస్తాయి వీటిలో రకార లోపం కనిపించదు క్రంత అంటే తోవ క్రమ్మర అంటే మళ్ళీ అని అర్థం క్రమ్మరించు అంటే మరల్చడం, వెనక్కు తిప్పడం క్రియ్యు అంటే కృశించడం, క్రోలు అంటే తాగడం, క్రోవి అంటే గొట్టం పిల్లంగోవి అని ర కారం లోపించిన రూపంతో వాడు తున్నాం గ్రుచ్చు అంటే తవ్వడం త్రుంగు అంటే ముక్కలు కావడం, ముగియడం, చావడం ప్రన్న అంటే అందం ప్రబ్బు అంటే వ్యాపించడం, ప్రమ్ము అంటే చుట్టుకోవడం, ప్రవ్వ అంటే కుండ, మ్రంగు అంటే క్రుంగు ప్రావ అంటే దోషం ప్రిదులు అంటే తొలగిపోవు, తగ్గు, సడలు అని అర్థం బ్రాతి అంటే ప్రేమ బ్రందు అంటే లేని నిందను మోపడం బ్రిందు అంటే ఇరుకు చోటు బ్రుంగు అంటే మునగడం, బ్రుయ్యు అంటే నశించడం మ్రొంగు అంటే ఎగసిపడడం వ్రీలు అంటే బద్దలు కావడం వ్రేత అంటే గొల్ల స్త్రీ వ్రేల్చు అంటే హోమం చేయడం, వ్రేల్మి, వ్రేలిమి అంటే హోమం

☆

# ర కారానికి లోపం ఎక్కడ

కొన్ని మాటలు సమాసంలో మార్పు పొందకుండానే ఉంటాయి ముఖ్యంగా విశేషణాలుగా వచ్చినప్పుడు విడిగా మార్పు ఉన్నా సమాసంలో మార్పులేకుండానే ఉంటాయి క్రింద అన్నమాట విడిగా కింద అయింది ఇది సమాసంలో విశేషణంగా క్రి అని క్రీ అనీ ఉంటుంది ఉదాహరణకు క్రియ్యాట అంటే క్రింది ఊట క్రీ గడుపు అంటే క్రింది కడుపు, పొత్తి కడుపు క్రీ గోరు, క్రి నీడ, క్రీ వాడ క్రీ దొడవంటి మాటలన్నీ ఇటువంటివే వీటిలో పదాది సంయుక్తంలో రకారం లోపించదు క్రిగ్గాలి అంటే తూర్పుగాలి

క్రీ గన్ను అంటే కటాక్షం, కంటి తుద, క్రీగయి అంటే హస్తాగ్రం కయి అంటే చేయి క్రీ అంటే కొన ఈ మాటల్లోనూ రకానికి లోపం లేదు

క్రొత్త కొత్త అవుతుంది సమాసంలో విశేషణంగా వచ్చినప్పుడు క్రొ లో మార్పు ఉండదు క్రొంజాయ, క్రొంజిగురు, క్రొంజిలుగు క్రొంజీకటి, క్రొందమ్మి, క్రొందావి, క్రొంబట్టు, క్రొం బెరుగు క్రొంబొగ, క్రొత్తమ్మి, క్రొత్తావి క్రొన్నన, క్రొన్నుదురు, క్రొన్నెత్తురు క్రొన్నెల, క్రొమ్మావి, క్రొమ్మించు, క్రొమ్ముడి, క్రొమ్మెరుగు క్రొవ్వాడి, క్రొవ్విరి ఈవిదంగా ఎన్ని సమాసాలయినా నిర్మించుకోవచ్చు ఈ సమాసాలన్నిటినీ యదాతథంగా వాడుకోవచ్చు కాని వీటి స్దానంలో కొత్త అన్న విశేషణాన్నే వాడి సమాస నిర్మాణం చేస్తున్నాం కొత్త నెత్తురులాగా

ప్రాత పాత అవుతుంది ప్రాయిల్లు, ప్రాగెంపు, ప్రాబలుకు మొదలయిన వాటిలో ప్రాలోని ర కారానికి లోపం లేదు ఇక్కడ కూడా పాత నే విశేషణంగా వాడుతున్నాం

ప్రాయి అంటే బియ్యం బహువచన ప్రత్యయం లు' చేరితే ప్రాలు అవుతుంది సమాసంలో రెండోపదంగా వచ్చినప్పుడు ఈ మాటలో ర కారానికి లోపం లేదు తలంబ్రాలు, సేసబ్రాలు

క్రాలు అంటే కదలడం దీనితో కన్ను చేరి క్రాల్గన్ను అవుతుంది అంటే కదిలే కన్ను క్రాల్గంటి అంటే చంచలాక్షి

ప్రోలు అంటే పట్టణం ఇది మన ఊళ్ళ పేర్లలో కనిపిస్తుంది కొన్ని చోట్ల ర కారం లోపించీ ఉంటుంది కొన్ని చోట్ల లోపించకుండానూ ఉంటుంది నిడదవోలు, ఒంగోలు, బిక్కవోలు, చందోలు, అయినవోలు, అందోలు మొదలయినవి రకార లోపం వచ్చినవి చేబ్రోలు, జటప్రోలు, నిడుబ్రోలు మొదలయినవి ర కార లోపం రానివి రాయప్రోలు సుబ్బారావు గారి ఇంటిపేరు రాయప్రోలు కూడా అంతే

క్రంచర, క్రన్ను, క్రన్నన, క్రమ్మన, క్రచ్చర వీటికి త్వరగా, వేగంగా అని అర్థం ఇవి వాడుకలో లేవు క్రుందు అంటే మోగడం, విలపించడం, ఉపద్రవం, ఎక్కువ అని అర్థాలు దీనికీ వాడుకలేదు క్రించు – కించు అంటే అల్పుడు, నీచుడు అని అర్థం ఇది వాడుకలో లేదు కాని, కించపరుచు అని వాడుతున్నాం తక్కువచేయు అవమానించు అని అర్థం క్రిక్క అంటే భట్రాజు ఈ మాటా ఇప్పుడు వాడుకలో లేదు

క్రుచ్చు అంటే కూర్చడం పూలు గుచ్చడం వాడుకలో ఉంది ఇక్కడ క్రుచ్చడమే, గుచ్చడం కాదు

---

క్రేపు అంటే దూడ  ఇక్కడ రకార లోపం లేదు  క్రేవ అంటే పార్శ్వం, పక్క  ఈ మాటల్లోనూ ర కార లోపం లేదు

గ్రక్కున అంటే వెంటనే  త్రచ్చు అంటే చిలకడం

ప్రగడ అంటే మంత్రి  దీనికి ప్రెగడ, ప్రెగ్గడ అని కూడా రూపాంతరాలున్నాయి  ప్రబలడం అంటే వ్యాపించడం  ఈ మాటల్లోనూ రకారలోపం లేదు

ప్రమిద - పమిద రెండు రూపాలూ వాడుకలో ఉన్నాయి  ప్రోది, ప్రోచులకు పెంచి పోషించు అని అర్థం  వీటిలోనూ రకారలోపం లేదు  మ్రోల అంటే ముందు, ఎదుట అని అర్థం ఇక్కడా రకారలోపం లేదు  వ్రేపల్లె అంటే గొల్లపల్లె

క్రాలు అంటే కదలు  తిరుగు, క్రమ్ము, విజృంబించు, ఒప్పు అని అర్థాలు  దీనిలో రకారం లోపిస్తే కాలు అవుతుంది  క్రియాపదంగా కాలు అంటే దగ్ధమగు అని అర్థం  ఈ రెండింటికి భేదం ఉండదు  ప్రతి అంటే వస్తువు, సదృశ వస్తువు అని అర్థం  ఇక్కడ రకారలోపం లేదు  ప్రతి లేదు అంటే ఈడు లేదని అర్థం  ప్రతి అంటే నకలు, కాపీ అని కూడా అర్థం

వ్రాయులో రకారం లోపించదు  వకారం లోపిస్తుంది  రాయు అవుతుంది  వ్రాయి అంటే రాత  వ్రాలు అన్నా రాతే  ఇక్కడ వ కారం లోపించి, రాయి  రాలు కాలేదు  వ్రాత మాత్రం రాత అయింది  ర కారం లోపిస్తే వాత అవుతుంది  వ్రాయి, వ్రాతలలో వ కారం లోపిస్తే రాయి రాతలతో భేదం పోతుంది  వ్రాలులో రకారం పోతే వాలుతో భేదం పోతుంది  వ్రాయిలో ర కారం లోపిస్తే వాయి అవుతుంది  వాయి అంటే నోరు  అప్పుడూ భేదం పోతుంది  బహుశా ఈ కారణం వల్లనేనేమో కొందరు వ్రాయు ధాతు రూపాలన్నింటినీ సంయుక్తాక్షరంతోనే రాస్తున్నారు

ఆధునిక భాష రాసేవాళ్ళలో కూడా కొందరు క్రింద'లో రకారలోపం చేయడంలేదు అట్లాగే క్రితం

ప్రాచీన భాషలో వాడుకలో ఉండి, ఆధునిక భాషలో అంతగా వాడుకలోలేని మాటల్లో సంయుక్తం నిలిచింది  అట్లాగే అరువు తెచ్చుకున్న మాటల్లోనూ సంయుక్తం నిలిచింది

తెలుగులో పదమధ్యంలో కాని, పదాంతంలో కాని సంయుక్తాక్షరాలు తక్కువ  ద్విత్వాలు ఎక్కువ  అక్క, అన్న, అమ్మ, పట్టి, వల్ల, గడ్డ, వద్ద మొదలయినవి  సంయుక్తాలు అచ్చులోపించడం వల్ల ఏర్పడతాయి  పాల్గొను (పాలుగొను)  కల్గిన (కలిగిన), పల్కు (పలుకు), అల్క (అలుక), చిల్క (చిలుక), చెర్వు (చెరువు)  అనునాసిక ద్విత్వం ఉంటుంది  రెండు అనునాసికాల సంయుక్తం ఉండదు, చిన్న  కమ్మ  జన్మ, ఆమ్నాయం వంటివి సంస్కృత పదాలు  క్రియలలో సకార  తకార సంయుక్తం ఉంటుంది, వస్తే  చేస్తాడు

క్రియా పదాలలో పదాంతంలోని అచ్చు లోపించడం వల్ల చెయ్, కొయ్  వెయ్ వంటి యకారాంత రూపాలు కనిపిస్తాయి  కాని చేయి/ చెయ్యి, కోయి/ కొయ్యి, వేయి/ వెయ్యి, ఉంటాయి వంటి అజంత రూపాలే వాడవచ్చు

ము ప్రత్యయాంత రూపాలను హలంతాలుగా వాడుతున్నాం  ఇది నామవాచకాలలోనూ క్రియలలోనూ కూడా వాడుకలో ఉంది

తెలుగుమాటలలో పదాంతంలో ఇతర హల్లులుండవు  తెలుగుమాటల్లో పదాంతంలో దీర్ఘాచ్చు ఉండదు  పదంలో సున్న తర్వాత కచటతప గజడదబలే ఉంటాయి  ఇతర హల్లులుండవు

# భాషల పరస్పర ప్రభావం

ప్రపంచంలో ఏ భాష అయినా మరో భాష నుండి పదజాలాన్ని తీసుకోక తప్పదు మానవ సమాజాల మధ్య సంబంధాలున్నంతవరకూ ఈ ఇచ్చిపుచ్చుకొనే వ్యవహారం సాగుతూనే ఉంటుంది ప్రాచీన సమాజంలో అనేక భాషలు తెలిసిన వ్యక్తుల సంఖ్య పరిమితంగా ఉండేది ప్రస్తుతం రెండు భాషలు మాట్లాడగలిగిన లేదా కనీసం అర్థం చేసుకోగలిగిన వ్యక్తుల సంఖ్య చాలా ఎక్కువ చదువుకున్న వాళ్ళు ముఖ్యంగా మన పాఠశాలల్లో అనుసరిస్తున్న విద్యావిధానం వల్ల మూడు భాషలు నేర్చుకుంటున్నారు హైదరాబాదు వంటి నగరాల్లో నాలుగు భాషలు వచ్చినవాళ్ళ సంఖ్య కూడా ఎక్కువే అందువల్ల తెలుగు భాషలో బహుభాషల పదజాలం వచ్చి చేరడానికి అవకాశం ఉంది

చారిత్రకంగా చూసినప్పుడు ప్రాచీనకాలంలో సంస్కృత ప్రాకృతాల ప్రభావం విస్తృతంగా ఉండేది. మధ్యయుగాలలో తమిళం, కన్నడం వంటి ఇరుగు పొరుగు భాషల నుండి పదాలు అరువు తెచ్చుకోవడం జరిగింది పదమూడో శతాబ్దం నుండి అరబిక్ పర్షియన్ పదాలు, ఉర్దూ పదాలు పదహారో శతాబ్దం నుండి ఇంగ్లీషు పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి పదాలు తెలుగు భాషలో చేరాయి

ప్రాచీన కాలంలో సంస్కృత ప్రాకృత పదాలు ఎక్కువగా చేరడానికి సాంస్కృతిక కారణాలు ప్రధానం ఆర్య ద్రావిడ జాతుల సమ్మేళనం ఆర్య ద్రావిడ భాషల పరస్పర ప్రభావానికి కారణమయింది సంస్కృతంలోనూ ఎన్నో ద్రావిడ భాషా పదాలూ, వ్యాకరణ నిర్మాణాలూ చేరాయి ద్రావిడ భాషల్లో మాత్రం సంస్కృత భాషా పదాలు విస్తృతంగా వచ్చి చేరాయి మతపరమైన సాహిత్యమంతా సంస్కృతంలోనే ఉండడమూ సంస్కృతం విద్యా మాధ్యమం కావడమూ దీనికి ప్రధానమయిన కారణం అయితే ఆధునిక కాలంలో కూడా తెలుగులో సంస్కృత భాషాపదాలు విస్తృతంగా చేరుతూనే ఉన్నాయి. పరిభాషను కల్పించుకోవడంలో సంస్కృత పదాలను బాగా వాడుకుంటున్నాం

రెండు మూడు శతాబ్దాల కిందట యూరోపియన్ భాషల పదాలు వస్తువులకు సంబంధించినవి మన భాషలో చేరాయి పూర్వం సంస్కృతం లాగా ఇప్పుడు ఇంగ్లీషు మనకు విద్యా మాధ్యమం అయింది ఇది ముఖ్యంగా ఉన్నతవిద్యా రంగంలో జరిగింది శాస్త్ర రంగంలో పరిభాష చాలావరకు ఇంగ్లీషే కేవలం శాస్త్ర సాంకేతిక రంగాలలోనేకాక పరిపాలనా రంగంలోనూ ఇంగ్లీషు మాటలను ఎక్కువగా వాడక తప్పడంలేదు ఇంగ్లీషు భాష ప్రపంచంలోని భాషలన్నింటి నుండీ పదజాలాన్ని కొల్లగొట్టింది ఇంగ్లీషు ద్వారా ఆ పదజాలం మన భాషలోకీ ప్రవేశించింది

ఒక భాష నుండి మరో భాషలోకి పదాలను అరువు తెచ్చుకొనేటప్పుడు పదాలు కొన్ని మార్పులు పొందుతాయి మూలభాషతో మనకున్న పరిచయాన్ని బట్టి ఈ మార్పులుంటాయి అట్లాగే మూలభాషా ధ్వనులకూ, మన భాషాధ్వనులకూ ఉన్న తారతమ్యాలను బట్టి కూడా ఈ మార్పులుంటాయి మూల భాషలో ఉన్న ధ్వనులు మన భాషలో లేకపోతే వాటికి మన భాషలో దగ్గరగా ఉన్న ధ్వనులను ఉపయోగిస్తాం ఉంటే వాటినే ఉపయోగిస్తాం ఒకవేళ ఆ భాషతో విస్తృతమయిన పరిచయం ఉంటే ఆ ధ్వని మన భాషలో లేకపోయినా అదేవిధంగా ఉచ్చరిస్తాం.

అటువంటి ధ్వనులున్న కొన్ని మాటలు విస్తృత ప్రచారంలో ఉంటే ఆ మాటలతోపాటు ఆ ధ్వనులు కూడా మన బాషలో ప్రవేశిస్తాయి దీనికి తెలుగులో మంచి ఉదాహరణలు కాఫీ, ఫీజు వంటి మాటలు తెలుగులో సంస్కృతం నుండి ఫ వచ్చింది పలం, ఫాలం వంటి మాటల్లో ఇది ఉంది దీని ఉచ్చారణను 'ph'తో సూచించవచ్చు కాఫీలో ఉన్న ఫ ఉచ్చారణను 'f 'తో సూచించ వచ్చు ఈ రెండూ వేరువేరు అయినా ఒకే లిపి సంకేతం ఉపయోగిస్తున్నాం కాని ఉచ్చారణలో మాత్రం భేదం పాటిస్తున్నాం

పదంలో మార్పు ఉన్నచోట అంటే వర్ణలోపం వర్ణాగమం, వర్ణ వ్యత్యయం వంటి మార్పు లున్నప్పుడు మనవాళ్ళు ఆ పదాన్ని తద్భవం అన్నారు వర్ణలోపం అంటే ఏదైనా ఒక వర్ణం లోపిం చడం, వర్ణాగమం అంటే ఒక వర్ణం ఎక్కువగా వచ్చి చేరడం, వర్ణ వ్యత్యయం అంటే రెండు వర్ణాలు తారుమారు కావడం, ఇటువంటి మార్పులేనప్పుడు కూడా సాధారణంగా పదాంతంలో మార్పు ఉంటుంది అంటే హలంతమైన పదం అజంతం కావడమో, దీర్ఘం హ్రస్వం కావడమో, హ్రస్వం దీర్ఘం కావడమో వంటివి ఆ భాషలో పదాంతంలో ఏదైనా ప్రత్యయం ఉంటే సాధా రణంగా ఆ ప్రత్యయం లోపించి, అవసరమయితే మన భాషా ప్రత్యయం చేరుతుంది

సంస్కృత ప్రాకృత భాషా పదాల విషయంలో ఈ రెండు రకాల మాటలనూ మన వాళ్ళు విశ్లేషించారు పదంలో గణనీయమయిన మార్పు ఉన్నప్పుడు దాన్ని తద్భవమనీ, పదం చివర ప్రత్యయం వంటివి మాత్రమే మారినప్పుడు దాన్ని తత్సమమనీ అన్నారు ఇతర భాషా పదాల విషయంలో ఇటువంటి విశ్లేషణ చేయలేదు ఇదే పద్ధతిని అనుసరించి ఇతర భాషల పదాలను కూడా మనం విశ్లేషించవచ్చు ఉదాహరణకు హాస్పిటల్ అన్న మాటను తీసుకుంటే ఆసుపత్రి అన్నది తద్భవం, హాస్పిటలు అన్నది తత్సమం

ఇంగ్లీషు నుండి మనం అరువు తెచ్చుకున్న మాటల్లో ఏకాక్షర పదాలన్నీ దీర్ఘాంతాలో, ఐ, ఔలతో ముగిసేవో అయి ఉంటాయి టీ కీ, బ్లూ, గ్రే, షో, షూ, మే లాంటివి సంస్కృతంలోని ఏకాక్షర పదాలలాగానే తెలుగులో దీర్ఘాంతాలుగానే ఉంటాయి హై, ఫ్రై, డ్రై లాంటి వాటిలో మార్పేమీ ఉండదు ఫ్రీ, ట్రే, టూ, త్రీ. రో, స్లో మొదలయినవన్నీ దీర్ఘాంతాలే సాధారణంగా అజంతంగా ఉండే మాటలు తెలుగులోకి దీర్ఘాంతాలుగానే వస్తాయి కాఫీ, పార్టీ, బ్యూరో, రౌడీ, గూండా, కూలీ, లోగో, కౌంటీ, కంట్రీ ఎల్లో, టాబూ, సినిమా, రేడియో, పియానో, బ్రాందీ, విస్కీ, టాక్సీ, ఆటో. రిక్షా, లారీ, సారీ, బేబీ, పిల్లో, డేటా వంటి మాటలన్నీ దీర్ఘాంతాలే

జనవరి, ఫిబ్రవరి మాత్రం హ్రస్వాంతాలు

☆

# ఇంగ్లీషు మాటలు - కొన్ని సంగతులు

ఇంగ్లీషు నుండీ, ఇంగ్లీషు ద్వారా వచ్చిన మాటల్లో అనేక రకాలున్నాయి అచ్చుతో అంతమయ్యే మాటలను చాలావరకు దీర్ఘాంతాలుగానే వాడుతున్నాం ధీరీ, స్టూడియో, అంబ్రెల్లా, మాస్టరీ, అరోమా, పనోరమా, ఫార్మసీ, మినిస్ట్రీ, ట్రీటీ, ట్రాఫీ, గ్లోరీ, విక్టరీ, మాండేటరీ, కేఫ్టీరియా, ఫోబియా, పార్ముతా, అలెర్జీ, అటాఫ్సీ, ఇండస్ట్రీ, మార్చురీ, ఆర్టిలరీ, ఇమేజరీ, బాటరీ, సర్జరీ, రెవిన్యూ, లిబర్టీ, ఏరియా, యూరియా వంటి మాటల్లో కొన్నింటిని కొంతమంది హ్రస్వాంతాలుగా రాస్తున్నారు ధీరీని దియరి అనీ, థియరీ అని కూడా రాస్తున్నారు స్టూడియొ, ట్రాఫి, ఆర్టిలరి అని రాసే వాళ్ళూ ఉన్నారు ప్రస్తుతం వీటిని దీర్ఘాంతాలుగా రాయడమే ఎక్కువ ప్రచారంలో ఉంది

అల్ట్రా, యాంటీ, మానెటరీ, శానిటరీ వంటి మాటలను విశేషణాలుగా ఉపయోగిస్తున్నాం వీటిని కూడా దీర్ఘాంతాలుగానే వాడుతున్నాం

ముఖ్యంగా వివిధ శాస్త్రాల పేర్లకు సంబంధించిన మాటలెన్నో తెలుగులో వాడుకలోకి వచ్చాయి హిస్టరీ జాగ్రఫీ, బాటనీ, జువాలజీ, కెమిస్ట్రీ, సైకాలజీ, ఫిలాసఫీ, సోషియాలజీ, అనాటమీ, ఫిజియాలజీ, పథాలజీ, అస్ట్రాలజీ, ఆస్ట్రానమీ, జియాలజీ, సైటాలజీ, డెంటిస్ట్రీ, ఫార్మకాలజీ, డెర్మటాలజీ, కార్డియాలజీ, ఆప్తల్మాలజీ, సైకియాట్రీ, జ్యామెట్రీ, ట్రిగనామెట్రీ, అల్‌జీబ్రాల వంటివి కూడా దీర్ఘాంతాలుగానే వాడుకలో ఉన్నాయి

అనేక ఆధునిక శాస్త్రాలకు సంబంధించిన పరిభాష ముఖ్యంగా గ్రీకు, లాటిన్ భాషల నుండి ఇంగ్లీషు భాషలోకి వచ్చింది ఇంగ్లీషు నుండి తెలుగులోకి కూడా వచ్చింది ప్లాజ్మా, ఫిస్టులా, కార్నియా, హెర్నియా కిడ్నీ, ఆల్గే, వెర్టెబ్రా, వీనకావా, స్పాచ్యులా, రెటీనా, ప్లాటినా, కరోనా వంటి మాటలెన్నో ఆవిధంగా వచ్చినవే వీటన్నిటినీ దీర్ఘాంతాలుగానే వాడుతున్నాం

డెమోక్రసీ, మాబోక్రసీ వంటి మాటల్నీ దీర్ఘాంతాలుగానే రాస్తున్నాం

ఇంగ్లీషు పరిపాలన వల్లనైతేనేం, ఆంగ్లసాహిత్యం ద్వారానైతేనేం, నేటి అంతర్జాతీయత వల్లనైతేనేం ఎన్నో ఇంగ్లీషు పేర్లు మనవాడుకలోకి వచ్చాయి క్రైస్తవమతం స్వీకరించిన తెలుగు వారిలో కొందరు ఇంగ్లీషు పేర్లు పెట్టుకుంటున్నారు ఈ పేర్లలో కొన్ని ఇంగ్లీషు అయితే మరికొన్ని హీబ్రూ, లాటిన్ ఇతర యూరోపియన్ భాషలకు చెందినవి వీటిలో కొన్ని అచ్చుతో అంతమయ్యేవి

ఆల్డో అనేది జర్మానిక్ పదం ఆల్డో అంటే ధనిక+వృద్ధ, అలోన్జో, ఆల్ఫాన్జో రూపాంతరాలు కులీన+సన్నద్ధం అని అర్థం ఆండ్రే, ఆండ్రూ రూపాంతరాలు, ఆండీ వీటికి సంక్షిప్తరూపం పురుషత్వం గల అని అర్థం ఆంటోనీ, ఆంథోనీ రూపాంతరాలు ఇది రోమన్ కుటుంబనామం ఆర్చీ అన్నది ఆర్చిబాల్డ్‌కు సంక్షిప్తరూపం ఆర్చిబాల్డు అంటే పేరుగల+ధైర్యం అని అర్థం

ఆబ్రే అన్నపేరు జర్మానిక్, ఒక విధమైన మంత్రశక్తి గల దివ్యవ్యక్తి+రాజు అని అర్థం బారీ అన్నది ఐరిష్ పదం ఈటె అని అర్థం బర్తలోమియో హీబ్రూ పేరు బీవర్లీ అంటే బీవర్ బీళ్ళలో ఉండేవాడు బిల్లీ అనేది విలియంకు సంక్షిప్తరూపం బాబీ అన్నది రాబర్ట్‌కు సంక్షిప్తరూపం బ్రూనో అంటే గోధుమరంగు

కాఠి ఒక కుటుంబనామం కాసీ అంటే ధైర్యవంతుడు కాస్మో గ్రీకుపదం నగ అని అర్థం డెనీ డేనియల్‌కు సంక్షిప్తరూపం డేనియల్ హీబ్రూ పదం డేవీ డేవిడ్‌కు సంక్షిప్త రూపం డానీ డోనాల్డుకు సంక్షిప్త రూపం, ప్రపంచం + శక్తి అని అర్థం డ్రూ జర్మానిక్ పదం, నమ్మకస్తుడు అని అర్థం డడ్లీ అంటే మెట్ట పొలం ఎలిహూ, ఎలిజా పర్యాయపదాలు, హీబ్రూ మాటలు ఎలిషా కూడా హీబ్రూయే ఎమరీ జర్మానిక్ పదం, శ్రమించే పాలకుడు అని అర్థం ఎన్రికో హెన్రీకి రూపాంతరం హెన్రీ జర్మానిక్ పదం దీనికి ఇల్లు+రాజ్యం అని అర్థం గారీ అంటే శూలధారి అని అర్థం

జెఫ్రీ అంటే దివ్యశాంతి జెరీ జెరాల్డ్‌కు సంక్షిప్తరూపం గాడ్‌ఫ్రే అంటే దేవుడు+శాంతి గ్రెగరీ గ్రీకుమాట జాగరూకత అని అర్థం గే అంటే అడవి

హారీ హెన్రీ, హెరాల్డులకు సంక్షిప్తరూపం హార్వే అంటే సైన్యం+యుద్ధం హిలరీ అంటే ఆనందంగా ఉండడం లాటిన్ నుండి వచ్చింది హొరేషియో హొరేస్‌కు పర్యాయరూపం రోమన్ కుటుంబ నామం హ్యూగో హ్యూగ్‌కి పర్యాయరూపం హంఫ్రీ జర్మానిక్ పదం, ఉన్నతం+శాంతి అని అర్థం ఇరా ఈసయ్యా హీబ్రూ పదాలు జెడదియ్యా హీబ్రూ పదం జెరమయ్యా కూడా అంతే దీని రూపాంతరమే జెరమీ జోనా జెహూ, జెస్సీ జోషువా, జోజయ్యా, జూడా హీబ్రూ మాటలు జో జోసెఫ్‌కు సంక్షిప్తరూపం జిమ్మి జేమ్స్‌కు సంక్షిప్తరూపం లారీ లారెన్సుకు సంక్షిప్త రూపం

లియో గ్రీకు నుండి వచ్చింది సింహం అని అర్థం లేవీ హీబ్రూ పదం లూ లూయిస్‌కి సంక్షిప్త రూపం మాథ్యూ హీబ్రూ మాట మీకా మైకేల్‌కు సంక్షిప్తరూపం మికే కూడా అంతే మన్రో కుటుంబనామం మాంట్‌గోమరీ కూడా అంతే ముర్రే కూడా కుటుంబ నామమే. నీరో రోమన్ కుటుంబ నామం నోవా హీబ్రూ

ఒబాదియా హీబ్రూ పదం ఒర్లాండో రోలాండ్‌కు పర్యాయరూపం ఓటో జర్మానిక్ పదం, ధనికుడని అర్థం పెర్సీ, ఫెరీ కుటుంబనామాలు క్విన్సీ లాటిన్‌పదం ఐదవ అని అర్థం రామ్సే స్కాండినేవియన్ పదం అటవీ ద్వీపం అని అర్థం రాండీ రాండోల్ఫుకు సంక్షిప్తరూపం రే రేమాండ్‌కు సంక్షిప్తం రాడ్నీ కుటుంబనామం శాండీ అలెగ్జాండర్ నుండి వచ్చింది సిడ్నీ కుటుంబనామం స్టాన్లీ కూడా అంతే టెరీ టెరెన్స్‌కు సంక్షిప్తరూపం. టిమోతీ గ్రీకు పదం, సమ్మానం+ దేవుడు అని అర్థం యూరయా హీబ్రూ పదం వాల్డో జర్మానిక్ పదం వెస్లీ కుటుంబ నామం

హీబ్రూ మాటలన్నీ దాదాపుగా దైవసంబంధమైనవి కుటుంబ నామాలు చాలావరకు స్థలనామాలు

ఇటీవలి కాలంలో భారతీయుల పేర్లలో కూడా ఇంగ్లీషు పేర్ల సంక్షిప్తనామాల వంటివి చేరుతున్నాయి సునీల్ గవాస్కర్, సన్నీగవాస్కర్ అయ్యాడు. మొహిందర్ అమర్‌నాథ్ జిమ్మీ అమర్ నాథ్ అయ్యాడు అట్లాగే కృష్ణ, క్రిస్టాఫర్ రెండూ కిట్టూ అయ్యాయి

☆

# ఇంగ్లీషు పేర్లనా

ఇంగ్లీషు వారి పేర్లలో స్త్రీల పేర్లు ఎక్కువగా అజంతంగా ఉంటాయి ఈ అజంతమయిన పేర్లన్నీ తెలుగులో దీర్ఘాంతాలుగా రాయడం పరిపాటి అయిపోయింది ఇంగ్లీషు పేర్లలో హీబ్రూ, గ్రీకు, లాటిను బాషల నుండి వచ్చిన పేర్లు ఫ్రెంచి, జర్మను, ఇటాలియను, డేనిషు మొదలయిన యూరోపియను బాషల నుండి వచ్చిన పేర్లు ఎక్కువ

అబీ అన్నమాట అబిగేల్ అనే హీబ్రూ పదం నుండి వచ్చిన సంక్షిప్త నామం ఆడా జర్మను నుండి వచ్చింది దీనికి కులీన అని అర్థం హీబ్రూనుండి వచ్చిన ఆడా అన్న పేరు కూడా ఉంది దీనికి ఆభరణం అని అర్థం ఈ రెండు మాటలకు వర్ణక్రమంలో బేదం ఉంది అడీనా హీబ్రూ మాట అగాదా గ్రీకుపదం మంచిది అని అర్థం అగీ అన్న పేరు అగ్నెస్ అగాథా అన్న మాటలకు సంక్షిప్తం అగ్నెస్ అంటే స్వచ్ఛమైన, పవిత్రమైన అని అర్థం ఇది గ్రీకు పదం

అల్బర్టీ అన్నమాట ఆల్బర్టుకు స్త్రీ వాచకం అల్బినా అల్బినుకు స్త్రీవాచకం అలదియా గ్రీకుమాట సత్యమని అర్థం అలెగ్జాంద్రా అలెగ్జాండరుకు స్త్రీ వాచకం అల్ఫ్రీడా అల్ఫ్రెడుకు స్త్రీ వాచకం

అలిషా ఇటాలియను పేరు, అలీస్‌కు పర్యాయరూపం అలీసా హీబ్రూ పదం, ఆనందం అని అర్థం అల్మా లాటిను నుండి వచ్చిన మాట కరుణ అని అర్థం అల్టా కూడా లాటిను పదమే దీనికి ఎత్తైన అని అర్థం అల్థియా గ్రీకుపదం ఆరోగ్యవంతమయిన అని అర్థం అత్వారా ఎత్వరా పర్యాయ పదాలు

అమండా లాటిను పదం, ప్రియురాలు అని అర్థం అమీల్యా జర్మానిక్ పదం ఆమీ అన్నా ప్రియురాలే ఇది లాటిను పదం.

అనస్తాషా అన్నది గ్రీకుపదం, పునరుత్థానం అని అర్థం

ఆండ్రియా ఆండ్రూకు స్త్రీ వాచకరూపం ఏంజెలా, ఏంజెలికా, ఏంజెలినా రూపాంతరాలు అనితా అనాకు రూపాంతరం అనా హీబ్రూ హన్నా నుండి వచ్చింది అనబెలా స్కాటిషు పదం అనమరీ ఆన్, మరీ అనే రెండు పదాల సమాహారం అనీ కూడా అనా రూపాంతరమే అంథియా గ్రీకుపదం ఆంతోన్యా ఆంతోనీకి స్త్రీ వాచకం ఆడ్రే ఇంగ్లీషు మాట కులీన + శక్తి అని అర్థం అగస్తా అగస్టస్‌కు స్త్రీ వాచకం ఒరోరా లాటిన్ పదం, ఉషస్సు అని అర్థం అవీవా హీబ్రూ మాట, వసంతమని అర్థం

బార్బరా గ్రీకుపదం, విదేశీయమని అర్థం బాత్‌షీబా హీబ్రూపదం బీ బీట్రిసుకు సంక్షిప్త రూపం ఆనందాన్నిచ్చేదని అర్థం బెకీ రెబాకాకు సంక్షిప్తరూపం ఇది హీబ్రూ మాట బెలిండా అంటే సుందరి బెలా ఇజ బెలాకు సంక్షిప్తరూపం ఇది ఎలిజబెత్‌కు పర్యాయరూపం బెటీ, బెట్సీ కూడా అంతే బెర్తా అంటే కాంతివంతమైన అని అర్థం, ఇది జర్మానిక్ పదం దీని సంక్షిప్త రూపమే బెర్టీ బ్యూలా హీబ్రూ మాట, వివాహిత అని అర్థం బియాంకా ఇటాలియను పదం, తెల్లని అని అర్థం బిడీ, బ్రిడీలు బ్రిడ్జెటుకు సంక్షిప్త రూపాలు బాబీ బార్బరా, రాబెర్టాలకు సంక్షిప్త రూపం బోనీ లాటిన్ పదం, మంచి అని అర్థం బ్రెండా జర్మానిక్ మాట ఖడ్గజ్వాల అని అర్థం బనీ బర్నిసుకు సంక్షిప్తం

కమీల్యా కమిలా కాండిడా లాటిను పదాలు కాండీ కాండేసుకు సంక్షిప్తరూపం కార్లా ఇటాలియను పదం కార్లా కార్ల్‌కు స్త్రీవాచక రూపం కార్లోటా కార్లట్‌కు పర్యాయ రూపం ఇది చార్లెస్‌కు స్త్రీ వాచకం కార్మెలా కార్మెలిటీ పర్యాయ పదాలు కారోలా కరోలుకు పర్యాయం కార్రీ కరోలిన్‌కు సంక్షిప్తం కసాండ్రా గ్రీకుపదం కాదీ కాథరిన్‌కు సంక్షిప్తరూపం సిసీలియా సిసిల్‌కు స్త్రీ వాచకం

సీల్యా సిసీలియాకు సంక్షిప్తం చెరీ చారిటీకి సంక్షిప్తరూపం చికీతా స్పానిష్ పదం చిన్న అని అర్థం క్లోయీ గ్రీకుపదం వికసిత అని అర్థం క్రిస్టియానా క్రిస్టియన్‌కు స్త్రీ వాచకం

సిండీ సింథియాకు పర్యాయ పదం క్లారా అంటే కాంతివంతమైన అని అర్థం క్లారిండా క్లారాకు రూపాంతరం క్లారిసా కూడా అంతే క్లాడియా క్లాడ్‌కు స్త్రీ వాచకం క్లెమీ క్లెమింటీన్‌కు సంక్షిప్తం క్లీయో క్లియోపాత్రాకు సంక్షిప్తరూపం క్లియోపాత్రా అంటే కీర్తి + తండ్రి క్లీయో గ్రీకులో చరిత్రకు అధిష్ఠాన దేవత క్లోటిల్డా జర్మానిక్ పదం, ప్రసిద్ధ + యుద్ధం అని అర్థం కచీతా స్పానిష్ పేరు కంకార్డియా లాటిను పదం కానీ కాన్‌స్టన్స్‌కు సంక్షిప్తరూపం కొన్స్యూవా స్పానిష్ పదం కోరా గ్రీకుపదం కార్నీలియా కార్నీలియసుకు స్త్రీ వాచకం కోరీ దీనికి రూపాంతరం సింథియా గ్రీకుపదం

డెయిజీ ఒక పుష్పం పేరు

స్త్రీల పేర్లూ పురుషుల పేర్లూ ఒకే పదం నుండి వచ్చినవి చాలా ఉంటాయి డేనియల్, డేవిడ్, ఎడ్విన్, ఎల్బర్ట్, ఫెర్డినాండ్, ఫ్రాన్సిస్, జార్జ్, గిల్బర్ట్, జాన్, క్లాడ్ హెన్రీ, హిలరీ, జస్టిన్ జూలియస్, మార్కస్, పాట్రిక్, పాల్, ఫిలిప్, ప్రిస్కస్, రేమాండ్, రోములస్ పురుషుల పేర్లయితే డేనియలా, డవిడా, ఎడ్వినా, ఎల్బర్టా, ఫెర్డినాండా, ఫ్రాన్సిస్కా జార్జియా, గిల్బర్టా, జొవానా, గ్లాడ్యా, హెన్రియటీ, హిలరీ, జస్టినా, జూలియా, మార్సెలా, పాట్రీసియా, పోలా, ఫిలిపా, ప్రిసిలా రమోనా, రమోలా స్త్రీల పేర్లు

డయానా, ఫాస్టినా, ఫ్లోరా, వర్జీనియా, వయోలా, విక్టోరియా, వెరోనికా, మరీనా, నటాలీ, సబీనా, సిల్వియా, స్టెలా, ఉర్సులా మొదలయినవి లాటిన్ నుండి వచ్చాయి డెల్యా, డీడో, డోరా, డొరొతీ, మెలిసా, ఫిలోమెనా, సోఫియా, జెనియా మొదలయినవి గ్రీకు నుండి వచ్చాయి డెబోరా, డెలిలా, దీనా, ఎడ్నా, హెప్జిబా, ల్రైలా, మేరీ, సమంతా, సారా, సుసానా, తమారా వంటి పేర్లు హీబ్రూ నుండి వచ్చాయి

డొనా, ఎలెనా, లియొనారా, సాండ్రా, థెరిసా వంటి పేర్లు ఇటాలియన్ నుండి వచ్చాయి నీనా, ఓల్గా, దెరా వంటి పేర్లు రష్యన్ నుండి వచ్చాయి లిండా, ఎస్మరాల్డా, ఎవిటా, ఫెర్నాండా, ఎల్బర్టా, జానిటా, లోలిటా, మీరాండా వంటివి స్పానిష్ పేర్లు హిల్డా, మెటిల్డా వంటివి జర్మన్ పేర్లు మార్తా, తబితా వంటివి అరమాయిక్ పరిష్, స్కాటిష్ పేర్లు కూడా ఉన్నాయి ఇంగ్లీషులో చాలాపేర్లకు సంక్షిప్త రూపాలుంటాయి

మిలీ మిల్డ్రెడ్‌కు, మాగ్డా మాగ్డలీనాకు, లెనా హెలెన్‌కు, జెనీ జెనిపర్‌కు, జాకీ జాక్విలిన్‌కు, లిజా ఎలిజబెత్‌కు, గ్రెటా మార్గరెటాకు సంక్షిప్త రూపాలు ఒక్కొక్క పేరుకు ఒకటికంటే ఎక్కువ సంక్షిప్త నామాలు కూడా ఉంటాయి

గ్రీకు, లాటిను, పర్షియను, సంస్కృతం ఒకే మూల భాష నుండి ఉద్భవించిన భాషలు కాబట్టి ఈ భాషల్లో స్త్రీ వాచక శబ్దాల నిర్మాణంలో సామ్యం కనిపిస్తుంది ☆

# పేర్లు - కథా కమామిషూ

పేరు సంకేతం మాత్రమే ప్రతి మనిషికీ ఒక పేరు ఉంటుంది ప్రతి ఊరుకూ ఒక పేరు ఉంటుంది ఆ మనిషినీ, ఆ ఊరునూ గుర్తించడానికి, తక్కినవాటి నుండి వేరు చెయడానికి ఈ పేరు తోడ్పడుతుంది ప్రపంచంలో ఉన్న వ్యక్తులందరికీ వేరువేరు పేర్లు ఉండడం సాధ్యంకాదు ఏ భాషకూ అంత వైపుల్యం లేదు చైనాలో ఒకే పేరు గలవారు కోటిమందికి పైగా ఉన్నారట అప్పుడేం చేయాలి? తండ్రి పేరో, తల్లి పేరో, ఇంటిపేరో ఊరు పేరో ఏదో ఒకటో రెండో ఈ గుర్తింపుకు ప్రమాణాలవుతాయి అయినా కొన్ని సందర్భాలలో పొరపాట్లు జరుగుతూనే ఉంటాయి

ఒక మనిషికి ఒక పేరు ఉంటే గుర్తించడం తేలికే కాని చాలా సమాజాలలో ఒకటికంటే ఎక్కువ పేర్లు కూడా ఉంటాయి లోక వ్యవహారాలకోసం ఒకటి దైవపరంగా ఒకటి ప్రత్యేకమైన పేర్లు ఉండే సమాజాలూ ఉన్నాయి చాలామందికి ఇంట్లో ఒక పేరు బయట మరో పేరూ ఉంటుంది కొందరికి ముద్దుపేర్లు ఉంటాయి మరికొందరికి బిరుదులుంటాయి కొందరు అసలు పేర్లతో కంటే తరువాత పెట్టుకున్న ఏర్పడ్డ పేర్లతోనే ప్రసిద్ధమవుతారు రచయితలు చాలామంది కలంపేర్లతో ప్రసిద్ధులు మన చలనచిత్ర నటీనటులలో కొంతమంది పేర్లు చలన చిత్ర రంగంలోకి ప్రవేశించిన తర్వాత పెట్టుకున్న పేర్లు ఎప్పుడయినా చమత్కారానికి వీరి అసలు పేరు ఉపయోగిస్తే ఎవరూ గుర్తించలేరు కూడా

సంస్కృతంలో వేదాలు, ఉపనిషత్తులు పురాణాలు, ఇతిహాసాలు ప్రధానమయిన ప్రాచీన సాహిత్యం తరువాతి కాలంలో వచ్చిన కావ్య ప్రపంచానికంతా ఈ సాహిత్యం నుండే వస్తువు లభించింది అందువల్ల ఆ కావ్యాలన్నిటిలోనూ పురాణనామాలే ఉంటాయి మన సాహిత్యంలో ఎక్కువభాగం ఛందోబద్ధం, ఛందోబద్ధ రచనలో ఛందో నియమాలకు అనుగుణంగా ఒక్కొక్కసారి పేర్లూ మార్చుకోవలసి రావచ్చు ఒకే పేరును మాటిమాటికీ వాడడం కంటే దానిక్కూడా పర్యాయ రూపాలు ఏర్పరుచుకుంటే కొంత వైవిధ్యం ఉంటుంది కదా అట్లాగే ఆ వ్యక్తి నిర్వహించిన కార్యాలను వర్ణించే విధంగానూ కొత్త పేర్లు కల్పించుకోవచ్చు మన దేవతలకు ఎన్నో పేర్లు విష్ణుసహస్రనామాలు అందరికీ తెలిసినవే గదా అట్లాగే శివుడికీ, దేవికీ కూడా ఉన్నాయి ఇవి మాత్రమే కాదు, ఈ దేవతలకు మరెన్నో పేర్లుంటాయి ఈ దేవతల రూప సౌందర్యాలు, వారు చేసిన ఘనకార్యాలు, భక్తులకు వారు ప్రసాదించే వరాలు, ఆధ్యాత్మికంగా వారిని గురించి భక్తుల కున్న భావాలు ఇవన్నీ ఈ పేర్లలో వ్యక్తమవుతాయి ఈ పేర్లలో చాలా పేర్లను మనం పెట్టు కుంటున్నాం

పురాణనామాలలో వ్యక్తుల పేర్లు కొన్నిసార్లు గోత్ర సంబంధమయినవిగా ఉంటాయి గౌతముడు అంటే గౌతమ గోత్రానికి చెందినవాడు పురాణాలలో ఎందరో గౌతములున్నారు అట్లాగే భార్గవులు, భారద్వాజులు, వాసిష్ఠులు మొదలయిన వారు వివిధ పురాణాలలోనూ, కావ్యాలలోనూ వచ్చే పాత్రలలో సమానంగా కనిపించే పేర్లు అనేక సందేహాలకు తావిస్తాయి పురాణేతిహాసాలను బట్టి ఆయా రాజవంశాలను పునర్నిర్మించే ప్రయత్నంలో ఆధునికులు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు

ఇంద్రుడనేది ఒక పదవి అంటారు, వివిధ కాలాలలో వేరువేరు ఇంద్రులుండాలి అయితే ఏ ఇంద్రుడెవరో గుర్తించడం సాధ్యంకాదు అందరు ఇంద్రులు చేసిన పనులూ ఇంద్రుడికే అన్వయిస్తాయి అంటె ఇంద్రులంతా ఒకే వ్యక్తిగా రూపుదిద్దుకున్నారన్నమాట వృత్రుణ్ణి చంపిన ఇంద్రుడూ అహల్య కథలోని ఇంద్రుడూ, పారిజాతాపహరణ కథలోని ఇంద్రుడూ హిరణ్య కశిపుని కథలోని ఇంద్రుడూ ఒకరు కాకపోయినా మన కథల్లో కలగాపులగంగా కలిసిపోయారు అట్లాగే వ్యాసుడొక్కడేనా అన్న ప్రశ్న కూడా ఉంది

గోత్రం పేరు, తల్లి పేరు, తండ్రి పేరు, వంశం పేరుతో ప్రసిద్ధులైన వ్యక్తులు పురాణాల నిండా ఉన్నారు భారతంలో ద్రౌపది అంటే తెలియనివారుండరు ద్రుపదుని కూతురు ద్రౌపది కృష్ణ అన్న పేరు కంటే ద్రౌపదే ప్రసిద్ధం పాండవులు తండ్రి పేర పాండవులుగా ప్రసిద్ధులయితే, తల్లుల పేర కౌంతేయులు, మాద్రేయులు అవుతున్నారు కౌరవులన్న పేరు ధృతరాష్ట్రుడి కొడుకు లకే ఎందుకు ప్రసిద్ధమో పాండవులూ కౌరవులే కదా అంటే కురువంశం వాళ్ళు ధార్తరాష్ట్రులు అన్నది తండ్రి పేరుతో ఏర్పడితే కౌరవులు అన్నది వంశం పేరుతో ఏర్పడింది అర్జునుడు కౌంతేయుడూ, పాండవుడూ, ఇంద్రసుతుడూ కూడా అవుతున్నాడు కుంతి అసలు పేరు పృధ, కుంతి భోజుడు పెంచుకున్నాడు కాబట్టి కుంతి అయింది పృధ కొడుకు కాబట్టి అర్జునుడు పార్థు డయ్యాడు ధర్మరాజు, భీముడూ కూడా పార్థులే అవుతారు కదా కాని ఈ పేరు అర్జునునికే ప్రసిద్ధం ఈ అర్జునుడు మరో జన్మలో నరుడు కృష్ణుడు నారాయణుడు అందువల్ల అర్జునుడికి నరుడని కూడా పేరు

పురాణాలలో ప్రసిద్ధ వ్యక్తులందరి విషయంలోనూ ఈ విధంగా ఎన్నో పేర్లుండటం గమ నించవచ్చు

☆

# పేర్లకు అనువాదాలా

తెలుగు సాహిత్యం మధ్యయుగాలలో ఇతివృత్తాలను సంస్కృత సాహిత్యం నుండే తెచ్చుకుంది అందువల్ల మన సాహిత్యంలో పదకొండో శతాబ్దం నుండీ గత శతాబ్దం దాకా భారత రామాయణాలు పురాణాలు ఆధారంగానే రచనలు ఎక్కువగా వచ్చాయి దశకుమార చరిత్ర, కేయూర బాహుచరిత్ర విక్రమార్క చరిత్ర, భోజరాజీయం, పంచతంత్రం శుకసప్తతి హంసవింశతి, సింహాసన ద్వాత్రింశిక వంటివి కథా ప్రధానమైన రచనలు బసవ పురాణం, పండితారాధ్య చరిత్ర పల్నాటి వీరచరిత్ర వంటి రచనలు పురాణేతిహాస సంబంధమైనవి కావు ఇటువంటి గ్రంథాలలో పౌరాణిక పాత్రలు అరుదు ఇటువంటి రచనలను వదిలివేస్తే తక్కిన రచనలన్నింటికీ ఎంతోకొంత పురాణేతిహాసాల సంబంధం ఉంటుంది అందువల్ల ఈ రచనల్లో పురాణ పురుషుల పేర్లు ఉండక తప్పదు కళాపూర్ణోదయం వంటి కల్పిత కథాకావ్యంలో కూడా పౌరాణిక పాత్రలు ప్రవేశించాయి

పౌరాణిక పాత్రలకు ఒకటి కంటే ఎక్కువ పేర్లు సాహిత్యంలో కనిపిస్తూ ఉంటాయి వారికి పెట్టిన పేరు, వంశంవల్ల వచ్చిన పేరు, తల్లివల్ల వచ్చిన పేరు, తండ్రి వల్ల వచ్చిన పేరు, వారు చేసిన కృత్యాలను వర్ణించే పేర్లు ఉండవచ్చు ఆకారాన్ని బట్టి, గుణగణాలను బట్టి పేర్లు ఏర్పడవచ్చు అన్నదమ్ముల వల్ల, భార్యవల్ల, భర్తవల్ల, అక్కాచెల్లెళ్ళ వల్ల కూడా పేర్లు ఏర్పడవచ్చు వివిధ అవతారాలలో చేసిన కృత్యాలవల్ల వచ్చిన పేర్లు ఉండవచ్చు ఒక్కొక్కసారి తరువాతి అవతారాలలో చేసిన పనులవల్ల వచ్చిన పేర్లు ముందు అవతారాలను వర్ణించేటప్పుడు కూడా దొర్లుతూ ఉంటాయి పేర్లను ఈ విధంగా ఉపయోగించడం వల్ల పద్య రచనలో ఎంతో సౌలభ్యం చేకూరుతుంది అర్జునుడు ఇంద్రుని కొడుకు ఇంద్రతనూజుడు, ఆఖండలనందనుడు, ఇంద్రసూనుడు, పురందర సూనుడు, మహేంద్రసూతి, సురేంద్ర కుమారుడు, జంబారి తనూజుండు ఇట్లా ఇంద్రుడికి ఉన్న పేర్లన్నీ ఉపయోగించి కుమారుడు, పుత్రుడు, సూనుడు, తనూజుడు నందనుడు వగైరాలతో మనకు అవసరమైన విధంగా వాడుకోవచ్చు ఛందోనియమాలను పాటించడంలో ఇది చాలా తోడ్పడుతుంది వ్యక్తుల పేర్లేకాదు ఊళ్ళ పేర్లలోనూ పర్యాయ పదాల ప్రయోగం ఉంది ఉదాహరణకు హస్తినాపురాన్ని కరిపురం అని కూడా ప్రయోగించారు

సంస్కృతంలోని పేర్లను తెలుగులోకి తెచ్చుకొనేటప్పుడు వీటన్నింటినీ ఉపయోగించుకోవచ్చు తెలుగు కవులు చేసిన మరోపని పేర్లను కూడా తద్భవీకరించుకోవడం ఉదాహరణకు ద్రౌపది అన్న పేరును తీసుకోవచ్చు దీనిని ద్రోవదిగా కూడా ప్రయోగించారు కుంతిని గొంతి చేశారు శ్రీ సిరి అవుతుంది విష్ణువు వెన్నుడు అవుతాడు లక్ష్మి లచ్చి అవుతుంది

తత్సమాలుగా, తద్భవాలుగా తెలుగులో పౌరాణిక పాత్రల పేర్లను వాడడం ఒక ఎత్తు వాటిని అనువాదం చేసుకోవడం మరో ఎత్తు పేర్లు అనువాదం చేసుకోడం ఏమిటి? ఎట్లా సాధ్యం? అనిపించవచ్చు గుణాన్ని తెలిపేవి, వ్యుత్పత్తి అనువాదానుకూలంగా ఉన్నవి అనువాదం చేసుకున్నారు కృష్ణ శబ్దానికి నలుపు అని అర్థం అందువల్ల కృష్ణుడు అంటే కఱివేల్పు అని కఱ్ఱి అని, నల్లని దొర అనీ అనువాదం చేసుకున్నారు అర్జునుడు కూడా నల్లనివాడే అందుకే అతన్నీ కఱ్ఱి అంటారు 'కఱ్ఱి విక్రమంబు కాల్పనే' అని భారత ప్రయోగం అయితే ఇటువంటి

అనువాద నామాలు అంత ప్రచురం కాదు కాని, తెలుగులో అచ్చ తెలుగు కావ్యాలనే ఒక ప్రక్రియ ఉంది ఈ కావ్యాలలో తత్సమ శబ్దాలకు ప్రయోగం ఉండదు రామాయణ భారత ఇతి వృత్తాలు తీసుకొని వాటిలో రాముడు సీత, కృష్ణుడు, అర్జునుడు అని పేర్లు రాకుండా రాయడం సాధ్యంకాదు కాబట్టి పేర్లు తత్సమాలుగా వాడుకోవచ్చుననే సడలింపు ఒకటి చేసుకున్నారు పేరును యధాతదంగా వాడుకోవచ్చు కాని సమాస రూపంలో ఏర్పడ్డ ప్రత్యేకమైన పేర్ల విషయం ఏమిటి? వాటిని యదాతథంగా తత్సమ రూపంలో ప్రయోగించకూడదు అందువల్ల మన కవులు వాటిని అనువదించుకున్నారు సవ్యసాచిని కవ్వడి అని అనువదించారు

పార్వతి అంటే హిమవంతుని కూతురు హిమవంతుడు పర్వతం కాబట్టి ఆమె పర్వత పుత్రి దీన్ని అనువదించుకొని గట్టు దొరపట్టి, కొండకూతురు చలిరాయి కన్నట్టికన్నె, వలిగట్టు దొరపట్టి అని వాడుకున్నారు

బ్రహ్మకు నాలుగు ముఖాలుంటాయి చతుర్ముఖుడని నామాంతరం తెలుగులో ఇది నలువ అయింది నలు అంటే నాలుగు వాయి అంటే నోరు నాలుగు వాయిలు అంటే నాలుగు నోళ్ళు కలిగిన వాడని అర్థం నాల్మొగంబుల దిట్ట, నలునోళ్ళ దిట్ట నల్తలయ్య, నాలుగు మొగము లతడు అని అనువదించుకున్నారు బ్రహ్మ భార్య సరస్వతి ఆమె వాగ్దేవి అందువల్ల పల్కు ముద్దియ, నుడిచాన, కూతనాతి అని అనువదించుకున్నారు సీత అంటే నాగేటిచాలు అందువల్ల ఆమె చాలు పేరింటి ననబోడి చాలు అనే పేరుగల స్త్రీ వాల్మీకి అంటే పుట్టబుట్టిన దిట్ట అచ్చ తెలుగు కావ్యాలలో ఇటువంటి పేర్ల అనువాదాలు కొల్లలుగా కనిపిస్తాయి అయితే జనసామా న్యంలో ఈ అనువాద నామాలకు ప్రచారం తక్కువ సాహిత్య రచనలకు మాత్రమే పరిమితం

దేశ్య నిఘంటువులలో కూడా ఇటువంటి కృత్రిమమయిన దేవతా నామాలెన్నో కనిపి స్తాయి

నియమ బాహుళ్యం ఉన్న రచనలలో ఇటువంటి కృతకత్వం చోటు చేసుకుంటుంది ఉదాహరణకు రామాయణాన్ని నిరోష్ఠ్యంగా రాయదలచుకుంటే ఓష్ఠ్యమైన ధ్వనులు రాని పదా లతో రాయాలి. రాముడులో మకారం ఉంది ఇది ఓష్ఠ్యం అందువల్ల రాముడనే మాట లేకుండా రామాయణం రాయాలి రామాయణ కావ్యం దశరథ రాజనందన చరిత్ర అయింది పేరు కేవలం సంకేతం సంకేతాన్ని అనువదించడం వల్ల ఉద్దిష్టమయిన అర్థం తేలికగా గోచరించదు పేర్లను అనువదించడం ఒక ప్రత్యేక సాహిత్య ప్రక్రియలో అవసరంకోసం చేయడమే తప్ప సహజమైన ప్రక్రియ కాదు

☆

# పరాయి పేర్లు

మన ప్రాచీన కావ్యాలలో సంస్కృతం పేర్లు తప్ప ఇతర భాషల పేర్లు తక్కువ శైవ వైష్ణవ రచనల్లో తమిళ, కన్నడ నామాలు కొన్ని కనిపిస్తాయి మన ఆదికవి నన్నయగారి పేరే తెలుగు కాదంటారు మంచి అన్న అర్థంలో నన్ని అన్నమాట తెలుగులో లేదనీ అందువల్ల నన్నయగారు తెలుగువారే కాదనీ కొందరు వాదించారు పద్నాలుగో శతాబ్దం నుండీ శాసనాలలో మహమ్మదీయుల పేర్లు కనిపిస్తున్నా తెలుగు కావ్యాలలో పదహారో శతాబ్దం నుండి మాత్రమే కనిపిస్తాయి వాటిలో కూడా ఇతివృత్తంలో మహమ్మదీయుల పేర్లు ఉండేది చాలా తక్కువ కృష్ణరాయ విజయం, ప్రతాపచరిత్ర, రాయవాచకం, నరపతి విజయంవంటి వాటిలో మాత్రమే ఇతివృత్తంలో ఈ పేర్లుండడానికి అవకాశం ఉంది బాల భాగవతంలాంటి వాటిలో పీఠికలో అళియ రామరాజు మొదలయిన వారు మహమ్మదీయులను ఓడించిన ప్రసక్తి ఉంటుంది అద్దంకి గంగాధరుని తపతీ సంవరణోపాఖ్యానము, పొన్నిగంటి తెలగన యయాతిచరిత్ర మహమ్మదీయులకు అంకితమిచ్చిన కావ్యాలు వీటి ఇతివృత్తాలలో కూడా మహమ్మదీయుల పేర్లు రావడానికి అవకాశం లేదు పీఠికలో అంకితం సందర్భంలోనే ఈ పేర్లకు స్థానం ఉంది తపతీ సంవరణోపాఖ్యానం ఇబ్రహీం కుతుబ్షాకు అంకితం యయాతి చరిత్ర అతని సేనాని అమీనుఖానుకు అంకితం కృతి భర్త వంశాన్ని వర్ణించడం సంప్రదాయం కాబట్టి పీఠికలో వారి పేర్లు వస్తాయి

ఇబ్రహీం కుతుబ్షా న్యాయ పరిపాలన గురించి, ధార్మికతను గురించీ కథలున్నాయి చాటు పద్యాలు కూడా ఉన్నాయి ఇభరాము శాహువు మలికిభరాముడు, మల్కిభరాము, ఇభరాము శాహి అని తెలుగు కవులు ఈయనను పేర్కొన్నారు ఇది ఒక విధమయిన తద్భవీకరణం అయితే ఇందులో రామ శబ్దాన్ని తోపింపజేయడం ఒక విశేషం ఆదిల్షా ఏదులశాహి, ఏదుల శాహువు అయ్యాడు ఆదిల్ఖాన్ ఏదులఖానుడు అయ్యాడు అమీన్ఖాన్ అమీనుఖానుడు అయ్యాడు

ఫాజిల్ఖాన్ ఫాజీలుఖానుడు, ఉలూఖ్ఖాన్ ఉల్లాఖు ఖానుడు, సిద్దీఖ్ఖాను సిద్దీఖుఖానుడు, మలేఖాన్ మలేఖానుడు, షితాబ్ఖాన్ చిత్తాపుఖానుడు అయ్యారు

షేక్ ఇబ్రహీం షేకీభరాముడు అయ్యాడు కుతుబ్షా కుతుపన మలక అయ్యాడు

హలంతాలను అజంతాలుగా చేసుకోవడం డు ప్రత్యయం చేర్చడం నాటి కవుల సంప్రదాయంగా గుర్తించవచ్చు ఇటీవలి వరకూ 'డు' ప్రత్యయం చేర్చే సంప్రదాయం కొనసాగక పోయినప్పటికీ అజంతంగా రాయడమనే సంప్రదాయం కొనసాగింది అక్బరు, బాబరు, హుమయూను, జహంగీరు, షాజహాను, ఔరంగజేబు అనే మన చరిత్ర పుస్తకాలలో ఉంటుంది

ఈ శతాబ్దం తొలి సగంలో యూరోపియన్ల పేర్ల విషయంలోనూ ఈ సంప్రదాయం ఉంది షేక్స్పియరు నాటకాల అనువాదాల తొలిదశలో మూడు రకాల పద్ధతులు అవలంబించారు మనవాళ్ళు ఒక పద్ధతి ఏమిటంటే అసలు పేరునే మార్చివేయడం ఉదాహరణకు ఒథెల్లో జయద్రథుడవుతాడు ఒకరి అనువాదంలో మరొకరి అనువాదంలో జయదేవుడు అవుతాడు మరో అనువాదంలో వీరసేనుడయ్యాడు కింగ్లియర్ మందపాలుడవుతాడు హామ్లెటు ప్రతాప సింహుడవుతాడు సింబలీన్ రత్నావళి అవుతుంది నాలుగవ హెన్రీ నరసభూపాలుడైతే, ఐదవ హెన్రీ కృష్ణదేవరాయలవుతాడు

రెండో పద్ధతిలో జూలియస్ సీజర్ జూలియసు సీజరుడు అవుతాడు బ్రూటసును బ్రూ-
సుడు అని అనువదించారు సామాన్యనామం అయిన రోమన్ రోమనుడు అయింది అజం-
మయిన పేర్లలో 'డు' ప్రత్యయం చేర్చడం ఉండదు ఆంటోనీ ఆంతోనీగానే ఉంటాడు

మూడో పద్ధతిలో హలంత నామాలు అజంతాలుగా మారతాయి సీజర్ సీజరు, బ్రూ-
బ్రూటసు, కాసియస్ కాసియసు అవుతారు ఈ పద్ధతి ఇటీవలి వరకూ ఉంది కొన్ని సందర్భా-
లలో ఇప్పుడూ కొనసాగుతూనే ఉంది సంస్కృతం, గ్రీకు, లాటిన్, పర్షియన్ భాషలు ఒకే
మూలభాష అంటే ఇండో యూరపియను నుండి ఉద్భవించాయి కాబట్టి పేర్లలో సామ్యం ఉం-
వచ్చు కొంచెం మార్చుకుంటే గ్రీకు పేరు సంస్కృతం అయిపోవచ్చు అలెగ్జాండర్ ఈ శతా-
తొలిరచనల్లో అలక సుందరుడు కావడంలో ఆశ్చర్యమేమీ లేదు అట్లాగే జర్మనీ తత్త్వవే-
మాక్సుముల్లరుసు మనవారు మోక్షమూలరు అన్నారు

తెలుగువారిలో క్రైస్తవుల పేర్లు రెండు రకాలుగా ఉంటాయి ఒకటి తెలుగుపేరే పెట్టు-
కోవడం రెండు యూరోపియన్ పేరో బైబిల్ సంబంధమయిన పేరో పెట్టుకోవడం ఈ రెండ
రకం పేరు పెట్టుకున్నప్పుడు తెలుగు క్రైస్తవులు సాధారణంగా పురుషులయితే అయ్య, స్త్రీలయితే
అమ్మ అనే అనుబంధ పదం చేర్చుకుంటారు

థామస్ తామసయ్య, తోమాసయ్య అవుతుంది మైకేల్ మికేలయ్య అవుతుంది
ఇగ్నేషియస్ జేవియర్ ఇన్యాసి శౌరయ్య అయింది ఇగ్నేషియస్ ఇన్నయ్య అయింది ఆంటోనీ
అంతయ్య అయింది జోసెఫ్ జోజయ్య అయింది అగస్టీన్ అగస్తేనయ్య అయింది అయ్య
చేరకుండా థామస్, మైకేల్, జార్జ్, అల్ఫ్రెడ్ మొదలయిన విధంగా కూడా ఉంటాయి

మేరీ పేరుతో మరియమ్మ, మరమ్మ ఏర్పడ్డాయి మరయ్య అని పురుషనామం కూడా మేరీ
శబ్దంతో ఏర్పడింది తెరిసా తేరేజమ్మ అయింది మేరీరోజ్ మర్రోజమ్మ అయింది అగస్టీన్
అగస్తేనమ్మ అయింది రెజీనా రుజేనమ్మ అయింది లూర్దమ్మ, మత్తేనమ్మ, రోజమ్మ, జుస్తేనమ్మ,
తామాసమ్మ వంటి పేర్లతోపాటు అమ్మ చేరకుండా మేరీ, ఫాతిమా, ఫిలోమెనా, అన్నమేరీ
మాగ్దలీనా, ఏంజెలా, బ్యూలా, దోరోతీ మొదలయిన పేర్లూ ఉన్నాయి

ప్రస్తుతం హలంతనామాలను చాలా వరకు హలంతాలుగానే రాసే సంప్రదాయం ఏర్పడు
తున్నది బిల్ క్లింటన్, టోనీ బ్లెయిర్ అనే రాస్తున్నారు కాని క్లింటను, బ్లెయిరు అని రాయడం
లేదు

# పరభాషలపై మోజు మాతృభాషకు చేటు

ఒకప్పుడు కన్నడ రచయితలు తమ సమావేశాలలో ఇంగ్లీషు మాటలు రాకుండా మాట్లాడాలని నియమం పెట్టుకున్నారట ఏ వక్త అయినా తన ప్రసంగంలో ఎన్ని ఇంగ్లీషు మాటలు వాడితే అన్ని పావలాలు జరిమానా చెల్లించుకోవాలని కట్టడి చేశారు ఇది ఎన్నాళ్ళు సాగిందో కాని ఈనాడు ఇది సాధ్యమయ్యే పనేనా?

తెలుగు రచయితలు కూడా ఒకప్పుడు ఇటువంటి ప్రయత్నాలు చేసి ఉండవచ్చు ఒక సంస్కృతం మాటో ఒక ఇంగ్లీషు మాటో ఉర్దూ మాటో మరో భాషా పదమో దొర్లకుండా ప్రసంగించడం అసాధ్యమయి పోయిందీరోజు తెలుగే మాట్లాడుతున్నాం కాని అవసరమైనప్పుడు వాడుకలో నలిగిన అన్యభాషాపదం వాడితే తప్పేమీలేదు అవసరం లేనప్పుడు కూడా వాటిని వాడడం వల్ల మన భాష అభివృద్ధి కుంటుపడుతుందనడంలో సందేహం లేదు

ఇద్దరు తెలుగు వాళ్ళు కలుసుకుంటే ఇంగ్లీషులో మాట్లాడుకుంటారని హాస్యోక్తి ఇదివరకు హైదరాబాదు నగరంలో ఇద్దరు తెలుగు వాళ్ళు ఉర్దూలో మాట్లాడుకోవడం ఉర్దూలోనే తిట్టుకోవడం వింత విషయమేమీ కాదు ఇటీవలి కాలంలో కొంత మార్పు వచ్చినా ఉర్దూలో మాట్లాడుకునే తెలుగువాళ్ళు ఇప్పటికీ ఉన్నారు దీనికి ఇంగ్లీషు జోడయిందిప్పుడు ప్రయివేటు వైద్యశాలలు, ప్రయోగశాలలు, హోటళ్ళు, విద్యాసంస్థలు, ఇతర వ్యాపార సంస్థలు బాగా పెరిగిపోయింతర్వాత ఇంగ్లీషు మరీ పేట్రేగిపోయింది మనం లోపల అడుగుపెట్టగానే ఒక రిసెప్షనిస్టు తయారు మీకేంకావాలని ఇంగ్లీషులో చాలా మర్యాదగా అడుగుతారు, మన వేషం ఇంగ్లీషు వచ్చిన ముఖంలా కనిపిస్తే మనం తెలుగులో మాట్లాడినా ఇంగ్లీషులోనే జవాబు చెప్తారు తెలుగులోనే మాట్లాడవలసిన అవసరం వస్తే ఇంగ్లీషులో చూపించినంత మర్యాద కనిపించదు వచ్చిన పెద్ద మనిషి రిసెప్షనిస్టు ముందు న్యూనతా భావం పొందక తప్పదు ఇకలోపలికి వెళ్ళి కలవవలసిన వ్యక్తి ముందు ఏం మాట్లాడతాడు రిసెప్షనిస్టు బాధ్యత కూడా అదేనేమో

ఈమధ్య ఒక డయాగ్నస్టిక్ సెంటరుకు పోవలసి వచ్చింది వరండాలో కూర్చుని మావంతు కోసం ఎదురు చూస్తున్నాం ఒకామె గదిలోనుండి బయటకు వచ్చి ఏంచేయాలో పాలుపోక తడబడుతూ అటూఇటూ చూసింది నాపక్కనే కూర్చున్న మా ఆవిడ దగ్గరకు వచ్చి సందేహిస్తూ 'యూరిన్ పాస్‌చేసి రమ్మన్నారండి, అంటే ఏం చెయ్యాలండి' అని అడిగింది ఆమె చెప్పింది వెళ్ళిపోయింది లోపలకు ఆమెకు ఈమాట చెప్పిన వ్యక్తి పురుషుడు తెలుగులో చెప్పడానికి సందేహించాడేమో స్త్రీ అయినా తెలుగులో చెప్పి ఉండకపోవచ్చునుకోండి చెప్పింతర్వాత పేషంటు ముఖంవైపు చూస్తే ఆమెకు అర్ధమయిందీ లేనిదీ తెలిసేది కానీ అంత తీరికెక్కడ? ఆమె మళ్ళీ అడగడానికి అవకాశమివ్వకుండా మరో పేషంటు కొన్ని విషయాలు అర్ధంకాక పొరపాట్లు కూడా జరగవచ్చు

మనభాషలో ఒక మాట వాడితే బూతు అదేమాటకు సంస్కృత పదమో, ఇంగ్లీషు మాటో, ఉర్దూ మాటో వాడితే పరవాలేదు వస్తువదే, భావమదే మన భాషలో అది ఎందుకు బూతు, మరోభాషలో ఎందుకు కాదు? మనకు ఇటువంటి నమ్మకాలు బాగా నాటుకుపోయి ఉన్నాయి పూర్వకవులు 'సహసానఖంపచస్తన దత్త పరిరంభ ' అంటూ సమాస భూయిష్ఠంగా రతివర్ణన

చెప్తే సామాన్యులకు అర్థంకాదుగదా పండితులకు మాత్రమే అర్థమవుతుంది పరవాలేదు ఇది పండితులకు బూతుకాదేమో ఇంగ్లీషు వాళ్ళు రాధికా సాంత్వనంలాంటి పుస్తకాలను నిషేధించినప్పుడు వాటిని పండితులకోసం ప్రచురణలుగా అచ్చువేసుకోనిచ్చారు పరిణత బుద్ధులయిన పండితులు వాటిని చదివి చెడిపోరుగదా పండితులు కానివాళ్ళు వాటిని చదివి అర్థం చేసుకోలేరుకదా మరి నిషేధం ఎందుకు? ఎవరి తృప్తి వారిది

సంస్కృతం విషయంలో చెప్పవలసిందేమీ లేదు ఏ కొత్త మాట కల్పించుకోవాలన్నా మనం సంస్కృతం మీదే ఆధారపడుతున్నాం ఇప్పుడు ఇంగ్లీషూ అంతే అనివార్యమయి పోయింది

ప్రభుత్వ వ్యవహారాలూ, కార్యకలాపాలలోనూ శాస్త్ర రచనల్లో వార్తాప్రసార ప్రచార సాధనాల్లోనూ ఇంగ్లీషు రోజురోజుకూ విస్తరిస్తోంది కంప్యూటర్లూ, ఆధునిక సాంకేతిక పరికరాలూ విస్తరించే కొద్దీ ఇది మరీ ఎక్కువవుతుంది ఇంగ్లీషు భాష విస్తరించడానికి నేటి అంతర్జాతీయ అవసరాలు ఒక ముఖ్యమైన కారణం సాహిత్యం, సంస్కృతి, కళలు, అసలు జీవితమే అంతర్జాతీయమయి పోతూ ఉన్నప్పుడు భాషలు ఈ ప్రభావాల నుండి ఎలా బయటపడతాయి

అందువల్ల మన పత్రికల భాషలో కూడా ఇంగ్లీషు మాటలు ఎక్కువయ్యాయి వివిధ రంగాలకు సంబంధించిన విషయాలతో నిండి ఉండే పత్రికలలో ఇంగ్లీషు మాటల అవసరం తప్పదు మరి ఈనాడు పత్రికలలో వాడే ఇంగ్లీషు మాటలను అర్థం చేసుకోవడానికి ప్రత్యేకంగా నిఘంటువులు అవసరమవుతున్నాయంటేనే ఇంగ్లీషు మాటల వాడుక ఎంత పెరిగిందో అర్థం చేసుకోవచ్చు ఏవో కొన్ని పదాలే అయితే వాటికోసం ప్రత్యేకంగా నిఘంటువు అవసరంలేదు వేల సంఖ్యలో పదాలు వచ్చి చేరినప్పుడే నిఘంటువు అవసరం ఏర్పడుతుంది ఒక సామాన్య పాఠకుడు తేలికగా అర్థం చేసుకోవడానికి తగినట్లుగా ఉండవలసిన దినపత్రికలో వాడే మాటలకు నిఘంటువును చూసుకొని అర్థాలు తెలుసుకోవలసిన అవసరం ఏర్పడడం కూడా వింతే ఆ పదాలు వాడే వారికీ నిఘంటువు కావాలి, చదివే వారికీ నిఘంటువు కావాలి

పత్రికలోని ప్రతి అక్షరమూ సామాన్య పాఠకుడి కోసమే అనడం సమంజసంకాదేమో పత్రికలోని అనేక అంశాలు ఆయా రంగాలకు సంబంధించిన విశిష్ట పాఠకులకు ఉద్దేశించినవి కాబట్టి ఈ పరిస్థితి ఏర్పడిందేమో

☆

# హలంతాలా? అజంతాలా?

ఆంగ్ల విద్యావిధానం వల్లగాని ఆధునిక సమాజం అంతర్జాతీయ లక్షణం వల్లగాని ఇంగ్లీషు, ఇతర యూరోపియను భాషల పదాలు మన భాషలోకి వచ్చి చేరాయన్నది మాత్రం వాస్తవం నిరంతరమూ పెరుగుతూ ఉన్న సాంకేతిక విజ్ఞానం కూడా మనకు ఇంగ్లీషు ద్వారానే సంక్రమిస్తూ ఉంది కాబట్టి ఇంగ్లీషు మాటలను అరువు తెచ్చుకోవడం అనివార్యం అయితే అవసరంలేని సందర్భాలలో కూడా ఇంగ్లీషు మాటల వాడుక హానికరమేననక తప్పదు

ఇంగ్లీషు ఇతర యూరోపియను భాషాపదాలను అరువు తెచ్చుకొనేటప్పుడు అవలంబించే పద్ధతులేమిటి? ఇది ముఖ్యంగా పదం చివర ఎట్లా ఉండాలి అన్నదాన్ని బట్టి ఉంటుంది ఈ మాటలు అజంతమయిన మాటలయితే అజంతాలుగానే తెచ్చుకుంటాం హలంతమయిన మాటల విషయంలోనే వాటిని అజంతాలుగా చేసుకోవాలా? హలంతాలుగానే ప్రయోగించాలా? అన్న సమస్య వస్తుంది వాటిని యదాతథంగా హలంతాలుగానే వాడే సంప్రదాయం ఇటీవల కొంత పెరుగుతూ ఉన్నప్పటికీ అజంతాలుగా మార్చుకొనే సంప్రదాయమే కొంత బలంగా ఉంది విడిమాటను వాడడంలో ఒక పద్ధతి, ప్రత్యయం చేర్చినప్పుడు వాడడంలో మరొక పద్ధతీ కూడా వాడుతున్నారు

ఇంగ్లీషు మాటలను అజంతాలుగా మార్చుకొంటే అవి పొందే మార్పులేమిటి?

కొన్ని మాటలు క్, గ్, వ్, ర్, చ్, జ్ మొదలయిన విధంగా అసంయుక్తంగా, అద్విరుక్తంగా అంతమవుతాయి ఈ మాటల చివర ఒత్తులేని హల్లు ఉంటుందన్నమాట ఉదాహరణకు చెక్, బుక్ అనే మాటలను తీసుకోవచ్చు ఇవి చెక్కు, బుక్కు అవుతాయి పిక్నిక్ పిక్నిక్కు అవుతుంది ఈ మాటలలో చివర ఉన్న హల్లుకు ముందు హ్రస్వమయిన అచ్చు ఉంది ఇటువంటి సందర్భాలలో ఈ హల్లు ద్విరుక్తమవుతుంది అంటే క–క్క అవుతుంది తక్కిన హల్లులు కూడా అంతే రగ్ రగ్గు అవుతుంది రిగ్ రిగ్గు అవుతుంది మగ్ మగ్గు, లెగ్ లెగ్గు అవుతాయి సామాన్యంగా లెగ్ వంటి మాటలను వాడవలసిన అవసరం రాదుకాని కొన్ని ప్రత్యేక సందర్భాలలో వాడవలసి వస్తుంది రెండు, మూడు భాగాలుగా ఉండే క్రీడల్లో సెకండ్ లెగ్, థర్డ్ లెగ్ అని వాడుతుంటారు రెండో భాగం, మూడో భాగం అనో రెండో పాదం, మూడోపాదం అనో కూడా వాడవచ్చు. సెట్ సెట్టు అవుతుంది బెట్ బెట్టు, మార్కెట్ మార్కెట్టు, క్రెడిట్ కెడిట్టు, బ్రాకెట్ బ్రాకెట్టు, సీక్రెట్ సీక్రెట్టు అవుతాయి క్రికెట్, రాకెట్, లాకెట్, కిట్, జెట్ జాకెట్ మొదలయిన పదాలన్నీ ఇంతే బ్రెడ్ బ్రెడ్డు అవుతుంది త్రెడ్ త్రెడ్డు అవుతుంది లెడ్ లెడ్డు అవుతుంది మిత్ మిత్తు అవుతుంది తకారాంతమయిన పేర్లు కూడా ఇంతే మాక్‌బెత్ మాక్‌బెత్తు అవుతుంది

మేకప్, మేకప్పు అవుతుంది కప్ కప్పు, లాకప్ లాకప్పు అవుతాయి టబ్ టబ్బు అవుతుంది క్లబ్ క్లబ్బు అవుతుంది పిన్ పిన్ను అవుతుంది బన్ బన్ను, గన్ గన్ను, జిన్ జిన్ను అవుతాయి బిల్ బిల్లు అవుతుంది మిల్ మిల్లు అవుతుంది బెల్ బెల్లు అవుతుంది లవ్ లవ్వు అవుతుంది ఫర్ ఫర్రు అవుతుంది సెన్ సెస్సు అవుతుంది ప్రెస్ ప్రెస్సు అవుతుంది డ్రెస్ డ్రెస్సు అవుతుంది

ఈ హలంత పదాలలో చివరి హల్లుకు ముందు దీర్ఘం కాని, బిందువు (సున్నా) కాని

---

ఉన్నట్లయితే ఆ హల్లు ద్విరుక్తం కాదు ఉదాహరణకు లాక్ లాకు అవుతుంది కాని లాక్కు కాదు గీక్ గ్రీకు అవుతుంది షాక్ షాకు అవుతుంది అట్లాగే లింక్ లింకు, బాంక్ బాంకు టాంక్ టాంకు, రాంక్ రాంకు, జింక్ జింకు అవుతాయి అదేవిధంగా కింగ్ కింగు, స్ట్రాంగ్ స్ట్రాంగు రింగ్ రింగు, సాంగ్ సాంగు, బ్లీచింగ్ బ్లీచింగు, కౌంటింగ్ కౌంటింగు అవుతాయి బ్యాగ్ బ్యాగు అవుతుంది సీట్ సీటు, ఓట్ ఓటు, సెంట్ సెంటు అవుతాయి పాంట్ పాంటు అవుతుంది ప్లాట్ ప్లాటు అవుతుంది బ్లేడ్ బ్లేడు, రాడ్ రాడు, లోడ్ లోడు, కోడ్ కోడు అవుతాయి రోడ్ రోడు కావాలి కొందరు రోడు అని వాడినా ఎక్కువమంది రోడ్డు అనే వాడుతున్నారు దీన్ని ఒక ప్రత్యేక రూపంగా గుర్తించవచ్చు

బ్రాండ్ బ్రాండు అవుతుంది లాండ్ లాండు అవుతుంది సీల్ సీలు అవుతుంది రీల్ రీలు అవుతుంది ప్రిన్సిపాల్ ప్రిన్సిపాలు అవుతుంది క్రేన్ క్రేను, వాన్ వాను అవుతాయి కార్ కారు అవుతుంది బార్ బారు అవుతుంది

హలంత పదంలో చివరి హల్లుకు ముందు ఐ, ఔలు ఉన్నా హల్లుకు ద్విత్వం రాదు అంటే లైన్ లైను అవుతుందే తప్ప లైన్ను కాదు లైట్ లైటు, వైట్ వైటు, రైట్ రైటు, మైల్ మైలు, జైల్ జైలు, చైర్ చైరు, సైడ్ సైడు అవుతాయి ఔట్ ఔటు అవుతుంది బ్రౌన్ బ్రౌను, క్రౌన్ క్రౌను, బ్లౌజ్ బ్లౌజు, బౌల్ బౌలు, పౌన్ పౌను అవుతాయి

ఇంగ్లీషులో పదాంతంలో ద్విరుక్త వర్ణాలుండవు పదమధ్యంలో కూడా కొన్నిచోట్ల వర్ణక్రమంలో ద్విరుక్తత ఉన్నా ఉచ్చారణలో అది తొలగిపోతుంది తెలుగు వర్ణక్రమంలో రాసేటప్పుడు వాటిని అద్విరుక్తంగానే రాస్తాం

లిటిల్ అనే ఇంగ్లీషు మాటలో రెండు 'టి'లు ఉంటాయి కాని ఉచ్చారణలో ఒకటే టి తెలుగులో రాసినప్పుడు కూడా అద్విరుక్తంగానే రాస్తాం కెటిల్, బాటిల్, సెటిల్ వంటివి దీనికి ఉదాహరణలు పదాంతంలో కూడా ఇంగ్లీషులో ద్విరుక్త హల్లులుంటాయి కాని వాటి ఉచ్చారణ అద్విరుక్తంగానే ఉంటుంది మిల్‌లో రెండు 'ఎల్'లు ఉన్నాయి తెలుగులో మిల్లు అని రాస్తాం అయితే తెలుగులో 'ల్లు రాయడానికి కారణం ఇంగ్లీషులో రెండు 'ఎల్'లు ఉండడం కాదు ఒకే 'ఎల్' ఉన్నా తెలుగులో ద్విరుక్తంగానే రాస్తాం దీర్ఘాచ్చు తర్వాత రెండు 'ఎల్'లు ఉన్నా తెలుగులో అది అద్విరుక్తంగానే ఉంటుంది ఉదాహరణకు వాల్‌ని తీసుకోవచ్చు తెలుగులో వాలు అవుతుంది బాల్ బాలు అవుతుంది ఈ పదాలన్నింటిలోన )వర వచ్చి చేరిన అచ్చు ఉ' కావడం గమనార్హం

☆

# మరికొన్ని ఇంగ్లీషు మాటలు

అక్షరంలో ఒక అచ్చు తప్పకుండా ఉండాలి కేవలం అచ్చు కూడా అక్షరమవుతుంది అచ్చుకు ముందు ఒకటి, రెండు లేక మూడు హల్లులుండవచ్చు అచ్చు తరువాత కూడా ఒకటి రెండు లేక మూడు హల్లులుండవచ్చు ఇవన్నీ కలిపి ఒకే అక్షరం అవుతుంది ఉదాహరణకు అ ఒక అక్షరం క ఒక అక్షరం కార్ ఒక అక్షరం స్త్రీ ఒక అక్షరం స్ట్రై ఒక అక్షరం

ఇంగ్లీషు మాటల్లో పదాంతంలో సంయుక్తం ఉన్నా సాధారణంగా వచ్చి చేరే అచ్చు ఉ ఉదాహరణకు బోర్డ్ బోర్డు అవుతుంది రికార్డ్ రికార్డు అవార్డ్ అవార్డు కార్డ్ కార్డు, పాస్వర్డ్ పాస్వర్డు వార్డ్ వార్డు అవుతాయి పార్ట్ పార్టు కోర్ట్ కోర్టు షర్ట్ షర్టు ఛార్ట్ ఛార్టు అవుతాయి రెస్ట్ రెస్టు, ఛెస్ట్ ఛెస్టు అవుతాయి బెల్ట్ బెల్టు, సాల్ట్ సాల్టు అవుతాయి పల్స్ పల్సు, సెల్ఫ్ సెల్ఫు అవుతాయి ప్రాంప్ట్ ప్రాంప్టు అవుతుంది ఆబ్జెక్ట్ ఆబ్జెక్టు, సబ్జెక్ట్ సబ్జెక్టు అవుతాయి

రెండు కంటే ఎక్కువ అక్షరాలున్న మాటల్లో పదాంతంలో ఉన్న హల్లును బట్టి అది ద్విరుక్తం కావడమో కాకపోవడమో ఉంటుంది చివరి హల్లుకు ముందు ఉన్న అచ్చు దీర్ఘమయితే హల్లు అద్విరుక్తంగానే ఉంటుంది ఉదాహరణకు రిబేట్ రిబేటు అవుతుంది కాంక్రీట్ కాంక్రీటు అవుతుంది చలాన్ చలాను అవుతుంది ప్లాటూన్ ప్లాటూను అవుతుంది కార్టూన్ కార్టూను అవుతుంది ప్రిన్సిపాల్ ప్రిన్సిపాలు అవుతుంది ఇంజినీర్ ఇంజినీరు అవుతుంది

రెండుకాని రెండుకంటే ఎక్కువగాని అక్షరాలున్న మాటల్లో చివరి హల్లు ర కారమయితే దానికి ముందు హ్రస్వాచ్చు ఉన్నా ర కారం ద్విరుక్తం కాదు టీచర్ టీచరు అవుతుంది

మీటర్, మీటరు, సెంటర్ సెంటరు, డ్రైవర్ డ్రైవరు, లివర్ లివరు, డాక్టర్ డాక్టరు మేజర్ మేజరు, మైనర్ మైనరు, అటెండర్ అటెండరు అవుతాయి పదాంతంలో న కారం ఉన్నా ద్విరుక్తం కాదు విలన్ విలను అవుతుంది ఛైర్మన్ ఛైర్మను, స్పెయిన్ స్పెయిను, మిలియన్ మిలియను అవుతుంది

పదాంతంలో ప కారంగాని ట కారంగాని ఉన్నప్పుడు ద్విరుక్తం కావడం కనిపిస్తుంది మేకప్ మేకప్పు, లాకప్ లాకప్పు అవుతున్నాయి మేకపు, లాకపు అని అద్విరుక్తంగా కూడా ఉండవచ్చు క్రికెట్ క్రికెట్టు, రాకెట్ రాకెట్టు, లాకెట్ లాకెట్టు, సీక్రెట్ సీక్రెట్టు అవుతాయి

హలంత శబ్దాల మీద చేరే అచ్చు సాధారణంగా ఉ అయినప్పటికీ పదాంతంలో తాలవ్య హల్లు ఉన్నప్పుడు ఇ వచ్చి చేరుతుంది

పదం చివర య కారం ఉంటే ఇ చేరుతుంది బాయ్ బాయి, టాయ్ టాయి, రాయ్ రాయి అవుతాయి

చ కార జ కారాలతో ముగిసే మాటల చివర కూడా ఇ చేరుతుంది లంచ్ లంచి అవుతుంది బెంచ్ బెంచి అవుతుంది బీచ్ బీచి అవుతుంది లాంచ్ లాంచి అవుతుంది

గారేజ్ గారేజి, లగేజ్ లగేజి, బారేజ్ బారేజి, కాలేజ్ కాలెజి అవుతాయి రేంజ్ రేంజి అవుతుంది ఎక్స్ఛేంజ్ ఎక్స్ఛేంజి అవుతుంది మైలేజ్ మైలేజి అవుతుంది లాంజ్ లాంజి అవుతుంది

సంయుక్త హల్లుతో అంతమయ్యే మాటల్లో కూడా చివరి హల్లు చ కారం కాని జ కారం





కాని అయినట్లయితే చివర ఇ చేరుతుంది ఉదాహరణకు సెర్చ్ సెర్చి అవుతుంది చర్చ్ చర్చి అవుతుంది రిసెర్చ్, రిసెర్చి అవుతుంది

బ్రిడ్జ్ బ్రిడ్జి అవుతుంది వాడ్జ్ వాడ్జి, లాడ్జ్ లాడ్జి, స్లెడ్జ్ స్లెడ్జి, ప్లెడ్జ్ ప్లెడ్జి, జడ్జ్ జడ్జి ఛార్జ్ చార్జి డిస్చార్జ్ డిస్చార్జి అవుతాయి

పదాంతంలోని జ'కారం దంత్యమయితే దీనిమీద ఇ చేరదు, ఉ యే చేరుతుంది ఉదాహరణకు ప్రైజ్ ప్రైజు అవుతుంది రిలీజ్ రిలీజు, లీజ్ లీజు, క్రీజ్ క్రీజు, ఫ్లవర్‌వాజ్ ఫ్లవర్ వాజు అవుతాయి

పదం చివర ఇ' చేరిన మాటలలో కొన్నింటిని కొందరు దీర్ఘాంతాలుగా రాస్తారు జడ్జీ బారేజీ, గారేజీ, చర్చీ, బ్రిడ్జీ మొదలయిన విధంగా దీర్ఘాంతాలుగా రాయడం కనిపిస్తుంది

తెలుగులో తాటాకు లాంటి మాటల్లో ట' కారం మీద అ రాస్తున్నాం ఈ మాటను విడదీసినప్పుడు తాటి+ఆకు అవుతుంది ట' కారం మీద ఉన్న అచ్చు 'ఇ+అ' కలవడం వల్ల వచ్చింది మామూలు అ ఉచ్చారణకూ దీనికీ బేదం ఉంది దీనికి తాలవ్యోచ్చారణ ఉంటుంది ఇంగ్లీషు మాటల్లో bank, bat వంటి వాటిలో ఇటువంటి ఉచ్చారణే ఉంది ఈ మాటలను తెలుగులో రాసేటప్పుడు బ్యాంకు, బ్యాటు అనీ బాంకు, బాటు అనీ రెండు విధాలుగా రాస్తు న్నారు 'య' కారం తాలవ్యం ఆ మాటలో అచ్చు తాలవ్యం అని సూచించడానికి య'కారాన్ని రాస్తున్నారు ఈ సంప్రదాయం ప్రాచీన శాసనాలలో కూడా ఉంది మేకలు వంటి తెలుగు మాటల్నే మ్యాకలు అని రాయడం శాసనాలలో ఉంది కాబట్టి య ఒత్తు రాయడంలో దోషమేమీ లేదు కాని పదం ఉచ్చారణ మనకు తెలిసినప్పుడు ప్రత్యేకమయిన లిపి సంకేతం అవసరం ఉండదు అందువల్ల బాంకు అని రాస్తే సరిపోతుంది రాంకు, టాంకు అని రాయవచ్చు

ఇట్లా రాయడం వల్ల కొన్ని మాటల మధ్య భేదం తొలగిపోతుంది ఉదాహరణకు battle bottle అనే మాటల్ని తీసుకోవచ్చు ఈ రెండింటినీ బాటిల్ అనే రాయాలి ఒక మాటకు యుద్ధం అనీ, మరోమాటకు సీసా అనీ అర్థం ఒకే విధంగా రాసినా సందర్భాన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు

☆

# పదజాలం

ఒక భాషలో పదజాలం ఆ భాష మాట్లాడే సమాజం అవసరాల దృష్ట్యా ఉంటుంది ప్రపంచం లోని భాషలన్నింటిలోనూ పదాలు సమాన సంఖ్యలో ఉండవు కొన్ని భాషల్లో చాలా ఎక్కువ పదాలు ఉండవచ్చు కొన్ని భాషల్లో చాలా పరిమితమయిన సంఖ్యలో పదాలు ఉండవచ్చు అభివృద్ధి చెందిన సమాజాల భాషలలో పదాల సంఖ్య ఎక్కువగా ఉంటుంది ఒక సమాజ సంస్కృతిలో వచ్చే మార్పులు, వారికి పరిమితమయిన వస్తువులలో వచ్చిన మార్పులు ఆ సమాజ భాషలో ప్రతిఫలిస్తాయి పూర్వం వాడుకలో ఉండిన కొన్ని మాటలు నేడు వాడుకలో లేవు అట్లాగే పూర్వం వాడుకలో లేని మాటలెన్నో భాషలో కొత్తగా ఏర్పడ్డాయి అంటే భాషలో నిరంతరంగా కొన్ని పాత మాటలుపోయి కొత్త మాటలు వచ్చి చేరుతూ ఉంటాయి

కొత్త మాటలు ఎలా ఏర్పడతాయి? అరువు తెచ్చుకున్న పదాలను పక్కన పెడితే ఒకే భాషలోని పదాలు కూడా ఒకదానికొకటి సంబంధం లేనివిగా ఉండవు సాధారణంగా ఉన్న పదాల నుండే కొత్త పదాలు పుడుతుంటాయి ఉన్న పదాలనే వాక్యంలో భిన్న భాషా భాగాలుగా ఉపయోగించవచ్చు పదాన్ని కొంచెం మార్చడం ద్వారా కొత్త పదాన్ని నిర్మించవచ్చు రెండు మూడు పదాలను కలపడం వల్ల కూడా కొత్త పదం ఏర్పడవచ్చు అనేక పదాలను కలిపి పదాన్ని నిర్మించవచ్చు ఇట్లా ఏర్పడిన పదాలను విశ్లేషించడానికి వాటికి వ్యాకరణ పరిభాషలో వేరువేరు పేర్లు పెట్టుకున్నాం

వాక్యంలో కర్త, కర్మ, క్రియలుంటాయి కర్త కర్మలు నామవాచకాలు అంటే పేర్లు క్రియ పనిని తెలియజేసే మాట ఈ నామవాచకాలకూ క్రియలకూ విశేషణాలూ ఉంటాయి నామ వాచకాలు, విశేషణాలు, సర్వనామాలు, క్రియలు, క్రియావిశేషణాలు మొదలయిన విధంగా పదాలను భాషాభాగాలుగా విభాగం చేస్తూ ఉంటారు ఇట్లా విభాగం చేసినప్పుడు కొన్ని మాటలు నామవాచకాలూ కావచ్చు, విశేషణాలూ కావచ్చు, క్రియలూ కావచ్చు అటువంటి సందర్భంలో వాక్యంలో ఆ మాట నిర్వహించిన పాత్రను బట్టి అది నామవాచకమో, విశేషణమో, క్రియో నిర్ణ యించాలి 'అది పెద్ద ఊరు' అన్నప్పుడు 'పెద్ద' విశేషణం ఆయన ఊరికి 'పెద్ద' అన్నప్పుడు 'పెద్ద' నామవాచకం 'దీపం వెలిగింది' అన్నప్పుడు, 'వెలిగింది'లోని వెలుగు క్రియ 'దీపం వెలుగు ఇస్తుంది' అన్నప్పుడు 'వెలుగు' నామవాచకం ఉన్న మాటలనుండి కొత్త మాటలను కల్పించుకున్నట్లుగానే అవే మాటలను భిన్న భాషా భాగాలుగా కూడా ఉపయోగించుకో వచ్చునన్నమాట

పదంలోని మౌలిక భాగాన్ని ధాతువు అంటాం ఈ ధాతువుకు వివిధ ప్రత్యయాలు చేర్చి ఎన్నో మాటలను తయారు చేసుకోవచ్చు కర్త, కర్మ, క్రియ అన్న మూడు మాటలకూ ధాతువు ఒక్కటే భార్య, భర్త అన్న రెండు మాటలకూ ధాతువు ఒక్కటే రెండు, మూడు అన్నది ఇక్కడ ఉదా హరణ కోసమే ఒక్కొక్క ధాతువునుండి పదులు వందల సంఖ్యలో పదాలు ఉత్పన్నం అవుతాయి కొన్ని భాషల్లో ఈ ప్రక్రియ చాలా విస్తృతంగా ఉంటుంది కొన్ని భాషల్లో అంత విస్తృతంగా ఉండదు నిఘంటువులలో ఇటువంటి పదాలన్నీ ఇస్తారు అట్లాగే పైకి మాట ఒక్కలాగే ఉండి ధాతువు వేరుగా ఉన్నా ఆ మాటలను వేరుగా ఇస్తారు ఒకదానికొకటి సంబంధంలేని అర్థాలున్నా

వాటిని విడిగా ఇస్తారు అయితే వాటిలో ఏర్పడే సమాసాలన్నిటినీ పట్టికలో కూర్చడం కాని నిఘంటువులో ఇవ్వడం కాని సాధ్యం కాదు అందువల్ల వాటి కూర్పుకు సంబంధించిన సూత్రాలు వ్యాకరణాలలో ఉంటాయి మన కల్పనా సామర్థ్యాన్ని బట్టి, అవసరాన్ని బట్టి పదాలను ఎన్నో రకాలుగా కలిపి కొత్త పదాలను నిర్మించుకోవచ్చు

తెలుగులో కొన్ని మాటలను క్రియలుగాను, నామవాచకాలుగాను కూడా ఉపయోగించ వచ్చు ఉతుకు, ఉయిము, వెలుగు, చదువు పొంగు మొదలయినవి ఇటువంటివి అయితే వీటిలో క్రియా పదంగా వాడినప్పుడు నామవాచకంగా వాడినప్పుడు అర్థంలో కొంత భేదం కూడా ఏర్పడవచ్చు

క్రియాపదం మీద ప్రత్యయాన్ని చేర్చి నామవాచకంగా మార్చుకోవచ్చు అలుగు-అలక, ఆడు-ఆట, ఎన్ను-ఎన్నిక, ఓపు-ఓపిక మొదలయినవి ఇటువంటివి ఈ మాటల్లో చేరిన ప్రత్యయాలను వ్యాకరణ పరిభాషలో కృత్ప్రత్యయాలు అంటారు కృత్ప్రత్యయం చేరిన పదం కృదంతం ఈ కృదంతం నామవాచకం కాబట్టి ఈ విదంగా ఏర్పడిన నామవాచకాలను కృదంత నామాలంటారు

నామవాచకం మీద కూడా ప్రత్యయాలు చేరి కొత్త నామవాచకాలు ఏర్పడవచ్చు గొప్ప-గొప్పతనం, జూదం- జూదగాడు, చెలి-చెలికత్తె, కల్ల-కల్లరి మొదలయినవి ఇటువంటివి ఇక్కడ చేరిన ప్రత్యయాలను తద్ధిత ప్రత్యయాలంటారు ఏర్పడిన నామవాచకం తద్ధిత నామం

రెండుకాని, అంతకంటే ఎక్కువ నామవాచకాలు కాని కలిసి ఏర్పడిన పదాన్ని సమాసం అంటారు అన్నదమ్ములు, ముక్కంటి, తీపిమాట, ముల్లోకాలు మొదలయినవి సమాసాలు వీటిని సమస్తనామాలు అని కూడా అనవచ్చు రెండు కాని అంతకంటే ఎక్కువ క్రియాపదాలు కలిసి కొత్త పదమేర్పడితే దాన్ని క్రియాసమాసం అంటారు చేసికొను, తీసివేయు, పగులగొట్టు, చెల్లబెట్టు మొదలయినవి క్రియా సమాసాలు వీటికి విలక్షణమయిన అర్థం వచ్చినట్లయితే శబ్ద పల్లవాలు అంటారు.

నామవాచకం మీద క్రియాపదం చేరి కూడా సమాసం ఏర్పడుతుంది విజయం చేయు వంటివి

రెండుకాని అంతకంటే ఎక్కువకాని పదాలు కలవడం అని అంటున్నా, తెలుగులో రెండు పదాలో మూడు పదాలో కలవడం ఉందికాని సంస్కృతంలో లాగా బహుపదాలు కలిసి సమాసం ఏర్పడదు ఒకవేళ కష్టపడి మనం అటువంటి సమాసాన్ని తయారుచేసినా కృతకంగా ఉండి వినేవారికి ఎబ్బెట్టుగా ఉంటుంది

☆

# క్రియా? నామవాచకమా?-1

వివిధ భాషా భాగాలకు రూపం ఒక్కటే ఉన్నప్పుడు వ్యాకరణ కర్తలు (వ్యాకర్తలు) వాటిని వేరుగా సూచించడానికి ఏదో ఒక మార్గాన్ని అనుసరిస్తూ ఉంటారు నిఘంటువులలో అయితేవాటిని వేరువేరు ఆరోపాలుగా ఇచ్చి ఆరోపం పక్కన అది ఏ భాషా భాగమో సూచిస్తారు క్రియ అయితే క్రియ అనీ, నామవాచకం అయితే నామవాచకమనీ విశేషణమయితే విశేషణమనీ గుర్తిస్తారు

క్రియా ప్రాతిపదికా నామవాచకమూ ఒక్కలాగే ఉండేటట్లయితే వ్యాకర్తలు క్రియారూపాన్ని మూలరూపంగా తీసుకుంటారు దానికి ప్రత్యయం చేరి నామవాచకమయిందని చెప్తారు ఉదాహరణకు అలరు అనే మాటను తీసుకుందాం క్రియా ప్రాతిపదికగా అలరు అంటే ప్రకాశించు అని అర్థం విశేషణంగా కూడా ఇదే అర్థం నామవాచకంగా ఈ మాటకు పుష్పం అనీ కాంతి అనీ, ఆనందం అనీ అర్థాలు అలరు అనే క్రియా ప్రాతిపదికకు ఉ అనే ప్రత్యయం చేరి నామవాచకం అయిందని వ్యాకర్త చెప్తాడు అలరు+ఉ=అలరు తెలుగులో క్రియాప్రాతిపదికలన్నీ ఉకారాంతాలే కాబట్టి క్రియగానూ, నామవాచకంగానూ సమాన రూపం ఉన్న ఏ మాటనైనా ఇట్లాగే వివరించవచ్చు ఈ అన్ని సందర్భాలలోనూ ఉ అనే ప్రత్యయం వచ్చి చేరిందని చెప్పవచ్చు వ్యాకరణ ప్రక్రియలో, పద నిర్మాణ వర్ణనలో ఇది ఒక సులువు

'అలుకు అని ఒక మాట ఉంది ఇల్లు అలుకు, గోడ అలుకు అని క్రియగా వాడవచ్చు ఇదే అర్థంలో నామవాచకంగా రెండో అలుకు, మూడో అలుకు అని వాడవచ్చు అలుకు అంటే భయపడు అని కూడా అర్థం ఈ అర్థంలో నామవాచకంగా భయం అని అర్థం

అవుకు' అంటే క్రియగా ఒత్తిడికి లొంగు అని అర్థం నామవాచకంగా జంకు, బలహీనత అని అర్థం

ఇగురు అంటే క్రియగా ఆవిరైపోవు, నశించు, ఎండిపోవు అని అర్థం నామవాచకంగా నీరంతా ఇగిరిపోయేట్లు ఉడికించిన కూర అని అర్థం ఇరుకు' అంటే క్రియగా సన్నని ప్రదేశంలో దూరడం అని అర్థం నామవాచకంగా సన్నని ప్రదేశం అని అర్థం విశేషణంగా కూడా ఇదే అర్థం ఇరుకు సందు అంటే సన్నని వీధి, వెడల్పు లేని సందు

ఉడుకు' అంటే అసూయవల్ల కానీ, కోపంవల్లకానీ దుఃఖపడు అని అర్థం ఉడుకుమోతు తనం' దీనినుండే వచ్చింది ఉడకడం, కోపగించడం అనికూడా అర్థం వేడివల్ల తుకతుకమనడం అని అర్థం నామవాచకంగా ఈ మాటకు వేడి అనీ ఉడకడమనీ అర్థం ఉతుకు/ఉదుకు' అంటే బట్టలు ఉతకడమని అర్థం దీన్ని విస్తరించి తీవ్రంగా కొట్టడానికీ, విమర్శించడానికీ కూడా వాడుతున్నారు నామవాచకంగా ఈ చీర ఒక్క ఉతుకు కూడా పడలేదు వంటి వాక్యాలలో ప్రయోగం ఉంది

'ఉబుకు అంటే వాచు ఉబ్బు అని అర్థం నామవాచకంగా కూడా ఇదే అర్థం 'ఉరుకు' అంటే దూకడం అనీ, పరిగెత్తడం అనీ అర్థం ఒక్క ఉరుకు ఉరికాడు, ఉరుకులు పరుగులు మీద వచ్చాడు అన్న వాక్యాలలో ఇది నామవాచకం ఉరుము అంటే గర్జించు అని అర్థం నామవాచకంగా మేఘగర్జన అని అర్థం ఉలుకు' అంటే భయపడు, బెదురు అని అర్థం నామవాచకంగా ఈ మాటకు భయం, బెదురు, జంకు అని అర్థం 'ఎగురు'కు క్రియగానూ, నామవాచకంగానూ అర్థం ఒకటే

ఎమ్ము/హెమ్ము అంటే పెరుగు వృద్ధి చెందు అని అర్థం నామవాచకంగా అధికం అని అర్థం వాడుకలో ఎమ్ములు పోవడం అంటే సామర్థ్యాన్ని మించి గొప్పకు పోవడమని అర్థం ఎదుర్కు క్రియగానూ నామవాచకంగానూ ఒకే అర్థం ఎదురు అంటే వ్యతిరేకించు అని అర్థం నామవాచకంగా ఎదుట అనీ ప్రత్యర్థి అనీ, సాటి అనీ అర్థం

ఏకు అంటే దూదిని శుభ్రం చేయడం విమర్శించు అనే అర్థం కూడా ఏర్పడింది నామవాచకంగా ఏకు అంటే ఏకిన దూది చుట్ట 'ఏకుమేకయింది', 'ఏకయి వచ్చి మేకయి కూర్చున్నాడు మొదలయిన ప్రయోగాలు మన నుడికారంలో భాగాలు మెత్తగా ప్రమాదరహితంగా మొదలయి ఇప్పుడు వదుల్చుకోలేకుండా తయారవడమన్నమాట

ఒత్తు అన్న మాటకు అణచు, అదుము, నొక్కు అని అర్థం కావ్య భాషలో నిర్బంధించు, పీడించు, ఆక్రమించు, నిందించు, తోము, అద్దు, తుడుచు, సవరించు, ఊదు, వాయించు, పరిశోధించు మొదలయిన అనేక అర్థాలున్నాయి నామవాచకంగా అదుముడు, నొక్కుడు అన్న అర్థంతోపాటు బాధ, తుడుపు, దట్టం అనే అర్థాలు కూడా ఉన్నాయి ఖ, ఘ, ఛ మొదలయినవి ఒత్తక్షరాలు ఈ వర్ణాలలో మహాప్రాణ లక్షణాన్ని గుర్తించడానికి ఉపయోగించే గుర్తును 'ఒత్తు' అని అంటాం అట్లాగా ద్విత్వాక్షరాలలోనూ, సంయుక్తాక్షరాలలోను మొదటి హల్లుకాక ఇతర హల్లులను సూచించే గుర్తులు కూడా ఒత్తులే 'ౕ' క వత్తు 'ా' గ వత్తు

'ఒదుగు'కు క్రియగానూ, నామవాచకంగానూ అర్థం ఒకటే ఒనరు అంటే కలుగు అనీ, సొగసు అనీ అర్థం నామవాచకంగా దీనికి అనుకూలత, సదుపాయం అని అర్థం 'ఒప్పు' అంటే తగు, ఉచితమగు, ప్రకాశించు, ఉత్తమమగు అని అర్థం నామవాచకంగా ఈ మాటకు చక్కదనం, కాంతి, శోభ, రీతి, సమ్మతి అని అర్థాలు ఒప్పు అంటే సరైనది అని కూడా అర్థం ఇక్కడ దీనికి వ్యతిరేకార్థ పదం 'తప్పు'

'ఒసగు' అంటే ఇచ్చు అని అర్థం నామవాచకంగా కానుక అని అర్థం ఇప్పుడీ మాటను వాడడం లేదు

'కట్టు' అంటే బంధించు, ధరించు, ఆరోపించు, కూర్చు, నిర్మించు, అడ్డగించు, చెల్లించు, విధించు మొదలయిన అర్థాలున్నాయి నామవాచకంగా బంధనం, బంధన సాధనం మితి, నియమం, కూర్పు, వస్త్రధారణ, నిర్మాణం అని అర్థాలు కందిపప్పు వంటి వాటిని ఉడికించినప్పుడు వచ్చిన రసాన్ని కూడా కట్టు అంటారు

'కడుగు' అంటే శుభ్రం చేయు బియ్యం మొదలయిన వాటిని కడిగిన నీటిని కూడా కడుగు అంటారు ఇక్కడ అది నామవాచకం 'కదుము' అంటే ఆక్రమించు, అదుము, అణచు అని అర్థం నామవాచకంగా ఈ మాటకు బొప్పి అని అర్థం 'కనరు' అంటే కోపించు. ఇది నామవాచకమయి నప్పుడు కోపం అని అర్థం 'కనలు' అంటే మండు కోపించు నామవాచకంగా కనలు అంటే కోపం నామవాచకంగా ఈ మాట వాడుకలో లేదు

'కందు' అంటే రంగుమారు, ఎర్రబడు, వాడిపోవు అని అర్థం. క్షీణించు, కృశించు, నశించు అనే అర్థాలు కూడా ఉన్నాయి నామవాచకంగా దీనికి మచ్చ అనీ, నలుపు అనీ దుఃఖం అనీ, లోపం అనీ, సెగ అనీ అర్థాలున్నాయి బిడ్డ, కొదమ అనే అర్థాలు కలిగిన 'కందు' అన్న నామవాచకమూ ఇదీ ఒకటేనేమో పుట్టగానే కందినట్లుగా

# క్రియా? నామవాచకమా?-2

'కప్పు' అంటే ఆచ్ఛాదించు మరుగుపరుచు వ్యాపించు కప్పు నామవాచకం అయినప్పుడు ఆచ్ఛాదనం ఇంటిపైకప్పు అని అర్థం నలుపు చీకటి అనే అర్థంలో మరో కప్పు ఉంది కమురు అంటే కాలు దగ్ధమగు, నామవాచకంగా కాల్పు అని అర్థం నూనె చర్మం, జుట్టు కాలడం

కసరు అంటే తిట్టు దూషించు అని అర్థం నామవాచకమయినప్పుడు కోపం అసంతోషం తిట్టు అని అర్థాలు కాగు అంటే వేడెక్కడం నామవాచకంగా దీనికి నీళ్ళు పాలు మొదలయినవి కాచే లోహపాత్ర అని అర్థం కుట్టు అంటే ఆకులు బట్టలు మొదలయినవి కుట్టడం పురుగులు తేలు వంటివి కుట్టడం గుచ్చు పోగులు పెట్టుకొవడానికి చెవులు కుట్టు అని అర్థాలు నామవాచకంగా కుట్టు అంటే కుట్టడం, కుట్టినదారం నొప్పి, కుట్టడం వల్ల ఏర్పడ్డ రంధ్రం అని అర్థాలు

కుదుపు కు క్రియగానూ నామవాచకంగానూ అర్థం ఒకటే కుదురు అంటే స్థిరపడు, నెలకొను, సరిపడు బాగుపడు, దొరకు, మాను అని అర్థాలు నామవాచకంగా దీనికి స్థానం, పాదు, మొదలు వంశం ఆధారం నెలవు ధైర్యం, వరుస చుట్టకుదురు అని అర్థాలు 'కునుకు అంటే నిద్రవల్ల తూగు అని అర్థం దీపం వెలుగు క్రమంగా తగ్గి ఆరిపోవడం అని కూడా అర్థం నామవాచకంగా కునుకు అంటే నిద్ర

కుందు' అంటే దుఃఖించు, చింతించు, తగ్గు, కుంగు, నరకు ఒక కాలితో నడచు అని అర్థాలు. నామవాచకంగా దుఃఖం తక్కువ అని అర్థాలు కుర్రు' అంటే కూయు, అరచు అని అర్థం నామవాచకంగా కూత అని అర్థం కులుకు అంటే శరీరాన్ని శృంగారంగా కదిలించు, మరియు ప్రకాశించు, ప్రకటమగు అని అర్థాలు నామవాచకంగా కులుకు అంటే విలాసం అందం అని అర్థం కూర్కు/కూరుకు అంటే నిద్రపోవు అనీ, నిద్ర అనీ అర్థం కొంకు అంటే సందేహించు బెదరు, సంకోచించు, వెనుదీయు అని అర్థం నామవాచకంగా భయం, జంకు, సందేహం, వంకర అని అర్థాలు

కొట్టు' అంటే దెబ్బకొట్టు, మోగించు, చంపు, కూల్చు, వెళ్ళగొట్టు, పగులగొట్టు అని అర్థం ఎలుకలు కొట్టాయి మొదలయిన సందర్భాలలో కొరికివేయు అని అర్థం చెట్టు కొట్టారు అన్నప్పుడు నరుకు అని అర్థం నామవాచకంగా ఈ మాటకు దెబ్బ అని అర్థం

'కొదుకు' అంటే జంకు, వెనుదీయు, మాటలు దిగమింగు అని అర్థం నామవాచకంగా సంకోచం అని అర్థం కొరుకు'కు క్రియగానూ, నామవాచకంగానూ ఒకే అర్థం 'కొసరు' అంటే సంకోచించు, విజృంభించు అని అర్థాలు పక్షులకు సంబంధించి మాటిమాటికి కూయు అని అర్థం నామవాచకంగా ఈ మాటకు కోరిక అనీ, సంకోచం అనీ, సరుకులు అమ్మేవాడు కొనేవాడికి ఇచ్చే ఎక్కువ అనీ అర్థం. 'కోరు' అంటే చీరు, గీరు అని అర్థం నామవాచకంగా గీరిన కొబ్బరి భాగం, కప్పం అని అర్థం

క్రక్కు/కక్కు కడుపులోది వెళ్ళగక్కడం నామవాచకంగా క్రియగా కూడా ఇదే అర్థం 'క్రందు అంటే మోగు, ఏడ్చు అని అర్థం, నామవాచకంగా ఈ మాటకు ఏడ్పు అనీ, పెద్ద ధ్వని అనీ, సందడి అనీ, ఉపద్రవం అనీ, అతిశయం అనీ అర్థాలు 'క్రుంకు' అంటే మునుగు, అస్తమించు, చనిపోవు, గుచ్చుకొను అని అర్థాలు నామవాచకంగా అస్తమయం అనీ, స్నానం అనీ అర్థాలు 'క్రుమ్ము/కుమ్ము' అంటే పొడచు అని అర్థం నామవాచకమయితే పోటు అని అర్థం

క్రుళ్ళు/కుళ్ళు అంటే బాదపడు, దుఃఖించు పాడైపోవు అని అర్థం నామవాచకంగా ఈ మాటకు అహాయి అనీ దు ఖం అనీ అర్థం

క్రొవ్వు/కొవ్వు అంటే గర్వించు, బలియు అని అర్థం నామవాచకంగా మదం అనీ సారం అని, పుష్టి అనీ అర్థాలు శరీరంలోని ఒక ధాతువు క్రొవ్వు పొగరుబోతుల మాటలను కూడా క్రొవ్వులు అంటారు గిలుబు అంటే దొంగిలించు, దొంగతనం అని అర్థాలు గిల్లు అంటే క్రియ గానూ, నామవాచకంగానూ ఒకే అర్థం గీటు అంటే పళ్ళు నూరడం, కన్ను గిలపటం నామవాచకంగా దీనికి గీత అనీ, అనాదరం అనీ అర్థాలు

'గెంటు అంటే కదలు, చెడు తప్పిపోవు, సంకోచించు, నెట్టు తోయు అని అర్థాలు నామ వాచకంగా కదలిక అని అర్థం

గెంతు/గంతు అంటే దూకు అని అర్థం గ్రుద్దు/గుద్దు అంటే పిడికిలితో పొడుచు అనీ పిడికిలి దెబ్బ అనీ అర్థం చదువు అంటే పఠించు, అధ్యయనం చేయు పైకి అప్పచెప్పు అని అర్థం నామవాచకంగా అధ్యయనం, జ్ఞానం అని అర్థం చమురు' అంటే నూనె వంటివి రాయడ మనీ, నూనె అనీ అర్థం

చాదు అటే అరగదీయు (నామం) పెట్టుకొను నామవాచకంగా ఈ మాటకు బొట్టు పెట్టుకోవడానికి ఉపయోగించే ఒకరకమయిన ద్రవ్యం అని అర్థం చాపు అంటే చాచు నామ వాచకంగా దీనికి పొడవు అని అర్థం దీర్ఘాచ్చును కూడా చాపు అంటారు

క్రియగా 'చిక్కు అంటే కృశించు, సంకోచించు, మిగులు, చచ్చు, ఆగిపోవు, దొరుకు పట్టువడు, లొంగు తగులుకొను, ఇమిడి ఉండు అని అర్థాలు నామవాచకంగా మెలిక, బంధం, ముడి, పట్టు, ఆపద, బాధ, సంశయం అని అర్థాలు చిటుకు అనే మాటకు క్రియాపదంగానూ, నామవాచకంగానూ అర్థం ఒకటే చినుకు' కూడా ఇటువంటిదే చినుగు , చిరుగు' కూడా అంతే 'చిందు' అంటే ఒలుకు, వ్యాపించు, రాలు, వ్యక్తమగు అని అర్థాలు నామవాచకంగా బిందువు, కోపం అని అర్థాలు చిందు అనేది ఒక నాట్యవిశేషం ఒక విధమైన పాటకు కూడా చిందు' అనే పేరు

'చుట్టు అంటే తిరుగు, మూగు, ప్రదక్షిణించు అని అర్థాలు నామవాచకంగా చుట్టు అంటే వలయం, తడవ, వైపు, స్త్రీలు కాలికి పెట్టుకొనే ఆభరణం అని అర్థాలు

'చెక్కు అంటే దోపు అనీ, సవరించు అనీ, (రాళ్ళు) పొదుగు అనీ, ఖండించు అనీ, దోకు అనీ, (బొమ్మలు) చెక్కు అనీ అర్థాలు నామవాచకంగా ఈ మాటకు చెక్కిలి, చెక్క, చెట్టుపట్ట అని అర్థాలు పుండు మానేటప్పుడు ఏర్పడే గట్టి పొరను కూడా చెక్కు అనే అంటారు చెట్టు పట్ట సామ్యంవల్ల ఈ అర్థం వచ్చిందేమో

'చెనకు' అంటే తాకు, కొరుకు, మాటలతో రెచ్చగొట్టు అని అర్థం నామవాచకంగా దెబ్బ, కొరకడం, గిచ్చడం వల్ల ఏర్పడే గుర్తు అని అర్థం చెరలు' అంటే చాలా ఆనందంగా ఉండడం, నామవాచకంగా కూడా ఇదే అర్థం చేపు అంటే పాలు చేపడం క్రియగానూ, నామవాచకం గానూ అర్థం ఒకటే చొక్కు అంటే పరవశమగు, మోహంపొందు, లొంగు, చచ్చు అని అర్థాలు నామవాచకంగా పారవశ్యం, మోహం, మూర్ఛ, మత్తు అని అర్థాలు

'చోకు/సోకు అంటే తగులు, ఆవేశించు అని అర్థం నామవాచకంగా స్పర్శ దెబ్బ అని అర్థాలు 'జంకు' అంటే భయపడు, సంకోచించు, చలించు, క్రుంగు అని అర్థాలు నామవాచకంగా భయం, సంకోచం అని అర్థం ☆

# క్రియా? నామవాచకమా?-3

'డగ్గు' తరువాత దగ్గు అయింది అయితే డగ్గుత్తిక అన్న సమాసంలో మాత్రం పేరు మారకుండా అలాగే ఉంది గద్గదస్వరం అని అర్థం క్రియగానూ నామవాచకంగానూ కూడా ఒకే అర్థం ప్రాచీన కాలంలో డకారంతో మొదలయ్యే పదాలు చాలావరకు దకారాదులుగా మారాయి ఇటువంటిదే 'డెప్పు' ఇది దెప్పుగా మారింది ఈ మాటకు ఎత్తిపొడుచు అని అర్థం క్రియగానూ నామవాచకంగానూ కూడా అదే అర్థం 'డోకు' అన్నమాట కూడా గడ్డి పెక్కడం అన్న అర్థంలో దోకుగా మారింది కాని కక్కు అన్న అర్థంలో డోకుగానే ఉంది క్రియగానూ నామవాచకంగానూ కూడా ఈ అర్థంలో ఈ మాటకు వాడుక ఉంది

తక్కు అంటే విడుచు, మాను అని అర్థం నామవాచకంగా దీనికి మిగులు అని అర్థం విశేషణంగా ఇతరం అని అర్థం తగులు అంటే తాకు, స్పృశించు అని అర్థం దీనికి తవులు అన్న రూపాంతరం కూడా ఉంది దీనికి ఇష్టపడు, వలచు అని కూడా అర్థం ఉంది జ్వరం తగలడం తిట్లు తగలడం, తగులుకోవడం వంటి ప్రయోగాలలో విశేషార్థాలున్నాయి తోవలో ఒక మనిషి తగిలాడు అన్నప్పుడు ఎదురయ్యాడు కలిశాడు అని అర్థం నామవాచకంగా తగులుకు అభిలాష, వలపు, సంబంధం, చిక్కు, నష్టం అని అర్థాలు

తగ్గు అంటే తక్కువగు కుంగు వెనుదీయు, కృశించు అని అర్థాలు నామవాచకంగా తక్కువ అని అర్థం 'తట్టు' అంటే చేతితో మెల్లగా కొట్టు, స్ఫురించు అని అర్థాలు ప్రాచీన కావ్యాలలో వాయించు, తోమువంటి అర్థాలు కూడా ఉన్నాయి నామవాచకంగా దద్దురు పొంగు అని అర్థం తన్నుకు క్రియగానూ, నామవాచకంగానూ అర్థభేదం లేదు 'తప్పు' అంటే తొలగు, వ్యర్థమగు అసత్యమగు, చెడు, ఉల్లంఘించు విఫలమగు తప్పించుకొను కోల్పోవు అని అర్థాలు నామవాచకంగా నేరం పాపం, అబద్ధం, వైఫల్యం అని అర్థాలు దయ తప్పడం, రైలు తప్పిపోవడం, నెల తప్పడం వంటి విశేషార్థాలు ఉన్నాయి తప్పదు అంటే కాకమానదు అని అర్థం తప్పనిసరి అని అర్థం 'తరటు' అంటే కొరడాతో కొట్టు అనీ, కొరడా అనీ అర్థం 'తరుగు' అంటే క్రియగాను, నామవాచకంగాను అర్థం ఒకటే 'తలకు' అంటే భయపడు, జంకు, చలించు అని అర్థాలు నామవాచకంగా భయం, చలనం, సందేహం, దుఃఖం అని అర్థాలు తసుకు అంటే ప్రేమ కలిగినట్లు నటించు అని అర్థం నామవాచకంగా అసత్యం, టక్కు మోసం అని అర్థం 'తాకు' అంటే రాచుకొను, తగులు, కొట్టు, మార్కొను అని అర్థాలు నామవాచకంగా దెబ్బ, పీడ అని అర్థాలు 'తిట్టు'కు క్రియగానూ, నామవాచకంగానూ నిందించు అని అర్థం కావ్యాలలో శాపం అని కూడా అర్థం ఉంది 'తిమురు' అంటే తొందరపడు, ఉద్రేకించు, గర్వించు అని అర్థాలు 'తుమ్ము'కు క్రియగానూ, నామవాచకంగానూ అర్థం ఒకటే. తురుము అంటే కొప్పులో పూవులు మొదలయినవి చెరువుకోవడం జుట్టు ముడివేయడం, సవరించడం, అదిమి దోపడం అని అర్థాలు నామవాచకంగా కొప్పు జుట్టు ముడి అని అర్థం కొబ్బరి తురుము కూడా

'తూగు' అంటే బరువు తూగటమనీ, సమానమగు అనీ, సిద్ధమగు అనీ, చలించు, ఊగు అనీ కూరుకుపడు అనీ అర్థాలు శక్తి కలిగినంత అని కూడా అర్థం నామవాచకంగా కునికిపాటు అని అర్థం 'కవిత్వంలో ఒక తూగు ఉండాలి' వంటి ప్రయోగాలలో సమత్వం అని అర్థం

తొణుకు అంటే క్రియగా చిందు అని అర్థం నామవాచకంగా భయం అనీ, తొట్రుపాటు అనీ అర్థం తొరగు అంటే విడుచు, కారు అని అర్థం నామవాచకంగా కూడా అర్థంలో మార్పు లేదు తొలకు అంటే పొర్లు, చిందు, కదులు వ్యాపించు అని అర్థాలు నామవాచకంగా చలనం అనీ అల అనీ అర్థాలు

'త్రుళ్ళు/తుళ్ళు అంటే సంతోషంతో గంతులు వేయు ఎగిరిపడు, సంతోషించు, గర్వించు అని అర్థాలు నామవాచకంగా ఎగసిపాటు అని అర్థం త్రొక్కు/తొక్కు అడుగుపెట్టు, కాలితో అదుము, దంచు అని అర్థం నామవాచకంగా కూడా ఇదే అర్థం తొక్కు అంటే పచ్చడి అనికూడా అర్థం ఉంది దంచినది కాబట్టి తొక్కు 'దాటు' అంటే క్రియగానూ, నామవాచకంగానూ దాటడమనే అర్థం

దిద్దు అంటే సరిచేయు, బొట్టు వంటివి పెట్టుకొను అని అర్థం అక్షరాలు దిద్దు అన్నప్పుడు రాసిన అక్షరంమీద మళ్ళీ రాయడం నామవాచకంగా సరిచేయడమని అర్థం దుముకు/దూకు అంటే గంతువేయు అని అర్థం నామవాచకంగా గంతు అని అర్థం దూరు అంటే నిందించు నింద అని అర్థం నట్టు అంటే అడ్డు, ఆలస్యం

నడుకు అంటే చలించు, ఒదుగు, జంకు, ఇక్కట్లు పడు, నశించు అని అర్థం నామవాచకంగా కంపం, భయం అని అర్థం 'నరకు' అంటే ఖండించు నామవాచకంగా దీనికి కత్తిదెబ్బ అని అర్థం నవ్వు'కు క్రియగానూ, నామవాచకంగానూ అర్థం ఒకటే 'నసుగు' అంటే అస్పష్టంగా మాట్లాడు అని అర్థం నామవాచకంగా అస్పష్టమైన మాట 'నాటు అంటే గుచ్చు, పాతు, తగులు అని అర్థం నామవాచకంగా దెబ్బ, రంధ్రం, కుదురు, వరి మొదలయినవి నాటటం అని అర్థం 'నిండు' అంటే పూర్ణమగు, ముగియు అని అర్థం నామవాచకంగా పూర్ణత్వం నింపు కు పూరించు, వ్యాపింపజేయు అని అర్థం నామవాచకంగా ఈ మాటకు పూర్ణం, అధికం అనే అర్థంతోపాటు మనోహరం అనే అర్థం కూడా ఉంది

నిక్కు అంటే పైకి లేచు, వర్ధిల్లు, ఉబుకు, సాగు, వ్యాపించు, పుట్టు, సంతోషించు, గర్వించు అని అర్థాలు నామవాచకంగా ఔన్నత్యం, బింకం, అందం అని అర్థాలు 'నుగ్గు' అంటే క్రియాపదంగా నలుగు అని అర్థం అయితే క్రియగా దీనికి ప్రయోగం తక్కువ నామవాచకంగా పొడి అని అర్థం 'నుచ్చు' అంటే మేకల పొదుగులకు చుట్టూ గుడ్డ కట్టడం ఆ కట్టిన గుడ్డకు కూడా 'నుచ్చు' అనే పేరు 'నుడుగు అంటే వచించు, మాట్లాడు అని అర్థం నామవాచకంగా మాట, పలుకు అని అర్థం

'నురుము' అంటే పొడిచేయు, చంపు అని అర్థం నామ వాచకంగా పొడి అని అర్థం 'నెట్టు' అంటే గెంటు, తోయు, నిరాకరించు అని అర్థం నామవాచకంగా గెంటు, తోపు, తావు అని అర్థం 'నొక్కు' అంటే అదుము, నలుపు అని అర్థం అదమడం వల్ల కలిగిన ముడతకు, గుంతకు 'నొక్కు' అని పేరు నొగులు' అంటే బాధచెందు, వాడిపోవు, నలుగు, వికలమగు అని అర్థం నామవాచకంగా దీనికి నొప్పి, బాధ అని అర్థం 'నొడుగు/ నొడువు' అన్నమాట నుడుగు/ నుడువుకు రూపాంతరం వచించు, చెప్పు, రచించు, చదువు, స్తుతించు అని అర్థం నామవాచకంగా మాట, పలుకు అని అర్థం 'నోము' అంటే నోచు, వ్రతాదులను ఆచరించు, పూజించు అని అర్థం నామవాచకంగా వ్రతం అనీ, వ్రతఫలం అనీ అర్థాలు ☆

# క్రియా? నామవాచకమా? -4

తెలుగులో నామవాచకాలుగానూ క్రియలుగానూ వాడుకలో ఉన్న మాటలెన్నో ఉన్నాయి పగులు అంటే బద్దలగు చీలు అని అర్థం నామవాచకంగా ఓటు, చీలిక అని అర్థం పట్టు అనే మాటకు క్రియగానూ నామవాచకంగానూ ఎన్నో అర్థాలున్నాయి స్వీకరించు ఆక్రమించు ఆశ్రయించు ఊదు ధారణచేయు, ఆలోచించు, నిలుపు, (ప్రతిజ్ఞ) పూను సోకు అనుసరించు బలాత్కరించు మింగు (గొడుగు వంటివి) వేయు చాచు (సాను) పెట్టు (రెక్కు వంటివి) పాత్రలలో నింపు (పాలు) తాగించు తాకు (వేడి) సహించు (నోము) చేయు నమ్ము (ఊపిరి) బిగబట్టు, (కాలం) జరుగు, పీడించు అంటు ఇముడు (మసి) పారు వ్యాపించు మొదలయిన అర్థాలు ఈ పట్టు అనే క్రియా పదానికి ఉన్నాయి వివిధార్థాలలో దీన్ని ప్రయోగించవచ్చు ఇతర క్రియా ధాతువులతో కలిసివచ్చినప్పుడు కూడా ఈ మాట కొత్త అర్థాలను కలిగిస్తుంది నామవాచకంగా కూడా దీనికి ఎన్నో అర్థాలున్నాయి పట్టుదల, గ్రహణం, పూత నివాస స్థానం, చోటు, సంగతి, ధైర్యం, విషయం, సందర్భం సమయం, పరిమితి, ప్రాప్తి, రీతి, ఊత, కారణం కథా ఘట్టం మొదలయినవి సిల్కు అన్న అర్థంలో ఉన్న పట్టు వేరే మాట

పండు అంటే పక్వం కావడం, సిద్ధించు, ఫలించు, సంతానం కలుగు ముగియు అని అర్థాలు నామవాచకంగా పండినది, ఫలం అని అర్థం 'పండు' అనే మరో పదానికి శయనించు అని అర్థం ఇది కేవలం క్రియ పదరు/వదరు అతిగా మాట్లాడు, ప్రేలు గొప్పలు చెప్పుకొను అని అర్థం నామవాచకంగా మాట కలత, త్వరగా మాట్లాడినమాట, ధ్వని అని అర్థాలు పరుపు' అంటే ప్రసరించు, ప్రయోగించు, ప్రవహింపజేయు అని అర్థం నామవాచకంగా పడడం అనీ, పైకప్పు అనీ, వైశాల్యం అనీ శయ్య అనీ, రీతి అనీ అర్థాలు ఈ మాటకు పొడవు అనీ వెడల్పు అనీ కూడా అర్థం ఉంది పరువు/పర్వు అనే మాటకు పరిగెత్తు ప్రసరించు ప్రవహించు, వ్యాపించు, బయల్పడు, పుట్టు, ప్రసిద్ధమగు అని అర్థాలు నామవాచకంగా పరుగు అని అర్థం

పలుకు అంటే వచించు, నిందించు, ఉచ్చరించు, రచించు, స్తుతించు, జవాబు చెప్పు, కూయు, మోగు అని అర్థం నామవాచకంగా మాట, ఆజ్ఞ, నింద, సత్యవచనం, కూత అని అర్థాలు పలుకు అంటే ముక్క అనీ అర్థం

పాతు అంటే పూడ్చు అనీ, చెట్లు, కొండలు మొదలైనవాటి భూమిలోని మూలం అనీ అర్థం 'పిక్కు అంటే వెనుదీయు, దొంగిలించు మోసంచేయు అని అర్థాలు నామవాచకంగా మోసం, కిటుకు అని అర్థం పుడుకు/పుణుకు అంటే మునివేళ్ళతో పట్టుకొను పిసుకు, నిమురు, ఓదుము, కొంచెముగా తీసుకొను, ఇచ్చు అని అర్థాలు నామవాచకంగా దానం, కానుక అని అర్థం

'పెట్టు అనే మాటకు చాలా అర్థాలున్నాయి సందర్భాన్ని బట్టి ఈ అర్థాలు తెలుసుకోవచ్చు ఇచ్చు, వడ్డించు, చెల్లించు, ఆరోపించు, అమర్చు, అలదు, (నగలు) ధరించు – ధరింపజేయు ప్రసవించు, నెలకొల్పు, నియమించు, నాటు, నిర్ణయించు, నిర్మించు, కల్పించు, మూయు, కొట్టు, ఉచ్చరించు మొదలయినవి 'ఇవ్వాళ బడి పెట్టారు' అంటే తెరిచారని అర్థం స్కూటర్ చెట్టుకు పెట్టాడు అంటే ఢీ కొట్టడమని అర్థం మాట చెవిని పెట్టడమంటే వినడమని అర్థం నామవాచ

కంగా పెట్టు అంటే దెబ్బ అని అర్థం దానం అని కూడా అర్థం పెట్టుపోతలు అంటారు కదా వాడొక్కడే పది మంది పెట్టు అన్నప్పుడు పదిమందికి సమానమని అర్థం

పెంపు అంటే పోషించు పోగొట్టు అని అర్థం నామవాచకంగా ఈ మాటకు ఎక్కువ గొప్పతనం, గౌరవం, ప్రాశస్త్యం, ఉత్సాహం ఎత్తు, మనోజ్ఞత విదం అని అర్థాలు పొక్కు అంటే దుఃఖించు, బాదపడు, బొబ్బలెక్కు, బయటపడు అని అర్థాలు నామవాచకంగా ఈ మాటకు బాధ, బొబ్బ, జనశ్రుతి చెక్కు అని అర్థాలు పొంగు అంటే ఉబ్బు, పెరుగు ప్రసరించు సంతోషించు, విజృంబించు అని అర్థాలు నామవాచకంగా ఉబ్బుదు, విజృంభణం గర్వం సంతోషం అని అర్థాలు తడపర మశూచి వంటి వ్యాదికి కూడా పొంగు అని పెరు

'పొడుగు అంటే పెరగడమని అర్థం క్రియగా ఈ మాటకు అర్థం ఉన్నప్పటికీ ప్రస్తుతం వాడుకలో ఉన్నట్లు లేదు నామవాచకంగా ఉన్నతి, దైర్ఘ్యం అని అర్థం పొదుగు/పొదుపు అంటే ఆవరించు, (గ్రుడ్లు) పొదుగు, (రత్నాలు మొ॥వి) పొదుగు అని అర్థం నామవాచకంగా పసిపిల్లలకు పక్కలో వేసిన గుడ్డకు పొదుగు అని పేరు

పొసరు అంటే కలుగు, పొసగు అని అర్థం నామవాచకంగా పొందిక ఇంపు అని అర్థాలు పొంచు కు క్రియగానూ, నామవాచకంగానూ దాగి ఉండడమనే అర్థం పొందు అంటే అనుభవించు, కూడు, ఆశ్రయించు, కలుగు అని అర్థాలు నామవాచకంగా ఈ మాటకు పొందిక, పొత్తు, కలయిక నెలవు, సహాయం, వలపు, పద్దతి అని అర్థాలు పోరు అంటే యుద్ధం చేయు, ఎదిరించు కలహించు, ఏడ్చు అని అర్థాలు నామవాచకంగా యుద్ధం, కలహం, పిల్లల ఏడుపు అల్లరి అని అర్థం

బ్రతుకు/బ్రదుకు/బతుకు' అంటే జీవించు నామవాచకంగా జీవనం అనీ జీవనోపాయం అనీ అర్థాలు బెగడు అంటే బెదురు, జంకు, కలతచెందు, దుఃఖించు వణకు అని అర్థాలు నామవాచకంగా భయం అని అర్థం బెణకు/బెడకు' అంటే చలించు అనీ కదలిక అనీ అర్థం 'బెదరు అంటే భయపడు అనీ, జంకు, భయం అనీ అర్థం బెళుకు అంటే ప్రకాశించు, చలించు, బెణుకు, భయపడినట్లు నటించు, కలవరమందు, తప్పించుకొను అని అర్థాలు నామవాచకంగా ఈ మాటకు కాంతి అనీ, మాటల్లో చమత్కారం అనీ, తీక్షత అనీ అర్థం తళుకుబెళుకులు అని వాడుక

'బొంకు అంటే అబద్ధమాడు అనీ, అబద్ధం, తప్పు అనీ అర్థాలు 'బొల్లు అన్నా ఇదే అర్థం

'మక్కు' అంటే కాంతి విహీనమగు, కృశించు, రూపుచెడు, మగ్గు, మరణించు అని అర్థాలు నామవాచకంగా మురికి అని అర్థం 'మచ్చు అంటే ఆకర్షించు అని అర్థం నామవాచకంగా వలపుమందు అనీ, ఎర అనీ అర్థం అటక, గీటురాయి ఒకరకమయిన కత్తి, మురికి అనే అర్థాలతో నామవాచకరూపంలో 'మచ్చు' ఉంది మసరు అంటే పొగరెక్కు మదించు పొగరు మదం అని అర్థం మాటు అంటే మరుగుపరుచు అణగదొక్కు అంటించు, కన్నాలు లేకుండా బాగుచేయు, పాడుచేయు, కలిగించు అని అర్థాలు నామవాచకంగా మాటు అంటే మరుగు, చాటు, గొడుగు, అతుకు, రక్షణస్థానం అని అర్థం

మాడు' అంటే నల్లగా కాలిపోవడం, ఆకలితో కడుపు మాడడం నామవాచకంగా మాడు అంటే మాడిన అన్నం ☆

# క్రియా? నామవాచకమా?-5

'మిగులు'కు మివులు అన్న రూపం కూడా ఉంది మిగులు అంటే ఎక్కువగు అతిశయించు మీరు దాటు విజృంభించు ఉత్కృష్టమగు వేరగు శేషించు, నిగుడు అని అర్థాలున్నాయి నామ వాచకంగా ఈ మాటకు శేషం, లాభం అని అర్థాలు మినుకు అంటే ప్రకాశించు గొణుగుకొను అని అర్థాలు నామవాచకమయినప్పుడు ఈ మాటకు కాంతి కిరణం పలుకు వేదవాక్కు తాలిబొట్టు అని అర్థాలు మినుకు అంటే ఒకపిడమైన బంగారు నాణెం అని కూడా అర్థం ఉంది కావ్యాలలో దీనికి ప్రయోగాలున్నాయి ఇప్పుడు బంగారు నాణాలె వాడుకలో లేవు కాబట్టి ఈ అర్థంలో ఈ మాటకు వాడుకలేదు

మించు అనేమాటకు క్రియాపదంగా చాలా అర్థాలున్నాయి ప్రకాశించు అన్నది ఒక అర్థం శోభిల్లు, అతిశయించు, అధికమగు, వృద్ధిపొందు, చెలరేగు వ్యాపించు మునిగియు అని కూడా అర్థాలు దాటు జయించు, తీర్చుకొను అనే అర్థాలు కూడా ఉన్నాయి నామవాచకంగా ఈ మాటకు కాంతి, మెరుపు, కిరణం, ఆధిక్యం అని అర్థాలు

ముట్టు అంటే తాకు, పట్టుకొను, తీసికొను, పొందు మీటు ఉపయోగించు, ప్రతిఘటించు, వ్యాపించు కరచు, ఆవరించు, కడముట్టు, మొదలంటు కలుగు, నాటు అని అర్థాలున్నాయి నామవాచకంగా సాధనం, పదార్థం, ఎగుమతి, రాకుడు, పద్ధతి అని అర్థాలు బహిష్టు అని కూడా అర్థం

'మునుగు అంటే స్నానం చేయు, మగ్నమగు, క్రుంగు క్రుంకు, ఆవృతమగు లగ్నమగు నశించు, తీరు, గుచ్చుకొను, పూర్ణమగు అని అర్థాలు నామవాచకంగా స్నానం అనీ మునగడం అనీ అర్థం మురుగు అంటే కుళ్ళు, మలినమగు, నలుగు అని అర్థాలు నామవాచకంగా మురికి అని అర్థం

'మూలుగు' అనే మాటకు క్రియగానూ, నామవాచకంగానూ అర్థంలో మార్పులేదు 'మెచ్చు' అంటే పొగడు, గౌరవించు, లక్ష్యపెట్టు, గణించు సంతోషించు అని అర్థాలు నామవాచకంగా ఈ మాటకు పొగడ్త అనీ, పొగిడేవాడు అనీ, బహుమానం, సంతోషం అనురాగం, అద్భుతం అనీ అర్థాలు

మెట్టు' అంటే తొక్కు, అణగదొక్కు అడుగుమోపు, తిరుగు, ప్రవేశించు, పాదుకలు తొడుగుకొను, నటించు వచ్చు అని అర్థాలు నామవాచకంగా మెట్టు అంటే తొక్కుడు, కొండ లిప్ప, సోపానం, ఆశ్రయం, తల, మొత్తం, కాలు, చెప్పు పాదుక అని అర్థాలు సుంకం తీసుకొనే చోటు, బండి అటూ ఇటూ కదలకుండా బండి కింద కట్టే కర్ర, వీణమెట్టు అనే అర్థాలు కూడా ఉన్నాయి 'మెత్తు' అంటే దట్టంగా పూయు అని అర్థం నామవాచకంగా దట్టంగా పూసిన పూత 'మొక్కు' అంటే నమస్కరించు, నమస్కారం, మొక్కుబడి అని అర్థాలు మొట్టు కు క్రియగానూ నామవాచకంగానూ అర్థభేదమేమీ లేదు తలమీద పిడికిలితో పొడవడమని అర్థం

'మొత్తు' అంటే కొట్టు, అణచు, నరకు, పగులగొట్టు, మోగించు, గుచ్చుకొను అని అర్థాలు నామవాచకంగా దెబ్బ అని అర్థం మొరగు' అంటే మోసగించు, కప్పిపుచ్చు అని అర్థం నామ వాచకంగా మోసం, మోసపు మాట అని అర్థం మొయిగు అంటే (కుక్క) అరుచు, ప్రేలు అని

అర్థాలు  నామవాచకంగా కూడా (కుక్క) అరుపు, ప్రలాపం అని అర్థాలు

మొక్కు/మ్రొక్కు  అంటే నమస్కరించు అని అర్థం  నామవాచకంగా నమస్కారం అ: దేవుడికి ఇస్తానని నిర్ణయించుకున్న వస్తువు అనీ అర్థం  రక్కు' అన్న మాటకు క్రియగానూ నా: వాచకంగానూ అర్థం ఒకటే  గీరు, బరుకు అని అర్థం

రువ్వు  అంటే విసరు అని అర్థం  ఇది ధ్వన్యనుకరణ శబ్దం కూడా  లాగు' అం: ఆకర్షించు, హరించు అని అర్థం  నామవాచకంగా సొమ్ము, విధం మర్యాద, ఒప్పు అని అర్థాలు లాగు అనే భక్ష్య విశేషం కూడా ఉందట  వట్టు' అంటే ఇంకు  ఎండు, కృశించు, పాలులేనిదగ అని అర్థాలు  నామవాచకంగా వరుగు అని అర్థం

వడకు/వణకు  అంటే కంపించు అని అర్థం  నామవాచకంగా కంపం అనీ, మంచు అ: అర్థాలు  వనరు  అంటే దుఃఖించు  దీనాలాపాలాడు, ఒప్పు, ఉండు అని అర్థాలు  నామవా: కంగా దుఃఖం, వీలు అని అర్థం

విత్తు  అంటే విత్తనములు చల్లు అనీ, విత్తనం అనీ అర్థం  'విసరు  అంటే ఆడించు  తిప్పు రువ్వు, తిను, గాలి ప్రసరింపచేయు, పొడిచేయు, వీచు అని అర్థాలు  నామవాచకంగా వీచడం అనీ  ఆడించడం అనీ, దెబ్బ అనీ, రువ్వడం అనీ అర్థాలు

వెలుగు  అంటే ప్రకాశించు, మండు, ఒప్పు, ప్రసిద్ధికెక్కు, ప్రతిఫలించు, చెలరేగు అని అర్థాలు  నామవాచకంగా కాంతి  కిరణం, ఎండ అని అర్థాలు

'సడలు  అంటే జారు, వదులగు, తగ్గు, చెడు, రాలు, నశించు, కదలు  విడుచు అని అర్థాలు  నామవాచకంగా వదులు అని అర్థం

'సలుపు  అంటే బాధ కలిగించు అని అర్థం  నామవాచకంగా మంట  పోటు, బాధ అని అర్థం

'హెచ్చు' అంటే అతిశయించు, మించు, ఉద్రేకించు, విజృంభించు అని అర్థాలు  నామ వాచకంగా గొప్పతనం, ఆధిక్యం అని అర్థం

చాలా మాటలలో అరసున్నలూ, బండిరాలు ఉంటాయి  వాటినిక్కడ తీసుకోలేదు  అర సున్నలు వదిలివేయడమూ, బండిరా బదులు మామూలురానే వాడడమూ జరిగింది  పదాది సంయుక్తాలలో రకారాన్ని వదిలి వేయడం జరిగింది

ఒకేమాట ఎటువంటి మార్పూ లేకుండా క్రియగానూ, నామవాచకంగానూ వాడుకలో ఉండడం గమనార్హం  ఇటువంటి మాటలు తెలుగులో గణనీయంగానే ఉన్నాయి  ఇటువంటి మాటలలో సాధారణంగా నామవాచకంగా కంటే క్రియాపదంగా ఈ మాటలకు ఎక్కువ అర్థ ఛాయలుండడం కూడా మనం గమనించవచ్చు  చాలా మాటలను ప్రాచీన కవులు వాడిన అర్థా లలో మనం నేడు వాడడంలేదు  అప్పటినుండి ఇప్పటిదాకా ప్రసిద్ధమయిన అర్థం కొనసాగినప్ప టికీ కొన్ని విశేషార్థాలు ఆనాటివి నేడు వాడుకలో లేవు  అదేవిధంగా కొన్ని మాటలకు పూర్వంలేని అర్థాలు నేడు వాడుకలోకి వచ్చాయి

☆

# భావార్థక నామాలు

క్రియా పదాలను నామవాచకాలుగా మార్చుకోవడానికి వివిధ ప్రత్యయాలను చేరుస్తాం ఈ ప్రత్యయాలు వివిధ అర్థాలను కూడా కలిగిస్తాయి ఈ ప్రత్యయాలను కృత్ప్రత్యయాలని ఈ ప్రత్యయాలు చేరి ఏర్పడ్డ నామవాచకాలను కృదంత నామవాచకాలనీ అంటారు

ఏ క్రియాపదాన్నైనా నామవాచకంగా మార్చవచ్చు గ్రాంధిక భాషలో ట అనే ప్రత్యయం చేరి క్రియాప్రాతిపదికలు నామవాచకాలుగా మారేవి ఉదా తిను+ట= తినుట చేయుట వచ్చుట, పోవుట, వినుట, ఎక్కుట, దిగుట, తాగుట మొదలయినవన్నీ ఇటువంటి నామవాచకాలు

ఆధునిక భాషలో ఈ సందర్భంలో చేరే ప్రత్యయం అటం/అడం తిను+అటం= తినటం, చదువు+అటం= చదవటం. పోవు+అటం= పోవటం, చేయు+అటం= చేయటం ఏ క్రియా ప్రాతిపదికనయినా ఈ ప్రత్యయం చేర్చి నామవాచకంగా మార్చుకోవచ్చు చూపటం/చూపడం, రాయటం/రాయడం, కొట్టటం/కొట్టడం, రాలటం/రాలడం. తూలటం/తూలడం, మారటం/మారడం, చీలటం/చీలడం మొదలయినవి కొన్ని క్రియాప్రాతిపదికల మీద ఈ ప్రత్యయం చేరినప్పుడు క్రియా ప్రాతిపదికలో సంధివల్ల కొన్ని మార్పులు వస్తాయి పిలుచు+అటం= పిలవటం కొలుచు+అటం= కొలవటం, నేర్చు+అటం= నేర్వటం తెచ్చు+ అటం+ తేవటం, వచ్చు+అటం= రావటం, కలియు+అటం= కలవటం

అటం/అడం' ప్రత్యయాన్ని అకర్మక క్రియలమీదా, సకర్మక క్రియలమీదా కూడా చేర్చవచ్చు నేర్చు+అటం=నేర్వటం, నేర్చు+అటం= నేర్పటం, మారు+ అటం= మారటం మార్చు+అటం= మార్పటం, తీరు+అటం= తీరటం, తీర్చు+అటం= తీర్పటం

తెలుగులో ఇంచు చేర్చి క్రియా ప్రాతిపదికలను సకర్మకాలుగా, ప్రేరణార్థకాలుగా మార్చుకోవచ్చు సంస్కృత పదాలను కూడా 'ఇంచు చేర్చి క్రియలుగా ఉపయోగించుకోవచ్చు కొట్టు అనేది సకర్మక క్రియ దీనిమీద ఇంచు చేరిస్తే కొట్టించు అని ప్రేరణ క్రియ ఏర్పడుతుంది నడుచు అన్నది అకర్మక క్రియ దీనిమీద ఇంచు చేరిస్తే నడిపించు అని సకర్మక క్రియ ఏర్పడుతుంది భుజించు, రచించు, జయించు, లయించు. సృజించు, నిర్మించు, ప్రశ్నించు, చర్చించు, వర్ణించు, దర్శించు, ప్రకాశించు, ప్రవేశించు, ఆలోకించు, ద్రవించు, చరించు, గమనించు, ప్రార్థించు, ఆలోచించు, యోచించు, కీర్తించు, స్తుతించు, జీవించు, మరణించు, భావించు, ప్రేరేపించు, దుఃఖించు, శోకించు మొదలయినవన్నీ ఇంచు చేరి క్రియా పదాలుగా ఏర్పడిన సంస్కృతపదాలు ఈ 'ఇంచు' చేరిన అన్ని క్రియలమీదా అటం/అడం చేరుతుంది కొట్టించటం, నడిపించటం, భుజించటం, రచించటం, జయించటం, సృజించటం నిర్మించటం మొదలయినవి

ఒక క్రియా ప్రాతిపదిక మీద మరో అనుబంధ క్రియను చేర్చి కొత్త అర్థాలను సాధించవచ్చు ఉదాహరణకు తీయు' అనే అనుబంధాన్ని చేర్చామనుకోండి వెళ్ళు+తీయు= వెళ్ళదీయు అవుతుంది అట్లాగే చీలదీయు కూడా వేయు అనే అనుబంధాన్ని చేరిస్తే కొట్టివేయు, పారవేయు, తినివేయు, మింగివేయు, నెట్టివేయు, తోసివేయు మొదలయిన క్రియలు ఏర్పడతాయి 'పోవు' చేరిస్తే తినిపోవు, వెళ్ళిపోవు, రాలిపోవు, జరిగిపోవు వంటి క్రియలు ఏర్పడతాయి 'కొట్టు' చేరిస్తే

వెళ్ళగొట్టు చిలగొట్టు, చిందగొట్టు, చెడగొట్టు, చెల్లగొట్టు, చావగొట్టు మొదలయిన క్రియలేర్పడ తాయి 'పెట్టు' చేరిస్తే కొనిపెట్టు, తీసిపెట్టు, వెళ్ళబెట్టు, చెల్లబెట్టు, మగ్గబెట్టు వంటివి ఏర్పడ తాయి ఇచ్చు చేరిస్తే రానిచ్చు, తిననిచ్చు, చేయనిచ్చు వంటివి ఏర్పడతాయి కొను చేర్చి చేసికొను, వేడుకొను, మార్చుకొను, వండుకొను వంటివి ఏర్పడతాయి ఇవన్నీ కూడా అటం/ అడం చేరి నామవాచకాలుగా ఏర్పడతాయి తినివేయటం, మింగివేయటం, వెళ్ళిపోవటం, రాలి పోవటం, చీలగొట్టటం, చెడగొట్టటం, కొనిపెట్టటం, చెల్లబెట్టటం, చేయనివ్వటం, రానివ్వటం వేడుకోవటం, మార్చుకోవటం వగయిరా

రెండుకంటే ఎక్కువ క్రియాధాతువులు కూడా కలవవచ్చు ఉదా తీసికొనిపోవు వెళ్ళ గొట్టివేయు వీటిని కూడా అటం/అడం చేర్చి నామవాచకాలుగా మార్చవచ్చు తీసికొనిపోవడం, వెళ్ళగొట్టివేయడం మొదలయినవి

అటం/అడం' అనే ప్రత్యయాన్ని బావార్థక ప్రత్యయం అంటాం భావార్థమంటే క్రియకు ఉండే అర్థమే

ఈ అటం/అడం'కు ముందు అకపోవు' చేరిస్తే వ్యతిరేక భావార్థకం ఏర్పడుతుంది అంటే పైన చెప్పిన భావార్థకాలన్నిటికీ వ్యతిరేకార్థక రూపాలన్నమాట ప్రతి భావార్థకానికీ వ్యతిరేకార్థక రూపం ఉంటుంది పైన చూపిన అన్ని రకాల భావార్థకాలకూ వ్యతిరేకార్థక రూపాలకు ఉదాహర ణలు చూడండి

తినటం-తినకపోవటం, కొలవటం-కొలవకపోవటం, రావటం-రాకపోవటం, నడిపిం చటం- నడిపించకపోవటం, నిర్మించటం- నిర్మించకపోవటం, వెళ్ళదీయటం-వెళ్ళదీయక పోవటం, మింగివేయటం- మింగివేయకపోవటం, వెళ్ళగొట్టటం - వెళ్ళగొట్టకపోవటం, కొని పెట్టటం- కొనిపెట్టకపోవటం, తిననివ్వటం- తిననివ్వకపోవటం, వండుకొనటం- వండు కొనకపోవటం మొదలయినవి

'కలుగు' అన్నది సామర్థ్యాన్ని బోధించే అనుబంధ క్రియ చేయగలుగు+అటం= చేయగల గటం అవుతుంది వ్యతిరేకార్థంలో చేయగలగకపోవటం, చేయలేకపోవటం 'రావటం'కు రాక పోవటం అన్న వ్యతిరేకార్థకముంది కదా దీన్ని క్రియా ప్రాతిపదికమీద చేర్చి అసామర్థ్యాన్ని బోధించవచ్చు ఉదా తినరాకపోవటం ఈ రూపాలన్నీ చూసినప్పుడు ఈ ప్రక్రియ ఎంత విస్తారమయిందో అర్థమవుతుంది

☆

# డు - ప్రత్యయం

అటం/ఆడం లాంటిదే మరో ప్రత్యయం కూడా ఉంది ఇది డు ప్రత్యయం క్రియా ప్రాతిపదికమీద డు చేరిస్తే అది నామవాచకమయిపోతుంది ఉదాహరణకు పేలు/ప్రేలు అనే క్రియా ప్రాతిపదికను తీసుకుందాం దీనిమీద డు చేరిస్తే పేలుడు/ప్రేలుడు అని అవుతుంది ఈ ప్రేలుడుకు రెండర్థాలు ఉన్నాయి ఒకటి వదరడం, వాగడం, దుర్భాషలాడడం ధ్వనించడం రెండవది బ్రద్దలు కావడం/బద్దలుకావడం వేడికి పగిలిపోవడం, శరీరంమీద పొక్కులు లేవడం ఈ విధంగా డు ప్రత్యయం చేరి ఏర్పడ్డ నామవాచకాలు అన్ని ప్రాంతాలలోనూ వాడుకలో ఉన్నాయి అయితే ఆధునిక వ్యవహారంలో స్థిరపడిన కొన్ని రూపాలు అందరూ వాడుతున్నారు కాని, కొన్ని ప్రాంతాలలో ఏ క్రియా పదాన్నయినా ఈ ప్రత్యయం చేర్చి నామవాచకంగా మార్చుకోవచ్చు

అద్దుడు, అలుగుడు అడుగుడు మొదలయిన విధంగా వాడవచ్చు అల్లుడు అన్నరూపం అల్లు అనే క్రియా ప్రాతిపదికతో ఏర్పడుతుంది దీనికి అల్లిక అని అర్థం కూతురు భర్త అన్న అర్థంలో మరొక అల్లుడు ఉంది దీనికి అల్లువాడు అనే రూపం కూడా ఉంది వంశాన్ని అల్లే వాడు, కాబట్టి అల్లువాడు, అల్లుడు ప్రాతిపదిక ఒకటే ఆడుడు అంటే ఆడడం అనుడు అంటే అనుకోవడం కోసం పెట్టుకొనే దిండు లేకపోతే దేనికి అనుకుంటే అది ఆనుకోవడం అనికూడా అర్థం ఉతుకు ఉతుకుడు అవుతుంది బట్టలు ఉతకడమన్న అర్థంతోపాటు తీవ్రంగా కొట్టడం, విమర్శించడం అనే అర్థాలు కూడా ఉన్నాయి ఇచ్చుతో ఇచ్చుడు ఏర్పడుతుంది ఊగుతో ఊగుడు ఏర్పడుతుంది అక్కిరాజు ఉమాకాంతంగారు నేటి కాలపు కవిత్వంలో ఊగుడు మాటలని వాడారు ఆయన ఈ మాటను ఆవేశం, పూనకం వచ్చినట్లు కేకలు వేయడానికి సంకేతంగా వాడారు కట్టు కట్టుడు అవుతుంది కదలు కదలుడు అవుతుంది కట్టుడు పళ్ళు అన్నచోట కట్టుడు విశేషణంగా ప్రయుక్తమయింది కొట్టు – కొట్టుడు అవుతుంది వాడు ఒకటే కొట్టుడు కొడుతున్నాడు. కొరుకు– కొరుకుడు అవుతుంది వాడికీ విషయం కొరుకుడు పడటంలేదు అంటాం గిచ్చుకు డు' చేరితే గిచ్చుడు అవుతుంది గిల్లు గిల్లుడు అవుతుంది గుద్దు గుద్దుడు అవుతుంది ఈ మాటను కూడా అక్కిరాజు ఉమాకాంతం వాడారు ఆయన రాయిగుద్దుడు వాదం అంటారు పిడివాదం అని అర్థం గోకు– గోకుడు అవుతుంది గోకుడు పెట్టింది అంటారు

చంపు– చంపుడు అవుతుంది పూర్వం చంపుడు గుడులు అని ఉండేవి బలులు ఇచ్చే గుళ్ళు అని అర్థం చంపుడు కట్ట అంటే వధ్యస్థానం చింపు– చింపుడు అవుతుంది చీకు– చీకుడు అవుతుంది చూచు– చూసుడు అవుతుంది చూపు– చూపుడు అవుతుంది చూపుడు వేలు, చూపుడు గుర్రం చెప్పు– చెప్పుడు అవుతుంది చెప్పుడు మాటలు అన్నప్పుడు పితుర్లు, కొండేలు అని అర్థం

తిట్టు– తిట్టుడు అవుతుంది తిరుగు– తిరుగుడు అవుతుంది అందులో ఏదో తిరుగుడు ఉంది అన్నప్పుడు మెలిక అని అర్థం తిరుగుడు వచ్చింది అన్నప్పుడు సమస్య వచ్చింది అని అర్థం తెచ్చు– తెచ్చుడు అవుతుంది తాకు– తాకుడు అవుతుంది తప్పు– తప్పుడు అవుతుంది. తప్పుడు మనిషి అంటే దుర్మార్గుడు, ధర్మ విరుద్ధంగా నడిచేవాడు, మాట తప్పేవాడు అని అర్థం

దిగు – దిగుడు అవుతుంది  దిగుడుబావి అని మెట్లు ఉండి బావిలోకి దిగే ఏర్పాటు ఉన్న బావికి పేరు

నరుకు – నరుకుడు అవుతుంది  నలుగు – నలుగుడు అవుతుంది  పీల్చు – పీల్చుడు, పూను – పూనుడు అవుతాయి  పేర్చు – పేర్చుడు, పొర్లు – పొర్లుడు అవుతాయి  పొడుచు – పొడుచుడు అవుతుంది  పోవు – పోవుడు అవుతుంది  ఇటువంటి మాటలు సాధారణంగా జంటలుగా వస్తూ ఉంటాయి  ఉదాహరణకు ఈ వచ్చుడూ పోవుడూ ఎందుకు! అక్కడే ఉంటే సరిపోదా! అన్న వాక్యాన్ని తీసుకోవచ్చు  వచ్చు వచ్చుడు అయ్యే సందర్భం ఇది  సాధారణంగా అటం/అడం చేరినట్లయితే 'వచ్చు'కు బదులు 'రా' వస్తుంది  రావటం/రావడం అవుతుంది  డు చేరినప్పుడు మాత్రం వచ్చులో మార్పు ఉండదు  మాగు – మాగుడు అవుతుంది  మాగడం అని అర్థం  మూగు – మూగుడు అవుతుంది  మునుగు – మునుగుడు అవుతుంది  మింగు – మింగుడు అవుతుంది  మింగుడుకు వాచ్యార్థంలో గొంతులోకి పోవడమనే అర్థం  నీళ్ళు మింగుడు పడడంలేదు  లక్ష్యార్థంలో విషయం అవగాహన కాకపోవడం, సహించలేకపోవడం, అనుకున్న విధంగా కాక మరోవిధంగా జరగడం భరించలేకపోవడం  ముట్టు – ముట్టుడు అవుతుంది  ఇదికూడా అంటుడుతో జంటగా వాడుకలో ఉంది  అంటుడు ముట్టుడు అని  రుద్దు – రుద్దుడు అవుతుంది  బండ రుద్దుడు రుద్దుతున్నాడు అంటాం  రుబ్బు – రుబ్బుడు అవుతుంది  మాను – మానుడు అవుతుంది  పుండు మానుడు పట్టింది అంటాం. లాగు – లాగుడు అవుతుంది  లాగుడు బండి  లొంగు – లొంగుడు అవుతుంది  వాడి జీవితంలో లొంగుడన్నదే లేదు  వాగు – వాగుడు అవుతుంది  వాడు వట్టి వాగుడుకాయ అంటాం  నీ వాగుడు కట్టిపెట్టు అంటాం  విరుగు – విరుగుడు అవుతుంది  ఈ విషానికి విరుగుడు లేదు అంటాం  దేన్నయినా ఉపసంహరించేది, తిరస్కరించేది  ఈ పనిచేస్తే వాడు చేసిందానికి విరుగుడుగా ఉంటుంది అని వాడుక

'డు' ప్రత్యయం చేరినప్పుడు కూడా క్రియా ప్రాతిపదిక రూపంలో మార్పు రావచ్చు  ఎక్కు ఎగు అవుతుంది. 'డు' చేరిస్తే ఎగుడు అవుతుంది దిగుడుతో కలిపి మెరక పల్లాలు/మిట్ట పల్లాలుగా ఉన్న భూమిని ఎగుడుదిగుడుగా ఉంది అంటాం  సమంగా లేని దేనినయినా ఎగుడు దిగుడుగా ఉందని అనవచ్చు  పద్యంలో నడక ఎగుడుదిగుడుగా ఉందని కూడా ప్రయోగం  వేగు వేపు అవుతుంది  వేపుడు – వేపుడు కూర  తోయు కూడా తోపు అవుతుంది. తోపు – తోపుడు, తోపుడుబండి  దించు, దంచు, పెంచులు, దింపు, దంపు, పెంపులవుతాయి  దింపు – దింపుడు, దింపుడు కళ్ళం ఆశ అంటాం  దంపు – దంపుడు, దంపుడు బియ్యం  పెంపు – పెంపుడు, పెంపుడు కొడుకు  నూర్చు – నూర్పుడు అవుతుంది

'డు' ప్రత్యయం చేరిన కొన్ని మాటలు కేవలం విశేషణాలుగానేకూడా వాడుకలో ఉన్నాయి  ఉంపుడుకత్తె, ఉప్పుడు బియ్యం, పెట్టుడు బట్టలు మొదలయినవి  తెలుగులో నామవాచకమే విశేషణంగా కూడా వాడుకలో ఉంటుంది  ఇవన్నీ నామవాచకాలే  అటం/అడం చేరి ఏర్పడిన రూపాలలాగానే 'డు' చేరే రూపాలు కూడా విస్తృతంగా ఉన్నాయి  వండి పెట్టు – వండి పెట్టుడు అవుతుంది  వండుకొను – వండుకొనుడు అవుతుంది  వ్యతిరేకార్థంలో కూడా రూపాలున్నాయి ప్రాతిపదికమీద 'అకపోవు' చేరుతుంది  తినుడు – తినకపోవుడు, వచ్చుడు – రాకపోవుడు మొదలైనవి

☆

# పు - ప్రత్యయం

చాలా విస్తారంగా వాడుకలో ఉన్న కృత్ప్రత్యయాలలో పు ఒకటి ఈ ప్రత్యయాన్ని ఉపయోగించి ఎన్నో క్రియాపదాలను నామవాచకాలుగా ఉపయోగించుకోవచ్చు

క్రియా ప్రాతిపదిక చివర చు ఉన్నట్లయితే దానిస్థానంలో పు వచ్చి చేరుతుంది. ఉదాహరణకు అరచు+పు= అరపు అవుతుంది ఒలుచు ఒలుపు అవుతుంది ఒలుపు అంటే ఒలవడం కొలుచు కొలుపు అవుతుంది కొలుచు అంటే కొలత వేయడం అని అర్థం ఈ అర్థంలో కొలుపు అంటే ధాన్యమని అర్థం కొలుచు అంటే ఉపాసించు ధ్యానించు సేవించు, నమస్కరించు అనికూడా అర్థాలున్నాయి ఈ అర్థంలో కొలుపు అంటే పూజ అమ్మవారికి కొలుపులు చేయించారంటారు గెలుచు గెలుపు అవుతుంది చరచు- చరపు అవుతుంది చరచు అంటే ఉన్న అర్థాలలో అరచేతితో కొట్టు, సాగగొట్టు అన్నవి ముఖ్యమైనవి ఈ అర్థాలతోనే చరపు అంటే అరచేతితో కొట్టిన దెబ్బ అనీ రేకు అనీ అర్థాలు ఏర్పడ్డాయి

తలచు- తలపు అయింది తలచు అంటే వివేచించు, విచారించు, సంకల్పించు, స్మరించు, ధ్యానించు, గణించు, ప్రస్తావించు అని అర్థాలు తలపుకు తలచడం భావం, ఆలోచన, సంకల్పం, వలపు, స్మృతి, మనస్సు, ధ్యానం, అనుకోవడం అని అర్థాలు

తుడుచు- తుడుపు అయింది తుడుచు అంటే ఊడ్చు, రాచు, ఒత్తు, కడుగు, నిమురు, పోగొట్టు, చంపు అని అర్థాలు తుడుపు అంటే శుభ్రం చేయడం రాసిన రాతను చెరపడం కూడా తుడుపే డస్టర్‌ని తుడుపు గుడ్డ అంటాం

నిలుచు- నిలుపు అవుతుంది ఆపడం అనీ, స్థాపించడం అనీ అర్థం నొడుచు- నొడుపు అవుతుంది తప్పులు పట్టడమని అర్థం పడుచు- పడుపు అవుతుంది పడుచు అన్నమాటకు కన్య అనే అర్థంతోపాటు వ్యభిచరించు అనే అర్థం కూడా ఉంది ఈ అర్థంలోనే ఇది 'పడుపు' అనే నామవాచకమయింది వ్యభిచారం అని అర్థం

పిలుచు- పిలుపు అయింది పిలుపు అంటే పిలవడం, ఆహ్వానం పొడుచు- పొడుపు అయింది పొడుపు అంటే సూర్యుడు, చంద్రుడు ఉదయించడం పొద్దు పొడుపు అంటే సూర్యోదయం, నెలపొడుపు అంటే చంద్రోదయం పొడుపుగొండ, పొడుపుమల, పొడుపుగట్టు, పొడుపు గుబ్బలి ఇవన్నీ తూర్పుకొండకు పేర్లు పొడుపు అంటే కుమ్మడం అనికూడా అర్థం కుట్టడమనీ, కాటు అనీ కూడా అర్థాలున్నాయి పొడుపుకథ అంటే చిక్కుప్రశ్న పొడుపు వేలు అంటే చూపుడు వేలు

పొలుచు- పొలుపు అవుతుంది పొలుపు అంటే ఒప్పు, ఉల్లాసం, జాడ, పెంపు, రూపు, విషయం, రీతి, మర్యాద, పరిమళం, ప్రతాపం అని అర్థాలు మరచు- మరపు అవుతుంది వగచు వగపు అవుతుంది వగపు అంటే దుఃఖం అనీ, కీడు అనీ, విధం అనీ అర్థాలు. వలచు- వలపు అవుతుంది వలపు అంటే మోహం, కోరిక అని అర్థం విడుచు- విడుపు అవుతుంది విడుపు అంటే విడిచినది అనీ, త్యాగం, దానం అనీ అర్థాలు. పట్టు విడుపులు అని జంటగా వాడతాం వెరచు- వెరపు అవుతుంది వెరపు అంటే భయం అని అర్థం

పేర్చు- పేర్పు అవుతుంది పేర్పు అంటే ఒకదానిమీద ఒకటి నిలిపిన వరుస, సమృద్ధి అని

కూడా అర్థం ఉంది దాక అని కూడా అర్థం ఒకవిధమైన కుండ అన్నమాట మోడ్పు- మోడ్పు అవుతుంది కైమోడ్పు అని సమాసంగా ఎక్కువ వాడుకలో ఉంది చేతులు జోడించడమని అర్థం వేల్చు, వేల్పు అవుతుంది వేల్చు అంటే హోమం చేయు అనీ, కాల్చు అనీ అర్థం వేల్పు అంటె దేవత అని అర్థం

ఊడ్చు- ఊడ్పు, ఏడ్చు- ఏడ్పు, ఓర్చు- ఓర్పు, తీర్చు- తీర్పు, త్రేన్చు- త్రేన్పు, నూర్చు- నూర్పు, నేర్చు- నేర్పు, పీల్చు- పీల్పు అవుతాయి కను కాన్చు అయి తర్వాత కాన్పు అవుతుంది జన్మనివ్వడమని అర్థం

వాచు- వాపు, చూచు- చూపు, త్రేచు- త్రేపు, త్రోచు- త్రోపు అవుతాయి సైచు- సైపు అవుతుంది సహనం, ఓర్పు అని అర్థం ఏచు- ఏపు అవుతుంది ఏపు అంటే ఆధిక్యం, అభివృద్ధి, విజృంభణ, గర్వం, విలాసం, విధం అని అర్థాలు తాచు-తాపు అవుతుంది తన్ను అని అర్థం కాచు-కాపు అవుతుంది కాపు అంటే రక్షణ అని అర్థం కాయలు కాయడం అని అర్థం ఈ చెట్టు రెండు కాపులు కాస్తుంది' అంటే సంవత్సరంలో రెండుసార్లు కాయలు కాస్తుంది అని అర్థం కాచు అంటే ఎదురుచూచు అనే అర్థంకూడా ఉంది 'వాడికోసం కాపువేశాడు' అన్న వాక్యంలో కాపుకు అర్థం ఇదే పట్టుకోవాలనే సంకల్పంతో వేచి ఉండడమన్నమాట దోచు- దోపు అవుతుంది దోపిడి అని అర్థం నిలువుదోపు అంటే దేవుడికి శరీరంమీద ఉన్న అన్ని నగలూ ఇవ్వడం

క్రియా ప్రాతిపదిక చివర 'యు' ఉంటే దానికి బదులుగా 'పు' వస్తుంది బలియు- బలుపు, బులియు- బులుపు అవుతాయి ఇక్కడ ప్రాతిపదికలోని ఇ-ఉ అయింది మెరయు- మెరపు, నరయు- నరపు, నెరయు- నెరపు అవుతాయి కదియు- కదుపు అవుతుంది కదుపు అంటే గుంపు

మాయు- మాపు, మోయు- మోపు అవుతాయి పదాంతంలో ద్విరుక్త చకారం ఉంటే అది ద్విరుక్త పకారం అవుతుంది 'చ్చు' ఉంటే 'ప్పు' అవుతుందన్నమాట మెచ్చు- మెప్పు, చొచ్చు- చొప్పు

ప్రాతిపదిక చివర 'గు' ఉంటే దానికి బదులు 'పు' వస్తుంది మెలగు- మెలపు, ఎరుగు- ఎరుపు, తొడుగు- తొడుపు, ఊగు- ఊపు, ఆగు- ఆపు అవుతాయి అడ్డూ ఆపూ లేకుండా పోయింది అంటాం

కొన్ని మాటలకు 'పు' వచ్చి చేరుతుంది చెడు- చెడుపు, మారు- మార్పు, పూడు- పూడ్పు, తనరు- తనర్పు అవుతాయి తీరు- తీర్పు అవుతుంది

వంచు- వంపు అవుతుంది త్రుంచు- త్రుంపు, ఇంచు- ఇంపు అవుతాయి ఇంపు అంటే అందం పనుచు- పంపు అవుతుంది

క్రియా ప్రాతిపదికల మీద, నామవాచకాల మీద ఇంచుచేరి క్రియ లేర్పడడం తెలిసిందే ఈ 'ఇంచు'లో 'చు'కు బదులుగా 'పు' రావడం వల్ల మళ్ళీ నామవాచకాలేర్పడతాయి చాటు- చాటించు- చాటింపు ఆరగించు- ఆరగింపు, కారించు- కారింపు, తుస్కారించు- తుస్కారింపు, కంటగించు- కంటగింపు, రావించు- రావింపు, బెదిరించు- బెదిరింపు, అదిలించు- అదిలింపు ఈ విధంగా ఎన్ని నామవాచకాలనైనా కల్పించుకోవచ్చు

☆

# త - ప్రత్యయం

బహుశః ప్రచారం ఉన్న కృత్ప్రత్యయాలలో 'త' ప్రత్యయం ఒకటి క్రియా ప్రాతిపదిక చివర 'యు' ఉన్నప్పుడు ఆ 'యు'కు లోపం వచ్చి దాని స్థానంలో 'త' ప్రత్యయం వచ్చి చేరుతుంది

కాయు - కాత అవుతుంది కాయు అంటే కాయలు కాయడం కాత అనేది కాపు అన్న అర్థంలోనే కోయు - కోత అవుతుంది కోయు అంటే ఖండించు, ఛేదించు, నరకు తుంచు అని అర్థాలు ఇంగ్లీషులో కట్ అనే మాటకు సమానార్థకంగా దీన్ని వాడుతున్నాం పార్లమెంటులో బడ్జెట్ ప్రవేశపెట్టిన తర్వాత దానికి ప్రతిపక్షాలు కట్‌మోషన్స్ ప్రవేశపెట్టవచ్చు ఈ తీర్మానాలను కోత తీర్మానాలు అంటున్నారు బడాయి మాటలు మాట్లాడితే కోతలు కోస్తున్నాడంటాం గొప్పలు చెప్పుకోవడం అన్నమాట లేతలేత సొరకాయలు కోస్తున్నాడని కూడా అంటాం చేయు - చేత అవుతుంది వాడి చేతలేమీ బాగోలేవు అన్నప్పుడు వాడుచేసే పనులు అని అర్థం చేత ఒక విభక్తి ప్రత్యయం కూడా అయితే ఈ చేత చేయి నుండి ఏర్పడింది చేత చేయుట అన్న అర్థంలో వాడుకలో ఉంది పొడిచేత అంటే పొడిచేయడం దాడిచేయు - దాడిచేత అవుతుంది

కూయు - కూత అవుతుంది కోడి కూత, పిల్లికూత వంటివి. పిట్టకొంచెం కూతఘనం అని సామెత కూత అంటే అరవు, కేక, మొర, ప్రలాపం కారు కూతలు కూస్తున్నాడు అంటాం కూత కరణమే కాని రాత కరణం కాదని వాడుక కూతలేగాని చేతల్లేవనీ అంటాం కూత నేల అంటే కూత వేటుదూరం, ఒక క్రోశం. కూతపట్టు అన్నా అర్థం అదే గీయు - గీత అవుతుంది గీత అంటే రేఖ వాడి గీత అట్లా ఉంది ఏంచేస్తాం' అంటాం అదృష్టం, నొసటిరాత, విధి అన్న అర్థంలో ఇక్కడ వాడడం జరిగింది భగవద్గీతలోని గీత సంస్కృతం గీయునుండి ఏర్పడింది కాదు తీయు - తీత అవుతుంది తీత అంటే తీయడమనే అర్థం 'రెండు తీతలు తీశాడు' అన్నప్పుడు దెబ్బలు కొట్టాడని అర్థం తీత అంటే తగ్గడం అనికూడా అర్థం వరదతీత అంటే వరద తగ్గడం అకుతీత అన్నప్పుడు ఆకు తెంచి వేయడం అని అర్థం కాళ్ళతీత అన్నప్పుడు నొప్పి అని అర్థం తీయు'ను ఇతర క్రియాప్రాతిపదికల మీద అనుబంధంగా చేర్చవచ్చు ఉదాహరణకు వెలికితీయు ఇటువంటి క్రియా సమాసాన్ని కూడా నామవాచకంగా మార్చుకోవచ్చు వెలికి తీయు - వెలికితీత అవుతుంది చీలదీయు - చీలదీత అవుతుంది చేరదీయు - చేరదీత అవుతుంది వంగదీయు - వంగదీత అవుతుంది లొంగదీయు - లొంగదీత అవుతుంది నిలదీయు - నిలదీత అవుతుంది కుంగదీయు - కుంగదీత అవుతుంది ఈ విధంగా మరికొన్ని మాటలను కూడా నిర్మించుకోవచ్చు క్రియల మీదే కాకుండా నామవాచక పదాలమీద కూడా 'తీయు' చేరవచ్చు దారితీయులో దారి నామవాచకం దారితీయు - దారితీత అవుతుంది అరగదీయు - అరగతీత అవుతుంది పోయు - పోత అవుతుంది పోత అంటే పోయడం విడవడం అనికూడా అర్థం ఉంది పోత పోయడం లోహాన్ని కరిగించి పాత్రలు, విగ్రహాలు చేయడం పెట్టుపోతలు అంటే అన్నపానాదికాలిచ్చి పోషించడం పోతపాలు అంటే తల్లిపాలు కాక పోసే ఇతర రకాల పాలు పోతనీరు అంటే కుండలతో తెచ్చి పెట్టుకున్న నీళ్ళు భారీవర్షాన్ని కుండపోత వర్షం అంటాం. వడపోయు - వడపోత అవుతుంది రాలిపోవు - రాలిపోత, తలపోయు - తలపోత అవుతుంది ఇట్లాగే మరికొన్ని పదాలను కూడా ఏర్పరచుకోవచ్చు

మూయు – మూత అవుతుంది మేయు – మేత అవుతుంది మోయు – మోత అవుతుంది ప్రోగు/మోగు – ప్రోత/మోత అవుతుంది వీటిలో మొదటి మోతకు బరువు మోయడమని అర్థం రెండవ దానికి మోగడం, ధ్వనించడం అని అర్థం పూయు – పూత అవుతుంది పూచు అన్న అర్థంలో పూత ఒకటి ఉంది దీనికి పూవులు పూయడమని అర్థం పూయు – పూతకు లేపనం అని అర్థం పూసికొనే గంధం వంటి పరిమళ ద్రవ్యాలను కూడా పూత అనవచ్చు బంగారుపూత పూసిన నగలు ప్రసిద్ధమే కదా నోరు పూత పూచిందని కూడా అంటారు

రోయు – రోత అవుతుంది రోయు అంటే అసహ్యించుకొను, రోత అంటే అసహ్యం రోత కలిగించే పదార్థాన్ని కూడా రోత అంటారు రోత అంటే నింద అనికూడా అర్థం వ్రాయు/రాయు – వ్రాత/రాత అవుతుంది. నేయు – నేత అవుతుంది నాయకుడు అన్న అర్థం ఉన్న నేత తెలుగుకాదు, సంస్కృతం

నవయు – నవత అవుతుంది నవయు అంటే కృశించు, క్షీణించు, శ్రమపడు అని అర్థాలు నవత అంటే కష్టం, శ్రమ క్షయ రోగం అనికూడా అర్థం మెలయు – మెలత అవుతుంది మెలత అంటే స్త్రీ అని అర్థం వేయు – వేత అవుతుంది 'వేయు'కు అనుబంధ క్రియగా చాలా ఎక్కువ వాడుక అణచివేయు, అంపివేయు, అమ్మివేయు, తీసివేయు, ఆపివేయు, ఏరివేయు, రాల్చి వేయు, పీల్చివేయు, కూల్చివేయు, తొలిచివేయు, కొట్టివేయు, దిద్దివేయు మొదలైనవి ఇవన్నీ అణచివేత, అంపివేత, అమ్మివేత, ఆపివేత, కూల్చివేత, తొలిచివేత మొదలైన విధంగా నామ వాచకాలవుతాయి క్రియాప్రాతిపదిక చివర 'గు' ఉన్నట్లయితే దాని స్థానంలో కూడా 'త' వస్తుంది అలగు – అలత అవుతుంది అలసట అనీ, బాధ అనీ అర్థం కలగు – కలత అవుతుంది కలత అంటే క్షోభ నలగు – నలత అవుతుంది నలత అంటే అలసట, చిన్నరోగం మడగు – మడత అవుతుంది మడత అంటే వంచడం

పదాంతంలోని 'చు' స్థానంలో 'త' వస్తుంది నడచు – నడత అవుతుంది నడత అంటే నడవడి కొలుచు – కొలత అవుతుంది, ఈ కొలత పరిమాణం, పొడవు మొదలయిన వాటిని కొలవడానికి ఉపయోగించేది

నెగడు – నెగడ్త, పొగడు – పొగడ్త అవుతాయి ఈ మాటల్లో ప్రాతిపదిక చివరి అచ్చు మాత్రమే లోపిస్తుంది నెగడ్త అంటే ప్రసిద్ధి, ప్రఖ్యాతి వీటిలాగానే తెగడు – తెగడ్త అవుతుంది దూషణ అని అర్థం.

ఈదు – ఈత, ఊదు – ఊత అవుతాయి ఊత అంటే ఆధారం ఊత అనే చేపలుపట్టే వెదురు సాధనం కూడా ఉంది ఈను నుండి ఏర్పడిన ఈత కూడా ఉంది. ఈతచెట్టు అన్న అర్థం లోని ఈతవేరు

చెందు – చెంత అవుతుంది. చెంత అంటే వద్ద అనీ, సమీపం అనీ అర్థం వందు – వంత అవుతుంది వంత అంటే బాధ

ఇంచు చేరి ఏర్పడే క్రియలెన్నో ఉన్నాయి ఇవి నామవాచకాలు కావడానికి 'చు'కు బదులు 'త' ప్రత్యయాన్ని చేర్చవచ్చు ఉదాహరణకు అను అనే క్రియను తీసుకోవచ్చు అను + ఇంచు = అనించు అవుతుంది 'త' ప్రత్యయం చేరితే అనింత అవతుంది అలరు – అలరించు – అలరింత అవుతుంది అవులించు – అవులింత అవుతుంది పులకరించు – పులకరింత, పలకరించు –

పలకరింత అవుతాయి  గాలించు- గాలింత అవుతుంది  చికిలించు- చికిలింత అవుతుంది  చెప్పించు- చెప్పింత అవుతుంది  రాపించు- రాపింత అవుతుంది  వేగిరించు- వేగిరింత అవుతుంది  అదిలించు- అదిలింత  ఆరగించు- ఆరగింత అవుతాయి  వెక్కిరించు- వెక్కిరింత అవుతుంది  పుక్కిలించు- పుక్కిలింత అవుతుంది

డ్రిల్ అన్న ఇంగ్లీషు మాటకు ఇంత చేర్చి డ్రిల్లింత అని వాడుతున్నారు  తుళ్ళు- తుళ్ళింత వంటి మాటల సామ్యం వల్ల ఇటువంటి ప్రయోగం ఏర్పడింది  మన అవసరాన్ని అనుసరించి ఈ విధంగా ఎన్ని మాటలయినా కూర్చుకోవచ్చు

☆

# ఇక - ప్రత్యయం

మనం ఎక్కువగా వాడే కృత్ప్రత్యయాలలో ఇక ఒకటి క్రియా ప్రాతిపదికకు ఇక చేర్చి నామ వాచకంగా మార్చుకోవచ్చు 'అడు' అనే క్రియా ప్రాతిపదికకు అనేక అర్థాలున్నాయి కాని ఇక చేర్చి ఏర్పరచుకున్న నామవాచకం అడిక'కు ప్రతిజ్ఞ అనీ, నింద అనీ అర్థాలు ప్రస్తుతం నింద అపవాదం అనే అర్థమే ఎక్కువగా వాడుకలో ఉంది ఆను– ఆనిక అవుతుంది ఆనిక అంటే ఆదారం, ఊత ఇముడు– ఇముడిక అవుతుంది దీనికి ఇమిడిక అన్న రూపం కూడా ఉంది ఇమిడి ఉండడమని అర్థం ఊను– ఊనిక అవుతుంది ఊనిక అంటే ఆధారం ఊత అని అర్థం బాషాశాస్త్రంలో stress అన్న అర్థంలో ఈ మాటను వాడతారు పదంలో ఏ అచ్చుమీద ఊనిక ఉందన్న దాన్నిబట్టి ఆ పదం అర్థం ఉంటుంది ఒక విషయం మీద ప్రాధాన్యాన్ని నెలకొల్పడానికి కూడా ఊనిక అనే వ్యవహారం ఉంది ఇంతకు ముందు వ్యవసాయ రంగంమీద ఉన్న ఊనిక ఇప్పుడు పారిశ్రామికరంగంవైపు మళ్ళింది వంటి వాక్యాలలో ప్రాధాన్యమనే అర్థం

ఎన్ను– ఎన్నిక అవుతుంది ఎన్నిక అంటే లెక్క అనీ, ప్రసిద్ధి అనీ, ఊహ అనీ, సంకల్పమనీ, ఎన్నుకోవడం అనీ అర్థాలు వాడు ఎన్నికెక్కాడు అంటే ప్రసిద్ధి చెందాడని అర్థం వాడు ఎన్నిక చేసిన మనిషి అన్నప్పుడు యోగ్యుడుగా గుర్తించిన మనిషి అని అర్థం దీనికి అపఖ్యాతి అన్న అర్థం కూడా నిఘంటువులలో ఉందికాని నేటి వాడుకలో లేదు ప్రసిద్ధి, ఎన్నుకోవడం అన్న అర్థాలలోనే ఈ మాట ప్రచురంగా కనిపిస్తుంది

ఏమరు– ఏమరిక అవుతుంది ఏమరు అంటే ఉపేక్షించు మరచు అని అర్థాలు ఏమరిక అంటే పరాకు, ప్రమాదం అని అర్థం ఏమరపు, ఏమరిపాటు అనికూడా నామవాచక రూపాలు న్నాయి ఏలు– ఏలిక అవుతుంది రాజు, యజమాని, భర్త అని అర్థాలు రాజు అన్న అర్థంలోనే వాడుక ఎక్కువ ఓపు– ఓపిక అవుతుంది ఓపు అంటే సమర్థమగు, ఇష్టపడు, సహించు అని అర్థాలు ఓపిక అంటే ఓరిమి, తాలిమి, విసుగు లేకపోవడం శక్తి, సామర్థ్యం అనే అర్థం కూడా ఉంది ఓము– ఓమిక అవుతుంది ఓము అంటే రక్షించు, కాపాడు అని అర్థం ఓమిక అంటే రక్షణ

కదలు– కదలిక అవుతుంది కదలిక అంటే చలనం కలయు– కలయిక అవుతుంది కలయిక అంటే సంగమం, కూడిక కుదురు– కుదిరిక అవుతుంది కుదిరిక అంటే అమరిక అమరిక కూడా అమరు అనే క్రియా ప్రాతిపదిక మీద 'ఇక చేరి ఏర్పడిన రూపమే వాడికి కుదిరిక లేదు అన్నప్పుడు నిలకడలేదని అర్థం ఇది భౌతికంగానూ, మానసికంగానూ కూడా ఒక ఉద్యోగంలో కుదిరికగా ఉండకపోవచ్చు ఒక అభిప్రాయం స్థిరంగా ఉండకపోవచ్చు కుదిరిక అంటే స్వస్థత అనికూడా అర్థం కూడు– కూడిక అవుతుంది కూడిక అంటే సంగమం అనీ, పొందిక అనీ అర్థం కలపడం అనికూడా అర్థం

కోరు–కోరిక అవుతుంది కోరిక అంటే కోరడం, ఇచ్ఛ, వాంఛ కోరిన విషయం అని కూడా అర్థం వరం అనికూడా అర్థం దీనికి కోరికి, కోరికె అనికూడా రూపాలున్నాయి చీరు– చీరిక అవుతుంది చీరిక అంటే చీలిక, ముక్క, పాయ అని అర్థాలు చినిగిపోయిన గుడ్డను కూడా చీరిక అంటారు చీరికలు చారికలు అని జంట పదంగా కూడా వాడుక ఉంది చీలు– చీలిక అవుతుంది చీరిక, ఐద్ద అని అర్థం చేరు– చేరిక అవుతుంది చేరిక అంటే కలిసి ఉండడం స్నేహం దగ్గర అని కూడా అర్థం

[illegible]- [illegible] అవుతుంది [illegible] అంటే [illegible] అవుతుంది నమ్మిక అంటే నమ్మకం విశ్వాసం విశ్వాసాన్ని కలిగించే మాట ప్రమాణం అనీ కూడా అర్థం దీనికి నమ్మిగ అనే రూపం కూడా ఉంది నమ్మిక కాపు అంటే కనిపెట్టుకొని ఉండే మనిషి పూడు- పూడిక అవుతుంది పూడిక అంటే వాపులు కురుపులు మొదలయిన వాటిలో [illegible] ఉన్న మన్ను పూను- పూనిక అవుతుంది పూనిక అంటే ప్రయత్నం ఉద్దేశం [illegible] అనీ కూడా అర్థం ఉంది పట్టుదల అని కూడా అర్థం పూనిక అంటే రీతి [illegible] అర్థం కూడా ఉంది దీనికి పూనికి అన్న రూపం కూడా ఉంది

పొందు- పొందిక అవుతుంది పొందిక అంటే కలయిక చెలిక స్నేహం స్వభావం రీతి [illegible] అర్థాలు పొరలు- పొరలిక అవుతుంది పొరలిక అంటే పొర్లడం పొలయు- పొలయిక అవుతుంది పొలయు అంటే వ్యాపించు సంచరించు వీచు కలిపించు, ప్రవేశించు [illegible] అనుకూలించు మూగు కలుగు, అతిశయించు తొలగు దగ్గరగు వంటి అర్థాలున్నాయి పొలయిక అంటే సంచారం అనీ వ్యాప్తి అనీ అర్థాలు పోలు- పోలిక అవుతుంది పోలిక అంటే సామ్యం, సాదృశ్యం, రీతి పోలికి పోలికె అనే రూపాలు కూడా ఉన్నాయి బడలు- బడలిక అవుతుంది బడలిక అంటే శ్రమ అలసట

మచ్చు- మచ్చిక అవుతుంది మచ్చు అంటే ఆకర్షించు అని అర్థం నామవాచకంగా మచ్చు అంటే వశీకరణ ఔషధం జంతువులను వలలో పడేట్లు చేయడానికి పెట్టే ఎరను కూడా మచ్చు అంటారు ఈ అర్థంలోనే మచ్చిక దీనికి వలపు అనీ, ఆసక్తి అనీ, భ్రాంతి అనీ, చనవు అనీ అర్థాలు మచ్చిక చేసుకోవడం అంటే మాలిమి చేసుకోవడం దీనికి మచ్చిగ అనే రూపం కూడా ఉంది మొట్టు- మొట్టిక అవుతుంది మొట్టికాయ అని కూడా వాడుక పిడికిలితో తలమీద పొడిచిన పొడుపు మొట్టిక/మొటిక అంటే మొలక అనికూడా అర్థం మొటికలు వేస్తూ ఉంది అంటే మొలక వేస్తూ ఉందని అర్థం నిన్నమొన్నటి మొటిక అంటే పసివాడని అర్థం నిఘంటువులలో తునుక అనే అర్థంకూడా ఉంది కాని వాడుకలో ఉన్నట్లు లేదు

ఎంచు- ఎంపిక అవుతుంది ఇక్కడ ప్రాతిపదికలోని చకారం పకారమయింది ఎంపిక అంటే సెలక్షన్ ఒకదానికంటే ఎక్కువ ఉన్నప్పుడు వాటిలో మేలైనదాన్ని ఎన్నడం

దయ్యు- దప్పిక అవుతుంది దయ్యుకు దయ్యు అన్న రూపమూ, దప్పికకు దప్పిక అన్న రూపమూ ఉన్నాయి దప్పి/దప్పి కూడా అవుతుంది ఇక్కడ ద్విరుక్త యకారం, ద్విరుక్త పకారం అయింది దప్పిక/దప్పిక అంటే దాహం, పిపాస, తాగాలనే కోరిక

పెరుకు- పెరిక అవుతుంది 'ఇక' చేరే ముందు పదాంతంలో ఉన్న 'కు' లోపించిందన్న మాట పెరుకు అంటే పీకు, పెల్లగించు, మోయు, మోయించి తెచ్చు అని అర్థాలు ఈ మోయు అనే అర్థంలోనే పెరిక ఏర్పడింది పెరిక అంటే రెండు పక్కల బరువుండేట్లుగా ధాన్యం పోసి ఎద్దు, గుర్రంవంటి వాటి వీపుమీద వేసే గోనెసంచి మోకాళ్ళ మీది పెరిక అన్నది జాతీయం నడవ నీయనిది, కష్టకరం అని అర్థం పెరికాటం అంటే పెరికలలో ధాన్యం మోయించుకొనిపోయి చేసే వ్యాపారం పెరిక సెట్టి అంటే ఇటువంటి వ్యాపారం చేసే వర్తకుడు

మెలయు- మెలిక అవుతుంది ఇక్కడ చివరి అక్షరం లోపించింది. తాల్చు- తాలిక, తూన్చు- తూనిక అన్నప్పుడూ అంతే మెలిక అంటే మెలి, పెన మెలికపడింది అంటే చిక్కు పడిందని అర్థం తాలిక అంటే మెలిక, చారిక అని అర్థం పాలతాలికలున్నాయి కదా తూనిక అంటే త్రాసుతో తూచడం ☆

# క - ప్రత్యయం

కృత్ప్రత్యయాలలో 'క' ఒకటి క్రియా ప్రాతిపదిక మీద క చేరి కృదంత నామవాచకాలు ఏర్పడతాయి పుట్టు+క= పుట్టుక పుట్టుక అంటే జన్మ సూర్యచంద్రాదుల ఉదయాన్ని కూడా వారి పుట్టుకగా వర్ణించవచ్చు పుట్టు గట్టు అంటే ఉదయాచలం, తూర్పుకొండ వాడుకలో పుటక అని కూడా ప్రయోగం 'మనిషి పుటక పుట్టిం తర్వాత కొంచెం ఇంగితజ్ఞానం ఉండాలి' వంటి వాక్యాలలో ఇటువంటి ప్రయోగం ఉంది వాడు - వాడుక అవుతుంది వాడుక అంటే ఉప యోగం అనీ వ్యవహారం అనీ అర్థం అభ్యాసం, అలవాటు అని కూడా అర్థం ఉంది పాల వాడుక అంటే క్రమం తప్పకుండా ఒకరిదగ్గరే పాలు పోయించుకోవటం వేడు- వేడుక అవుతుంది వేడుక అంటే కుతూహలం, కోరిక, సంతోషం, వినోదం, ఉత్సవం, విలాసం, అవలీల అని అర్థాలు

వాడికి ఉయ్యాల ఊగాలని వేడుక అన్నప్పుడు కుతూహలం అని అర్థం కాంక్ష, కోరిక అనే అర్థంలో కావ్యాలలో ఈ మాటకు ప్రయోగం ఉంది వేడు అంటే కోరు అని ఒక అర్థం ఈ అర్థం వల్లే వేడుక అంటే కోరిక అనే అర్థం ఏర్పడింది నీకంతా వేడుకగా ఉంది అంటే వినోదంగా ఉందని అర్థం వేడుక జరుపుకున్నారు అన్నప్పుడు ఉత్సవం జరుపుకున్నారని అర్థం వేడు అన్నమాటకు యాచించు, ప్రార్థించు అని అర్థాలున్నాయి కాని 'వేడుక'లో ఈ అర్థాలు లేవు

పదాంతంలో 'గు' ఉన్నప్పుడు దానికి బదులుగా 'క' వస్తుంది అలుగు- అలుక అవు తుంది. అలుక అంటే కోపం శత్రుత్వం అన్న అర్థం కూడా ఉంది పెళ్ళిలో పెళ్ళి కొడుకు అలుక పాన్పు ఎక్కినప్పుడు అలుకకు కోపం నటించడమే అర్థం కాసేపు బతిమిలాడించుకొని దిగి రావడం సంప్రదాయం పెళ్ళిళ్ళలో వేడుక కోసం చేసే ఈ చేష్టలు సీరియస్‌గా మారి ఆడపెళ్ళి వారిని నానా ఇబ్బందులూ పెట్టేవరకూ వచ్చాయి అలక/అల్క అని కూడా రూపం ఉంది

ఎరుగు- ఎరుక అవుతుంది. ఎరుక అంటే జ్ఞానం. ఎరుకగలవాని చరితలుగరచుచు అన్న భారత ప్రయోగానికి జ్ఞానులని అర్థం ఎరుక స్మృతి అని కూడా అర్థం ఎరుక అంటే ఆనవాలు, గుర్తు అన్న అర్థం కూడా ఉంది పరిచయం, సోదె అనే అర్థాలూ ఉన్నాయి ఎరుకసాని అన్న ప్పుడు సోదె చెప్పే స్త్రీ అని అర్థం ఎరుకలో అన్నా అదే అర్థం ఎరుక/ఎరిక/ఎరికె అనే రూపాలతో తెలియడమనే అర్థంలో తెలంగాణాలో ఈ మాట చాలా వాడుకలో ఉంది జోస్యం అని కూడా అర్థం

కడగు- కడక అవుతుంది. కడక అంటే ప్రయత్నం ధైర్యం, ఉద్ధతి, చేష్ట, రీతి, సంతోషం, ఆధిక్యం అన్న అర్థాలు కూడా ఉన్నాయి కాని నేటి వ్యవహారంలో ఈ అర్థాలలో ప్రయోగాలు లేవు కలగు- కలక అవుతుంది కలక అంటే వ్యాకులత్వం, క్షోభ, కాలుష్యం, కళంకం, జంకు అని అర్థాలు కండ్లకలక ఒకరకమైన కంటి జబ్బు తునుగు-తునుక/ తునక/ తున్క అవుతుంది ముక్క అని అర్థం మునుగు-మునుక/ మునక/ మున్క అవుతుంది మునుక అంటే మునగడం స్నానం అని కూడా అర్థం కాగు- కాక అవుతుంది కాక అంటే తాపం, బాధ, కోపం అని కూడా అర్థం వాడు చాలా కాకమీద ఉన్నాడు అన్నప్పుడు కోపమనే అర్థం వేడిమి, జ్వరం అని కూడా అర్థాలున్నాయి బహువచన ప్రత్యయంచేరి కాకలుదేరిన యోధుడు అన్న ప్రయోగం ఉంది

ఆరితేరిన అని అర్థం కాకలుతేరిన బంటు జాతీయం పుటం పెట్టిన లోహంలాంటి వాడ-
అర్థం తేరిన పనులు తీరిన అని కూడా వాడుతున్నారు పోవు - పోక అవుతుంది పోక అంటే
పోవటం ఈ మాటకు జాడ అని కూడా అర్థం ఉంది వాడు పలు పోకలు పోతున్నాడు అన్న-
ప్పుడు నడకలు అని అర్థం అనేకరీతులని అర్థం ఈ అర్థంలో బహువచనంలోనే వాడుక
నడవడి నటన, విలాసం అన్న అర్థాలలో బహువచనంలోనే ప్రయోగం ఉంది అదే పోకగా
పోయాడు అన్నప్పుడు ఇక తిరిగి చూడకుండా పోయాడు అని అర్థం 'పోయిన పోక జాతీయం
మళ్లీ తిరిగి రాకుండా పోవటం అని అర్థం పోయినదే పోక అన్నది కూడా జాతీయమే
నడిచినదే మార్గమని అర్థం తాను నడిచిందే సరైన తోవ అనడం

మూగు - మూక అవుతుంది మూక అంటే సమూహం, గుంపు కావ్యభాషలో సేన అని కూడా అర్థం ఉంది వీగు - వీక అవుతుంది వీక అంటే ఉత్సాహం బలం పరాక్రమం, గర్వం, సాహసం, వ్యాప్తి, ఔదార్యం, ఔన్నత్యం, రీతి మొదలయిన అర్థాలున్నాయి వంగు - వంక అవుతుంది అంటే వంకర, వంపు, వంకరపని, తప్పు, సెలయేరు అని అర్థాలు

పదాంతంలో చు అంటే దాని స్థానంలో క వస్తుంది నడచు - నడక అవుతుంది నడక అంటే నడవడం, ప్రవర్తన అని అర్థాలు జీవనోపాయం, వృత్తి అన్న అర్థం కూడా ఉంది మొలచు - మొలక అవుతుంది మొలక అంటే అంకురం మొలకెత్తిన విత్తనాన్ని కూడా మొలక అంటారు మూలవ్యాధి, అర్శవ్యాధి అని కూడా అర్థం విశేషణంగా లేత, చిరుత, చిన్న అని అర్థం మగ మొలక అంటే మగపిల్లవాడు.

ముదియు - ముదుక అవుతుంది ముదుక అంటే ముసలివాడు ముదుక అంటే మోటయినది, దళసరి అయినది అని కూడా అర్థం లావు అన్న అర్థం కూడా ఉంది ముదుక బియ్యం, సన్నబియ్యం అన్నప్పుడు ముదుకకు లావు అనే అర్థం

మురియు - ముక్క అవుతుంది మురియు అంటే తెగు అని అర్థం ఊడు, విరుగు అని కూడా అర్థాలున్నాయి ముక్క అంటే ఖండం అని అర్థం

వచ్చు అనే ప్రాతిపదిక మీద క ప్రత్యయం చేరినప్పుడు వచ్చు 'రా' అవుతుంది రా+క= రాక రాక అంటే రావటం కావ్యాలలో దాడి అన్న అర్థంలో కూడా ఈ మాట కనిపిస్తుంది రాక అనే సంస్కృత పదంఒకటి ఉంది దీనికి పూర్ణచంద్రుడున్న పున్నమి అని అర్థం కతుకు అనేమాటకు గతుకు అనే రూపాంతరం ఉంది తినడం అని అర్థం దీని నుండే గటక/గట్క అనే మాట వచ్చిందని అంటారు. పిండితో చేసిన జావను గటక అంటారు అంబలి అని అర్థం లేపనం చేయడానికి నూరి ఉడికించిన పిండి అన్న అర్థం కూడా ఉంది

☆

# అ. అకం - ప్రత్యయాలు

పదం చివర ఉ ఉన్న కొన్ని మాటలకు అ ప్రత్యయం చేర్చడం ద్వారా నామవాచకాలు ఏర్పడ తాయి పదం చివర ఉన్న ఉ లోపిస్తుంది దాని స్థానంలో అ చేరుతుంది ఉదాహరణకు ఉదిలు - ఉదిల అవుతుంది ఉదిలు అంటే కదలు అని అర్థం ఉదిల అంటే చలనం పరితాపం అని కూడా అర్థం ఉదిల కొను అని వాడుక భయంతో వణకడం అనీ తొందరపడడం అనీ వ్యాపిం చడం అనీ, పరితపించడం అనీ అర్థాలు

కట్టు - కట్ట అవుతుంది కట్టు క్రియ నామవాచకం కూడా దీనికి చాలా అర్థాలున్నాయి కట్టు క్రియా ప్రాతిపదికకు అ ప్రత్యయం చేరిస్తే కట్ట ఏర్పడుతుంది కట్ట అనే మాటకు రెండు అర్థాలున్నాయి వేటినైనా కలిపి కట్టిన సముదాయం కట్ట, పుస్తకాల కట్ట మొదలైనవి చెరువు గట్టును కూడా కట్ట అంటారు చెరువుకట్ట నిరోధించడానికి అడ్డుగా కట్టినది కట్ట అడ్డుకట్ట ఆనకట్ట అడ్డుకట్ట అన్నది ఆలంకారికంగా కూడా వాడవచ్చు వాడి విజృంభణకు అడ్డుకట్ట వేశాడు వంటివి ఇటువంటివి కాయు - కాయ అవుతుంది మూడు కాయు'లు ఉన్నాయి ఒక కాయు కు ప్రసరించు అని అర్థం ఎండకాసింది, వెన్నెల కాసింది అన్న వాటిలో అరం ఇదే రెండో కాయు రక్షించు అని అర్థం మూడో కాయు'కు పుట్టు' అని అర్థం ఈ అర్థంలో కాయ నామవాచకమైంది కాయ అంటే చెట్టో, తీగో కాసే కాయ వీణకు అమర్చిన సొరకాయను కూడా కాయ అంటారు రాపిడివల్ల శరీరంలో గట్టిపడిన భాగాన్ని కాయ అంటారు ఆమె కడుపులో నాలుగు కాయలు కాశాయి అన్నప్పుడు సంతానమని అర్థం జూదం ఆడేటప్పుడు ఉపయోగించే సొరె మొదలైన వాటిని కూడా కాయ అంటారు పందెం కాయలు అని వాడుక చెడిపోయిన ధాన్యాన్నీ కాయ అంటారు కాయా, పొల్లూ లేని వడ్లు అని వాడుక కాయ నుండే పుట్టే ధాన్యాన్ని కాయ ధాన్యం అంటారు మినుములు, పెసలు వంటివి కాయ ధాన్యాలు వడ్లు గడ్డి ధాన్యం ఒకరకమైన కంటి జబ్బుకు కూడా కాయ అని పేరు 'వెళ్ళిన పని కాయా? పండా?' అన్నప్పుడు కాయ అంటే విఫలమనీ, పండు అంటే సఫలమనీ అర్థం ఎదురుచూసి కళ్ళు కాయలు కాచా యంటారు లెంపకాయ వేశాడు అంటే చెంపదెబ్బ కొట్టాడని అర్థం తల, మెడలకు కాయచేర్చి తలకాయ, మెడకాయ అని కూడా అంటారు పిల్లకాయ అనీ వాడుక లెంపకాయలాగే మొట్టి కాయ

గీరు - గీర అవుతుంది గీర అంటే గీత అని అర్థం ఈ మాటకు గర్వం అనే విశిష్టార్థం కూడా ఏర్పడింది గ్రుక్కు/గుక్కు - గ్రుక్క/గుక్క అవుతుంది గుక్క అంటే మింగడం అని అర్థం గొంతులో పట్టే (నీటి) ప్రమాణం గుక్క అంటే ఊపిరి అని కూడా అర్థం 'పద్యమంతా ఒక్క గుక్కలో అప్పజెప్పివేశాడు' అన్నప్పుడు శ్వాస అనే అర్థం. చేదు - చేద అవుతుంది చేదు అంటే తోడు అని అర్థం చేద అంటే నీళ్ళు చేదే పాత్ర దగ్గరు - దగ్గర అవుతుంది దగ్గరు అంటే సమీ పించు, దగ్గర అంటే సమీపం దగ్గర తీయడం అంటే చేరదీయడం

దొంగు - దొంగ అవుతుంది దొంగు అంటే దొంగిలించు దొంగ అంటే చోరుడు, దొంగి లించేవాడు మోసం, మాయ, నటన అని కూడా విశేషణంగా ఈ మాటకు అర్థముంది దొంగ నిద్ర పోతున్నాడు అంటే నిద్రపోతున్నట్లు నటిస్తున్నాడని అర్థం దొంగ భక్తి చూపిస్తున్నాడంటే లేని

[illegible]

తునియు – తునియ అవుతుంది తునియు అంటే తెగు అని అర్థం తునియ అంటే తెగి [illegible] ముక్క తూరు – తూర అవుతుంది తూరు అంటే [illegible] అని అర్థం తూర అంటే వానజల్లు జల్లు సన్నతూర పట్టింది అంటే ముసురు పట్టిందని అర్థం ముక్కు – ముక్క అవుతుంది ముక్కు అంటే దుక్కిచేయు అని అర్థం ముక్క అంటే [illegible] అర్థం [illegible] కాబట్టి ముక్క

పిడుచు – పిడుచ అవుతుంది పిడుచు అంటే పిండు అని ముద్దలాగా అదుము అని అర్థం పిడుచ అంటే ముద్ద పిడుచకట్టు అంటే దప్పికతో తడి ఆరిపోయి ముద్దలాగా కావడం వెచ్చు – వెచ్చ అవుతుంది వెచ్చ అంటే వేడి, జ్వరం

అ ప్రత్యయం చేరినప్పుడు కొన్ని మాటల్లో చివరి అక్షరం లోపిస్తుంది ఉదాహరణకు నడచు – నడ నడ అంటే నడక నడత ననుచు – నన అవుతుంది ననుచు అంటే పూచు అని అర్థం నన అంటే పూవు చిగురు, మొగ్గ అని అర్థాలు

పొగయు – పొగ అవుతుంది పొగ అంటే ధూమం ఆవిరి అనికూడా అర్థం పొగతోట పొగాకు తోట పొగకన్ను అంటే శివుడి మూడోకన్ను మొరగు – మొర అవుతుంది మొరగు అంటే మోసంచేయు అని అర్థం మొర అంటే ఆర్తనాదం మొర పెట్టుకోవడం అంటే తమ కష్టాలు చెప్పుకోవడం మొరపెట్టడం అంటే పెద్దగా ధ్వనిచేయడం దీనికి మొఱ్ఱ అన్న రూపాంతరం కూడా ఉంది

విలుచు – వెల అవుతుంది విలుచు అంటే కొను అని అర్థం వెల అంటే ధర మనం కొనే వస్తువుకు చెల్లించే మూల్యం వెలుగు – వెల్ల అవుతుంది వెల్ల అంటే తెలుపు వెల్లదనం అంటే తెల్లగా పాలిపోవడం వెల్ల అంటే సున్నం అని కూడా అర్థం 'ఇంటికి వెల్ల వేశారు' అంటాం చెమరు – చెమ్మ అవుతుంది చెమ్మ అంటే తడి, ఊట కన్ను చెమ్మగిల్లింది అంటాం

అకం' అన్నది మరొక కృత్ప్రత్యయం ఈ ప్రత్యయాన్ని కూడా చాలా మాటల మీద చేర్చి నామవాచకాలను ఏర్పరచుకోవచ్చు ఉదాహరణకు 'అద్దు' మీద 'అకం' చేరిస్తే అద్దకం అవుతుంది అద్దకం అంటే బట్టలకు రంగువేయడం అల్లు – అల్లకం అవుతుంది అల్లకం అంటే అల్లిక నమ్ము – నమ్మకం అవుతుంది నమ్మకం అంటే విశ్వాసం పూను – పూనకం అవుతుంది పూనకం అంటే దేవత ఆవేశించటం అమ్ము – అమ్మకం అవుతుంది అమ్మకం అంటే విక్రయం, అమ్మడం

అకం చేరినప్పుడు పదాంతంలోని చకారం పకారం అవుతుంది అనుచు – అంచు – అంపకం అవుతుంది అంపకం అంటే పంపడం అంపకాలు పెట్టడమంటాం పంచు – పంపకం అవుతుంది పంచడం అని అర్థం పంపు కూడా పంపకం అవుతుంది పంపడమని అర్థం పెంచు – పెంపకం అవుతుంది పెంచడం, పోషించడమని అర్థం కొందరి వాడుకలో ఈ ప్రత్యయానికి చాలా వాడుక ఉంది కొనకం తినకం, చేసకం లాగా ఎన్నో పదాలు వాడతారు

☆

# ఇ - ప్రత్యయం

కృత్ప్రత్యయాలలో ఇ ఒకటి ఎదురు అనే క్రియా ప్రాతిపదికకు ఇ ప్రత్యయం చేరితే ఎదిరి అవుతుంది ఎదిరి నామవాచకం ఎదిరి అంటే అన్యుడు, ఇతరుడు అని అర్థం ప్రతిపక్షి, విరోధి అనే అర్థం కూడా ఉంది ప్రస్తుతం ఈ అర్థంలోనే 'ఎదిరి'కి వాడుక ఎక్కువగా ఉంది కూయు-కూయి అవుతుంది కూయి అంటే కూత, అరపు, మొర నంగు- నంగి అవుతుంది నంగు అంటే ముక్కుతో మాట్లాడు అని అర్థం నంగి అంటే ముక్కుతో పలికే మాట అనీ, అస్పష్టమైన మాట అనీ అర్థం వాడు నంగి నంగిగా మాట్లాడతాడు , నీ నంగి మాటలు కట్టిపెట్టు వంటి ప్రయోగాలున్నాయి నత్తు- నత్తి అవుతుంది నత్తు అంటే తడబడుతూ మాట్లాడు అని అర్థం నత్తి అంటే మాట్లాడేటప్పుడు మాటలో మొదటి అక్షరాన్నే ఒకటికంటే ఎక్కువసార్లు ఉచ్చరించడం, ఆగి ఆగి కష్టంమీద మాట్లాడడం బాల్యంలో ఆత్మన్యూనతా భావంవల్ల, భయంవల్ల నత్తి వస్తుందంటారు

పిండు- పిండి అవుతుంది పిండు అంటే పాలు పిదుకు అని అర్థం రసం కారేటట్లుగా పిసకడం కూడా పిండటమే బట్టలు ఉతకటాన్ని కూడా పిండడమని అంటున్నారు చెవి మెలి పెట్టడాన్ని చెవి పిండడం అంటారు ఆలంకారికంగా దీన్ని విస్తృతపరిచి వాడడం కూడా ఉంది 'చెవులు పిండి వసూలు చేశా'డంటాం. పిండి అంటే ధాన్యం, పప్పులు మొదలైనవి విసరి చేసిన పొడి అని అర్థం.

మిక్కిలు- మిక్కిలి అవుతుంది మిక్కిలు అంటే అతిశయించు అని అర్థం మిక్కిలి అంటే ఎక్కువ మిక్కిలి కన్ను అంటే మూడో కన్ను, మిక్కిలి చూపు అని కూడా కావ్యాలలో వాడారు మిక్కిలి కంటివేల్పు అంటే త్రినేత్రుడు, శివుడు అచ్చతెలుగు కావ్యాలలో శివుడు అనడానికి ఈ మాటను ఎక్కువగా వాడారు వాము-వామి అవుతుంది వామి అంటే గడ్డికుప్ప, ఏ వస్తువులనైనా కుప్పగా అమర్చినప్పుడు వామి అనవచ్చు

కొన్ని మాటల చివర 'ఇ' ప్రత్యయం చేరినప్పుడు చివరి అక్షరం లోపిస్తుంది ఉదాహరణకు 'ఉరలు' అనే మాటను తీసికోవచ్చు 'ఉరలు' మీద 'ఇ' చేర్చినప్పుడు లు లోపిస్తుంది అప్పుడు ఉర+ఇ= ఉరి అవుతుంది ఉరలు అంటే పడు, వలలో చిక్కు కూలు, దొర్లు, విడిపోవు, పగులు మొదలయిన అర్థాలున్నాయి ఉరి అంటే ఉచ్చు జంతువులు, పక్షులను పట్టుకోవడానికి పన్నేది ఈ ఉరినే మనుషుల మెడకు వేసి చంపడాన్నే ఉరి తీయడం అంటున్నాం

కసరు, గురుచు, నలగు, ముడుచు, ముదియు, మిడియు, మొగియు, వెలచు మొదలయిన మాటలు ఉరలు వంటివి కసరు-కసి అవుతుంది. కసరు అంటే కోపపడు అని అర్థం కసి అంటే కోపం గురుచు- గురి అవుతుంది గురుచు కు గురించి రూపాంతరం గురి అంటే లక్ష్యం గురి అంటే విశ్వాసం, నమ్మకం అన్న అర్థం కూడా బాగా వాడుకలో ఉంది 'డాక్టరు మీద గురి ఉంటే జబ్బు తొందరగా తగ్గుతుంది', 'గురువు మీద గురి ఉండాలి' గురి అంటే నిదర్శనం అనీ, సాక్షి అనీ, నిర్ణయం అనీ, ఉపాయం అనీ, హద్దు అనీ, గిరి (గుండ్రంగా గీసిన గీత) అనీ, మచ్చ అనీ కూడా అర్థాలున్నాయి నలగు- నలి అవుతుంది నలగు అంటే బాధపడు, పీడ నొందు, నశించు అని అర్థం నలి అంటే బాధ, పొడి, ఎండుగడ్డి, చిరు తిండి, అందం, ప్రేమ, ఉత్సాహం, శక్తి అన్న అర్థాలున్నాయి

ముడుచు– ముడి అవుతుంది ముడుచు అంటే ముడి-వేయడం, ముడుచు పట్టు కొనే
కుచ్చు ముడిచించు ముడివేయు అంటే చెట్టుకొను కొప్పువేయు కనుబొమలు ముడివేయు
పట్టు అని అర్థాలు ముడి అంటే మూట అని దారం తాడు వంటి వాటి ముడి అని అర్థం మూట
అని అర్థం కూడా కట్టి ముడివేయడం వల్ల వచ్చిందే కోపం గాఢమైన అలోచన కలిగినప్పుడు
కనుబొమలు ముడివేయడం ఉంది ముడివేసినట్లుండే కొన్ని అక్షరాల ఒత్తులను కూడా
ముడులంటారు ్ర– మామూడి ్ర– రాముడి వట్టు మూపురాన్ని ముడి అంటారు చెట్టు మొద
లయిన వాటి బుడిపెను కూడా ముడి అంటారు దానికి దీనికీ ముడివేసాడు అన్నప్పుడు లంకె
వేసాడు పనకు పెట్టాడు అని అర్థం బహువచనంగా ముడుపువేయడం అంటే తగాదాలు పెట్టడం
ముడ్కమారి అంటే తగాదాలు పెట్టే వ్యక్తి ముడ్కి పేరు అంటే ఒక రకమయిన గొలుసు

ముదియు– ముది అవుతుంది ముదియు అంటే ముసలితనం రావడం ముది అంటే ముసలితనం లేక, ముసలివాడు, ముసలిది అని అర్థాలు మిదియు– మిది అవుతుంది మిడి అంటే గర్వం, ఉన్నతం పైకి ఉబికినది తీక్షమైనది అని అర్థాలు మిడిగుడ్లు అంటే పైకి ఉబికిన కంటిగుడ్లు మిడిగుడ్లవాడు అన్నది ఈ అర్థంలోనే మిడిదల అంటే పెద్ద తల మిడినాగు అంటే ఎగిరెగిరి పడే పాము మిడిపండ్లు అంటే ఎత్తుపండ్లు మిడిమేలం అంటే గర్వం మొగియు– మొగి అవుతుంది మొగియు అంటె వ్యాపించు పూను అని అర్థాలు మొగి అంటే పూనిక, తడవ, మొత్తం, రీతి, మొవ్వ, పూర్వం, ఎదుట అని అర్థాలు ఒక్క మొగిన మీదపడ్డారు అన్నప్పుడు ఒక్క తడవ, ఒక్కసారిగా అని అర్థం సైన్యం మొగిలో నిలిచాడు అంటే అగ్రభాగాన, ముందు అని అర్థం వెలచు– వెలి అవుతుంది వెలచు అంటే శుభ్రపరచు అని అర్థం వెలి అంటే వెలుపల, వెలుపలి ప్రదేశం బహిష్కారం అని అర్థాలు బయలు బహిష్కారం అన్న అర్థాలు రెండూ ప్రచురంగానే ఉన్నాయి

పదాంతంలో ద్విరుక్త యకారం కాని, ద్విరుక్త చకారం కాని ఉన్నట్లయితే అది పకారంగా మారుతుంది అంటే య్య– చ్చ లు ప్ప అవుతాయి ఉదాహరణకు డయ్యు– డప్పి అవుతుంది డయ్యుకు దయ్యు రూపాంతరం అట్లాగే డప్పికి దప్పి రూపాంతరం దయ్యు అంటే అలసిపోవు, బలహీనపడు, కృశించు, తగ్గు, చెడు అనే అర్థాలున్నాయి డప్పి అంటే శ్రమ, క్షీణత్వం, దాహం అని అర్థాలు నొచ్చు– నొప్పి అంటే బాధ నొప్పిని బహువచనంలో వాడితే నొప్పులు. దీనికి ప్రసవవేదన అన్న ప్రత్యేక అర్థం కూడా ఉంది పుచ్చు– పుప్పి అవుతుంది పుచ్చు అంటే చెడిపోవు అని అర్థం నీ పుణ్యం పుచ్చింది' అన్నప్పుడు మాత్రం పరిపక్వానికి వచ్చింది అని అర్థం పుప్పి, అంటే పుచ్చిపోయినది

☆

# మాపకం - మారకం

సమాజం అభివృద్ధి చెందే కొద్దీ ఆ సమాజం మాట్లాడే భాషా అభివృద్ధి చెందుతుంది భాష అభివృద్ధి చెందడమంటే ఏమిటి? ఆ భాష మాట్లాడే ప్రజల భావ వ్యక్తీకరణ శక్తి అభివృద్ధి చెందడమే మన విజ్ఞానం పెరుగుతూ ఉంది మనం నిర్మిస్తున్న వస్తుజాలం పెరుగుతూ ఉంది ప్రకృతిలో మనం గుర్తిస్తూ ఉన్న వస్తువుల సంఖ్యా పెరుగుతూనే ఉంది ప్రకృతికీ మనిషికీ ఉండే సంబంధాలు, మనిషికీ మనిషికీ మధ్య, సమాజానికీ సమాజానికీ మధ్య ఉండే సంబంధాల స్వరూపంలో అనేక మార్పులు కలిగాయి ఇదంతా భాషలో ప్రతిబింబించవలసిందే ప్రపంచంలో ఏ భాష అయినా సమర్థవంతంగా ఆ భాష మాట్లాడే వ్యక్తుల అవసరాలను తీర్చగలుగుతుంది

ప్రతిభాషా వ్యవస్థలోనూ ఈ అభివృద్ధికి అవసరమయిన పెరుగుదలకు అనుగుణమయిన నిర్మాణం ఉంటుంది పదజాలాన్ని విస్తృతపరచుకొనే ప్రక్రియలు ప్రతిభాషలోనూ ఉంటాయి ఒక పదాన్ని వాక్యంలో వివిధ భాషా భాగాలుగా ఉపయోగించుకోవచ్చు ఒకేమాటను నామవాచకంగా వాడవచ్చు విశేషణంగా వాడవచ్చు క్రియగా వాడవచ్చు నామవాచకాన్ని క్రియగా మార్చుకోవచ్చు క్రియనూ, నామవాచకాన్నీ కూడా విశేషణంగా మార్చుకోవచ్చు

క్రియా ప్రాతిపదికలను నామవాచకాలుగా మార్చుకొనే ప్రక్రియ చాలా విస్తారమయిన ప్రక్రియ ఎన్నయినా కొత్తమాటలను తయారు చేసుకోవడానికి ఉపయోగపడే ప్రక్రియ తెలుగులో క్రియను నామవాచకంగా మార్చుకోవడానికి ఉపయోగపడే ప్రత్యయాలు చాలా ఉన్నాయి కొన్ని ప్రత్యయాలు ఈ ప్రక్రియలో ఏ విధంగా ఉపయోగపడుతున్నదీ గమనించే ఉంటారు ఇంతకుముందు అకం అనే ప్రత్యయం చేరి ఏర్పడే రూపాలు చూశాం అమ్మకం, వంటకం. పంపకం వంటి మాటలు ఈ ప్రత్యయం చేరడం వల్ల ఏర్పడతాయి

'అకం' చేరి ఏర్పడ్డ మరో రెండు మాటలు మాపకం, మారకం సంస్కృతంలో ఒక మాపకం ఉంది జ్వరమాపకం అంటాం కదా జ్వరాన్ని కొలిచే సాధనం అన్నమాట అగ్నిమాపక దళం అని వాడుతున్నాం ఇక్కడ మాపకం సంస్కృతం కాదు సంస్కృతమే అయితే అగ్నిని కొలిచే దళం అని అర్థం వస్తుంది అగ్నిమాపకదళం అంటే మంటలను ఆర్పేదళం అని అర్థం మాయు – మాపు – మాపకం మాపు అంటే నశింపజేయు అని అర్థం మాపకం అంటే నశింపజేసేది అగ్ని మాపకం అంటే అగ్నిని నశింపజేసేది అయితే అగ్ని సంస్కృతం, మాపకం తెలుగు రెండూ కలిసి సమాసం అయ్యాయి తెలుగు వ్యాకరణాలు ఈ సమాసాన్ని ఒప్పుకోవు దీన్ని దుష్ట సమాసం అనీ వైరి సమాసం అనీ అంటారు అయినా సమాసంగా స్థిరపడి పోయింది

మారకం అన్న మాటను మార్పిడి అన్న అర్థంలో వాడుతున్నాం విదేశీ మారకద్రవ్యం అని సమాస రూపంలో ఈ మాట చాలా ఎక్కువగా వాడుకలో ఉంది ఫారిన్ ఎక్స్ఛేంజ్ అని అర్థం విదేశీ ద్రవ్యం అనే రెండు సంస్కృత పదాల నడుమ మారకం ఇరికింది

ఈ రెండు మాటలతో మరో సమస్య కూడా ఉంది సంస్కృత పదాలు సమాసంలో పూర్వ పదంగా వచ్చినప్పుడు వాటిమీద ఉన్న ప్రత్యయం లోపిస్తుంది వనము, కన్య అనే మాటలను కలిపితే వనకన్య అవుతుంది. భోజనం సమాసంతో మొదటి మాట అయితే భోజన అవుతుంది ఉదాహరణకు భోజన సమయం తెలుగుమాటల చివర ఉండే 'ము ఆ విధంగా లోపించదు

..మ్మకం - ఏమ్మకకాడు వంచకం వంచకకాడు ఇక్కో మాపకం మాపకం మాపక మారక
..మారెప్ప అందువల్ల కూడా అన్నిమాపకపదం అన్న సమాసం ఏర్పడదు మాపకప్ప దళం అనే మారెకప్ప ప్రయోగం అనే అనవలసి ఉంటుంది

ఏవన్నా వాడుకలోకి తెచ్చారో మొత్తానికి రెండూ స్థిరపడిపోయాయి సంస్కృత పదాల సమాస నిర్మాణ పద్ధతుల ప్రభావం వల్ల ఇటువంటి సమాసాలు ఏర్పడ్డాయి అయితే సాధ్యమయినంతవరకు భాషా స్వభావానికి విరుద్ధమయిన ఇటువంటి సమాసాల నిర్మాణం ప్రోత్సహించదగింది కాదు సహజం కాదు కాబట్టే వీటి సామ్యంతో మరిన్ని సమాసాలు ఇటువంటివి ఏర్పడలేదు

క్రియా ప్రాతిపదికలను నామవాచకాలుగా మార్చే ప్రత్యయాలలో ట ఒకటి ఆడు పాడు మొదలయిన క్రియా ప్రాతిపదికల మీద ట ప్రత్యయం వస్తుంది ఆడు– ఆట అవుతుంది పాడు– పాట అవుతుంది ఊరు– ఊట అవుతుంది ఊట అంటే ఊరిన ద్రవం ఊట అంటే సారం అనీ, బలం అనీ కూడా అర్థం ఉంది చెమరు– చెమట అవుతుంది

తీడు– తీట అవుతుంది తీడు అంటే పదునుపెట్టు, నులిపెట్టు, చీల్చు, (పండ్లు) కొరుకు, ఏమ్ము అని అర్థాలున్నాయి తీట అంటే దురద, కండూతి తోడు– తోట అవుతుంది త్రిమ్మరు– త్రిమ్మట, త్రిప్పట అవుతుంది వేసరు– వేసట అవుతుంది వేసట అంటే అలయిక, అలసట వనరు– వనట అవుతుంది వనట అంటే దుఃఖం

వందు– వంట అవుతుంది మందు– మంట అవుతుంది తునియు– తుంట అవుతుంది తుంట అంటే ముక్క

చెరగు మీద ట ప్రత్యయం చేరినప్పుడు చె తరవాత ఉన్న వర్ణాలన్నీ లోపిస్తాయి చె లోని ఎత్వం దీర్ఘమవుతుంది దీన్నే వ్యాకరణ పరిభాషలో చెప్తే తొలి అచ్చు మీది వర్ణాలకు లోపమూ, ఆ తొలి అచ్చుకు దీర్ఘమూ వస్తుంది అంటే చెరగు– చేట అవుతుంది చెరిగే సాధనం చేట అదేవిధంగా ముడుచు– మూట అవుతుంది

దూటు అనే క్రియా ప్రాతిపదిక మీద 'డ' ప్రత్యయం చేరుతుంది దూటు అంటే పొడుచు, కుమ్ము దీనినుండి దూడ ఏర్పడింది తల్లిపాలు తాగేటప్పుడు పొదుగును ముట్టెతో కుమ్ముతుంది కాబట్టి అది దూడ

ℷ

# దిద్దుబాటు - మెచ్చుకోలు

**కొ**న్ని ప్రత్యయాలు చేరినప్పుడు పదంలో మొదటి అక్షరంలోని అచ్చు దీర్ఘమవుతుంది దాని తరువాతి అక్షరాలు లోపిస్తాయి చెడు + టు= చేటు అవుతుంది ఇటువంటివే పడు– పాటు వేయు– వేటు, పొడుచు– పోటు మొదలయినవి పడు అన్నది అనుబంధ క్రియగా కూడా వస్తుంది తిరుగబడు, ఏర్పడు, తడబడు, మారుపడు, ఒడబడు వంటివి పడు అనుబంధంగా చేరిన క్రియలు పడు క్రియాపదాల మీద, నామవాచకాల మీద కూడా అనుబంధంగా వస్తుంది కొన్నిచోట్ల పాటు అనేది చేరి నామవాచకాలు ఏర్పడతాయి

నగు– నగుబాటు అవుతుంది లొంగు– లొంగుబాటు అవుతుంది జరుగు– జరుగుబాటు అవుతుంది చెల్లు– చెల్లుబాటు అవుతుంది నగు అంటే నవ్వు నగుబాటు అంటే నవ్వులపాలు కావడం ఎగతాళికి గురికావడం జరుగుబాటు అన్నప్పుడు జీవిక అని అర్థం చెల్లుబాటు అంటే అధికారం సాగడం మరో ప్రత్యయంతో చెల్లుబడి అనే రూపం కూడా ఉంది చెల్లుబాటు వంటిదే సాగుబాటు రెండింటికీ అర్థం ఒకటే

కొన్నిమాటల్లో పాటు వచ్చి చేరిందనడం కంటే 'టు' ప్రత్యయం వచ్చి చేరిందని చెప్పడం ఉచితంగా ఉంటుంది ఏర్పడు– ఏర్పాటు అవుతుంది వేరుపడు– వేర్పాటు అవుతుంది తెగబడు – తెగబాటు అవుతుంది ఒడబడు– ఒడబాటు అవుతుంది ఒడంబడిక అని అర్థం తిరుగబడు– తిరుగుబాటు అవుతుంది పొరబడు– పొరపాటు అవుతుంది చిక్కుపడు– చిక్కుపాటు అవుతుంది కట్టుబడు – కట్టుబాటు అవుతుంది నియమం అని అర్థం తడబడు – తడబాటు అవుతుంది

దిద్దు– దిద్దుబాటు అవుతుంది జి యస్ వరదాచార్యులు గారు ఈ పేరుతో శీర్షికను నిర్వహించారు కదా తప్పులను, పొరపాట్లను సరిదిద్దడం, వెసులు – వెసులుబాటు అవుతుంది తీరిక, అవకాశం అని అర్థం. వీలు అన్న అర్థం కూడా ఉంది

గగుర్చు – గగుర్పాటు అవుతుంది జారు– జారుపాటు అవుతుంది జారుపాటు అంటే పొరపాటు జారడం అనీ, నెమ్మది అనీ కూడా అర్థం ఉంది తొట్రు– తొట్రుపాటు అవుతుంది తొట్రుపాటు అంటే తడబాటు తొట్రు అంటే జారడం ఇదే అర్థంలో జీరుకుపాటు అనే మాట కూడా ఉంది అడ్డు – అడ్డపాటు అవుతుంది నిరోధం అని అర్థం అడ్డుపాటు అనీ అవుతుంది ఆటంకం అని అర్థం

తోడ్పడు – తోడ్పాటు అవుతుంది సహాయం, సహకారం అని అర్థం మారుపడు – మార్పాటు అవుతుంది సాపడు – సాపాటు అవుతుంది సాపాటు అంటే భోజనం విన్నబడు – విన్నబాటు అవుతుంది వివర్ణత అని అర్థం తీరు – తీరుబాటు అవుతుంది మరో ప్రత్యయంతో తీరుబడి అని కూడా అవుతుంది తీరిక, సావకాశం అని అర్థం

సంస్కృత పదాల మీదకూడా పడు అనుబంధంగా చేరుతుంది వాటిలో కొన్ని 'టు' చేరి నామవాచకాలవుతాయి ఉదాహరణకు భంగపడు అనే మాటను తీసికోవచ్చు ఇది భంగపాటు అవుతుంది వైఫల్యం చెందడం, అవమానం పాలుకావడం అని అర్థం

ఎడబాయు – ఎడబాటు అవుతుంది వియోగం అని అర్థం. ఉదురు – ఉదుటు అవు

ఒంటి ఉమియ అంటే ఉష్ణలి నిప్పు అని అర్థం

కొంటు నుండి కోలు అనే మాట వచ్చింది బహువచన ప్రత్యయం లు చేరి ఏర్పడి ఉండవచ్చు కొంటు+లు=కోలు

కోలు చేరి కూడా కొన్ని నామవాచకాలు ఏర్పడతాయి అమ్ము - అమ్ముకోలు అవుతుంది అమ్మకం అని అర్థం కొను- కొనుగోలు అవుతుంది కొనడం అని అర్థం

అడ్డు- అడ్డగోలు అవుతుంది అప్రసక్తంగా అని అర్థం ఒక పద్ధతి లేకుండా వాడు అడ్డగోలుగా సంపాదించాడంటాం అడ్డులేకుండా కావచ్చు ఒప్పు- ఒప్పుకోలు అవుతుంది అంగీకారం అని అర్థం ఆడు- ఆడికోలు అవుతుంది ఆడు అంటే నిందించు అని ఒక అర్థం ఆడికోలు అంటే నింద

ఎల- ఎలగోలు అవుతుంది ఎలగోలు అంటే మొదటి పని అని అర్థం మొదటి యుద్ధం అని కూడా అర్థం ఎలగోలు దళం అంటారు సైన్యంలో ముందుండే భాగం కాల్బలం, కోలాహలం అనీ, సంకుల సమరం దొమ్మి అనీ కూడా అర్థం ఉంది కలుపు- కలుపుకోలు అవుతుంది కలుపుకోలుతనం అని తనం చేర్చి గుణంగా వాడవచ్చు కలుపుకోలు అంటే కలివిడి కలిసిపోవడం

చెప్పు- చెప్పుకోలు అవుతుంది చెప్పుకోలు విశేషణంగా వాడుకలో ఉంది చెప్పుకొనే మాటలు తెచ్చు- తెచ్చికోలు అవుతుంది ఇదీ విశేషణమే తెచ్చికోలు కోపం నిజంగా లేకపోయినా తెచ్చిపెట్టుకున్నది నటన

మెచ్చు- మెచ్చుకోలు అవుతుంది వేడు- వేడుకోలు అవుతుంది ప్రార్థన అని అర్థం వీడు - వీడుకోలు/వీడ్కోలు అవుతుంది

దల అనే అనుబంధం కూడా చాలా మాటల మీద చేరుతుంది ఒప్పు- ఒప్పుదల అవుతుంది అంగీకారం అని అర్థం పెరుగు- పెరుగుదల అవుతుంది తరుగు- తరుగుదల అవుతుంది ఎదుగు- ఎదుగుదల అవుతుంది

విడుచు - విడుదల అవుతుంది. పెంచు పెంపుదల అవుతుంది

☆

# ఉంకువ - ఊవి - అరువు

భాషలో ఆ భాష మాట్లాడే ప్రజల అవసరాలనుబట్టి మాటలుంటాయి సమాజం అభివృద్ధి చెందేకొద్దీ సమాజ అవసరాలు కూడా పెరుగుతూ ఉంటాయి అవసరాలతోపాటు భాషలో పదాలూ పెరుగుతాయి కాల పరిణామంలో భాషలోని ఎన్నో పదాలు వాడుకలోనుంచి తొలగి పోతాయి అట్లాగే ఎన్నో పదాలు కొత్తగా వచ్చి చేరతాయి మాటలను పెంచుకోవడానికి, అంటే కొత్త మాటలను కల్పించుకోవడానికి మనభాషలో ఎన్నో మార్గాలున్నాయి అవకాశాలున్నాయి అవసరానికి తగిన పదాన్నో, పదబంధాన్నో తయారుచేసుకొనే ప్రయత్నం చేయవచ్చు

గత కాలంలో ఏదైనా ఇంగ్లీషు మాటో, హిందీ మాటో మరొకటో మనభాషలోకి తెచ్చుకోవడంలో కొంత ఆలోచన ఉండేది సాధారణంగా వీలయితే మన భాషలో ఒక పదాన్ని కల్పించుకోవడం, లేకపోతే ఒక పదబంధాన్ని కల్పించుకోవడం చేసే వాళ్ళం లేకపోతే ఆ మాటను అనువదించుకొనేవాళ్ళం ఈ ప్రయత్నంలో సంస్కృత పదాలను సంస్కృత పదనిర్మాణ పద్ధతులను మనం విస్తారంగా ఉపయోగించుకున్నాం కాని ఇటీవలి కాలంలో కొత్త మాటలు కల్పించుకొనే ప్రయత్నం తగ్గించి అన్యదేశ్య పదాలను యధాతథంగా వాడుకోవడం ఎక్కువైంది దీనివల్ల మన వ్యవహారంలో దేశ్యపదాలు తగ్గి అన్యదేశ్యాల సంఖ్య ఎక్కువవుతుంది

పూర్వం సంస్కృత పదాలు విస్తృతంగా చేరి సంస్కృతం తల్లీ తెలుగు పిల్లా అనే అభిప్రాయం ఏర్పడింది ఇప్పుడీ అన్యదేశ్యాలు పదాలు అవసరమయినప్పుడు అరువు తెచ్చుకోవడంలో తప్పు లేదు కాని అవసరంలేకుండా కూడా అన్యదేశ్యాలను వాడడం ఉచితం కాదు కృష్ణానది మీద బ్రిడ్జి కట్టారు, అనడం కంటే వంతెనకట్టారు అంటేయేం

భాషలో ఉన్న పద నిర్మాణ పద్ధతుల్ని ఉపయోగించుకోవడం మానివేస్తే కొత్త మాటలు ఏర్పడవు. సాధ్యమయినంత వరకూ మన భాషలో పద నిర్మాణ పద్ధతులను ఉపయోగించి కొత్త మాటలు కల్పించుకోవాలి అవరమయితే భాషలో ఈనాడు వాడుకలో లేని మాటలను కూడా మళ్ళీ వాడుకలోకి తీసుకురావచ్చు నేటి అవసరానికి అనుగుణంగా వాటిని వాడుకోవచ్చు

ఉంకించు అనేమాట ఒకటి ఉంది ఉంకించు అంటే పూను, యత్నించు అని అర్థం దీనిమీద 'వ' అనే ప్రత్యయం చేరి ఉంకువ అనేమాట ఏర్పడింది ఈ మాటకు నివాసస్థానం అనీ, నిలకడ, స్థైర్యం అనీ అర్థం ఉంకువకు కన్యాశుల్కం అని కూడా అర్థం ఉంది ఓలి అని కూడా అంటారు ఉంకువ అంటే కానుక అని కూడా అర్థం ఉంకించుకు పర్యాయపదంగా ఊకించు అనేమాట ఉంది ఊకు– ఊకించు దీనిమీద 'వ' చేరి ఊకువ అవుతుంది ఊకువ అంటే ఆధారం, ఆశ్రయం, నెలవు

'వ' ప్రత్యయం చేరి ఏర్పడే నామవాచకాలు చాలా ఉన్నాయి ఎక్కు అంటే అధిష్ఠించు, పైకిపోవు, ప్రసరించు, అధికమగు, సంభవించు, నెరవేరు, ఎదుర్కొను, స్పష్టమగు వంటి అర్థాలున్నాయి కాని ఎక్కువ అంటే ఆధిక్యం అనిమాత్రమే అర్థం ఇటువంటిదే ఎగు అనే క్రియాపదం దీనికి అనుబంధ క్రియలను చేర్చి అనేక రకాలుగా వాడవచ్చు ఎగగట్టు అంటే పైకి కట్టడం ఎగగొట్టు అంటే తీర్చవలసిన అప్పును తీర్చకపోవడం ఎగగొలుపు అంటే పులికొల్పడం ఎగగ్రోలు అంటే పీల్చడం ఈ విధంగా ఎగజల్లు, ఎగజేపు, ఎగజోపు, ఎగదట్టు, ఎగదన్ను,

ఎగిరియు ఎగ్రోయు ఎగబడు ఎగబట్టు ఎగవారు ఎగపెట్టు ఎగబెట్టు ఎగదోయు, ఎగవాకి వంటి అనేక క్రియారూపాలు ఏర్పడతాయి ఈ మాటలన్నింటిలోను ఎగు కు పైకి అనే అర్థం ఎగువ విశేషణంగా కూడా వాడతాం ఎగుబుజంబులవాడు అని వర్ణిస్తారు కదా ఎగు-వ ఎగువ అవుతుంది ఎగువ అంటే మీదు అవతలి భాగం అటువంటిదే దిగువ దిగువ అంటే క్రింది ఇవతలిభాగం ఎక్కువలాంటిదే తక్కువ

కొద- కొదవ అవుతుంది కొదవ అంటే కొరత లేమి తక్కువతనం సంశయం, తప్పు చాటు అంటే దిప్పువంటివి వాయించి అందరికీ తెలియజేయడం వెల్లడించడం చాటువ అంటే ప్రఖ్యాతి, ప్రసిద్ధి చాటువ అంటే ఉదాహరణం దృష్టాంతం అనికూడా అర్థం

చేరు - చేరువ అవుతుంది చేరు అంటే సమీపించు చేరువ అంటే సమీపం, దగ్గర చేరువ అంటే కలయిక అనే అర్థం కూడా ఉంది సేన అనే అర్థం కూడా ఉంది మనుష్యుల గుంపును కూడా చేరువ అంటారు

తెగు- తెగువ అవుతుంది తెగువ అంటే సాహసం ఔదార్యం, దాతృత్వం అని కూడా అర్థం నిర్దయం అనీ, వాడి అనీ కూడా అర్థాలున్నాయి తెట్టు- తెట్టువ అవుతుంది తెట్టువ అంటే తెట్టె, సమూహం స్థానం తీరు-తీరువ అవుతుంది పన్ను అని అర్థం నీటితీరువ అంటాం

నడచు- నడవ అవుతుంది నడవ అంటే తలవాకిలికి నడిమి వాకిటికీ మధ్య ఉండేచోటు. నడవ అంటే సేతువు అని కూడా అర్థం ఉంది మరో అర్థం దారి తెరువు, త్రోవ, దారి, తెన్ను, పదవి, చనుప, నడవ, చొప్పు, జాడ, డొంక ఈ మాటలన్నీ మార్గం అన్న అర్థంలో వాడుకలో ఉన్నాయి నిలుచు- నిలువ అవుతుంది నిలువ అంటే నిలిచిన వస్తువు డబ్బు నిలువ, ధాన్యపు నిలువలు అని వాడుతున్నాం

విలుచు- విలువ అవుతుంది విలుచు అంటే కొను విలువ అంటే వెల, మూల్యం, ధర ఈ విలువను వస్తువు వెల అన్న అర్థంలోనే కాకుండా నైతిక విలువలు, మానవ విలువలు, సామాజిక విలువలు అని విస్తరించి వాడుతున్నాం

వి అని మరో ప్రత్యయం ఉంది ఈ అంటే ఇచ్చు దీనికి వి చేరితే ఈవి అవుతుంది ఈవి అంటే దాతృత్వం తనియు- తనివి అవుతుంది. తృప్తి అని అర్థం తెలియు- తెలివి అవుతుంది. జ్ఞానం అని అర్థం

వు అనే ప్రత్యయం చేరి అరుచు- అరువు అయింది అరువు అంటే తరువాత ఇచ్చే పద్ధతిలో చేసే అప్పు ఉరు- ఉరువు అవుతుంది తగినదని అర్థం ఉలియు- ఉలివు అవుతుంది శబ్దమని అర్థం ఎరియు- ఎరివు అవుతుంది తాపం, బాధ అని అర్థం కొలుచు- కొలువు అవుతుంది ఆస్థానం అని అర్థం ఉద్యోగమని ఇప్పుడు వాడుక తగు- తగవు అవుతుంది తగినది, న్యాయం, కలహం, తీర్పు, మేలు, కానుక, రీతి అని అర్థాలు తడయు- తడవు, తొడుగు- తొడవు నగు- నగవు/నవ్వు, నెరయు- నెరవు, నెలయు-నెలవు, బిగియు-బిగువు అవుతాయి పుట్టు - పుట్టువు అవుతుంది జన్మ అని అర్థం చచ్చు- చావు అవుతుంది పూచు- పూవు అవుతుంది ప్రుచ్చు-పుర్వు/ప్రువ్వు అవుతుంది పురుగు అని అర్థం

☆

# మరికొన్ని కృత్ప్రత్యయాలు

తెలుగులో కృత్ప్రత్యయాలు చాలా ఉన్నాయి అందుకే వ్యాకర్తలు వీటిని ప్రయోగాల నుండి తెలుసుకోవాలంటారు బడి అన్నది ఒక ప్రత్యయం వచ్చుకు బడి చేరిస్తే రాబడి అవుతుంది దిగుకు బడి చేరిస్తే దిగుబడి అవుతుంది అమ్ము- అమ్మబడి అవుతుంది రాబడి వంటిదే వరుంబడి

నిలుచుకు కడ చేరిస్తే నిలుకడ/నిలకడ అవుతుంది వచ్చు+కడ- రాకడ అవుతుంది పోవు+కడ-పోకడ అవుతుంది పన్ను+గడ- పన్నుగడ అవుతుంది పన్ను గడ అంటే యుక్తితో చేసిన ఏర్పాటు మను-మనుగడ అవుతుంది మనుగడ అంటే బతుకు, జీవనం విరుగు- విరుగడ/విరగడ అవుతుంది పీడావిరగడయిందంటారు

ఉడుగు అంటే మాను, విడుచు, త్యజించు అని అర్థం దీనికి కువ ప్రత్యయం చేరిస్తే ఉడుకువ అవుతుంది ఉడుకువ అంటే విశ్రాంతి, ఊరట, తెరపి ఎరుగు - ఎరుకువ అవుతుంది ఎరుకువ అంటే తెలివి, జ్ఞానం తేగు- తేకువ అవుతుంది తేగు అంటే వణకు అని అర్థం తేకువ అంటే భయం, జంకు, ధైర్యం, గర్వం, ఉత్సాహం, దృఢ సంకల్పం, బింకం, వివేకం మర్యాద హద్దు, ఓర్పు, సమగ్రత, రీతి మొదలైన అర్థాలున్నాయి వేగు-వేకువ అవుతుంది వేకువ అంటే తెల్లవారుజాము.

అమి ప్రత్యయం భావార్థంలోనూ వస్తుంది వ్యతిరేకార్థంలోనూ వస్తుంది కూడు+అమి- కూటమి అవుతుంది కూటమి అంటే చేరిక, చెలిమి, కలయిక ఓడు-ఓటమి అవుతుంది ఓటమి అంటే అపజయం ఒంటు-ఒంటమి అవుతుంది ఇక్కడ వ్యతిరేకార్థం వచ్చింది ఒంటు అంటే అనుకూలించు, సరిపడు ఒంటమి అంటే వైరం, పగ ఒవ్వు అన్నా, సరిపడు, గిట్టు అని అర్థం ఒవ్వమి అంటే గిట్టకపోవడం, ద్వేషం వ్యతిరేకార్థంలో 'అమి' ప్రత్యయం విస్తృతంగా వస్తుంది తిను-తినమి, వచ్చు- రామి, వెళ్ళు-వెళ్ళమి, గిట్టు-గిట్టమి, చదువు- చదవమి, కను- కనమి, విను- వినమి, కొట్టు- కొట్టమి, వండు- వండమి మొదలైన విధంగా ఏ క్రియాప్రాతిపదికనయినా వ్యతిరేక క్రియానామంగా మార్చుకోవచ్చు

ఒత్తుకు 'ఇడి' ప్రత్యయం చేరితే ఒత్తిడి అవుతుంది ఒరయు, రాయులు ఒరపిడి, రాపిడి అవుతాయి తాకు- తాకిడి అవుతుంది దోచు- దోపిడి అవుతుంది మార్చు-మార్పిడి అవుతుంది. విను-వినికిడి అవుతుంది కలయు- కలివిడి అవుతుంది కట్టు-కట్టిడి అవుతుంది క్రూరం అనీ, దిట్ట అనీ అర్థం కలుగుకు వ్యతిరేకార్థంలో 'లే' అనే రూపం ఉంటుంది దీనిమీద అడి ప్రత్యయం చేరి లేవడి అవుతుంది

నడచుకు 'అడి' ప్రత్యయం చేరితే నడవడి అవుతుంది ముట్టు-ముట్టడి అవుతుంది ముట్టు అనేమాటకు తాకు, పట్టుకొను, తీసికొను, మీటు, వ్యాపించు, కరచు, బాధించు, ఆవరించు మొదలైన అర్థాలున్నాయి ముట్టడి అన్నప్పుడు ఈ ఆవరించు, చుట్టుకొను అన్న అర్థం వస్తుంది చుట్టుముట్టి నిర్బంధించడం కట్టు కట్టడి అవుతుంది కట్టడి అంటే నియతి, కట్టుబాటు కట్టడి కట్ట అంటే చెలియలి కట్ట

ఓర్చుకు 'ఇమి' ప్రత్యయం చేరితే ఓరిమి అవుతుంది. కలుగు- కలిమి అవుతుంది

కూరు – కూరిమి అవుతుంది తాల్చు – తాలిమి తాల్మి అవుతుంది ఓర్పు ధైర్యం అని అర్థం

కమియుకు అలి ప్రత్యయం చేరితే కమికిలి అవుతుంది కమికిలి అంటే పట్టిన ఈ మాట కూడా ఏయుకు అలి ప్రత్యయం చేరగా ఏర్పడినదే చేతిపెట్టు పంటిని పుడిసిలి అని అర్థం పుడుకకు అలి చేరి పుడికిలి/పుడిసిలి ఏర్పడుతుంది కమికిలి పట్టిన పుడిసిలి సమానార్థకాలు పెక్కు – పెక్కుర అన్నా అర్థం ఒకటే ఏదేటప్పుడు వచ్చే ధ్వని పెక్కిక్కు అనే బహువచన రూపంలో దీనికి వాడుక ఎక్కువ

కామికు అలి ప్రత్యయం చేరితే కావలి అవుతుంది కుడుముకు ఇతి చేరితే కుడితి అవుతుంది పాతుకు దు చేరితే పాదు అవుతుంది పంచుకు గ ప్రత్యయం చేరితే పంగి అవుతుంది నోచుకు ము చేరితే నోము అవుతుంది ఉమియుకు మ్ము చేరితే ఉమ్ము అవుతుంది పులియుకు ఉ చేరితే పులుసు అవుతుంది వినుకు కలి చేరి వినుకలి అవుతుంది పిండుకు బు చేరితే పిబ్బు అవుతుంది

దబ్బు అంటే బొంకు దబ్బుకు అర ప్రత్యయం చేరితే దబ్బర అవుతుంది అసత్యమని అర్థం ఇరియుకు కు ప్రత్యయం చేరితే ఇరుకు అవుతుంది చెదుకు గు ప్రత్యయం చేరితే చెదుగు అవుతుంది ట్ట ప్రత్యయం చేరితే చెట్ట అవుతుంది చెదుపుకు ఎ ప్రత్యయం చేరితే చెదిపె అవుతుంది బిర్రుకు 'సు' ప్రత్యయం చేరితే బిరుసు అవుతుంది తినుకు డి' ప్రత్యయం చేరితే తిండి అవుతుంది చేయుకు దము చేరితే చెయ్దము అవుతుంది చేష్ట అని అర్థం దూటుకు ద చేరితే దూడ అవుతుంది దూటు అంటే కుమ్ము అని అర్థం తెరచుకు పి చేరితే తెరపి అవుతుంది విరామం అని అర్థం

త్రచ్చుకు అన చేరితే త్రచ్చున అవుతుంది త్రచ్చున అంటే చిలకడం వడ్డించు – వడ్డన అవుతుంది వీచు – వీవన అవుతుంది దువ్వుకు ఎన' చేరితే దువ్వెన అవుతుంది పోచుకు గు చేరితే పోగు అవుతుంది తూరుకు 'అర ప్రత్యయం చేరితే తువ్వర/తుప్పర అవుతుంది తసుకు అంటే మోసం దీనికి అరి చేరితే తసుకరి అవుతుంది టక్కులాడు, టక్కులాడి అని అర్థం.

తారు అంటే సంచరించు, అటూ ఇటూ తిరుగు దీనికి 'అసం' చేరితే తారసం అవుతుంది తారసం అంటే సమీపించినది, తటస్థించినది, సమీపం అని అర్థం రాయు (వ్రాయు)– రాయసం అవుతుంది రాయసం అంటే లేఖ అని అర్థం లేఖకుడు అనీ అర్థం రాజుల దగ్గర లేఖక పదవిలో ఉన్న రాయసాలు కొందరు ప్రముఖ స్థానాలు సంపాదించి మంత్రుల స్థాయిని పొందారు

కొలుచుకు 'ది' చేరి కొలది అవుతుంది చేయు – చెయిది, పాతు – పాది, ప్రోచు – ప్రోది, విడియు – విడిది అవుతాయి చనుకు 'ప' చేరి చనుప అవుతుంది చనుప అంటే తోవ చాచు – చావ అవుతుంది కినియుకు 'ఉక' చేరి కినుక అవుతుంది నాకు – నాలుక అవుతుంది

ఎడయుకు 'అం' చేరితే ఎడం అవుతుంది తిరియు – తిరిపం అవుతుంది మురియు – మురిపం అవుతుంది ఉబ్బు – ఉబ్బరం అవుతుంది.

☆

# భిన్న ప్రత్యయాలు - భిన్నార్థాలు

క్రియా ప్రాతిపదికలను నామవాచకాలుగా మార్చుకొనే ప్రక్రియలో తెలుగులో ఎన్నో ప్రత్యయాలను వాడుతున్నాం ఒక్కొక్క ప్రత్యయం ఎన్నో ప్రాతిపదికల మీద చేరి అనేక నామవాచక పదాలను నిర్మించుకోవడంలో తోడ్పడుతుంది ముఖ్యంగా అటం/అడం, డు వంటి ప్రత్యయాలు ఏ క్రియా దాతువు మీదనయినా చేర్చుకొనే అవకాశం ఉన్నవి అనటం, తినటం, రావటం, పోవటం - అనుడు, తినుడు, వచ్చుడు పోవుడు ఈ విధంగా ఈ ప్రత్యయాలకు ప్రయోగ విస్తృతి ఉంది భాషలో ఇది చాలా ఉపయోగకరమయిన ప్రక్రియ

ఒక ప్రత్యయం అనేక క్రియా ప్రాతిపదికల మీద చేరినట్లుగానే వేరువేరు ప్రత్యయాలు ఒకే క్రియా ప్రాతిపదిక మీద కూడా చేరవచ్చు వేరువేరు ప్రత్యయాలు చేరినప్పుడు అర్థంలో మార్పు ఉండవచ్చు ఉండకపోవచ్చు అంటే ఒకటికంటే ఎక్కువ ప్రత్యయాలు ఒకే అర్థాన్ని బోధించవచ్చు వేరు అర్థాల్నీ బోధించవచ్చు అల్లు అనే క్రియా ప్రాతిపదికకు అకం అనే ప్రత్యయం చేరితే అల్లకం అవుతుంది ఇక ప్రత్యయం చేరితే అల్లిక అవుతుంది అర్థంలో మార్పు లేదు నమ్మకం, నమ్మిక కూడా ఇటువంటివే విలుచు అన్న ప్రాతిపదిక నుండి ఏర్పడ్డ మాటలు విలువ, వెల ఈ రెండింటికీ భేదమూ ఉంది పోలికా ఉంది ధర అనే అర్థంలో ఈ రెండు మాటలూ వాడవచ్చు కాని వీటిని అన్ని సందర్భాలలోనూ ఒకదాని బదులు మరొకటి వాడడానికి వీలులేదు నేటి సమాజంలో నైతిక విలువలు పడిపోతున్నాయి అన్న వాక్యంలో విలువలు అన్న మాటకు బదులుగా వెలలు అన్న మాటను వాడటం కుదరదు మొలచు నుండి మొలక, మొక్క అన్న మాటలు ఏర్పడ్డాయి మొలక మొక్క కంటే చిన్నది వంచు నుండి వంపు, వంక, వంకర ఏర్పడ్డాయి వంపు, వంకరలకు అర్థంలో పోలిక ఉంది అయితే అలంకారికంగా వంకను వాడినట్లు వంపును వాడడానికి వీలులేదు వాగూ వంకాలో వంకకు బదులు వంపు వాడలేం ఈ పుస్తకానికి ఏ వంకా లేదు అంటే లోపం లేదని అర్థం అమ్మాయికి వంకపెట్టడానికి వీల్లేదు అన్నా అంతే లోపం చూపించడానికి వీల్లేదని అర్థం ఇక్కడా వంపు వాడడానికి వీల్లేదు వంకకు మిష అని అర్థం ఉంది ఈ అర్థంలో వంపును వాడడానికి వీల్లేదు

కాయు నుండి కాపు, కాత, కాయ ఏర్పడ్డాయి కాపు, కాత సమానార్థకాలు కాయకు అర్థంవేరు నడచు నుండి నడ, నడక, నడత, నడవ, నడవడి ఏర్పడ్డాయి నడ, నడక, నడత, నడవడి వీటిని ప్రవర్తన అన్న అర్థంలో వాడవచ్చు నడ, నడకలను నడచు ధాత్వర్థంలో కూడా వాడవచ్చు. నడత, నడవడులను అట్లా వాడడానికి వీలులేదు నడవ అంటే దారి అది తక్కిన వాటికి భిన్నమైనది.

ముదియు నుండి ముది, ముదిమి, ముదుక, ముదుసలి వంటి మాటలు ఏర్పడ్డాయి ముది, ముదిమి అన్న మాటలకు వార్ధక్యం అని అర్థం ముదుక, ముదుసలి అన్న మాటలకు వృద్ధుడని అర్థం ముదుసలి మొగుడు అని ముదుసలిని విశేషణంగా కూడా వాడవచ్చు ముది వగ్గు అని ముదిని కూడా విశేషణంగా వాడవచ్చు మోయు నుండి మోపు, మోత ఏర్పడ్డాయి రెండింటికీ కొద్ది అర్థభేదం ఉంది నిలుచు నుండి నిలుపు, నిలువ, నిలుకడ ఏర్పడ్డాయి నిలుపు అంటే ఆపుదల నిలువ అంటే నిలిచిన వస్తువు 'ధాన్యం నిలువ తగినంతగా ఉంది' అనవచ్చు

[illegible] అనవచ్చు [illegible] అంటే స్థైర్యం చేయు నుండి చేయుట చేతక ఏర్పడ్డాయి చేయుట అంటే సమర్థం చేతక అంటే సమయం అన్న అర్థంతోపాటు కలిసి ఉండటం స్నేహం వంటి అన్న అర్థాలూ ఉన్నాయి

ముడుచు నుండి ముడి మాట ఏర్పడాయి ముడికి మాట అన్న అర్థమూ ఉంది కాని గ్రంథి అన్న అర్థానికి ఎక్కువ వాడుక వెంట్రుకలు, తాడు దారం వంటి మొదలయిన వాటిని ముడివేయడం కనుబొమలు ముడివేయడం కూడా వ్రాయు/రాయు నుండి వ్రాత/రాత రాయసం ఏర్పడ్డాయి రాయసం అంటే రాసేవాడు

వండు నుండి వంట, వడ్డన వంటకం అన్న మాటలు ఏర్పడ్డాయి వంట అంటే వండే ప్రక్రియ వంటకం అంటే వండిన పదార్థం వడ్డన అంటే వడ్డించడం

చెడు నుండి చెరుపు, చెడుపు, చెడుగు చేటు, చెట్ట, చెడ్డ, చెడిది, చెడిపె వంటి మాటలు ఏర్పడ్డాయి చెరుపు, చెడుపు ఒకటె చేటు, చెట్ట, చెడ్డలకు కీడు అని అర్థం అయితే చెట్ట, చెడ్డ లను విశేషణాలుగా ఉపయోగించవచ్చు చేటును అట్లా విశేషణంగా వాడలేం చెడిది అంటే కీడు, ఆపద అశుభం అని అర్థం చెడిపె/చెడిప అంటే దుష్ప్రవర్తన గల స్త్రీ అని అర్థం చెడుగు అంటే దుష్టం అనె అర్థంతోపాటు దూర్తుడు అనే అర్థం కూడా ఉంది అశుభకార్యం, చెడ్డమాట అని కూడా అర్థం క్రూరమనే అర్థమూ ఉంది

కూడు నుండి కూడిక, కూటమి అనే మాటలు ఏర్పడ్డాయి కూడిక అంటే కలయిక కలపడాన్ని కూడిక అంటున్నాం ఈ అర్థంలో కూటమికి వాడుకలేదు కలయిక, పొందు అన్న అర్థంలో రెండు మాటలూ సమానమే తటస్థ రాజ్యాల కూటమి అన్నప్పుడు కూటమికి సమూహం అని అర్థం ఈ ధాతువునుండే వచ్చిన కూటము అన్న మాటకూ కూటమి అనే అర్థం ఉంది ఈ మాటకు చావడి, సభాభవనం అన్న అర్థం కూడా ఉంది మరోమాట కూటువ కూటువ అంటే గుంపు, కూటమి ఇదే ధాతువు నుండి ఏర్పడ్డ ఇంకోమాట కూడలి నదులు కాని, దారులుకాని కలసినచోటు కూడుదల అంటే లాభం ఈ విధంగా కృత్ప్రత్యయాలు భాషలో పద సంపద పెరగడానికి తోడ్పడతాయి

☆

# తద్ధితనామాలు

క్రియల నుండి నామవాచక పదాలను నిర్మించుకున్నట్లే నామవాచకం నుండి కూడా మరో నామవాచకాన్ని నిర్మించుకోవచ్చు ఈ ప్రక్రియ రెండు రకాలుగా జరుగుతుంది నామవాచక పదం మీద ఏదైనా ప్రత్యయాన్ని చేర్చి మరో నామవాచకాన్ని తయారుచేసుకోవడం ఒక పద్ధతి నామవాచకం మీద మరో నామవాచకాన్ని చేర్చి కొత్త మాటను నిర్మించుకోవడం రెండో పద్ధతి వీటిలో మొదటి పద్ధతిలో చేరే ప్రత్యయాలను తద్ధిత ప్రత్యయాలనీ, తయారయ్యే నామవాచకాలను తద్ధితనామాలనీ వ్యాకరణాలు వ్యవహరిస్తాయి రెండో పద్ధతిలో తయారయ్యే మాటలు సమాసాలు

తద్ధిత ప్రత్యయాలు నామవాచకాల మీదా చేరవచ్చు విశేషణాల మీద కూడా చేరవచ్చు తద్ధిత ప్రత్యయం చేరడంవల్ల ఏర్పడే పదాలకు అర్థంలో మార్పు ఉండవచ్చు, ఉండకపోవచ్చు అంటే కొన్ని ప్రత్యయాలు చేరినప్పుడు పదానికి ఉండే అర్థంలో మార్పు ఉండదు కొన్ని ప్రత్యయాలు చేరినప్పుడు ఆ పదానికి ఉన్న అర్థానికి సంబంధం ఉన్న విశిష్టార్థం ఏర్పడుతుంది

ఒక వస్తువు ఉందనుకోండి ఆ వస్తువుకు ఒక ధర్మం ఉంటుంది ఆ ధర్మాన్ని లేదా స్వభావాన్ని మనం విడిగా గుర్తించవచ్చు అయితే ఆ వస్తువుకు ఒకటికంటే ఎక్కువ ధర్మాలు కూడా ఉండవచ్చు ఈ ధర్మాలన్నింటినీ విడివిడిగా చెప్పిందానికంటే ఆ వస్తువునే పేర్కొనడం తేలికగా ఉంటుంది సమగ్రంగానూ ఉంటుంది భీముడు ఒక పౌరాణిక వ్యక్తి శక్తికీ, పరాక్రమానికీ, భోజన పరాక్రమానికీ, వంటకీ ప్రసిద్ధి భీమునితనం అన్నప్పుడు ఈ లక్షణాలన్నీ చెప్పినట్లే భీముడిలో సందర్భాన్నిబట్టి ఒక లక్షణాన్ని గుర్తించడానికిగాని, అన్ని లక్షణాలనూ గుర్తించడానికి గానీ ఈ భీమునితనం అన్నమాటను ఉపయోగించవచ్చు తనం' అన్న ప్రత్యయాన్ని వస్తువు ధర్మాన్ని బోధించడానికి ఉపయోగిస్తాం వ్యక్తుల లక్షణాన్ని ఉద్దేశించినప్పుడు ఆ వ్యక్తుల పేరుమీద 'తనం' చేర్చి వాడవచ్చు గాంధీతనం/గాంధీగారితనం అనవచ్చు ఆయనలో ఇంకా కొంత గాంధీతనం మిగిలి ఉంది అంటే ఆ వ్యక్తిలో ఇంకా గాంధీగారి లక్షణాలు/స్వభావం ఉందని అర్థం ఇటువంటి సందర్భాల్లో వ్యక్తిలోని ప్రధాన లక్షణమే గోచరిస్తుంది రావణుడితనం ఉంది అంటే రాక్షసత్వం వంటి చెడు లక్షణమే ముందు తోస్తుంది దుర్యోధనుడి తనం అన్నా అంతే ధృతరాష్ట్రుడి తనం అన్నప్పుడు ధర్మానికి వ్యతిరేకంగా నడిపించే పుత్ర ప్రేమ స్ఫురిస్తుంది రామునితనం అంటే ఒక ఉత్తమ మానవుడన్న అర్థం స్ఫురిస్తుంది సందర్భాన్ని బట్టి పితృవాక్య పరిపాలన, ధర్మపాలన, ఏకపత్నీవ్రతం, శరణాగత రక్షణ వంటి వాటిలో ఏదైనా స్ఫురించవచ్చు లక్ష్మణునితనం అంటే అన్నగారి అడుగుజాడల్లో నడిచే తమ్ముని స్వభావం స్ఫురిస్తుంది

చిన్నతనం అంటే చిన్నవాడి లక్షణం ఈ మాటను రెండు రకాలుగా వాడుతున్నాం వయసునుబట్టి చిన్నతనం ఒకటి వయసు తక్కువ కాబట్టి అనుభవంలేదు, లోకం తెలియదు అందువల్ల అమాయకుడు/ అమాయకురాలు అన్న అర్థం ఒకటి మరొకటి అల్పత్వం అమర్యాదను అనుభవించడం ఆయనకు చాలా చిన్న తనం కలిగింది అన్నప్పుడు ఇదే అర్థం బాల్యం అన్న అర్థంలోనూ వాడుతున్నాం నా చిన్నతనంలో అంటే నా బాల్యంలో అని అర్థం

పెద్దతనం అంటే పెద్దవాడి లక్షణం వృద్ధాప్యం అని ఒక అర్థం పరిపక్వత అని మరొక

ఉంది ఈ పరిపక్వత వయస్సులో మాత్రమేకాదు ఆలోచనలోనూ స్వభావంలోనూ ప్రవర్తనలోనూ కూడా పెద్దరికం పెత్తనం అయి యాజమాన్యం అధికారం అన్న అర్థం ఏర్పడింది చిలిపివాడి స్వభావం చిలిపితనం అట్లాగే అల్లరితనం పిరికివాడి స్వభావం పిరికితనం ముసలివాడి లక్షణం ముసలితనం ముసలివాడు అంటే ఇక్కడ కేవలం పురుషుడు కాదు స్త్రీ పురుషులు ఇద్దరి లక్షణమూ ముసలితనమే ఇటువంటివే కొంటెతనం మొండితనం మూర్ఖతనం, కుర్రతనం గరువతనం గడుసుతనం పెంకితనం మంచితనం పెద్దతనం చిక్కతనం వెకిలితనం, మకిలితనం మకురుతనం ఆడతనం మగతనం మొదలైనవి చలాకీగా ఉండే వ్యక్తి లక్షణం చలాకీతనం పేదవాడి లక్షణం పేదతనం అట్లాగే ఓడతనం దొంగ లక్షణం దొంగతనం శరీరావయవ లోపాన్ని వ్యక్తీకరించవచ్చు కుంటితనం గుడ్డితనం ఇటువంటివి

వయో, గుణ వాచకాలలాగానే రంగు రుచులను తెలిపే మాటలమీదా 'తనం' ప్రత్యయం వస్తుంది నల్లదనం, తెల్లదనం, ఎర్రదనం, పచ్చదనం, పుల్లదనం తియ్యదనం, కమ్మదనం మొదలయినవి

ఒజ్జ అంటే ఉపాధ్యాయుడు ఉపాధ్యాయుడి లక్షణం ఒజ్జతనం వెజ్జు అంటే వైద్యుడు అతని లక్షణం వెజ్జుతనం ప్రస్తుతం వృత్తులకు సంబంధించిన ఇటువంటి ప్రయోగాలు అంతగా వాడుకలో లేవు పనివాడు, ఆటగాడు వంటి మాటలమీద కూడా తనం చేరుతుంది పనివాడితనం అన్నప్పుడు పనివాడు అన్నమాటకు ఒక పనిలో నేర్పు కలిగినవాడని అర్థం పనివాడితనం అంటే నైపుణ్యం అని అర్థం పనితనం అన్నా అర్థం ఇదే

క్రియాజన్య విశేషణాలమీద కూడా తనం చేర్చవచ్చు వాడిది తెలిసినతనమూ కాదు తెలియని తనమూ కాదు అనవచ్చు లేదా తెలిసీ తెలియని తనం అనీ అనవచ్చు

ఇతర తద్ధిత ప్రత్యయాలు చేరి నామవాచకాలయిన మాటలమీద కూడా 'తనం' చేర్చవచ్చు తిరుగుబోతు, ఆశబోతు కుక్కబోతుల నుండి తిరుగుబోతు తనం, ఆశబోతుతనం, కుక్కబోతుతనం ఏర్పడతాయి ఇటువంటివే తగవులమారితనం, ఏడుపుగొట్టుతనం, కలుపుకోలుతనం, నేర్పరితనం, మాటకారి తనం, మోసకారితనం మొదలయినవి

లెక్కలేనితనం, సిగ్గులేనితనం అని వ్యతిరేక క్రియాజన్య విశేషణాలతోనూ వాడవచ్చు కొన్ని తత్సమ పదాలమీద కూడా తనం' చేరుతుంది బుద్ధిమంతతనం ఇటువంటిదే 'తనం' చాలా విస్తృతంగా వాడే తద్ధిత ప్రత్యయం

☆

# త్వార్థ, స్వార్థ ప్రత్యయాలు

తనంలాంటి తద్ధిత ప్రత్యయాలే రికం, ఇమి, న, ఇక, పు రికం చిన్న పెద్ద వంటి మాటలకు చే వస్తుంది చిన్నరికం, పెద్దరికం చుట్టరికం, దొంగరికం పేదరికం, బీదరికం, రాజరికం అత్తరికం, కోడం త్రికం కోడరికం, తొత్తరికం, వెజ్జరికం, కన్నెరికం మొదలైనవి రికం చేరి ఏర్పడ్డ మాటలు ౦ ౦ఒం అంటే కన్యాత్వం ఈ మాటకు మరో అర్థం కూడా ఏర్పడింది వారకన్యక ప్రథమ సంగమం అన్న అర్థంలో కావ్యాలలో ఈ మాటను ప్రయోగించారు, కన్నెరికం పెట్టడం అని కూడా అంటారు ఇటువంటి మాటలకు ప్రయోగం క్రమంగా తగ్గిపోతుంది మరికొన్ని తిట్లు కూడా ఈ ప్రత్యయంతో వాడుకలో ఉన్నాయి పెంపరికం అంటే పోషకత్వం

పేరు, కడు వంటి మాటలమీద ఇమి ప్రత్యయం చేరి తద్ధితనామాలు ఏర్పడతాయి పేరు+ఇమి= పేర్మి పేర్మి అంటే పెంపు, అభివృద్ధి, గొప్పతనం కడిమి అంటే బలం పరాక్రమం గొప్పతనం ముచ్చు అంటే దొంగ ముచ్చిమి అంటే దొంగతనం మేలు+ఇమి= మేలిమి మేలిమి అంటే శ్రేష్ఠత మేలిమిని విశేషణంగా వాడి మేలిమి బంగారం అంటారు కేవలం మేలిమి అన్నా మంచి బంగారమే మేలిమిగట్టు అంటే బంగారుకొండ, మేరు పర్వతం మగకు ఇమి చేరిస్తే మగటిమి అవుతుంది శౌర్యం, పరాక్రమం, పౌరుషం మగటిమి, మగతనం, మగ పంతం మొదలయిన మాటలు సమానార్థకాలు చెలికి ఇమి చేరిస్తే చెలిమి అవుతుంది చెలిమి అంటే స్నేహం, అనురాగం. పేద అన్నమాటకు పూర్వరూపం పేదరు దీనికి ఇమి చేరిస్తే పేద రిమి అవుతుంది పేదరిమి అంటే దారిద్ర్యం, లేమి మరో అర్థం పిరికితనం పోడిమి అంటే అందం, ఆదరం చిహ్నం, సుఖం అని అర్థం పోణిమి అనికూడా అనవచ్చు పదును అన్న అర్థంలో వాడిమి, ఉష్ణం అన్న అర్థంలో వేడిమి ఉన్నాయి

రంగు, రుచులను బోధించే విశేషణాల మీద 'న' ప్రత్యయం వచ్చి తద్ధితనామాలు ఏర్పడతాయి తెల్ల+న= తెల్లన ఇదేవిధంగా నల్లన, పచ్చన, ఎర్రన తియ్య+న= తియ్యన ఇట్లాగే పుల్లన, కమ్మన, చప్పన. చామన అంటే నలుపు చామనచాయ అంటే నలుపురంగు ఆకుపచ్చ కూడా ఒయ్యకు న' చేరిస్తే ఒయ్యన అవుతుంది ఒయ్యన అంటే తిన్నగా, మెల్లగా ఒయ్యనొయ్యన అనికూడా వాడవచ్చు మెలమెల్లగా, క్రమక్రమంగా అని అర్థం పద్యాలలో ఈ మాటను వాక్యాలంకారంగా కూడా వాడతారు అంటే పద్యంలో పాదపూరణ కోసం వాడే మాట చెప్పుకోదగిన అర్థమేమీ ఉండదు ఒప్పిదంగా, తగినట్లుగా, బాగుగా వంటి అర్థాలిస్తుంది అల్లకు 'న' చేరిస్తే అల్లన అవుతుంది మెల్లకు న' చేరిస్తే మెల్లన అవుతుంది రెండింటికీ ఒకే అర్థం మెల్లదనమని అర్థం చక్క అంటే రుజువు, తిన్ననిది, అందమైనది అని అర్థం దీనికి న ప్రత్యయం చేరిస్తే చక్కన ఏర్పడుతుంది చక్కన అంటే మనోహరం, సుందరం, స్పష్టం, వంకర లేకుండా తిన్నగా ఉండేది, మంచిది అని అర్థాలు తిన్నన అంటే తగినటువంటిది, సూటి, స్వస్థత, సౌమ్యత అని అర్థాలు తిమ్మన అన్నమాట కూడా ఉంది తిమ్మ అనేమాటకు న' చేరిస్తే ఇది ఏర్పడుతుంది తిమ్మ అంటే స్వాస్థ్యం, నెమ్మది తిమ్మన అంటే స్వస్థత, చక్కనైనది, మనోజ్ఞమైనది పారిజాతాపహరణం రాసిన నంది తిమ్మన పేరులోని తిమ్మ శబ్దం ఇదే

వ్రేక అంటే బరువైనది, పెద్దది వ్రేకన అంటే బరువు, భారం విన్న అంటే కాంతిహీనం,

విచ్ఛిన్నమైంది విన్నదనం విన్నాణం విన్నాణి విన్నబిమ్మ విన్నపోవు వంటి మాటల్లో దీనికి ప్రయోగం ఉంది విన్నన అంటే వైవర్ణ్యం కాంతిహీనత తక్కువ వెలి అన్న అర్థం కూడా ఉంది

ఇక ప్రత్యయం క్రియా ప్రాతిపదికల మీద ఎక్కువగా వస్తుంది నామవాచకాలమీద తక్కువ అగ్గలం అంటే ఎక్కువ పెంపు ఉత్సాహం పూనిక అగ్గలిక అంటే విజృంభణం అతిశయం, ఉత్సాహం పూనిక అగ్గలికం అని కూడా అనవచ్చు

ఒమ్ము అంటే సరిపడు ఒమ్మిక అంటే పొందిక పొలుపు అందం రంగు రుచులను బోధించే విశేషణాల మీద పు ప్రత్యయం చేరుతుంది తెలుపు, ఎరుపు, నలుపు, పసుపు రంగులు పులుపు రుచి

ఇక ప్రత్యయం నామవాచకాల మీద చేరినప్పుడు అర్థభేదం లేనిమాటలు చాలా ఏర్పడతాయి అంటే ప్రత్యయం చేరకముందు ఉన్న అర్థమే చేరిన తరువాత కూడా ఉంటుంది ఇటువంటి ప్రత్యయాన్ని స్వార్థంలో వచ్చిన ప్రత్యయమని వ్యాకర్తలు చెప్తారు స్వ+అర్థం అన్నమాట అరమర అన్నమాటకు శంక, జంకు, సందేహం అని అర్థం అరమరిక అన్నా అదే అర్థం ఆము అంటే గర్వం, మదం ఆమిక అన్నా అదే అర్థం అల్లిబిల్లి- అల్లిబిల్లిక, గండి-గండిక, నడవడి-నడవడిక, నివ్వాళి-నివ్వాళిక, పొత్తి-పొత్తిక మాన-మానిక, మెలి-మెలిక, వాలు-వాలిక ఇటువంటివే గండిక అంటే రంధ్రం నివ్వాళిక అంటే ఆరతి, నీరాజనం, దీపం పొత్తిక అంటే గుడ్డముక్క మరొక పొత్తిక కూడా ఉంది ఇక్కడ పొత్తు+ఇక అని విభాగం ఇక్కడ కూడిక, కలయిక అని అర్థం మానిక అంటే నాలుగు సోలల పాత్ర ధాన్యం, నేయి వంటివాటిని కొలవడానికి ఉపయోగించే పాత్ర వివిధ ప్రాంతాలలో మానికలు వేరువేరుగా ఉన్నాయి. చిన్న మానిక, పెద్ద మానిక అనికూడా రెండు విధాలున్నాయి ఇది పరిమాణాన్ని బట్టి చేసిన విభాగం మెలిక అంటే పెన హారం మెలికపడింది అంటాం చిక్కు అనే అర్థంకూడా వచ్చింది ఆలంకారికంగా వాడు ఏదో మెలిక పెట్టే ఉంటాడు' అని వాడతాం మనకు తెలియని చిక్కు ఏదో పెట్టి ఉంటాడని అర్థం మెలిక వేశాడని కూడా ప్రయోగం నాలిక అంటే పొడుగు వాడి అయినది అని కూడా అర్థం ఉంది

ఉక అనే ప్రత్యయం ప్రధానంగా స్త్రీ వాచక శబ్దాలమీద కనిపిస్తుంది చిరుతుక, మెలతుక, నాతుక, పడతుక, మడతుక, పొలతుక, వెలదుక మొదలైనవి నిప్పు- నిప్పుక, ఎమ్ము-ఎమ్ముక/ఎముక అవుతాయి స్త్రీ వాచకంగా దీనికి ఆధునిక భాషలో అంతగా వాడుకలేదు చెలికాడు, చెలికత్తె అన్నమాటల్లో కాడు, కత్తె అన్న ప్రత్యయాలు స్వార్థంలోనే వస్తాయి కల్లరీడు, మొక్కలీడు అన్నమాటల్లో 'ఈ' ప్రత్యయం వచ్చింది వీటికి ఆధునిక భాషలో వాడుక తక్కువ

☆

# మతుబర్థక ప్రత్యయాలు

మతుబర్థం అంటే కలవాడు, కలది అనే అర్థం కలవాడు కలది అనే అర్థం ఇచ్చే ప్రత్యయాలు మతుబర్థక ప్రత్యయాలు శ్రీమంతుడు, ధీమంతుడు, ధైర్యవంతుడు వంటి మాటల్లొ ఈ ప్రత్యయం ఉంది సంస్కృతంలో ఈ ప్రత్యయం ఏవిధంగా వస్తుందో తెలుగులో ఆవిధంగా వచ్చే ప్రత్యయాలు మతుబర్థక ప్రత్యయాలు తెలుగులో కాడు, కత్తె అనేవి ఇటువంటి ప్రత్యయాలే

చెలిమికాడు అంటే చెలిమి కలిగినవాడు, స్నేహితుడు చెలిమికత్తె అంటే చెలిమి కలిగిన స్త్రీ, స్నేహితురాలు అందగాడు- అందం కలవాడు, అందగత్తె అందం కలిగిన స్త్రీ ఇట్లాగే ఆట గాడు, ఆటగత్తె ఇటీవలి కాలంలో క్రీడాకారుడు, క్రీడాకారిణి అన్న మాటలకు ఉన్న ప్రాచుర్యం ఆటగాడు, ఆటగత్తె అన్న మాటలకు కనిపించడంలేదు ఆటగాడు బహువచన రూపంలో కొంచెం ఎక్కువగానే వాడుకలో ఉంది మన ఆటగాళ్ళు, క్రికెట్ ఆటగాళ్ళు, ఫుట్‌బాల్ ఆటగాళ్ళు మొదలయిన విధంగా వాడుతూ ఉన్నాం ఆటగాడు అని ఏకవచనంలో కూడా వాడుక ఉంది ఆటగాడికి ఉండవలసిన లక్షణం, ఆటగాడికి ఇవ్వవలసిన సౌకర్యాలు అన్నవిధంగా ఎక్కువగానే వాడుతున్నాం కాని స్త్రీ వాచకంగా ఆటగత్తె అన్న మాటను చాలా అరుదుగా వాడుతున్నారు ఏక వచనంలోనయినా అప్పుడప్పుడూ ఎవరయినా వాడుతున్నారేమోకాని బహువచన రూపంలో ఆటగత్తెలు అని మాత్రం వాడుతున్నట్లు లేదు ఆటగత్తె అంటే అదేదో కొంచెం తక్కువ మాటగా తోస్తున్నదేమో కాడు, కత్తె ప్రత్యయాలను చాలా విస్తృతంగా వాడవచ్చు పూర్వం వాడారు కూడా కాడు/గాడు, కత్తె/గత్తె వాడితే ఏదో గౌరవం తగ్గిపోయినట్లు భావిస్తున్నాం అందువల్ల వాటిని మాని ఆ సందర్భాల్లో సంస్కృత పదాలు వాడడానికి ప్రయత్నం చేస్తున్నాం జూదగాడు వంటిచోట్ల మాత్రం ఈ ప్రత్యయాన్ని ధారాళంగా వాడుతున్నాం జూదగాడికి సమాజంలో గౌరవం లేదుకాబట్టి ఆ మాట వాడడానికి సందేహించవలసిన అవసరం లేదేమో

కొన్నిమాటల్లో కాడు/కత్తె ప్రత్యయాలు బాగా స్థిరపడిపోయాయి అక్కడ మాత్రం మరోమాటకోసం వెదుక్కోవడంలేదు. ముఖ్యంగా విలుకాడు, వేటకాడులకు మాత్రం సంస్కృత పదాలను వాడడంలేదు ధానుష్కుడు వంటి మాట ఉన్నా విలుకాడు పదానికే ప్రచారం ఎక్కువ

బేరగాడు అన్నమాట కూడా ఇటువంటిదే దీనికి వాడుక బాగానే ఉంది నేస్తగాడు, నేస్తకత్తె అంతగా వాడుకలో లేకపోయినా దురర్థమేమీ లేదు అందగాడు లాగా సొగసుకాడు అనికూడా వాడవచ్చు అందకత్తెలాగా సొగసుకత్తె

పూర్వం అడపకాడు, అడపకత్తె అనేమాటలకు వాడుక ఉండేది అడపం అంటే తాంబూలం పెట్టుకొనే పెట్టె, సంచి ఆకులు, వక్కలు, సున్నం మొదలయిన తాంబూల సామగ్రి ఉంటుంది ఇందులో పూర్వం రాజులకు, ధనవంతులకు వెనక ఈ పెట్టె పట్టుకుని ఉండే పరిచారకులుండేవారు తాంబూలం చుట్టి ఇవ్వడం వాళ్ళ పని శాసనాలలో అడపం అనే మాటకు తాంబూలం అందించే సేవకుడు అన్న అర్థంకూడా ఉంది రాయసం వంటిమాట కావచ్చు ఇప్పుడు ఈ మాటలకు అవకాశమే లేదు అందువల్ల ప్రయోగమూ లేదు అందం అనే మాటకు తెలుగులో చాలా పర్యాయపదాలున్నాయి కాని వాటి వాడుక తక్కువ ఎమ్మె అనేది అటువంటి మాటల్లో ఒకటి అందం అనీ, విలాసం అనీకూడా ఈ మాటకు అర్థం ఎమ్మెకాడు

[illegible] తెలుగులో ఓయారం
[illegible] ఉంది దీనికే కాను కత్తె చేర్చి వాడవచ్చు

[illegible]
కొండెం పెట్టి మాటను పొత్తు మొదలయిన మాటలకు కూడా కాను కత్తె ప్రత్యయాలు చేరి [illegible] ముఖ్యంగా రచనా భాషలో వాడుక తక్కువ గొప్పవాడు గొప్ప స్త్రీ అన్న అర్థంలో మొనగాడు మొనగత్తె అన్న మాటలను వాడవచ్చు ఈ రెండు మాటలు [illegible] వ్యవహారంలో విరివిగానే ఉన్నా రాతలో తక్కువగానే కనిపిస్తాయి

అర్థభేదం లేకుండా కూడా ఈ ప్రత్యయం కొన్ని మాటల్లో వస్తుంది చెలికాడు చెలికత్తె [illegible] చెలి అన్నా చెలికాడన్నా అర్థం ఒకటే చెలి అన్న మాటకు స్నేహితుడు స్నేహితురాలు అనీకూడా అర్థం లింగభేదం లేదు చెలి అంటే స్త్రీ అన్న అర్థంకూడా ఉంది చెలి- చెలికాడు, చెలి- చెలికత్తె వీటికి అర్థభేదం లేదు ఇటువంటిదే ఒంటరి అన్నమాట దీనిమీద కూడా కాడు 'కత్తె చేర్చి ఒంటరిగాడు ఒంటరిగత్తె అనవచ్చు

మతుబర్థంలో ఈ అన్న ప్రత్యయం కూడా ఉంది కన్నదం+ఈ+డు- కన్నడీడు అవుతుంది అంటే కన్నాలకుడు ఇట్లాగే మన్నెము+ఈడు- మన్నీడు మన్నెం కలవాడు భూస్వామి సామంతుడు, అదిపతి అని అర్థం సుంకీడు అంటే సుంకరి 'ఈ' ప్రత్యయంతో ఇప్పుడు వాడుకలో ఉన్నమాటలు తక్కువ

అరి అన్న ప్రత్యయం కూడా మతుబర్థంలో వస్తుంది చదువు- చదువరి, కల్ల-కల్లరి జూదం- జూదరి, టక్కు-టక్కరి, తగవు- తగవరి, తిర్పు- తీర్పరి, తెంపు- తెంపరి, తెరువు- తెరవరి, నెర్పు- నేర్పరి, సిగ్గు- సిగ్గరి సుంకం- సుంకరి, జాలం- జాలరి వంటి మాటలు వాడుకలో ఉన్నాయి

ఇ ఓయారము వంటి మాటల మీద వస్తుంది ఓయారం- ఓయారి, కడలు- కడలి, కడలు అంటే అల అల ఉండేది కాబట్టి కడలి సముద్రం అట్లాగే బండారి, బేహారి, మిటారి వంటి మాటలు

కుల వాచకంగా త అనే ప్రత్యయం ఉంది స్త్రీని బోధించే ఈ ప్రత్యయాన్ని ఇప్పుడు వాడడం లేదు ఆడి/ఆదు అనే ప్రత్యయాలూ ఎక్కువగా వాడుకలో లేవు వగలాడి, వగలాడు వంటివి

☆

# అభావాది అర్థాలు

లేనిది, లేనివాడు అన్న అర్థంలో వచ్చే ప్రత్యయాలను అభావార్థక ప్రత్యయాలు అంటారు ఇడి అన్నది తెలుగులో అభావార్థక ప్రత్యయం సిగ్గు+ఇడి= సిగ్గిడి సిగ్గులేనివాడు అని అర్థం ముక్కు-ముక్కిడి, ముక్కులేనివాడు వాలు+ఇడి= వాలిడి తోకలేని కోతి వెరవు+ఇడి= వెరవిడి వెరవు అంటే ఉపాయం వెరవిడి అంటే ఉపాయం లేనివాడు

మానం అంటే కొలత చాంద్రమానం, సౌరమానం అంటాం కదా కాలమానం అని కూడా అంటాం ఈ మానార్థంలో తెలుగులో వచ్చే ప్రత్యయం ఎడు కొలతను సూచిస్తుందన్న మాట జాన+ఎడు= జానెడు జాన పొడవైన అని అర్థం బెత్తె+ఎడు= బెత్తెడు వేలు+ఎడు= వేలెడు వేలెడు, జానెడు, బెత్తెడు అన్న మాటలను జాతీయాలుగా కూడా వాడతాం పొట్టి, అల్పమైన అని అర్థం మూర+ఎడు= మూరెడు, బార+ఎడు= బారెడు అవుతుంది బారెడును పొడవైన అన్న అర్థంలో కూడా వాడతాం జాన, బెత్తె రెండూ కలిపి జానాబెత్తెడు అని కూడా వాడతాం ఈ మాటకూ పొట్టి, అల్పమైన అనే అర్థం జానాబెత్తెడు లేదు అంటాం పొడవును సూచించడానికే కాక పరిమాణాన్ని సూచించడానికి కూడా ఎడు ప్రత్యయాన్ని వాడతాం గిద్ద+ఎడు= గిద్దెడు సోలెడు, అరసోలెడు ఇటువంటివే మానిక+ఎడు= మానెడు అవుతుంది పుట్టి+ఎడు= పుట్టెడు అవుతుంది పుట్టెడు అన్నమాటను ఎక్కువ పరిమాణంలో అన్న అర్థంలో కూడా వాడ వచ్చు చాలా, మిక్కిలి అన్న అర్థంలోనూ వాడవచ్చు ఆయన పుట్టెడు దుఃఖంలో ఉన్నాడు' అంటాం బండి+ఎడు= బండెడు బండెడు అన్నమాటను కూడా ఎక్కువ అన్న అర్థంలో వాడతాం తూము+ఎడు= తూమెడు అవుతుంది లొడిత+ఎడు= లొడితెడు అవుతుంది గంప+ఎడు= గంపెడు గంపెడు పిల్లలు అని వాడుక

గంటె, గిన్నె, గ్లాసు, చెంబు, బిందె, కుండ, తొట్టి, బాన, పెట్టె మొదలైన మాటలన్నింటి పైనా ఎడు ప్రత్యయం వస్తుంది గంటెడు, గిన్నెడు, గ్లాసెడు, చెంబెడు, బిందెడు, కుండెడు తొట్టెడు, బానెడు, పెట్టెడు కొంచెం అన్న అర్థంలో చిటికెడు అంటాం చిటిక+ఎడు అన్నమాట పిడికిలి+ఎడు= పిడికెడు అవుతుంది పిల్లికి పిడికెడు బిచ్చం వేయడు' అంటారు పిడికెడు అన్నది కూడా కొంచెం, తక్కువ అన్న అర్థంలో వాడుకలో ఉంది దోసిలి+ఎడు = దోసెడు అవుతుంది పుడిసిలి+ఎడు= పుడిసెడు అవుతుంది దోసిలి అన్నప్పుడు రెండు చేతులు దగ్గరగా పెట్టి దొన్నెలాగా చేయడం అయితే పుడిసిలి అన్నప్పుడు ఒక్క చేతినే దొన్నెలాగా చేయడం

సీసా, చెంచా వంటి మాటలమీద కూడా ఎడు ప్రత్యయం చేరుతుంది అయితే సీసెడు, చెంచెడు అన్న వాడుక తక్కువగా కనిపిస్తుంది సీసాడు, చెంచాడు అన్న వాడుక ఎక్కువ ఈ మాటలు దీర్ఘాంతాలు కావడం వల్ల ఇటువంటి రూపాలు ఏర్పడి ఉండవచ్చు డబ్బా+ఎడు కూడా డబ్బాడు అవుతుంది

లోతును కొలిచే సందర్భంలో బంటి, కొలది ప్రత్యయాలు వస్తాయి మోకాలిబంటి, నడుముబంటి, మెడబంటి, మొలబంటి, రొమ్ముబంటి, మడమలబంటి అని వాడతాం బంటి లాగానే కొలది కూడా కాని ఆధునిక భాషలో దీనికి అంత విస్తృతిలేదు పిండికొద్దీ రొట్టె వంటి సామెతలలో స్థిరపడిపోయింది అలంకారికంగా మొలబంటి కూరుకుపోయాడు వంటి

ప్రయోగాలున్నాయి

మరి ప్రత్యాన్ని ఆర్చి చూపించారా పోతు మారి అన్న ప్రత్యయాలు వాడి ఉన్నాం చూశా ఆనే స్వభావం కలిగినవాడు ఆశపోతు ఎక్కువ ఉన్నవాడు ఆశపోతు ప్రయాణాల్లో కుట్టుపోతు ఒళ్ళు తెలియకుండా తాగేవాడు తాగుబోతు పిరికి స్వభావం కలిగినవాడు పిరికిపోతు ఈ తిరుగుబోతు అన్న మాటకు శీలం లేనివాడు అన్న అర్థంకూడా వచ్చింది ఎక్కువగా మాట్లాడేవాడు వదరుబోతు ఈ శతాబ్దం ఆరంభంలో వదరుబోతు అన్న పేరుతో సంఘ విమర్శనాత్మకమైన వ్యాసాలు వచ్చాయి పాశ్చాత్యంలోని ఒక్క్రి ... స్పెక్టేటర్ వ్యాసాల లాంటివి అవి ఉడికే స్వభావం కలిగినవాడు ఉడుకుబోతు ఊరికే ఉడుక్కుంటాడన్నమాట ఎక్కువగా బెదిరిపోయేవాడు బెదురుబోతు గర్విష్ఠి పొగరుబోతు

మారి అన్న ప్రత్యయం తగువు చిక్కువంటి మాటలమీద వస్తుంది సాధారణంగా బహువచన రూపం మీద వస్తుంది తగువులమారి చిక్కులమారి తంపులమారి పోట్లమారి బాగా కొవ్వుబాపం ఉన్నవాడు మంటమారి కావ్యాలలో ఈ మాటకు ప్రయోగాలున్నాయి ఆధునిక భాషలో అంతగా వాడుతున్నట్లు కనిపించదు జిత్తులమారి అన్నమాటకు మాత్రం వాడుక ఎక్కువ ఏ కథలోనైనా నక్కవస్తే చాలు జిత్తులమారి నక్క అనే అంటాం కొండేలు చెప్పేవాడు కొండెలమారి/కొండెములమారి పిశూరీల మారి అని కూడా అనవచ్చు తెగపొగిడే వాడిని పొగడ్తలమారి అనవచ్చు తిట్టేవాడిని తిట్లమారి అనవచ్చు

పోతు, మారి అన్న ఈ రెండు ప్రత్యయాలూ తాచ్ఛీల్యార్థంలో అంటే అటువంటి శీలం స్వభావం కలవాడు అన్న అర్థంలో వచ్చేవి అయితే వీటితో వచ్చే మాటలు చాలావరకు దురర్థం లోనే కనిపిస్తున్నాయి ఈ శీలం ప్రశంసావహమైంది కాదు తిరస్కార ధోరణిలో మాట్లాడే మాట లివి

తెలుగులో స్త్రీవాచకంగా సాని అన్న ప్రత్యయం ఉంది విడిగా ఈ మాటకు వేశ్య అన్న అర్థం ఏర్పడింది సానిది అనికూడా అంటారు దొర అన్నమాటకు చేర్చినప్పుడు ఈ మాటకు గౌరవార్థమే ఉంటుంది దొరసాని అని యజమానురాలిని అంటారు తెల్లవాళ్ళలో మగవారిని దొరలు అన్నట్లుగానే, ఆడవాళ్ళను మనవాళ్ళు దొరసానులనే అనేవాళ్ళు పూర్వం పెద్దింటి ఆడపడుచులు పేరుచివర సాని చేర్చుకొనేవాళ్ళు వెయ్యేళ్ళ కిందట విరియాల కామసాని గూడూరులో శాసనం వేసింది పిల్లలమర్రిలో ఎరుక సానమ్మ శాసనం వేయించింది తెలుగు దేశంలో ఇప్పటికీ ఇంటిపేరులో సాని ఉన్నవాళ్ళు చాలామంది ఉన్నారు పెమ్మసాని, కొమ్మసాని, ముద్దసాని తలసాని ఇటువంటివే సాని స్వామిని శబ్దం నుండి ఏర్పడిందంటారు హీనయాన బౌద్ధంలో బౌద్ధసన్న్యాసులను స్వాములనీ, సన్న్యాసినులను స్వామినులని పిల్చేవారనీ ఈ బౌద్ధ సన్న్యాసినులలో ప్రబలిన దుశ్శీలంవల్లే స్వామిని శబ్దానికి వేశ్య అనే అర్థం వచ్చిందనీ అంటారు స్వామి/సామి శబ్దాన్ని ఇప్పటికీ పేర్లలో వాడుతూనే ఉన్నాం దాని గౌరవం అట్లాగే ఉంది సాని శబ్దం మాత్రం అటు గౌరవార్థంలోనూ, ఇటు నిందార్థంలోనూ వాడుకలో ఉంది

☆

# అరువు ప్రత్యయాలు

తద్దిత ప్రత్యయాలు చేర్చి నామవాచకాలు తయారుచేసుకొనే ప్రక్రియ అన్ని భాషల్లోనూ ఉంది వివిధ భాషల మధ్య సంబంధాలు, పరస్పర ప్రభావానికి కారణమవుతాయి మాటలు అరువు తెచ్చుకోవడం అన్ని బాషలూ చేసేపనే, ఈ అరువు తెచ్చుకోవడంలో ఆ భాషల్లోని కృదంత నామాలూ, తద్ధితనామాలూ కూడా వస్తాయి ఉదాహరణకు జమీందారు వంటి మాటను తీసు కోవచ్చు జమీందారు అంటే భూస్వామి ఈ దారు' అన్నది కలవాడు అన్న అర్థంలో వచ్చింది వతన్‌దారు వంటి మాట కూడా ఇటువంటిదే తెలుగులోకి 'దారు ప్రత్యయంతో చాలా మాటలు వచ్చాయి తహసీలుదారు, కౌలుదారు ఖిలేదారు ఫౌజుదారు, దుకాణదారు, మిరాసీదారు ఇటువంటివి ఈ మాటల్లోని 'దారు' తెలుగు మాటలకు కూడా వ్యాపించింది

తెలుగు మాటల్లో కొనుగోలుదారుడు, అమ్మకందారుడు, పెట్టుబడిదారుడు, వాడకం దారుడు, దోపిడిదారు మొదలయినవి దారు ప్రత్యయం చేరి ఏర్పడ్డవే కొనుగోలుదారు, అమ్మకం దారు, వాడకందారు అని 'డు' చేర్చకుండా కూడా వాడవచ్చు స్త్రీ వాచకంగా 'దారిణి' వస్తుంది జమిందారిణి వంటివి సంస్కృతం నుండి అరువు తెచ్చుకున్న మాటలమీద కూడా ఈ ప్రత్య యాన్ని చేర్చివాడుతున్నాం వ్యవసాయదారుడు, వినియోగదారుడు, వాటాదారుడు మొదలయిన మాటలిటువంటివి

పెత్తందారు అని పెత్తనం మీద దారు చేర్చి పెత్తనం కలిగినవాడు అన్న అర్థంలో వాడు తున్నాం

అనుయాయి, సహాయకుడు, సమర్థకుడు అన్న అర్థంలో మద్దతుదారుడు అని వాడు తున్నాం ఈ మాట మదద్గార్ ఇందులోని ప్రత్యయం 'గార్' కాని తెలుగులో ఈ మాటలో అది దారు అయిపోయింది తెలుగులో చేరిన ఇంగ్లీషు మాటలమీద కూడా ఈ 'దారు' చేరిన రూపాలున్నాయి ఉదాహరణకు సప్లైదారును తీసుకోవచ్చు దీనికి పర్యాయపదం మరో అరువు మాట సరఫరా దీనిమీదా దారు చేర్చి సరఫరాదారుడు చేసుకున్నాం ఇట్లాగే దేశ్యాలు, అన్యదేశ్య పదాలన్నింటిమీద ఈ దారు ప్రత్యయాన్ని చేర్చి మాటలు తయారుచేసుకోవచ్చు ఉదాహరణకు ఈ తయారు అనే మాటనే తీసుకోవచ్చు తయారీదారు అని వాడవచ్చు పితూరీదారు, లబ్ధి దారుడు, కబ్జాదారు, పంపకందారు, భూమిదారుడు, ఫ్యాక్టరీదారుడు మొదలయినవి 'దారు వంటి ప్రత్యయాలకు విస్తృతి ఉంటుంది అంటే ఇంతకుముందు వాడుకలోకి వచ్చిన మాటలతోనేకాక కొత్త కొత్త మాటలతో చేర్చి వాడుకొనే అవకాశం ఉంటుంది

యజమాని అన్న అర్థంలో స్వంతదారు అనేమాట కూడా వాడుకలోకి వచ్చింది ఈ కారు స్వంతదారుడు ఫలానా అనవచ్చు అవసరం అయితే ఇంటిదారుడు, కొట్టుదారుడు, గిన్నెదారు అనికూడా వాడవచ్చు

మదద్గార్‌లోని గార్ అన్న ప్రత్యయం కూడా తెలుగులోకి వచ్చింది దీన్ని గౌరవ వాచకంగా వాడుతున్నాం మాస్టరుగారు, అయ్యగారు అమ్మగారు, అన్నగారు, పంతులుగారు వంటివన్నీ గారు ప్రత్యయం చేరినవే గౌరవ వాచకంగా మనం వాడే ప్రత్యయం బహువచన ప్రత్యయం అట్లాగే బహువచన సర్వనామం కూడా గౌరవ వాచకమే మేము, మీరు, వారు మూడూ గౌరవ

[illegible] ఏకేశ్వరాల [illegible] చేర్చివారికి [illegible] అయింది వారు [illegible] చాలా పెద్దవారు [illegible] అయ్యవారు అని ఉపాధ్యాయులకు వాడుతున్నాం స్త్రీ దేవతను అమ్మవారు అంటాం ఈ కారణంగానే మసూచికానికి [illegible] వంటివంటి వాటికి అమ్మవారు పోసిం [illegible] శాసనాలలో తిమ్మరుసు అయ్యవారు అన్నవిధంగానే ఉండేది ఇప్పుడు గారు తెలుగులో గౌరవ వాచకంగా స్థిరపడి పోయింది

కోరు అనే మరో ప్రత్యయం కూడా ఇట్లా వచ్చిందే దగాకోరు ఫుండాకోరు వంటి మాటలలో ఈ ప్రత్యయం తెలుగులోకి వచ్చింది అబద్దాలకోరు బాగా వాడుకలో ఉన్నమాట మాటల కోరు తగాదాలకోరు అని కూడా అనవచ్చు

జమీందారు లక్షణం జమీందారీ బాధ్యత అన్న అర్థంలో జవాబుదారీ అన్నమాట వాడుకలో ఉంది వీటి సామ్యంతో తెలుగులో పెత్తందారీ అనేమాట ఏర్పడింది

సంస్కృతంలో జటాధారి అనే మాట తెలుగులో 'జడదారి' అయింది తెలుగులో విశేషంగా వాడే మాయదారిలోని దారికి జడదారిలోని దారికీ ఏమైనా సంబంధం ఉందోలేదో కోపదారి అన్నమాట కూడా ఉంది

సంస్కృతంలో కార ప్రత్యయం ఒకటి ఉంది కుంభకారుడు అంటే కుమ్మరి కుండలు చేసేవాడు కలంకారీ వంటి మాటల్లో పనితనం అన్న అర్థంలో ఈ ప్రత్యయం కనిపిస్తుంది తెలుగులో మాటకారి అన్న మాటలో ఈ 'కారి' నేర్పరి అన్న అర్థంలో వచ్చింది మోసకారి, దోసకారి వంటి మాటలలో ఉన్న 'కారి'కీ దీనికీ భేదం ఉంది ఈ రెండు మాటల్లో నేర్పరితనం ఏమీలేదు మాటకారి పద్ధతిలో ఆటకారి, పాటకారి అని కూడా వాడవచ్చేమో

మరొక ప్రత్యయం 'నామా' కవులునామా రాజీనామా, కరారునామా, చిరునామా వంటి మాటల్లో ఈ ప్రత్యయం ఉంది ఈ ప్రత్యయం ఇంగ్లీషు 'విల్' మీద చేరి తెలుగులో వీలునామా అన్న మాట ఏర్పడింది

భాషలో పదసంపదను పెంచుకోవడానికి కృత్, తద్ధిత ప్రత్యయాలు చాలా తోడ్పడతాయి వీటికి నూతన పద సృజనశక్తి అద్భుతంగా ఉంటుంది

☆

# అపత్యార్థక ప్రత్యయాలు

తెలుగులో లాగానే సంస్కృతంలో కూడా తద్ధిత ప్రక్రియ విస్తారంగా ఉంది తద్ధిత ప్రత్యయాలు అనేక అర్థాలలో వస్తాయి ఈ ప్రక్రియ వల్ల ఎన్నో కొత్త పదాలను నిర్మించుకునే అవకాశం ఏర్పడుతుంది ఎన్నో సంస్కృత పదాలు తద్ధిత ప్రత్యయాలు చేరి ఏర్పడ్డవి తెలుగులోకి కూడా వాడుకలోకి వచ్చాయి దాదాపు సంస్కృతంలో ఆ ప్రత్యయానికి ఏ అర్థం ఉంటుందో తెలుగులో ఆ ప్రత్యయం చేరిన మాటకు కూడా అదే అర్థం ఉంటుంది

మనం కోట్లమందిమి ఉన్నాం ఇంతమందికీ విడివిడిగా కొత్త పేర్లు సాధ్యమయ్యేవి కావు ఒకే పేరు చాలా మందికి ఉంటుంది చైనాలో ఏదో పేరు కోట్లమందికి ఉంటుందట ఒకే కుటుంబంలో కాని, గ్రామంలోకాని ఒకే పేరు ఉన్న వ్యక్తులు ఉంటే వాళ్ళను వేరుచేసి గుర్తించడం ఎలా తండ్రి పేరు ఉపయోగించవచ్చు ఫలానా ఆయన కొడుకు అని ఇప్పుడు తమిళంలో బాగా వాడుకలో ఉన్న పద్ధతి ఇది వ్యక్తిపేరుతో తండ్రి పేరు కూడా ఉంటుంది శ్రీనివాసన్ వెంకట రాఘవన్ అంటే శ్రీనివాసన్ కుమారుడయిన వెంకటరామవన్ అని అర్థం రామనాదన్ కృష్ణన్ అంటే రామనాధన్ కుమారుడు కృష్ణన్ అని అర్థం పూర్వం తెలుగువాళ్ళలోనూ ఈ సంప్రదాయం ఉంది ప్రోలయ వేమారెడ్డి అంటేప్రోలయరెడ్డి కొడుకు వేమారెడ్డి కాటయ వేమారెడ్డి అంటే కాటయరెడ్డి కొడుకు వేమారెడ్డి పేదకోమటి వేమారెడ్డి అంటే పెద కోమటి రెడ్డి కొడుకు వేమా రెడ్డి ప్రోలయ వేమారెడ్డి రెడ్డిరాజ్య స్థాపకుడు కాటయ వేమారెడ్డి కాళిదాసు నాటకాలకు వ్యాఖ్యా నాలు రచించినవాడు, రాజమండ్రి రెడ్డి రాజ్యస్థాపకుడు పెదకోమటి వేమారెడ్డి ఆస్థానంలో శ్రీనాధుడు విద్యాధికారి, సర్వజ్ఞుడని ప్రసిద్ధి కాంచిన పండితుడు ఈ పేరులో మరో సంజ్ఞ కూడా ఉంది పెదకోమటిరెడ్డి అంటే ఈ కుటుంబంలో మరో కోమటిరెడ్డి ఉన్నాడన్న మాట అతను చినకోమటిరెడ్డి అయి ఉండాలి పెద్ద, చిన్న, పొట్టి, పొడుగు, కుంటి, తెల్ల, ఎర్ర, నల్లవంటి విశేష ణాలు కూడా పేరుముందు చేరి మనిషిని గుర్తుపట్టడానికి సహాయపడతాయి తండ్రి పేరును చేర్చుకున్నట్లే తల్లి పేరూ చేర్చుకోవచ్చు శాతవాహనులు ఇక్ష్వాకులూ ఇట్లా తల్లిపేరు పెట్టుకున్న వాళ్ళే గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి అంటే ఈ యజ్ఞశ్రీ శాతకర్ణి గౌతమి కుమారుడు అని అర్థం మాఢరీపుత్ర వీరపురుష దత్తుడు ఇటువంటి పేరే

ఇప్పటికీ మన ఊళ్ళలో ఈ సంప్రదాయం బలంగానే ఉంది రామయ్యగారి వెంకయ్య, గోవిందమ్మగారి కృష్ణారెడ్డి వంటి వాడుక అందరికీ తెలిసిందే మరో భేదక లక్షణం ఇంటిపేరు ఇంటిపేరు సాధారణంగా మన ఊరుపేరో, మన కుటుంబంలో ప్రసిద్ధమైన వ్యక్తి పేరో, మనం అవలంబించిన వృత్తో, చేసిన పనో మరొకటో అయి ఉంటుంది

తెలుగులో మనం అవలంబించే ఈ పద్ధతులు సంస్కృతంలో తద్ధిత ప్రత్యయాల ద్వారా కూడా నెరవేరతాయి అపత్యం, సంతానం అన్న అర్థంలో సంస్కృతంలో వివిధ ప్రత్యయాలు న్నాయి ఈ ప్రత్యయాలు చేరినప్పుడు పదస్వరూపంలో కొన్ని మార్పులు కూడా వస్తాయి ప్రాచీన కావ్యాలలోనూ, ఇతర సాహిత్య, సాహిత్యేతర రచనల్లోనూ ఇటువంటి తద్ధితనామాల సంఖ్య బాగానే ఉన్నప్పటికీ ఇప్పుడున్న పేర్లతో తద్ధిత నామాల నిర్మాణం అరుదు

సాధారణంగా అపత్యార్థంతో పాటు, ఆ వంశం వాడు అన్న అర్థం కూడా వస్తుంది

వసుదేవుని కొడుకు వాసుదేవుడు రఘువు కొడుకు రాఘవుడు రఘువు కొడుకే కాదు రఘు వంశం వాడైనా రాఘవుడవుతాడు అట్లాగే కురువు కొడుకు కాని కురువంశం వాడుకాని కౌరవుడు పురువు కొడుకు పౌరవుడు మను సంతానం మానవులు యదు సంతానం యాదవులు దశరథుని కొడుకు దాశరథుడు భృగువు కొడుకు భార్గవుడు భృగు వంశంవాడూ భార్గవుడే భార్గవ రాముడు అంటే పరశురాముడు కశ్యపుని సంతానం కాశ్యపులు పృథ కొడుకు పార్థుడు కుంతికి పృథ అని పేరు అందుకే అర్జునునికి పార్థుడని పేరు పాండురాజు సంతానం పాండవులు ఈ మాటల్లోని ప్రత్యయం అ

ఆయన అనే ప్రత్యయం శకట యుగంధర వంటి మాటలమీద చేరుతుంది శకటుని కొడుకు శాకటాయనుడు యుగంధరుని కొడుకు యౌగంధరాయణుడు ద్వీపుని కొడుకు ద్వైపాయనుడు అట్లాగే వాత్స్యాయనుడు, దాక్షాయణుడు ద్రోణాయనుడు వంటివి

ఇ అనే ప్రత్యయం చేరి దాక్షి ఏర్పడుతుంది దక్షుని కొడుకు దశరథుని కొడుకు దాశరథి అట్లాగే మరుతుని కొడుకు మారుతి పవనతనయుడు పావని సుమిత్ర కొడుకు సౌమిత్రి పణినుని కొడుకు పాణిని పాణిని సంస్కృత భాషకు గొప్ప వ్యాకరణం రచించాడు గంగ కొడుకు గాంగేయుడు భీష్ముడు రాధ కొడుకు రాధేయుడు వినత సంతానం వైనతేయులు అత్రి కొడుకు ఆత్రేయుడు ఇక్కడ ప్రత్యయం 'ఏయ' కద్రూ కొడుకులు కాద్రవేయులు సర్పాలు వినత సంతానం వైనతేయులు దితి సంతానం దైతేయులు రాక్షసులు అదితి సంతానం ఆదితేయులు

దితి సంతానం దైత్యులు అదితి సంతానం ఆదిత్యులు పరాశరుని కొడుకు పారాశర్యుడు శకుని సంతానం శాక్యులు ఇక్కడ ప్రత్యయం య

ఈ ప్రత్యయాలను ఇప్పుడు నూతన పదకల్పనకు వాడనప్పుడు వీటి ప్రయోజనం ఏమిటి? అన్న ప్రశ్న తలెత్తుతుంది మనం పెట్టుకొనే పేర్లలో ఇటువంటివి ఇప్పుడూ ఉన్నాయి రాఘవయ్య అన్న పేరు ఏమిటి ఈ పేరును రాముడన్న ఉద్దేశంతో పెట్టుకుంటున్నాం పార్థ సారధి అని పేరు పెట్టుకుంటున్నాం పార్థుడంటే అర్జునుడని తెలియాలి కదా' మనం పెట్టుకొనే పేర్లు ఎలా ఏర్పడ్డాయో వాటి అర్థమేమిటో తెలుసుకోవడానికి ఉపయోగపడుతుంది ప్రాచీన సాహిత్య పఠనానికి ఉపయోగపడుతుంది

☆

# శైవ వైష్ణవాదులు

తెలుగులో తద్ధిత ప్రత్యయాలను చేర్చి కొత్త నామవాచక పదాలను తయారుచేసినట్లుగా సంస్కృతంలోనూ ఎన్నో మాటలను తయారు చేసికోవచ్చు ఆవిధంగా తయారయిన మాటల్ని తెలుగులో యధాతధంగా వాడం అయినా తెలుగులో మనం వాడే సంస్కృత పదాల వాడుకలో తద్ధిత నామవాచకాల సంఖ్య అల్పమేమీకాదు సంస్కృత పదాల వాడుకలో తద్ధిత నామాలూ కృదంత నామాలూ కూడా చేరతాయి మన అవసరాలను అనుసరించి సంస్కృత నామవాచక పదానికి తద్ధిత ప్రత్యయం చేర్చి వాడుకుంటున్నాం ఇటువంటి సందర్భాలలో కొన్నిసార్లు సంస్కృత మర్యాదకు భిన్నంగా తెలుగులో కొన్ని సంస్కృత నామాలు ఏర్పడుతున్నాయి సంస్కృతంలో ఒక అర్థంలో ఒక ప్రత్యయం వస్తూ ఉంటే మనం మరో ప్రత్యయాన్ని తగిలించడమో, సంస్కృతంలో అప్పటికే తద్ధితనామంగా రూపొందిన దానికి మనం అనవసరంగా మరో ప్రత్యయం తగిలించడమో కూడా చేస్తూ ఉంటాం ఇటువంటప్పుడు ఒకేమాటకు ఒకే అర్థంలో ఒకేసారి రెండు ప్రత్యయాలను చేర్చడం జరుగుతుంది ప్రత్యయాలు చేరినప్పుడు పదంలో కొన్ని మార్పులు కూడా జరుగుతాయి వాటిని కూడా గుర్తించవలసి ఉంటుంది

తెలుగులో సంస్కృత పదాలు వాడే వాళ్ళందరికీ సంస్కృత భాషరాదు అట్లా రావాలనుకోవడం కూడా సరికాదు అవసరం లేదు సంస్కృత భాషతో బాగా పరిచయం ఉన్న తెలుగు వాళ్ళు తెలుగులో ఏదయినా సంస్కృత పదాన్ని వాడినట్లయితే ఆ పద నిర్మాణంలో సంస్కృత వ్యాకరణ సూత్రాలను గుర్తిస్తారు దాన్ని తెలుగులోకి తెచ్చుకోవడంలోని సంప్రదాయాన్ని గుర్తిస్తారు అటు సంస్కృత పదనిర్మాణ పద్ధతిగాని, ఇటు తెలుగు సంప్రదాయాన్ని కాని సరిగ్గా గుర్తించకపోతే ఏర్పడే పదాలు హేతుబద్ధంగా ఉండవు అట్లా హేతుబద్ధంగా ఉండాలా, ఉండకపోతే నష్టం ఏమిటి? ప్రచారంలో ఉన్నాయి కదా అట్లాగే వాడుకుంటే సరిపోదా? వంటి ప్రశ్నలుత్పన్నమవుతాయి ఆధునికులే కాదు మన పూర్వ కవులు కూడా ఎన్నో సంస్కృత పదాలను సంస్కృత వ్యాకరణ మర్యాదకు భిన్నంగా ప్రయోగించారు వాటిలో కొన్ని వాడుకలో స్థిరపడ్డాయి కొన్ని వాడుకలో లేకుండా తొలగిపోయాయి వాడుకలో స్థిరపడిన వాటిని యధాతధంగా వాడుకోవచ్చు వ్యాకరణాలలో వాటికేవో వివరణలివ్వవచ్చు లేకపోతే కొత్త వ్యాకరణ సూత్రాలను ఏర్పరచుకోవచ్చు అయితే మనం పొరపాటుగా వాడిన పదాన్ని ఆధారం చేసుకొని మరెన్నో రూపాలను కూడా తయారుచేసుకోవచ్చు ఇదంతా మన అవసరం మీద ఆధారపడి ఉంటుంది మన అవసరానికి అనుగుణంగా అంతకుపూర్వం ఎప్పుడూ లేని కొత్తమాటలూ, కొత్తపద బంధాలూ మనం తయారుచేసుకుంటూనే ఉన్నాం మన సృజనాత్మకశక్తి అద్భుతమైనది ఎవరైనా ఒక నూతన కల్పన చేసినప్పుడు, ఆ కల్పన ఆ భాష మాట్లాడే పదిమందికీ ఆమోదయోగ్యమైనప్పుడు అభ్యంతరమేమీ ఉండకూడదు ఒక్కొక్కసారి ఈ నూతన కల్పన మన ప్రశంసలను పొందుతుంది కూడా నూతనత్వమూ, వైవిధ్యమూ అంగీకరించవలసినవే కాక, తప్పనిసరి కూడా

అయినా హేతుబద్ధం కానప్పుడు, కేవలం మనకు తెలియకపోవడం వల్ల చేసిన పొరపాటు అయినప్పుడు అటువంటి కల్పనలను పరిహరించవచ్చు వాటికి ప్రత్యామ్నాయం ఉన్నప్పుడు

ఒక మనిషి ఆహారం వైవిధ్యం కోసమో ఆరోగ్యం కోసమో అవసరం కొద్దీ ఒక్కోసారి ప్రాధాన్యంగా ఒక ప్రయోగం చేయడంవల్ల అది ఒక్కోసారి అమోఘాన్ని పొందవచ్చు పొందకపోవచ్చు తెలియక చేయడం వల్ల ఎదురయ్యే వాటి ఈ రెండింటిని పరిహరించవచ్చు

సంస్కృతంలో సంబంధార్థంలో వచ్చే తద్ధిత ప్రత్యయం అణ్ ఈ ప్రత్యయంతో వచ్చే మాటలు ఏర్పడతాయి సాధారణంగా తద్ధిత ప్రత్యయాలు చేరినప్పుడు ఆదివృద్ధి వస్తుంది అంటే పదం మొదట ఉన్న అచ్చుకు వృద్ధి వస్తుంది అచ్చుతో మొదలయ్యే మాట అయితే ఆ అచ్చుకు వృద్ధి హల్లుతో మొదలయ్యే మాట అయితే మొదటి హల్లు మీద ఉన్న అచ్చుకు వృద్ధి వృద్ధి అంటే అ ఆ లకు బదులుగా ఆ రావడం ఇ ఈ, ఏ ఐ లకు బదులుగా ఐ రావడం ఉ ఊ, ఓ ఔ లకు బదులుగా ఔ రావడం, ఋ ౠ లకు బదులుగా ఆర్ రావడం వృద్ధి మాత్రమేకాక ప్రత్యయాన్ని బట్టీ పదాదిలో ఉన్న వర్ణాలను బట్టీ మరికొన్ని మార్పులు కూడా వస్తాయి

శివ అన్న మాటమీద అణ్ ప్రత్యయం వస్తే ఆది వృద్ధి వచ్చి శైవ అవుతుంది శైవం అంటే శివ సంబంధమైనది శైవుడు అంటే శివుణ్ణి సేవించేవాడు శైవమతానికి సంబంధించినవాడు అట్లాగే విష్ణు శబ్దం కూడా విష్ణు సంబంధమైనది వైష్ణవం విష్ణువును సేవించేవాడు వైష్ణవుడు దేవ సంబంధమైనది దైవం గ్రీష్మ సంబంధం గ్రైష్మం

తిల సంబంధమైనది తైలం తిలలంటే నువ్వులు వాటినుండి తీసేది తైలం ఒకప్పుడు మనం వాడింది నువ్వులనూనె అది నూనెకు సామాన్యవాచి అయిపోయింది ఇప్పుడు వేరుశనగ నుండి తీసినా కుసుమల నుండి తీసినా దేన్నుండి తీసినా తైలమనే అంటున్నాం అసలు నూనె అన్నమాట కూడా 'నూనేయి' అంటే నువ్వుల నుండి తీసిన నేయి నుండి ఏర్పడింది అది తైలం లాగానే సామాన్యవాచి అయింది

జిన సంబంధమైనది జైనం బుద్ధ సంబంధమైనది బౌద్ధం స్మృతి సంబంధమైనది స్మార్తం ఈ పద్ధతిలోనే క్రీస్తుకు సంబంధించినది అన్న అర్థంలో క్రైస్తవం అన్నమాట ఏర్పడింది

☆

# పాయసం - దేశీయం - సనాతనం

పయస్ అంటే పాలు పాలకు సంబంధించింది అంటే పాలతో చేసింది పాలతో వండింది పాయసం పరమం అన్నం పరమాన్నం శ్రేష్ఠమైన అన్నం పరమాన్నం అంటే పాలతో వండిన అన్నం శ్రేష్ఠమైనది అందుకే దీనికి పరమాన్నం అని పేరు పాయసం పరమాన్నం ఒకటే సరళ దేవదారు వృక్షాల పాలనుండీ పుట్టిన దాన్ని కూడా పాయసం అంటారు పొగవేయడానికి ఉప యోగించే సరళ దేవదారు వృక్షాల బంక

పురమునకు చెందినవారు పౌరులు పురవాస్తవ్యులు నగరంలో నివసించే వారు నాగరి కులు పౌరులనే మాటను ఇప్పుడు సిటిజన్ అన్న అర్థంలో వాడుతున్నాం నాగరం అంటే నగరంలో పుట్టింది

గ్రీష్మ ఋతు సంబంధమయింది గ్రైష్మం హేమంత ఋతు సంబంధమయింది. హేమంతం శిశిరానికి చెందింది శైశిరం వసంతానికి చెందింది వాసంతం పవన సంబంధం పావనం ఈ మాటలన్నిటిలో చేరిన తద్ధిత ప్రత్యయం అ

దక్షిణ దేశానికి సంబంధించిన వాడు దాక్షిణాత్యుడు పశ్చాత్ అంటే పడమటికి సంబం ధించింది, పాశ్చాత్యం నియతంగా ఉండేది నిత్యం అమా అంటే సమీపం సమీపంలో ఉండే వాడు అమాత్యుడు రాజు పక్కనే ఉండి మంత్రాలోచన చెప్పేవాడు ఈ మాటల్లో ప్రత్యయం త్య '

దేశానికి సంబంధించి దేశీయం ప్రాంతానికి సంబంధించింది ప్రాంతీయం స్వ అంటే తన తనకు సంబంధించింది స్వీయం స్వకీయం కూడా పరునికి సంబంధించింది పరకీయం భారతదేశానికి సంబంధించింది భారతీయం రాష్ట్రానికి సంబంధించింది రాష్ట్రీయం, రాష్ట్రీయం రాజుకి సంబంధించింది రాజకీయం వీటిలో ప్రత్యయం ఈయ'

అస్మత్ మీద ఈయ చేరితే అస్మదీయం

మాయాబజార్ సినిమాలో ఈ అస్మదీయులుతో పాటు తస్మదీయులు అనేమాట ప్రచారం లోకి వచ్చింది అస్మదీయులంటే తనవాళ్ళు తస్మదీయులంటే పరాయివాళ్ళు, ఎదుటివాళ్ళు, ప్రత్యర్థులు అన్న అర్థంలో వాడారు తస్మదీయులనే మాటేదీ లేదు అస్మదీయులు సామ్యంతో ఈ తస్మదీయులు వచ్చిందన్నమాట యుష్మత్– యుష్మదీయం అవుతుంది నీకు సంబంధించింది మత్–మదీయం, నాకు సంబంధించింది తత్ నుండి తదీయం ఏర్పడుతుంది దానికి సంబం ధించింది యత్ నుండి యదీయం. ఎవరికి సంబంధించింది త్వత్ నుండి త్వదీయం ఏర్పడు తుంది నీకు సంబంధించింది భవత్– భవదీయం అన్నా అదే అర్థం

త్వదీయం అనేమాటకు తావకం, తావకీనం అనే రూపాలు కూడా ఉన్నాయి మదీయం అనేమాటకు మామకం, మామకీనం అనే రూపాలున్నాయి అస్మదీయానికి అస్మాకం, అస్మాకీనం అనే రూపాలున్నాయి యుష్మదీయానికి యౌష్మాకం, యౌష్మాకీణం అని రూపాలున్నాయి యౌష్మాకం, యౌష్మాకీణం అనే మాటలకు తెలుగులో అంతగా వాడుకలేదు

సాయంకాలం అన్న అర్థంలో సాయంతనం అన్నమాట ఉంది మనం తెలుగులో సాయం త్రం అనేమాట వాడతాం సాయంతనమే సాయంత్రమయిందేమో చిరంతనం అంటే చిరకాలం నుండి ఉన్నది అంటే చాలాకాలం నుండి ఉన్నది. అట్లాగే దోషాతనం, దివాతనం. దోషా అంటే

[illegible] అంటే [illegible] ప్రాక్-[illegible] ప్రాక్తనం [illegible] అంటే [illegible] ఇది [illegible]
[illegible] క్రమాగం దీనినుండే అద్యతనం ఇదానీం [illegible] దీనినుండి
ఇదానీంతనం [illegible] అంటే ఎప్పుడు దీనితో [illegible] సదా [illegible] ఎల్లప్పుడు దీనితో
[illegible] అంటే నిత్యం దీనితో [illegible] కాలంతో [illegible] లేకుండా ఎప్పుడూ ఉండేది సనా
తనం అన్నా పురాతనం అన్నా నిత్యం అన్నా శాశ్వతం అన్నా అర్థం ఒకటే పురా అనేమాటను
[illegible]లలో ఉపయోగించవచ్చు పురాకు తన చేరితే పురాతనం పాతది అని అర్థం పురాణం
పురాతనం చిరంతనం ప్రతనం ప్రత్నం అన్నీ ఒకే అర్థంలో వాడుకలో ఉన్నాయి

నూతనం నూత్నం అంటే కొత్తది దీనికే [illegible] నవం నవీనం [illegible] మాటలు

హ్యస్ అంటే నిన్న దీనినుండి హ్యస్తనం శ్వస్ అంటే రేపు దీనినుండి శ్వస్తనం ఈ మాటలు తెలుగులో వాడుకలో లేవు

అపరాహ్ణం, పూర్వాహ్ణం నుండి అపరాహ్ణతనం పూర్వాహ్ణతనం ఏర్పడతాయి పూర్వాహ్ణం అంటే అహస్సు పూర్వభాగం అపరాహ్ణం అంటే అహస్సు కడపటి భాగం మధ్యాహ్నం అంటే అహస్సు మధ్యభాగం పూర్వాహ్ణాన్నే ప్రాహ్ణం అని కూడా అంటారు ఈ మూడు భాగాలనూ త్రిసంధ్యలంటారు ఈ మూడు మూడు కాలాలు మూడింటినీ కలిపి త్రిసంధ్యం అంటారు

అధస్ అంటే కింద దీనికి తన ప్రత్యయం చేరిస్తే అధస్తనం ఏర్పడుతుంది సద్యస్ అంటే ఇప్పుడు దీనికి తన చేరిస్తే సద్యస్తనం ప్రాతస్ అంటే ప్రభాతం, ఉదయం దీనినుండి ప్రాతస్తనం

ఈ మాటలలో కొన్నిటికి ఇతర ప్రత్యయాలు కూడా చేరతాయి ఉదాహరణకు అపరాహ్ణ లనాన్ని అపరాహ్ణకం అనీ, అపరాహ్ణకం అనీ కూడా అనవచ్చు సంధ్యకు అ ప్రత్యయం వచ్చి సాంధ్యం అవుతుంది

★

# ధైనికం - ఐహికం

ఒకే కాలపరిమితిలో జరిగే విషయాలుంటాయి ఆ కాల పరిమితిని తెలియజేయడానికి ఇక ప్రత్యయం వస్తుంది రోజుకు ఒక్కసారి జరిగేది దైనికం దిన పరిమితమైనది మన దిన పత్రికలన్నీ దైనికాలే నెలకు పరిమితమయింది అంటే మాసానికి పరిమితమయింది మాసికం రెండు, మూడు వంటి సంఖ్యావాచకాలు చేర్చి కూడా దీన్ని వాడవచ్చు ద్విమాస పరిమితమైంది ద్వైమాసికం, త్రి మాస పరిమితమైంది త్రైమాసికం, షట్ మాస పరిమితమైంది షాణ్మాసికం త్రైమాసిక, షాణ్మాసిక పరీక్షలు ప్రసిద్ధమే కదా ఏడాదికి పరిమితమైంది వార్షికం వర్షం అంటే సంవత్సరం వర్ష పరిమితం అన్నమాట అట్లాగే సంవత్సర కాలానికి పరిమితమయితే సాంవత్సరికం అబ్దం అన్నా సంవత్సరమే దీనితో ఆబ్దికం ఏర్పడుతుంది మాసికం, ఆబ్దికం వంటి మాటలు ప్రత్యేక అర్థాలతో స్థిరపడడం వల్ల సాధారణార్థంలో వీటిని వాడడంలేదు మాసికం అనగానే నెలనెలా చేసే పిండ పితృయజ్ఞం అనేఅర్థమే తోస్తుంది అట్లాగే ఆబ్దికం అన్నా ప్రతి ఏడాదీ చేసే పితృయజ్ఞమే సాంవత్సరికం అన్నమాటకు కూడా దాదాపు ఈ అర్థమే స్థిరపడిపోయింది వార్షికం అన్నమాట మాత్రం సాధారణార్థంలో ఉంది వార్షిక పరీక్షలు, వార్షిక ఆదాయం, వార్షిక బడ్జెటు, వార్షికోత్సవం మొదలయిన విధంగా వార్షిక పదానికి విస్తృతమయిన వాడుక ఉంది అహ్న పరిమితం ఆహ్నికం కాల పరిమితం కాలికం తత్కాల పరిమితం తాత్కాలికం అధునా అంటే ఇప్పటికి సంబందించింది ఆధునికం

'ఇక' ప్రత్యయం వివిధ అర్థాలలో వస్తుంది ఇహ అంటే ఇక్కడ ఇహానికి సంబంధించింది ఐహికం ఈ లోకానికి సంబంధించింది అట్లాగే లౌకికం పరలోకానికి సంబంధించింది పారలౌకికం అధ్యాత్మ సంబంధం ఆధ్యాత్మికం పరమార్థానికి సంబంధించింది పారమార్థికం

ధర్మ సంబంధమైనది ధార్మికం ధర్మగుణం కలిగినవాడు ధార్మికుడు ఈ మాటకు మత విశ్వాసం కలిగిన వాడన్న అర్థం కూడా ఏర్పడింది అధర్మ సంబంధం అధార్మికం అస్తి అంటే ఉంది అనీ, నాస్తి అంటే లేదనీ అర్థం అస్తి నుండి ఆస్తిక అన్నమాటా, నాస్తి నుండి నాస్తిక అన్న మాటా ఏర్పడ్డాయి ఆస్తికుడు అంటే పరలోకం ఉందనేవాడు నాస్తికుడు అంటే పరలోకం లేదనే వాడు

వేదానికి సంబంధించింది వైదికం వైదిక కర్మకాండ అంటే వేదంలో చెప్పిన కర్మకాండ వృత్తి వార్తికం అవుతుంది వ్యాకరణాది శాస్త్రాలలో సూత్ర వివరణ వృత్తి

తర్కం చదువుకున్నవాడు తార్కికుడు పురాణ సంబంధమైనది పౌరాణికం పురాణం చెప్పేవాడు పౌరాణికుడు ఇతిహాస సంబంధమైనది ఐతిహాసికం ఇతిహాసం చెప్పేవాడు ఐతిహాసికుడు చరిత్ర సంబంధమైనది చారిత్రికం చరిత్ర రచయిత చారిత్రికుడు. అలంకార సంబంధమైనది ఆలంకారికం అలంకార శాస్త్రం ఉంది అలంకార శాస్త్రం అంటే సాహిత్య శాస్త్రం కావ్య లక్షణాలు చెప్పే శాస్త్రం ఇది కావ్యంలో ఉండే అన్ని విషయాలూ ఈ శాస్త్రంలో చర్చకు వస్తాయి ఇటువంటి శాస్త్రాన్ని రచించే వాళ్ళు ఆలంకారికులు లక్షణం అన్నది ఒక విషయాన్ని గుర్తించే చిహ్నం శాస్త్రాలన్నీ ఏదో ఒక పదార్థ లక్షణాన్ని వివరించేవే అందువల్ల లక్షణ నిరూపకులయిన పండితులు లాక్షణికులు అలంకార, వ్యాకరణాది శాస్త్రజ్ఞుల విషయంలో లాక్షణిక శబ్దాన్ని

సాంతం

జ్యోతిష్యం తెలిసినవాడు జ్యోతిషికుడు ముహూర్తం తెలిసినవాడు మౌహూర్తికుడు కృతాంతం అంటే దైవం కృతాంతం తెలిసిన వాడు కార్తాంతికుడు జ్యోతిషికుడు అన్నా మౌహూర్తికుడు అన్నా కార్తాంతికుడు అన్నా ఒక్కటే తంత్రం తెలిసిన వాడు తాంత్రికుడు మంత్రం తెలిసినవాడు మాంత్రికుడు తంత్రం అంటే మత దర్శనాన్ని విస్తరింపచేసేది గాయత్రి మొదలయిన వేద మంత్రాలు మంత్రాలు రహస్యాలోచనకు కూడా మంత్రమని పేరు దీనినుండే మంత్రాంగం మంత్రి మంత్రాలోచన వంటి మాటలు ఏర్పడ్డాయి మంత్ర తంత్ర శబ్దాలకు మాంత్రిక, తాంత్రిక శబ్దాలకూ కొంత దురర్థం కూడా ఏర్పడింది

మృదంగం వాయించేవాడు మార్దంగికుడు వీణ వాయించే వాడు వైణికుడు

నౌ అంటే నావ నావ నడిపేవాడు నావికుడు హలం అంటే నాగలి హలంతో పొలం దున్నేవాడు కాబట్టి హాలికుడు రైతు బమ్మెర పోతన పేర ప్రసిద్ధంగా ఉన్న పద్యం బాల రసాల సాల లో హాలికులైననేమి అంటాడు పోతనగారి ఇతివృత్తాన్ని తీసుకొని 'హాలికుడు అన్న పేర ఒక చారిత్రిక నవల కూడా వచ్చింది పథం అంటే తోవ బాట, దారి పథంలో నడిచేవాడు పథికుడు, బాటసారి ఇంద్రజాలం చేసేవాడు ఐంద్రజాలికుడు

శ్రమచేసేవాడు శ్రామికుడు పరిశ్రమకు సంబంధించింది పారిశ్రామికం కర్మ అంటే చెయ్యడం, పని కర్మ చేసేవాడు కార్మికుడు ఈ మాటలకు ఆధునిక కాలంలో చాలా వ్యాప్తి వచ్చింది కర్మాగారాల్లో పనిచేసే వాళ్ళు కార్మికులు శ్రమించి జీవించే వర్గం వారినందరినీ శ్రామికులంటున్నాం పరిశ్రమ అంటే ఇండస్ట్రీ పరిశ్రమ కలిగినవాడు, యజమాని పెట్టుబడి దారు పారిశ్రామికుడు

మనస్ సంబంధమైంది మానసికం దేహ సంబంధమైంది దైహికం అర్థ సంబంధమైంది ఆర్థికం సమాజ సంబంధమైంది సామాజికం, సంఘ సంబంధం సాంఘికం సామాజికుడు అన్నమాటను అలంకార శాస్త్రాలలో సహృదయుడయిన ప్రేక్షకుడు అన్న అర్థంలో ఉపయోగిం చారు పశు సంబంధం పాశవికం పశువుకు జ్ఞానంలేదు, అది అనాగరికం అటు వంటి పశువు ప్రవృత్తి మనిషిలో ఉంటే దాన్ని పాశవిక ప్రవృత్తి, మానవునిలో ఉండదగనిది అంటున్నాం పక్ష నుండి పాక్షికం ఏర్పడింది ఒకే పక్షం నుండి చూడడం వల్ల ఏదైనా అసమగ్రంగా దర్శన మిస్తుంది అసమగ్రతకూ, పక్షపాత దృష్టికీ ఇది సంకేతం ఇచ్ఛా నుండి ఐచ్ఛికం ఏర్పడింది తన ఇష్టాన్ని అనుసరించి అన్నమాట ఆప్షనల్ అన్నమాటకు సమానార్థకంగా వాడుతున్నాం పార్శ్వ- పార్శ్వికం, అంగ- ఆంగికం, దేవ- దైవికం, ప్రేమ- ప్రేమికుడు, సత్త్వ- సాత్త్వికం, భౌతికం సార్వత్రికం, నైతికం, స్థానికం వంటి అసంఖ్యాకమైన పదాలు ఈ 'ఇక' ప్రత్యయంతో ఏర్పడు తున్నాయి

☆

# మహిమ - రాజ్యం

మనవాళ్ళు అష్టైశ్వర్యాలంటూ ఉంటారు అష్ట అంటే ఎనిమిది అనీ, ఐశ్వర్యం అంటే విభూతి అనీ అందరికీ తెలిసిన విషయమే అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం ఈశత్వం, వశిత్వం అనేవి ఎనిమిది ఐశ్వర్యాలు వీటిలో మొదటి నాలుగింటిలోనూ ఉన్న తద్ధిత ప్రత్యయం 'ఇమన్' ఈ ప్రత్యయం చేరి అమూర్త నామవాచకాలేర్పడతాయి గుణ సంబంధ మయిన పదాలనేకం ఏర్పడతాయి అణువు స్వభావం అణుత్వం, సూక్ష్మత్వం దీని మీద 'ఇమ చేరి అణిమ అవుతుంది అట్లాగే మహత్ అంటే పూజింపబడేది దీని నుండే మహిమ అట్లాగే గురుత్వం చేత గరిమ, లఘుత్వం చేత లఘిమ

పటుత్వం పటిమ నేర్పరితనం దిట్టతనం ప్రియభావం ప్రేమ ప్రేమ సంతోషింపజేసేది ప్రీతి, స్నేహం దృఢ శబ్దం నుండి ద్రఢిమ ఏర్పడింది, బలం మధురశబ్దం నుండి మధురిమ తియ్యదనం, ఇష్టమైనది నీల శబ్దం నుండి నీలిమ నలుపు అని అర్థం జడ శబ్దం నుండి జడిమ జడత్వం అని అర్థం

భావార్థంలోనూ మరికొన్ని అర్థాలలోనూ 'య' ప్రత్యయం వస్తుంది రాజు బావం రాజ్యం సారధి నుండి సారధ్యం ఏర్పడుతుంది అదిపతి నుండి ఆధిపత్యం విరూపబావం వైరూప్యం ధీరుడి భావం ధైర్యం. కవి నుండి కావ్యం ఏర్పడింది పురోహితుడి నుండి పౌరోహిత్యం నిపుణుడి భావం నైపుణ్యం అట్లాగే గంభీర శబ్దం నుండి గాంబీర్యం దూత భావం దౌత్యం దూత చేసే పని కూడా దౌత్యం శూరుడి లక్షణం శౌర్యం ప్రవీణుడి లక్షణం ప్రావీణ్యం స్థిరశబ్దం నుండి స్థైర్యం ఏర్పడింది ధైర్యస్థైర్యాలని జంటపదాలుగా వాడుతూ ఉంటాం

వయస్ శబ్దం నుండి వయస్కుడు వయస్కుడు అంటే సమాన వయస్కుడన్నమాట సమానవయస్కుల మధ్య స్నేహభావం ఉంటుంది అందువల్ల వయస్కుడంటే స్నేహితుడని అర్థం

దండ శబ్దం నుండి దండ్యం దండ్యం అంటే దండింపదగింది ఇటువంటిదే వధ్యం వధ నుండి ఏర్పడింది చంపదగింది అని అర్థం

తులా నుండి తుల్యం ఏర్పడింది సమానం అని అర్థం మూల శబ్దం నుండి మూల్యం ఏర్పడింది. మూలంతో సమానమైనది అని అర్థం, వెల

పధి నుండి పథ్యం జబ్బు చేస్తే పథ్యం పెడతారు ఆయా రోగాలలో తినదగింది, తినదగంది అని నియమం రోగంలేని మార్గంలో మంచిది

హృత్ నుండి హృద్యం హృదయానికి అంగీకారమైంది మనోహరమైనదన్నమాట ధర్మ శబ్దం నుండి ధర్మ్యం అంటే న్యాయంగా సంపాదించింది ద్రవ్యం అంటే మంచి పదార్థం పొంద దగినది అని అర్థం

సఖుని భావం సఖ్యం సఖ్యమంటే స్నేహం సఖ్యం సాప్తపదీనం అని వాడుక కలిసి ఏడడుగులు నడిస్తే స్నేహం ఏర్పడుతుందన్నమాట ఈశ్వరుని భావం ఐశ్వర్యం ఐశ్వర్యం అన్న మాటను ఇప్పుడు ధన సంపద అన్న అర్థంలో ఎక్కువగా వాడుతున్నాం

సుభగుని భావం సౌభాగ్యం భాగ్యవంతుడి లక్షణం

ముఖంతో సమానమయింది ముఖ్యం ముఖం శరీరంలో ప్రధానమయింది దీనివంటిది

ముఖ్యం ప్రధానమయిందని అర్థం ప్రధాన శబ్దం నుండి ప్రాధాన్యం అట్లాగే ప్రముఖ శబ్దం నుండి ప్రాముఖ్యం మూఢుని భావం మౌఢ్యం మధ్యస్థుని భావం మాధ్యస్థ్యం ధీరుని భావం ధైర్యం

వంశ శబ్దం నుండి వంశ్యుడు అన్నమాట ఏర్పడింది ఆ వంశంలో పుట్టినవాడని అర్థం సూర్య వంశ్యుడు చంద్ర వంశ్యుడు అంటాం దేశంలో పుట్టింది దేశ్యం రహస్ అంటే ఏకాంత స్థలం ఏకాంతస్థలంలో అంటే ఎవరూ లేనిచోట పుట్టింది రహస్యం ఆదిలో పుట్టింది ఆద్యం అంతంలో పుట్టింది అంత్యం ఆద్యంత్యాలు అని జంటగా వాడతాం

సజాతి నుండి పుడితే సజాత్యం విజాతి నుండి పుడితే విజాత్యం చళుకం నుండి పుట్టిన వాడు చాళుక్యుడు నన్నయను పోషించిన రాజరాజ నరేంద్రుడు తూర్పు చాళుక్య వంశానికి చెందిన రాజు చాళుక్య వంశ మూల పురుషుడు బ్రహ్మ చుళుకం నుండి ఉద్భవించాడట చుళుక మన్నమాటకే చళుకమన్న రూపాంతరం ఉంది ఈ చళుక శబ్దం నుండే చాళుక్య అన్నమాట ఏర్పడింది

దంతముల నుండి పుట్టింది దంత్యం కంఠం నుండి పుట్టింది కంఠ్యం, మూర్ధం నుండి పుట్టింది మూర్ధన్యం

సభ నుండి సభ్యుడన్న మాట ఏర్పడింది సభికుడు అన్నమాటకు జూదం ఆడించేవాడు అని అర్థం సభ కలిగినవాడన్నమాట సభ అన్నమాటకు ఆస్థానం అనీ, సజ్జనుడనీ, సమూహ మనీ, శాల అనీ జూదం అనీ అర్థాలు ఇప్పుడు సభికుడు అన్న మాటకే ఎక్కువ ప్రచారం కని పిస్తుంది సభాసదులు, సభాస్తారులు సభ్యులు, సామాజికులు అన్న మాటలు సభలో ఉండేవారికి వాడేవి

గో సంబంధమైంది గవ్యం గోవు అవయవాలలో దేన్నైనా గవ్యం అనవచ్చు పాలు మొదలయిన వాటిని కూడా గవ్యం అనవచ్చు పయస్ అంటే పాలు పాల నుండి ఏర్పడ్డ పెరుగు మజ్జిగ, వెన్న, నెయ్యి వీటిని పయస్యం అనవచ్చు

రథాలు నడిచేవి కాబట్టి రథ్యం పాదాలు కడుగుకోవటానికి ఇచ్చే నీరు పాద్యం అతిథి కోసం ఇచ్చేది ఆతిథ్యం అర్ఘం అంటే పూజ పూజకోసం నీళ్ళు అర్ఘ్యం

నౌ అంటే నావ నావతో దాటదగింది నావ్యం హలంతో దున్నతగింది హల్యం ఈ విధంగా య ప్రత్యయంతో అనేక శబ్దాలు ఏర్పడతాయి

☆

# జాడ్యాదులు

గుణవాచకాలయిన మాటలకు కర్మం భావం అనే అర్థాలలో య ప్రత్యయం వస్తుంది జడ శబ్దం మీద ఈ ప్రత్యయం వస్తే జాడ్యం. జడుడు చేసే పని కాని జడుని లక్షణం కాని కావచ్చు అట్లాగే మూఢ శబ్దం దీని నుండి మౌఢ్యం ఏర్పడుతుంది మూర్ఖ శబ్దం నుండి మౌర్ఖ్యం ఏర్పడుతుంది

ఉష్ణ శబ్దం ఔష్ణ్యం అవుతుంది శీత శబ్దం శైత్యం అవుతుంది నీల శబ్దం నుండి నైల్యం ఏర్పడుతుంది అట్లాగే అరుణ నుండి ఆరుణ్యం ఏర్పడుతుంది జాడ్యం, మౌఢ్యం, శైత్యం నైల్యం తెలుగులో ఎక్కువగా వాడే మాటలే

బ్రాహ్మణ్యం అనేమాట కూడా వింటూ ఉంటాం బ్రాహ్మణ సమూహం అని దీనికి ఒక అర్థం బ్రాహ్మణుడు చేసే పని, బ్రాహ్మణుని బావం అని కూడా అర్థాలు చోరుడు చేసే పని చౌర్యం బాలుడి భావం బాల్యం అలసుని లక్షణం ఆలస్యం గృహస్థుని భావం గార్హస్థ్యం పండితుని లక్షణం పాండిత్యం తరతమ బావం తారతమ్యం భేదం అనే అర్థంలో ఈ మాటను వాడుతున్నాం ఎక్కువా తక్కువా అన్న బావంలో వాడుతున్నాం

విషమ శబ్దం నుండి వైషమ్యం ఏర్పడింది వైషమ్యం అంటే విషమత్వం సమానంగా ఉండకపోవడం, హెచ్చుతగ్గులుగా ఉండడం, మిట్టపల్లాలుగా ఉండడం, కరుకుదనమనీ, అన్యాయం అనీ, కష్టం, దుఃఖం అనీ, ఒంటరితనం అనీ కూడా దీనికి అర్థాలు ఏర్పడ్డాయి కాని తగువు, భేదాభిప్రాయం, విరోధం అన్న అర్థంలో ఎక్కువగా వాడుతున్నాం విరోధ శబ్దం నుండి వైరుధ్యం ఏర్పడింది

మాహాత్మ్యం మాహాత్మ్యం గొప్పతనం మహిమ అన్న అర్థంలో వాడుకలో ఉన్నాయి లవణ శబ్దం నుండి లావణ్యం ఏర్పడింది లవణం అంటే సుందరమని అర్థం అందువల్ల లావణ్య శబ్దానికి సౌందర్యం అని అర్థం సౌందర్యం సుందర శబ్దం నుండి ఏర్పడింది

వత్సల శబ్దం నుండి వాత్సల్యం ఏర్పడింది ఏక నుండి ఐక్యం ఏర్పడుతుంది సుఖ శబ్దంతో సౌఖ్యం ఏర్పడుతుంది ధీరుడి భావం ధైర్యం అయితే వీరుడి భావం వైర్యం కావాలి కాని వీర్యం అని వాడుక

సేనాపతి లక్షణం సైనాపత్యం బృహస్పతి నుండి బార్హస్పత్యం ఏర్పడింది అదేవిధంగా గృహపతి పదం నుండి గార్హపత్యం ఏర్పడింది

ఆస్తికుడి నుండి ఆస్తిక్యం నాస్తికుని నుండి నాస్తిక్యం నాగరుని నుండి నాగర్యం ఏర్పడ్డాయి సమ్రాట్ భావం సామ్రాజ్యం

విశిష్ట శబ్దం నుండి వైశిష్ట్యం ఏర్పడుతుంది విశద నుండి వైశద్యం, విరల నుండి వైరల్యం ఏర్పడతాయి వైశద్యం అంటె స్పష్టత వైరల్యం అంటే అరుదుగా ఉండడం వివర్ణ నుండి వైవర్ణ్యం ఏర్పడుతుంది వైవర్ణ్యం అంటే రంగు మారడం విశారద శబ్దం నుండి వైశారద్యం ఏర్పడుతుంది వైశారద్యం అంటే నేర్పు, దక్షత

వివిధ శబ్దంనుండి వైవిధ్యం ఏర్పడుతుంది అట్లాగే విపుల నుండి వైపుల్యం విశాల నుండి వైశాల్యం విముఖ శబ్దం నుండి వైముఖ్యం ఏర్పడుతుంది విలక్షణ నుండి వైలక్షణ్యం ఏర్పడు

ఉంది ప్రత్యేకత్వమని అర్థం విపరీత నుండి వైపరీత్యం ఏర్పడుతుంది విపల నుండి వైఫల్యం, సఫల నుండి సాఫల్యం ఏర్పడతాయి

సమ శబ్దం నుండి సామ్యం ఏర్పడుతుంది సమానత్వం అని అర్థం పోలిక తుల్యత్వం అన్న అర్థంలో వాడుతున్నాం అదేవిదంగా సమాన శబ్దం నుండి సామాన్యం అన్నమాట ఏర్పడింది సదృశ నుండి సాదృశ్యం ఏర్పడింది సాదృశ్యం అన్నా పోలికే పరుష నుండి పారుష్యం, కఠిన నుండి కాఠిన్యం ఏర్పడతాయి సోదర శబ్దం నుండి సౌదర్యం సోదరత్వమని అర్థం

సయుజ్ శబ్దం నుండి సాయుజ్యం ఏర్పడుతుంది ముక్తి అని అర్థం వణిజ్ శబ్దం నుండి వాణిజ్యం ఏర్పడింది

కుశల నుండి కౌశల్యం ఏర్పడింది అట్లాగే చపల నుండి చాపల్యం యజమాన నుండి యాజమాన్యం

ఈ య ప్రత్యయం స్వార్థంలో కూడా వస్తుంది చతుర్వర్ణ– చాతుర్వర్ణ్యం అవుతుంది సేనా శబ్దం సైన్యం అవుతుంది అర్థం ఒకటే సన్నిధి సాన్నిధ్యం అవుతుంది అట్లాగే సమీప – సామీప్యం అవుతుంది ఉపమ నుండి ఔపమ్యం ఏర్పడుతుంది ఐతిహ నుండి ఐతిహ్యం ఏర్పడింది బేషజ నుండి భైషజ్యం ఐతిహ్యం అంటే ఈవిధమైన పరంపర ఉన్నదని అర్థం అంటే పరంపరగా చెప్పుకుంటున్నారని అర్థం భైషజ్యం అంటే మందు అనీ, రోగం కుదర్చడమనీ అర్థం రోగం కుదర్చడమనే మాట తెలుగులో జాతీయంగా బుద్ధి చెప్పడమనే అర్థంలో వాడుకలో ఉంది కాని, ఇక్కడ మాత్రం నిజంగానే రోగం మాన్పడమే

చేతన– చైతన్యం అవుతుంది త్రిలోక త్రైలోక్యం అవుతుంది పరంపర నుండి పారంపర్యం ఏర్పడుతుంది కరుణ నుండి కారుణ్యం ఏర్పడుతుంది వ్యాకరణంలో ఆనంతర్యార్థం అని ఒక అర్థం ఉంది అనంతరం అన్న అర్థంలో వచ్చేదన్నమాట గ్రాంధిక భాషలో 'డున్ చేరుతుంది ఈ అర్థంలో వక్త రాగానే సభ మొదలయింది వంటి వాక్యాలు ఆధునిక భాషలో ఆనంతర్యార్థానికి ఉదాహరణలు మాలా శబ్దం నుండి మాల్యం మణిక శబ్దం నుండి మాణిక్యం ఏర్పడ్డాయి ఈ విధంగా ఎన్నో మాటలను తయారు చేసుకోవచ్చు

☆

# మమత - మమత్వం

సంస్కృత పదాలతో మనం తెలుగులో వాడే తద్ధిత ప్రత్యయాలలో చాలా ముఖ్యమైనవి త్వ, తా ఇవి భావార్థంలో వస్తాయి భావార్థం అంటే వస్తువులో ఉండే ధర్మం ఈ అర్థంలో సంస్కృతంలో చాలా ప్రచారంలో ఉన్న ప్రత్యయం త్వ అందువల్లే తెలుగు వ్యాకరణాలలో భావార్థానికి త్వార్థమని కూడా పేరు సంస్కృతంలో త్వ అన్న ప్రత్యయం ఏ అర్థంలో వస్తుందో ఆ అర్థంలో వచ్చే తెలుగు ప్రత్యయాలను త్వార్థక ప్రత్యయాలని తెలుగు వ్యాకర్తలు చెప్తారు తనం, రికం వంటివి త్వార్థక లేక భావార్థక ప్రత్యయాలు తెలుగులో ఏ నామవాచకానికైనా భావం ఉండక తప్పదు అందువల్ల మనుష్యుల పేర్లతో సహా అన్ని నామవాచకాల మీదా భావార్థక ప్రత్యయాలను వాడవచ్చు

తెలుగులో ధృతరాష్ట్రుని తనం అన్నామనుకోండి ధృతరాష్ట్రునిలోని విశేష లక్షణాలన్నీ వస్తాయి ధృతరాష్ట్రుడిలో అంధత్వమూ ఉంది కొడుకు మీద గుడ్డి ప్రేమా ఉంది దేన్నయినా మనం లక్ష్యంగా పెట్టుకోవచ్చు అట్లాగే మంచితనం అన్నామనుకోండి మంచివాడిలో ఉండే ధర్మం అని అర్థం

సంస్కృత పదాలలో కూడా ఈ అర్థంలో వేరు, వేరు ప్రత్యయాలు వాడుకలో ఉన్నాయి తెలుగులో తనం, రికం, ఇమి, న, ఇక, పు వంటి అనేక ప్రత్యయాలు ఈ అర్థంలో వస్తాయి కదా అట్లాగే సంస్కృతంలోనూ ఇంతకుముందు జాడ్యం వంటి మాటల్లో వచ్చిన 'య' ప్రత్యయం కూడా భావార్థకమే

త్వ, తా ప్రత్యయాలను దాదాపు అన్ని నామవాచకాల మీదా భావార్థంలో వాడవచ్చు రాముని భావం రామత్వం కృష్ణుని భావం కృష్ణత్వం

సీతా నుండి సీతాత్వం అవుతుంది సంస్కృతంలో తద్ధిత ప్రత్యయం వచ్చింతర్వాతి రూపమే వాడుతున్నాం కాబట్టి సీతాత్వం వంటివి అట్లాగే వాడవలసి ఉంటుంది

తా ప్రత్యయం సంస్కృతంలో దీర్ఘాంతమే అయితే తెలుగులో సంస్కృతంలో దీర్ఘాంత పదాలన్నీ హ్రస్వాంతాలవుతాయి కదా అందువల్ల ఈ ప్రత్యయం చివర ఉన్న మాటలు కూడా హ్రస్వాంతాలవుతాయి సంస్కృతంలో మమ శబ్దం మీద 'తా' ప్రత్యయం వచ్చి మమతా అని ఏర్పడుతుంది తెలుగులో ఇది మమత అవుతుంది

మమత అన్నా, మమత్వం అన్నా అర్థం ఒకటే నాది అన్న భావం తనది అనుకున్న దాని మీద మనిషికి ప్రేమ ఉంటుంది అందుకే మమత్వం అంటే ప్రేమ అన్న అర్థం ఏర్పడింది గర్వం, స్వాభిమానం, అహంకారం అన్న అర్థాలు కూడా నిఘంటువులలో ఉన్నాయి కాని వాడుకలో మమత్వం, మమత అన్న మాటలకు అభిమానం, ప్రేమ అన్న అర్థాలే విస్తృతంగా ప్రచారంలో ఉన్నాయి ఒకే మాట మీద ఒకే అర్థంలో వివిధ ప్రత్యయాలు చేరవచ్చు దానివల్ల వివిధ రూపాలు ఏర్పడతాయి

అధిక అన్నమాటలో అధికత, అధికత్వం, ఆధిక్యం ఏర్పడతాయి

మృదు అనే మాటను తీసుకుంటే మృదుత్వం, మృదుత, మార్దవం, మ్రదిమం అన్న మాటలు ఏర్పడతాయి అట్లాగే లఘుత్వం, లఘుత లఘిమం, లాఘవం

ద్రఢత్వం దృఢత ద్రఢిమ, దార్ఢ్యం అన్నమాటలు దృఢ శబ్దం నుండి ఏర్పడుతున్నాయి అలాగే మధుర శబ్దం నుండి మధురత్వం, మధురత మధురిమ, మాదుర్యం ఏర్పడుతున్నాయి

జడ శబ్దం నుండి జడత్వం, జడత జడిమ, జాడ్యం అలాగే మూర్ఖత్వం, మూర్ఖత, మౌర్ఖ్యం మూఢ నుండి మూఢత్వం, మూఢత, మౌఢ్యం

ప్రౌఢ నుండి ప్రౌఢత్వం, ప్రౌఢత ప్రౌఢిమ అని కూడా వాడుతున్నాం కాని ఇది సరయిన రూపం కాదంటారు

గురు- గురుత్వం, గురుత, గరిమ అవుతుంది

రసిక నుండి రసికత్వం, రసికత, రాసిక్యం ఏర్పడతాయి పటు నుండి పటుత్వం, పటుత, పటిమ ఏర్పడతాయి అల్పత్వం- అల్పత, కవిత్వం- కవిత, సాదుత్వం- సాధుత, ధార్మికత్వం- ధార్మికత సార్ధకత్వం- సార్దకత- సార్ధక్యం, కృతార్ధత్వం- కృతార్ధత, అలసత్వం- అలసత- ఆలస్యం ఇలా అసంఖ్యాకంగా పదాలు ఏర్పడుతున్నాయి

ఒకేమాటకు ఒకే అర్ధంలో ఒకేసారి రెండేసి ప్రత్యయాలు చేర్చి కూడా మనం ప్రయోగిస్తున్నాం ఇది అవసరం కాదు ఏక అన్న మాట మీద భావార్ధక ప్రత్యయాలు చేరిస్తే ఏకత్వం, ఏకత ఐక్యం అనే మాటలు ఏర్పడతాయి కొందరు ఐక్యత అని వాడుతున్నారు ఇటువంటి రూపం ఏర్పడదు 'య' ప్రత్యయం భావార్ధంలోనే వచ్చింది 'త' ప్రత్యయం కూడా భావార్ధకమే ఈ రెండు ప్రత్యయాలూ ఒకే మాటలో వాడవలసిన అవసరం లేదు ఏకత అనవచ్చు లేదా ఐక్యం అనవచ్చు ఐక్యత సరయినది కాదు ఇట్లాగే మాధుర్యత, వాత్సల్యత మాధుర్యం, వాత్సల్యం అంటే సరిపోతుంది

ప్రస్తుతం మనం వాడుతున్న మాటల్లో ప్రాధాన్యత, ప్రాముఖ్యత అన్నమాటలు ఇటువంటివే వీటిని చాలా ఎక్కువగా వాడుతున్నారు ప్రాధాన్యం ప్రధాన శబ్దం నుండి ఏర్పడింది ప్రాముఖ్యం ప్రముఖ శబ్దం నుండి ఏర్పడింది ఇవి చాలు వీటిమీద మళ్ళీ 'త' చేర్చవలసిన అవసరం లేదు ఆధిక్యత అన్న ప్రయోగం కూడా ఇటువంటిదే అధికత్వం, అధికత, ఆధిక్యం అని వాడవచ్చు ఆధిక్యం మీద మళ్ళీ 'త' ప్రత్యయం అవసరం లేదు, సౌకుమార్యత, చాపల్యత, వైదుష్యత, వైశాల్యత మొదలయిన మాటలు ఇటువంటివే

స్త్రీత్వం, పురుషత్వం స్థిరత్వం వీరత్వం, సభ్యత్వం, ద్విత్వం ఇలా ఎన్ని మాటలయినా సిద్ధం చేసుకోవచ్చు జాగ్రత్ మీద 'త' వచ్చి జాగ్రత్త అవుతుంది జాగ్రత సరయిన రూపం కాదంటారు

☆

# అహంకారం - అహంభావం

**యు,** త్వ, త ప్రత్యయాలలాగానే కార భావ అన్న ప్రత్యయాలు కూడా భావార్థంలో వస్తాయి మమ శబ్దాన్ని తీసుకుంటే త ప్రత్యయం వస్తే మమత అవుతుంది 'త్వ' ప్రత్యయం వస్తే మమత్వం అవుతుంది కార ప్రత్యయం చేరిస్తే మమకారం అవుతుంది మమత, మమత్వం మమకారం మూడింటికీ అర్థం ఒకటే

అహం అంటే నేను అహంత, అహంత్వం అంటే నేను అన్న భావం అహం మీద కార భావ ప్రత్యయాలు రెండింటినీ వాడవచ్చు అహంకారం, అహంబావం అని పదాలు ఏర్పడ్డాయి అహంకారం అంటే నేను అన్న అబిమానం, గర్వం అహంకారం అంటే క్రోధం అన్న అర్థం కూడా తెలుగులో ఉంది పూర్వకవులు ఈ అర్థంలో వాడారు సంస్కృతంలో ఈ అర్థం లేదు ప్రస్తుతం గర్వం అన్న అర్థంలోనే ఈ మాటకు ప్రయోగం ఎక్కువ ఈ మాటతో అహంకారి అన్నమాట ఏర్పడుతుంది గర్వితుడు అని అర్థం క్రియగా అహంకరించు అనికూడా ప్రయోగం అహంకృతి అహంక్రియ అని కూడా అహంకార పదానికి రూపాంతరాలున్నాయి అహంభావం అన్నా గర్వమే

పురుషత్వం పురుషకారం, పుంస్త్వం, పుంభావం అని వాడవచ్చు వీటన్నిటినీ మగతనం అన్న అర్థంలో వాడవచ్చు పురుషకారం అంటే పురుష ప్రయత్నం అనికూడా అర్థం స్త్రీత్వం పురుషత్వం వంటి మాటలను సుకుమారత్వం ప్రౌఢత్వం అన్న అర్థాలలో వాడుతున్నాం పురుషకారమన్న మాటా ఇటువంటిదే పురుష శబ్దం సమాజంలో మగవాడి ఆధిక్యానికి చిహ్నంగా వాడడం జరుగుతున్నది ఉద్యోగం పురుష లక్షణం వంటి వాక్యాలు కూడా ఇటువంటి భావాన్నే వ్యక్తం చేస్తున్నాయి పౌరుషం వంటి మాటలు సామాన్యార్థంలోకి వచ్చాయి ఆమెకు చాలా పౌరుషం ఉండనవచ్చు అభిమానం అని అర్థం పురుషకారం అన్నమాటను కూడా పురుషుని పరంగా తీసికోకుండా మానవ ప్రయత్నంగా తీసికోవచ్చు తీసుకోవాలి మానవ ప్రయత్నం అన్న అర్థంలో పురుష కారాన్ని దైవికంకు వ్యతిరేకంగా వాడవచ్చు స్త్రీ పురుష న్యూనాధిక్యాలను సూచించే మాటలు భాషల్లో స్థిరపడి ఉన్నాయి వీటిని కొన్ని సందర్భాలలో వాడడం మాని వేయవచ్చు లేకపోతే స్త్రీకీ, పురుషుడికీ సమానంగా వర్తింపజేసి సామాన్యార్థంలో వాడవచ్చు

పుంభావం అన్నమాటను తెలుగులో ఎక్కువగా పుంభావ సరస్వతి అన్న పదబంధంలో వాడుతూ ఉంటారు ఈ మాట కేవలం పురుషులకే వర్తిస్తుంది సరస్వతి స్త్రీ సరస్వతికి పురుష రూపమే పుంభావ సరస్వతి మూర్తీభవించిన పాండిత్యం అని అర్థం ఈ మాటను కొంచెం అతిగానే వాడుతున్నామేమో అనిపిస్తుంది ముఖ్యంగా సాహిత్య సభలలో ఈ మాటను దురుపయోగం చేస్తున్నారు పొగిడి సంతోషించే వాళ్ళూ, పొడిగించుకొని సంతోషించే వాళ్ళూ కూడా ఆలోచించవలసిన విషయం ఇది

భావ ప్రత్యయాన్ని విస్తృతంగా వాడుకోవచ్చు ఏ మాటమీదనయినా ఆ భావము అన్న అర్థంలో వాడవచ్చు శత్రుభావం అంటే శత్రువనే భావం, అట్లాగే మిత్రభావం, పుత్రభావం, పుత్రికాభావం పితృభావం, మాతృభావం, భ్రాతృభావం మొదలయినవి

తూష్ణీమ్ అంటే ఊరక, మిన్నక అని అర్థం విడిగా తెలుగులో ఈ మాటకు వాడుక లేదు

...వ ప్ర...యం చేరి తూష్ణీంబావం అనేమాట మాత్రం వాడుకలో ఉంది  మిన్నకుండడం ...ర్థం మౌనంగా ఉండడం  లెక్కచేయకుండా ఉండడమన్న అర్థం కూడా ఉంది  అంటే ...ంచుకోకుండా ఊరకుండడమే  ఒక రకమయిన తిరస్కార భావం కూడా ఇందులో ఉంది

స్వభావం అంటే తన భావమే  తనతనం అన్న మాట  ఆయా వస్తువులకు ఉండే లక్షణం

వ్యాకరణాలలో ప్రకృతి భావం అనే మాటను వాడుతారు  ఇక్కడ ప్రకృతి అంటే ప్రాతి...దిక  అర్థం ఉన్నటువంటి శబ్దం, విభక్తి ప్రత్యయాదులు చేరకముందున్న శబ్ద రూపం  ప్రకృతి భావం అంటే అటువంటి లక్షణం

తిరః అంటే అడ్డంగా, తిరస్కారం అంటే అనాదరం, పాటించకపోవడం, అవమానించడం ...స్కారం అంటే మాయంకావడం అన్న అర్థం కూడా ఉంది  తిరస్కరిణి విద్య ఉంది కదా  తిరస్క...ణి అంటే ఇతరుల కంటికి కనిపించకుండా ఉండడం  ఇదొక మంత్ర విద్య అన్నమాట  తిర...స్కారం అంటే తెగడ్త, నింద అని కూడా అర్థం ఉంది  తిరస్కృతి, తిరస్క్రియ అనికూడా అనవచ్చు

పురస్కారం అన్నమాట కూడా ఇటువంటిదే  తిరః అంటే అడ్డంగా అన్నట్లుగానే పురః, పురతః అంటే ముందర అని అర్థం  పురస్కారం అంటే ముందు ఉంచడం  అంటే ప్రాధాన్యం ఇష్టపడం  పూజించడం  పురస్కారం అంటే సమ్మానం, బహుమతి, అవార్డు అన్న అర్థం ఇప్పుడు ప్రచురంగా ఉంది  జ్ఞానపీఠ పురస్కార గ్రహీత ఆచార్య సి నారాయణరెడ్డిగారు అంటున్నాం పురస్కృతి, పురస్క్రియ అన్నా ఇదే అర్థం  ధిక్ అంటే నింద  దీనిమీద కార ప్రత్యయం చేరిస్తే ధిక్కారం అవుతుంది  ధిక్ అని తెలుగులో విడిగా ప్రయోగం లేదు కాని ధిక్కారం మాత్రం వాడుకలో ఉంది  ఒక పౌరాణిక చిత్రంలోని వాక్యం 'ధిక్కారమును సైతునా' బాగా ప్రచారంలో ఉండింది  ధిక్కారం అంటే తిరస్కారమే  ధిక్కృతి, ధిక్క్రియ అనికూడా అనవచ్చు

చీత్కారం, ఫూత్కారం, హాహాకారం వంటి మాటలున్నాయి  ఛీత్కారం అంటే చీదరించుకోవడం  ఫూత్కారం అంటే ఊదిన ధ్వని  హాహాకారం అంటే ఆర్తనాదం

☆

# స్నాతకం - శతకం

తద్ధిత ప్రత్యయాలు వివిధ అర్థాలలో వస్తాయి ఒకే అర్థంలో అనేక ప్రత్యయాలు వచ్చినట్లుగానే ఒకే ప్రత్యయం అనేకార్థాలలోనూ వస్తుంది ఆ విధంగా అనేకార్థాలలో వచ్చే ప్రత్యయాలలో క ప్రత్యయం ఒకటి

పీత అంటే పసుపు రంగు పట్టు పీతాంబరాలు అంటాం కదా పీతకం అంటే పసుపు రంగు వేసింది పసుపు పచ్చనిది ఇక్కడ పీత వర్ణం వేసిన, కలిగిన అన్న అర్థంలో క ప్రత్యయం వచ్చింది ధేనుకు క చేరితే ధైనుకం అవుతుంది ధేనువుల సమూహం అని అర్థం

ధనుస్ అనే పదం మీద క ప్రత్యయం చేరి ధానుష్క ఏర్పడుతుంది ధానుష్కుడు అంటే విలుకాడు ధనుస్సుతో తిరిగేవాడన్న మాట

ఇటీవలి కాలంలో అమ్మకాలు' బాగా జరుగుతున్నాయి ఇంగ్లీషు మాట సేల్ అన్నది ఈ అర్థంలో బాగా వాడుకలోకి వచ్చింది చాలారకాల వస్తువులకు వాటి ధరను బట్టి ఒక్కో సమూహంగా ఏర్పాటు చేయడం కూడా కనిపిస్తుంది అక్కడ అయిదు రూపాయలనో, పది రూపాయలనో బోర్డు పెడతారు వేరె ధర చెప్పేపనిలేదు ఆ వస్తువులన్నీ అదే ధర అని అర్థం ఈ దరకు కొన్న వస్తువు అన్న అర్థంలో కూడా క ప్రత్యయం వస్తుంది పంచకం అంటే అయిదు రూపాయలకు కొన్న వస్తువు. బహుకం అంటే చాలా డబ్బు పోసి కొన్నది పంచాశత్కం అంటే యాభై రూపాయలకు కొన్నది త్రింశత్కం అంటే ముప్పై రూపాయలకు కొన్నది

క్వచిత్ అంటే అక్కడక్కడ, కదాచిత్ అంటే అప్పుడప్పుడు క్వాచిత్కం అంటే అక్కడక్కడ జరిగేది చెదురుమదురుగా అని అర్థం కాదాచిత్కం అంటే అప్పుడప్పుడూ జరిగేది అంటే అరుదుగా జరిగేదని అర్థం కాథంచిత్కం అంటే కష్టం మీద జరిగేది సులువైంది కాదని అర్థం

భ్రాతృ, మాతృ, పితృ వంటి మాటల మీద 'క' ప్రత్యయం చేరుతుంది అప్పుడు దాని నుండి వచ్చినది అని అర్థం భ్రాతృకం అంటే సోదరుని నుండి వచ్చింది మాతృకం అంటే తల్లి నుండి వచ్చింది పైతృకం అంటే తండ్రి నుండి వచ్చింది

పథికుడు అంటే బాటసారి, మార్గంలో పోయేవాడు పథి అన్న మాట మీద 'క' ప్రత్యయం చేరింది కేశకుడు అంటే కేశరచనా తత్పరుడు ఎప్పుడూ జుట్టు దువ్వుకుంటూ ఉండేవాణ్ణి ఈ పేరుతో పిలవచ్చేమో.

అంశం అంటే భాగం, వంతు అంశకుడు అంటే భాగం కలిగినవాడు పాలివాడన్న మాట దాయాది శీత శబ్దం మీద 'క' ప్రత్యయం చేరితే శీతకుడు అవుతుంది శీత శబ్దానికి చల్లని అని అర్థం శీతకుడు అంటే సోమరి అని అర్థం ఉష్ణకుడు అంటే చురుకయిన వాడని అర్థం వేడిగా ఉండడం చురుకుదనానికీ, చల్లగా ఉండడం సోమరితనానికీ లక్షణాలన్నమాట తూష్ణీం శీలకుడు అంటే ఊరకుండే స్వభావం కలిగినవాడు

'క' ప్రత్యయానికి నింద్యార్థం కూడా ఉంది అశ్వకం అంటే నింద్యమయిన అశ్వం తక్కువ రకంది అట్లాగే గ్రామటిక అంటే కుగ్రామం ఈ అర్థంలో 'పాశ' అన్న ప్రత్యయం కూడా ఉంది భిషక్పాశుడు అంటే నింద్యుడయిన వైద్యుడు

హరిణం అంటే లేడి దానిమీద జాలి కలిగితే హరిణకం అనవచ్చు చిన్నలేడి అన్న

...మూ ఉంది పాపం లేడి అన్న అర్థమూ ఉంది కొంచెం అన్న అర్థంలో కూడా క ప్రత్యయం ...స్తుంది తైలం అంటే నూనె తైలకం అంటే కొంచెం నూనె అట్లాగే జాతి అన్న అర్థంలోనూ ఈ ప్రత్యయాన్ని వాడవచ్చు సింహకం అంటే సింహజాతికి చెందింది శరబకం అంటే శరభ జాతికి చెందింది

సదృశమయినది అన్న అర్థంలోనూ క ప్రత్యయం వస్తుంది స్థూలకం అంటే స్థూల సదృశం అణుకం అంటే అణుసదృశం చంచత్కం అంటే కదులుతూ ఉన్నట్లున్నది, బృహత్కం అంటే పెద్దదిగా ఉన్నట్లున్నది పానకం అంటే పాన సదృశం తాగేది పత్రిక అంటే పత్రసదృశం

క ప్రత్యయం స్వార్థంలో కూడా వస్తుంది అంటే ధాతువుకు ఉన్న అర్థంలోనే అని భావం బాల శబ్దానికి ఉన్న అర్థమే క ప్రత్యయం చేర్చిన తరువాత ఏర్పడే బాలక శబ్దానికీ ఉంటుంది బాలుడు అన్నా బాలకుడు అన్నా అర్థం ఒకటే స్నాతుడు- స్నాతకుడు, అధ్యయనం పూర్తి చేసిన వాడని అర్థం ఇప్పుడు మన కళాశాలల్లో డిగ్రీ పూర్తి చేసినవాణ్ణి స్నాతకుడు అనవచ్చు డిగ్రీపై చదువును స్నాతకోత్తరం అంటున్నాం జాతం- జాతకం, మృతుడు- మృతకుడు, ప్రకీర్ణం- ప్రకీర్ణకం ఇటువంటివి

మాలా శబ్దం నుండి మాలిక ఏర్పడింది పద్యంలో నాలుగు పాదాలుంటే మాల అనీ, అనేక పాదాలుంటే మాలిక అనీ అంటాం ఉత్పలమాల అంటే నాలుగు పాదాల ఉత్పలమాల ఉత్పలమాలిక అంటే చాలా పాదాలుండే ఉత్పలమాల వృత్తం దండ అన్న అర్థంలో మాల అన్నా మాలిక అన్నా భేదం లేదు అట్లాగే మండపం - మండపిక, గమనం- గమనిక, ఖండం- ఖండిక, అంకురం- అంకురిక, అవతారం- అవతారిక, అవతరణం- అతవరణిక, పల్యంకం- పల్యంకిక

పొట్టిది, చిన్నది అన్న అర్థంలోనూ 'క' ప్రత్యయం వస్తుంది వృత్తకం అంటే పొట్టిచెట్టు వంశకం చిన్న వెదురు మొక్క, వేణుకం అన్నా ఇదే అర్థం పల్లవిక అంటే చిగురుటాకు

పరిమాణార్థంలోనూ, సంఘార్థంలోనూ కూడా 'క' ప్రత్యయం వస్తుంది ఏకకం అంటే ఒక్కటి ద్వికం అంటే రెండిటి సమూహం అట్లాగే త్రికం, చతుష్కం, పంచకం, షట్కం, సప్తకం, అష్టకం నవకం, దశకం, శతకం, సహస్రకం ఈ మాటలన్నీ మనం నిత్యం వాడుతూ ఉన్నవే అష్టకం, శతకం వంటివి కావ్యభేదాలు కూడా అష్టకం అంటే ఎనిమిది పద్యాల కావ్యం జనార్దనాష్టకం వంటివి ప్రసిద్ధ అష్టకాలు శతకం అంటే వంద పద్యాల రచన తెలుగువారిలో శతకం అంటే తెలియని వారుండరంటే అతిశయోక్తి కాదు

అశ్వకం అంటే గుర్రంలాగా ఉన్న బొమ్మ. గజకం అంటే ఏనుగులాగా ఉన్న బొమ్మ పిష్టం అంటే పిండి నువ్వుల పిండి పిష్టకం అన్నా పిండే పిష్టకం అంటే పిండివంట అని కూడా అర్థం ☆

# ప్రాచీనం - వాఙ్మయం

ప్రాక్ అంటే తూర్పు దీని మీద ఈన ప్రత్యయం చేరితే ప్రాచీనం అవుతుంది ప్రాచీనం అంటే తూర్పుదిక్కున పుట్టింది తూర్పు దిక్కున ఉన్నది ముందటిది పురాతనమైనది అని కూడా అర్థం కాని తెలుగులో పురాతనమైన అన్న అర్థంలో ఈ మాటకు ప్రాచుర్యం ఉంది కాని తూర్పు దిక్కున పుట్టినది అన్న అర్థంలో అంతగా వాడుకలోలేదు ప్రాచీనం అంటే కంచె అన్న అర్థం కూడా ఉంది కంపకోట గ్రామానికి ముందు వేసిన కంప తూర్పుదేశంలో పుట్టిన ఒక వృక్ష విశేషానికి కూడా ప్రాచీన అని పేరు అగురుసొంటి అంటారు

ప్రత్యక్ అంటే పడమటి దిక్కు దీనిమీద ఈన ప్రత్యయం చేరితే ప్రతీచీనం అవుతుంది పడమటి దిక్కున పుట్టింది ప్రతీచీనం ఇదేవిధంగా అవాచీనం అవాక్ అంటే దక్షిణం దక్షిణ దిశలో పుట్టింది అవాచీనం ఉదక్ అంటే ఉత్తరం ఉత్తర దిశలో పుట్టింది ఉదీచీనం

పరాజ్ మీద ఈన' ప్రత్యయం చేరిస్తే పరాచీనం అవుతుంది అవతలిముఖం అని అర్థం పరాచీనుడు అంటే పెడమొగం పెట్టినవాడు పరాఙ్ముఖుడు దీనికి భిన్నమయినది అర్వాక్ అర్వాక్ నుండి అర్వాచీనం ఇవతలి ఒడ్డున పుట్టినది పరాజ్ అవతలి ఒడ్డు అర్వాక్ ఇవతలి ఒడ్డు అర్వాచీనం అనే మాటను కాలవాచకంగా వాడుతున్నాం ఇటీవలిది అని అర్థం పరాచీనం అంటే రాబోయే కాలంలో జరిగేది అర్వాచీనం అంటే నవీనం ప్రాచీనానికి వ్యతిరేకంగా ఈ మాటను వాడుతున్నాం అర్వాచీనం అంటే కిందిది అన్న అర్థం కూడా ఉంది కాని ఇటీవలిది అన్న అర్థంలోనే తెలుగులో ఈ మాటను ఎక్కువగా వాడుతున్నాం

సమ్యక్ అంటే సత్యం సమీచీనం అంటే సత్యమైనది పరిశుద్ధమైనది అర్హమైనది తగిన దన్నమాట సధ్ర్యక్ కలిసి నడిచేవాడు సహచరుడు సధ్రీచీనుడు అంటే ఇదే అర్థం సధ్రీచీనం అంటే కలిసి నడవడం అని అర్థం

'తిర్యక్'కు 'ఈన' ప్రత్యయం చేరిస్తే తిరశ్చీనం అంటే అడ్డంగా నడవడం తిరశ్చీనుడు అంటే అడ్డంగా నడిచేవాడు

'మయ' అనే ప్రత్యయాన్ని ప్రాచుర్యం అన్న అర్థంలో ఉపయోగిస్తారు వాక్ మీద మయ ప్రత్యయం చేరితే వాఙ్మయం ఏర్పడుతుంది వాక్కులతో నిండినది వాగ్రూపమయింది భాషా సంపన్నమయినది సాహిత్యం, సారస్వతం, వాఙ్మయం అన్న మాటలను సమానార్థంలో ఉపయోగిస్తున్నాం అన్నమయం అంటే అన్నంతో నిండినది జలమయం అంటే నీటితో నిండింది వరదలలో అంతా జలమయమయి పోయిందంటాం జ్యోతిర్మయం అంటే వెలుగుతో నిండినది ఏ మాటమీదనయినా ఉపయోగించి వాడడానికి అవకాశం ఉన్న ప్రత్యయం ఇది. అంధకార మయం, అంటే చీకటితో నిండినది అయోమయం అన్నమాటను విస్తృతంగా వాడుతున్నాం అయస్ అంటే ఇనుము అయోమయం అంటే ఇనుముతో చేసింది కొరుకుడు పడనిది, అర్థం కానిది అన్న ఆలంకారికమయిన అర్థం ఈ మాటకు ఏర్పడింది మృణ్మయం అంటే మట్టితో చేసింది. మృణ్మయపాత్ర అంటే మట్టిపాత్ర స్వర్ణమయం, సువర్ణమయం, హిరణ్మయం మొదలయినవి బంగారంతో చేసినవి

చిన్మయం జ్ఞానంతో నిండి ఉండడం తన్మయం అంటే తత్ – దానిమయం దానితో

...మయిన అంతఃకరణ ప్రవృత్తి కలిగినటువంటిది దానితో ఐక్యమైనది
...మయం అంటే పేడ అమ్మయం అంటే జలమయం అప్ అంటె నీరు
ఈ మయ తో ఎన్నో మాటలు ఏర్పడతాయి కిరణ్మయి లాంటి పేర్లు వాడుకలో ఉన్నాయి ...మయ్ హిరణ్మయ్ లాంటి పేర్లు బెంగాలీలలో చాలా ప్రచారంలో ఉన్నాయి దయామయుడు, ...మయుడు బాగా వాడుకలో ఉన్నమాటలు మయ ప్రత్యయం తెలుగులో వాడుకలో ఉన్న ...త ప్రత్యయాలలో ముఖ్యమైంది సంస్కృత పదాలమీద సంస్కృత పద్ధతిలో చేరే ...త ప్రత్యయాలు కొన్ని కొన్ని ప్రత్యయాలను సంస్కృతంలో వాడె పద్ధతికి బిన్నంగా కూడా ...లో వాడడం ఉంది అయితే తెలుగుమాటల మీద సంస్కృత ప్రత్యయాలు వాడడం ...రణంగా అరుదైన విషయం అన్నమాచార్య కీర్తనలో పదివేల శేషుల పడగల మయము ... ఉంది కదా! పడగలు అన్నది తెలుగుమాట దీనిమీద మయము అన్న ఈ మయ ప్రత్య ...న్ని వాడాడు అన్నమయ్య

ముళ్ళమయం, బాధలమయం, కష్టాలమయం, నీళ్ళమయం, పొదలమయం, పుస్తకాల మయం చికటిమయం మొదలయిన విధంగా తెలుగులో మయ ప్రత్యయానికి విస్తృతమయిన వాడుక ఉంది

ఖండ ప్రత్యయాన్ని సమూహం అన్న అర్థంలో వాడతారు కమలఖండం అంటే కమల ముల సమూహం పద్మినీ ఖండం అంటే పద్మసమూహం కుముదఖండం అంటే కుముదముల సమూహం కుముదం అంటే తెల్లకలువ కైరవిణీ ఖండం అన్నా తెల్ల కలువల సమూహమే వీటిని ఆయా పుష్పాల కొలనుల సమూహంగా కూడా చెప్పవచ్చు

ఈ అర్థంలోనే కాండ ప్రత్యయం కూడా వస్తుంది పూర్వకాండం/పూర్వకాండ, తృణకాండం/ తృణకాండ, కర్మకాండం/కర్మకాండ మొదలయిన మాటల్లో కాండ సమూహార్థం

ఖండ, కాండల లాగానే స్కంధ ప్రత్యయం కూడాసమూహార్థాన్నే బోధిస్తుంది నరస్కంధం అంటే మానవ సమూహం, కరి స్కంధం అంటే ఏనుగుల సమూహం తురంగ స్కంధం అంటే గుర్రాల సమూహం

☆

# ద్వీపకల్పం- నామధేయం

కొంచెం తక్కువ అన్న అర్థంలో కల్ప దేశ్య, దేశీయ అనే ప్రత్యయాలు వస్తాయి ద్వీపం అంటే నాలుగు వైపుల నీరున్న భూమి చుట్టూ నీరున్నది దీనికి కల్ప ప్రత్యయం చేరిస్తే ద్వీపకల్పం అవుతుంది అన్ని వైపులా నీరుండి ఒక వైపున మాత్రం భూమి ఉన్న ప్రదేశం భారతదేశం ఒక ద్వీపకల్పం అంటే ద్వీపలక్షణాన్ని అన్వయించినప్పుడు దానికంటే కొంచెం తక్కువయినది అన్న మాట

విద్వాంసుడు అంటే సర్వమూ తెలిసిన వాడు విద్వత్ శబ్దానికి కల్ప ప్రత్యయం చేరిస్తే విద్వత్కల్పుడు అవుతుంది విద్వత్కల్పుడు అంటే కొంచెం తక్కువగా పండితుడు ఇంచు మించుగా పండితుడు పూర్తి పండితుడు కాడన్నమాట అట్లాగే మృతకల్పుడు మృతుని కంటే కొంచెం తక్కువవాడు చావొక్కటే తక్కువ తప్ప తక్కిన అన్ని విషయాలలోనూ చచ్చిన వాడితో సమానమన్నమాట

పితృకల్పుడు అంటే తండ్రి కంటే కొంచెం తక్కువ తండ్రి తరువాత తండ్రి అంతటివాడు పితృతుల్యుడు, పితృసమానుడు అని వాడుతూ ఉంటాం ఇది కూడా దాదాపు అటువంటి ప్రయోగమే మిత్రకల్పుడు అంటే మిత్రునికంటే కొంచెం తక్కువ వాడు భ్రాతృకల్పుడు, శత్రుకల్పుడు మొదలయిన విధంగా ఈ ప్రత్యయాన్ని వాడవచ్చు

దేశ్య దేశీయ ప్రత్యయాలు కూడా ఇంతే విద్వత్కల్పుడులాగానే విద్వద్దేశ్యుడు విద్వద్దేశీయుడు అర్థం సమానమే

చణ, చంచు/చుంచు ప్రత్యయాలు దానిచేత ప్రసిద్ధుడు అన్న అర్థంలో వాడుకలో ఉన్నాయి విద్యాచణుడు అంటే విద్యచేత ప్రసిద్ధుడయినవాడు యాత్రాచణుడు అంటే యాత్రల చేత ప్రసిద్ధుడయిన వాడు బోధనాచణుడు అంటే బోధనచేత ప్రసిద్ధుడయిన వాడు అదేవిధంగా రచనాచణుడు, పరిపాలనాచణుడు మొదలయిన ప్రయోగాలు చేయవచ్చు విద్యాచంచువు/విద్యాచుంచువు అన్నా విద్యచేత ప్రసిద్ధుడనే అర్థం కావ్యాలలో దీనికి ప్రయోగాలున్నాయి గానీ, నేటి వాడుకలో అంతగా కనిపించదు

'చర' అన్న ప్రత్యయం ముందే జరిగిపోయింది అన్న అర్థంలో వస్తుంది. శ్రుతచరం అంటే ఇంతకు పూర్వమే విన్నటువంటిది జ్ఞాతచరం అంటే ముందే తెలిసినటువంటిది అఢ్యచరుడు అంటే పూర్వం అఢ్యుడుగా ఉన్నవాడు అఢ్యుడు అంటే సంపన్నుడు 'బృహత్కథ'ను రచించిన గుణాఢ్యుడున్నాడు కదా గుణంచేత సంపన్నుడన్న మాట ధనాఢ్యుడులాంటి పదాలిటువంటివే

పరిమాణం అన్న అర్థంలో ద్వయస, దఘ్న, మాత్ర అనే ప్రత్యయాలు వస్తాయి ఊరు ద్వయసం అంటే తొడల వరకు ఉన్న లోతు అట్లాగే ఊరు దఘ్నం జాను ద్వయసం అంటే మోకాలిలోతు జాను దఘ్నం అన్నా అదే అర్థం కంఠ దఘ్నం అంటే గొంతులోతు వక్షోమాత్రం అంటే రొమ్ములోతు అట్లాగే ఊరుమాత్రం, జానుమాత్రం

ప్రశంసార్థంలో 'రూప' ప్రత్యయం వస్తుంది పటరూపం అంటే మంచి వస్త్రం యుక్త రూపం అంటే తగినది, యోగ్యమైనది విద్వద్రూపుడు మంచి విద్వాంసుడు 'ఏక' శబ్దానికి అకి ప్రత్యయం చేరితే ఏకాకి అవుతుంది ఒంటరి అని అర్థం

ధేయ అన్న ప్రత్యయం స్వార్థంలో వస్తుంది అంటే అర్థంలో మార్పు ఉండదు మీ నామధేయం ఏమిటి? అన్నా మీ నామం ఏమిటి? అన్నా అర్థం ఒకటే నామ శబ్దం మీద దేయ ప్రత్యయం చేరి నామదేయం ఏర్పడుతుంది భాగం, బాగధేయం అన్నా ఒకటే అంశం అనీ, అదృష్టం భాగ్యం అనీ అర్థాలు భాగధేయం అంటే పన్ను అన్న అర్థం కూడా ఉంది అట్లాగే రూపం అన్నా రూపధేయం అన్నా అర్థం ఒకటే నామదేయుడు అంటే పేరుకలవాడు భాగధేయుడు అంటే భాగం కలవాడు

హ్రస్వార్థంలో 'ర' ప్రత్యయం వస్తుంది కుటి అంటే గుడిసె కుటిరం/కుటీరం అన్నా గుడిసె గుడిసె కంటే కూడా చిన్నదన్న అర్థంలో వాడవచ్చు ఇదే విధంగా తూణి/తూణీరం, శమి శమీరం తూణి అంటే అమ్ములపొది శమి అంటే జమ్మిచెట్టు శమీరం అంటే చిన్న జమ్మిచెట్టు

సం మీద కట చేరి సంకటం అవుతుంది సంకటం అంటే ఇరుకైనది అని అర్థం ఇరుకయిన దారి సమ్మర్దం కలిగిన చోటు అని అర్థాలు కాని తెలుగులో సంకటం అంటే కష్టం అన్న అర్థమే ఎక్కువ ప్రచారంలో ఉంది సంకటపడటం అంటే ఇబ్బంది పడడం కష్టపడడం, బాధపడడం ప్రకటం అంటే ప్రసిద్ధమైనది వ్యక్తం, కనిపించేది అన్న అర్థంలో ఎక్కువగా వాడుతున్నాం ప్రకటించు అంటే వెల్లడి చేయడం ప్రకటనం అంటే ప్రకటించడం ఉత్కటం అంటే అధికమైనది ఉత్కటంగా ఉంది అంటే అధికంగా ఉందని అర్థం

ని మీద బిడ చేరితే నిబిడం అవుతుంది నిబిడం అంటే దట్టమైనది గట్టిది అని అర్థం నిబిడీకరించు అంటే దట్టంగా దృడంగా చేయడం నిబిరీసం అన్నా ఇదే అర్థం

'తర' ప్రత్యయం చేరి అల్పత్వాన్ని బోధిస్తుంది అశ్వం అంటే గుర్రం అశ్వతరం అంటే అశ్వత్వం అల్పంగా ఉన్నటువంటిది అశ్వతరం అంటే కంచరగాడిద వత్సతరం అంటే దూడ కంటే పెద్దది వత్సం అంటే దూడ వత్సత్వం తక్కువగా ఉన్నది దానికంటే కొంచెం ముదురు వయస్సు కలిగినది ఇటువంటిదే ఉక్షతరం ఉక్షం అంటే తరుణ వయస్సులో ఉన్న ఎద్దు దాని కంటే పెద్దవయస్సు ఉన్న ఎద్దు ఉక్షతరం ఋషభం అన్నా ఎద్దే ఎద్దు బరువులు మోయగలిగిన శక్తి కలిగినటువంటిది ఋషభతరం అంటే బరువులు మోసే శక్తి తక్కువగా ఉన్నది అంటే ఇంకా బరువులు మోసే వయస్సు రానిది – గిత్త

☆

# జాతీయాకరణం

అభూత తద్భావార్థం అని ఒకటుంది. లేనిది అవడం అని అర్థం. ఇంతకు ముందు లేనిది లేక మరో రూపంలో ఉన్నది ఉనికిలోకి రావడం, మరో రూపాన్ని పొందడం ఈ అర్థంలో సంస్కృతంలో కృ, భూ ధాతువుల కలయికతో రూపాలు వస్తాయి. భూతం, భవనం, కృతం, కరణం వంటివి నామవాచకాల మీద చేరతాయి. లక్ష్య శబ్దం మీద భూతం చేరిస్తే లక్ష్యీభూతం అవుతుంది. లక్ష్యం కానిది లక్ష్యం కావడమని దీనికి అర్థం. ఇదేవిధంగా లక్ష్యీకృతం. కృశీభూతం అంటే కృశం కానిది కృశం కావడం. కృశీకృతం కూడా ఇటువంటిదే. రాశీభూతం అంటే రాశి కానిది రాశి కావడం. రాశీకృతం అంటే రాశిగా చేయబడినది. అట్లాగే భస్మీభూతం భస్మం కానిది భస్మం కావడం. భస్మీకృతం అంటే భస్మంగా చేయబడినది.

గంగా శబ్దం మీద ఈ ప్రత్యయాలను చేర్చినప్పుడు గంగీభూతం, గంగీకృతం ఏర్పడతాయి. అట్లాగే శుచి– శుచీభూతం, శుచీకృతం అవుతుంది. చక్షు శబ్దం– చక్షూభూతం, చక్షూకృతం అవుతుంది.

ఆధునిక భాషలో వివిధ శాస్త్రాల రచన జరుగుతూ ఉంది. అట్లాగే పత్రికా భాషలో ఇంగ్లీషు నుండి ఎన్నో మాటలు వచ్చి చేరుతూ ఉన్నాయి. ఎన్నో మాటలను అనువదించుకోవలసి వస్తూ ఉంది. ఈ సందర్భంలో ఈ కరణ, భవన ప్రత్యయాలు చాలా ఉపయోగపడుతున్నాయి. వీటిని విస్తృతంగా వాడుతున్నాం.

ఘనీభవనం అంటున్నాం. ఘనం కానిది అంటే ఘన పదార్థం కానిది ఘన పదార్థంగా మారడం.

ఘనీభవనం చెందడంతోపాటు ఘనీభవించు అని క్రియగా కూడా దీన్ని వాడుతున్నాం. ఇటువంటిదే ద్రవీభవనం. బాష్పీభవనం, ద్రవీభవనం, ఘనీభవనం వంటి మాటలు విద్యార్థులకు బాగా పరిచితమయిన మాటలు. వాళ్ళ సైన్సు పుస్తకాలలో వీటి ప్రయోగం ఎక్కువ. వక్రీభవనం అన్నమాట కూడా వాడుకలో ఉన్నదే. వంకర కావడం.

కరణం చేరి ఇప్పుడు తెలుగులో వందల పదాలు వాడుకలోకి వచ్చాయి. బాంకుల జాతీయాకరణంతో జాతీయాకరణం అన్న మాటకు బాగా ప్రచారం వచ్చింది.

నేషనలైజేషన్ జాతీయాకరణ అయింది. ఇటువంటి ఇంగ్లీషు మాటలన్నీ కరణం చేరి తెలుగులో ఏర్పడుతున్నాయి. ఇటీవలి కాలంలో గ్లోబలైజేషన్ అన్న మాట వాడుకలోకి వచ్చింది. దీన్ని ప్రపంచీకరణంగా కొందరు వాడుతున్నారు.

ఆధునీకరణం అంటే ఇప్పటి రూపంలో లేనిదాన్ని ఇప్పటిదిగా చేయడం. నవీకరణం అన్న మాట కూడా ఇటువంటిదే.

విపులీకరణం అంటే విపులం చేయడం. వివరించడం అన్న అర్థంలో వాడుతున్నాం. ఇటువంటివే విశదీకరణం, స్పష్టీకరణం. ఒకటిగా లేని వాటిని ఒకటిగా చేయడం ఏకీకరణం. ఏకీకృతం, ఏకీభూతం అని కూడా వాడవచ్చు. కేంద్రీకరణం ఒక చోట కేంద్రీకృతం కానిదాన్ని కేంద్రీకృతం చేయడం. దీనికి వ్యతిరేకార్థంలో వికేంద్రీకరణ అని వాడుతున్నాం. అధికార వికేంద్రీకరణ అన్న పదబంధానికి మంచి వ్యాప్తి ఉంది. పారిశ్రామికీకరణ, వైజ్ఞానికీకరణలు కూడా వ్యాప్తిలో

ఇ్చే మాటలె ఫలదీకరణ అంటే ఫలాలనిచ్చేదిగా చేయడం సంతానవంతం చేయడం

ఏకీకరణం అన్నమాట కూడా పత్రికలలో బాగా వాడుకలో ఉంది విడిగా ఉన్నదానిని ఒకొక దానిలో కలపడం దూరీకరణం అంటె దూరం చేయడం ధ్రువీకరణం ధ్రువం చేయడం స్థిరీకరణం అంటే స్థిరం చేయడం

సినిమాలలోనూ, సాహిత్యంలోనూ చిత్రీకరణ అన్నమాటను వాడుతున్నాం అట్లాగే దృశ్యీకరణ మాయం చేయడం అన్న అర్థంలో అదృశ్యీకరణం అని వాడవచ్చు

గ్రామాలు, నగరాలుగా మారడం, గ్రామాల నుండి జనం నగరాలకు వలసపోవడం నగరీకరణం ఇటువంటిదే సంప్రదాయీకరణం సంప్రదాయం కాని దాన్ని సంప్రదాయం చేయడం సంప్రదాయం నుండి తొలగిపోయి మార్పు పొందిన జీవన విధానాన్ని మళ్ళీ సంప్రదాయ విధానాలలోకి పరివర్తింపచేసే ప్రయత్నాన్ని సంప్రదాయీకరణ ప్రయత్నం అనవచ్చు వెస్టర్నయిజేషన్‌ని పాశ్చాత్యీకరణం అనవచ్చు లోకలైజేషన్‌ను ప్రాంతీయీకరణ, స్థానీకరణ అనవచ్చు

ఇప్పుడు చాలా ప్రాంతాలలో పాలశీతలీకరణ కేంద్రాలున్నాయి పాశ్చరైజేషన్‌కు ఇది తెలుగు వర్గీకృతం కానిదాన్ని వర్గీకృతం చేయడం వర్గీకరణం విభాగాలుగా విభజించడం వ్యక్తీకరణ వ్యక్తం కాని దాన్ని వ్యక్తం చేయడం

వక్రీకరణం అన్నమాటకు దురర్థం చెప్పడమని అర్థం ఇది ఆలంకారికమయిన అర్థం వంకర చేయడం అన్నది మాటలకు అర్థాన్ని వంకరగా చేయడంగా ఇక్కడ అర్థం చెప్పుకోవాలి

వ్యాకరణంలో కూడా తాలవ్యీకరణం, తద్భవీకరణం, నామీకరణం వంటివి వాడుకలో ఉన్నాయి తాలవ్యం కానిది తాలవ్యం అవడం తాలవ్యీకరణం, మూలద్రావిడంలోని 'క' తెలుగులో చ గా మారడం కిళి చిలుక అయింది కయి చేయి అయింది కెరయ్ చెరువు అయింది తద్భవం కాని మాట తద్భవంగా మారడం తద్భవీకరణం నామవాచకం కానిది నామవాచకంగా మారడం నామీకరణం ఒక వాక్యాన్ని మరో వాక్యంలో నామవాచకంగా చేయడం నామీకరణం ఈ అర్థంలో నామ్నీకరణం అన్నమాట వాడుకలోకి వచ్చింది కాని నామీకరణం సరైన రూపం

ఒక భాష నుండి మరో భాషలోకి అనువాదం చేయడం భాషాంతరీకరణం మతాంతరీకరణం ఇటువంటిదే ఆంధ్రీకరణం అంటే ఇతర భాషలో ఉన్న రచనను తెలుగుగా చేయడం అట్లాగే సంస్కృతీకరణం మతాంతరీకరణంలో హైందవీకరణం, క్రైస్తవీకరణం వంటివి వాడవచ్చు

ఆయుధీకరణ, నిరాయుధీకరణ వంటివి కూడా పత్రికలలో బాగా ప్రచారంలో ఉన్నాయి అటవీకరణ అని కూడా అనవచ్చు

ఇతర భాషా పదాల మీద కూడా ఈ ప్రత్యయాన్ని చేర్చి వాడుతూ ఉన్నాం అటువంటి వాటిలో ముఖ్యమైంది ప్రైవేటీకరణ వలస అన్న తెలుగుమాట మీద కూడా దీన్ని చేర్చి వలసీకరణం అని వాడుతున్నారు అట్లాగే పరాయీకరణం ఇస్లామీకరణ అన్నమాట కూడా ఇటువంటిదే

పొలిటిసైజేషనన్న మాటను రాజకీయీకరణం అంటున్నాం

ఒక రచనను నాటకంగా పరివర్తనం చేయడం నాటకీకరణం ఈ విధంగా అనేక పదాలను నిర్మించుకోవచ్చు ☆

# బుద్ధిమంతుడు

రాముడు బుద్ధిమంతుడు ఏ వ్యక్తినయినా వినయం కలిగినవాడని చెప్పడానికి ఉదాహరణంగా ఈ వాక్యం వాడుతూ ఉంటాం ఒక్కోసారి ఈ వాక్యంలో కొంత వ్యంగ్యాన్ని కూడా జోడిస్తూ ఉంటాం ఈ బుద్ధిమంతుడులో దీశక్తి కంటె మనకు మంచితనం, అణగిమణగి ఉండే లక్షణం పెద్దలు చెప్పిన మాటను శిరసావహించే గుణం ప్రధానంగా కనిపిస్తాయి ఈ మాటలో మత్ అనే ప్రత్యయం వచ్చింది ఈ ప్రత్యయం ఏ అర్థంలో వస్తుందో ఆ అర్థాన్ని మత్వర్థం అనీ, మతుబర్థం అనీ అంటారు కలిగినది, కలవాడు అన్నది ఈ ప్రత్యయానికి సాధారణార్థం బుద్ధిమంతుడు అంటే బుద్ధి కలిగినవాడు ఇంకో రకంగా చెప్పాలంటే ఎవడియందు బుద్ధి కలదో వాడు సంస్కృతంలో బుద్ధిమత్, బుద్ధిమాన్ అని ఉంటాయి హిందీలో కూడా బుద్ధిమాన్, శక్తిమాన్ వంటి ప్రయోగాలు ఎక్కువ తెలుగులో మాన్‌తో ఉండే మాటలు తక్కువ సంస్కృతంలోనే ఏర్పడి తెలుగులోకి వచ్చినమాటలు కొన్ని ఇటువంటివి ఉంటాయి ఉదాహరణకు భగవానుడు హనుమానుడు వంటివి కొంత వాడుకలో ఉన్నాయి భగవంతుడు, హనుమంతుడు అన్నవి ఎక్కువ ప్రాచుర్యంలో ఉన్నాయి

సాధారణంగా ఇ కారాంత శబ్దాల మీద మత్ ప్రత్యయం మత్‌గానే ఉంటుంది బుద్ధిమంతుడు, శక్తిమంతుడు, ధీమంతుడు, శ్రీమంతుడు మొదలయినవి అప్పుడప్పుడూ శక్తివంతమయిన బాంబు ప్రేలుడు' వంటి ప్రయోగాలు కనిపిస్తూ ఉంటాయి శక్తిమంతమయిన సరయిన ప్రయోగం అట్లాగే కీర్తిమంతుడు, నీతిమంతుడు సూర్యుడు కాంతిమంతుడు అదేవిధంగా స్తుతిమంతం, ద్యుతిమంతం ద్యుతి అంటే కాంతి దీప్తిమంతం అని కూడా అనవచ్చు అట్లాగే భూమిమంతుడు సరస్సు ఊర్మిమంతం ధృతిమంతుడు అంటే ధైర్యం కలవాడు

గోవులు ఎక్కువగా ఉన్నవాడు గోమంతుడు జ్యోతిస్ అంటే కాంతి, ప్రకాశం, దీనిమీద మత్ చేరితే జ్యోతిష్మంతం, జ్యోతిష్మంతుడు అవుతుంది ఇటువంటిదే ఆయుష్మంతం, ఆయుష్మంతుడు

గరుత్ మీద మత్ చేరితే గరుత్మంతుడు అవుతుంది గరుత్ అంటే రెక్క గరుత్మంతుడు అంటే రెక్కలు కలవాడు గరుత్మంతం అనేది పక్షి వాచకం ఏ పక్షి అయినా గరుత్మంతమే కాని గరుత్మంతుడు అన్న పేరు విష్ణువు వాహనమైన గరుడునికే స్థిరపడింది అట్లాగే కకుద్మంతం మూపురం కలిగింది

జ్ఞాన విద్యా వంటి శబ్దాల మీద మత్ చేరినప్పుడు దీనిలోని మకారం వకారమవుతుంది జ్ఞానవంతం, విద్యావంతం జ్ఞానవంతుడు, విద్యావంతుడు లక్ష్మీ శబ్దం మీద కూడా మత్ ప్రత్యయంలోని మకారం వ కారమవుతుంది లక్ష్మీవంతం అట్లాగే చమూవంతం చమూ అంటే సైన్యం చమూవంతం అంటే సైన్యవంతం శీలవంతం, శీలవంతుడు పదం చివర అకారం కానీ, ఆ కారం కాని ఉంటే మత్–వత్ అవుతుంది

అర్థవంతం అర్థం కలిగినమాట. అర్థవంతమయిన పని అన్నప్పుడు సార్థకమయిన పని అని అర్థం ఇంగ్లీషులో మీనింగ్ ఫుల్ అన్న మాటకు ఇది సమానార్థకం అదృష్టవంతుడు అంటే అదృష్టం కలిగిన వాడు ఉత్సాహవంతుడు అంటే ఉత్సాహం కలిగినవాడు

సౌరభవంతం అంటే సౌరభం కలిగినది అనలవంతం, అనిలవంతం, ఉదన్వంతం మొద లయిన విధంగా వాడవచ్చు అనలం అంటే నిప్పు, అనిలం అంటే గాలి, ఉదకం అంటే నీరు

ధనవంతుడు, బలవంతుడు, కులవంతుడు ప్రజ్ఞావంతుడు, ప్రతిభావంతుడు మొదలయి నవి తెలుగులో బాగా వాడుకలో ఉన్న మాటలే

హిమవంతుడు అంటే హిమం- మంచు కలిగినవాడు హిమాలయ పర్వతం సుఖ వంతం, దుఃఖవంతం, ధర్మవంతం అని కూడా వాడవచ్చు రూపవంతం, రూపవంతుడు అని వాడవచ్చు

యశస్సు కలిగినవాడు యశస్వంతుడు భాస్వంతుడు అంటే కాంతిమంతుడు తేజస్వం తుడు అంటే తేజస్సు కలవాడు తేజోవంతుడు వంటి ప్రయోగాలు కూడా అక్కడక్కడా కనిపిస్తూ ఉంటాయి కాని తేజ స్వంతుడు సరయిన రూపం

జాంబవంతుడు రామాయణ భారతాదులలో ఒక పాత్ర

రాజస్వంతం అంటే మంచిరాజు ఉన్న దేశం రాజవంతం అంటే రాజున్న దేశం

విద్యుత్ కలిగినది విద్యుత్వంతం మెరుపు కలిగింది దీన్నే తటిత్వంతం అని కూడా అన వచ్చు

ఈ మత్ ప్రత్యయం బహుళ ప్రచారంలో ఉండడం వల్ల తెలుగులో పనిమంతుడు వంటి మాటలేర్పడ్డాయి పని తెలుగు దీనిమీద మత్ ప్రత్యయం సంస్కృతం నేర్పరి, నిపుణుడు అన్న అర్థంలో పనిమంతుడు అని వాడుతున్నాం

☆

# ధన్వి - రూప్యం

'ఇ' ప్రత్యయం చేర్చడం వల్ల కూడా మత్వర్థ రూపాలేర్పడతాయి ధనుస్ అనేమాట మీద ఇ చేరితే ధన్వి అవుతుంది ధన్వి అంటే ధనుస్సు కలిగినవాడు, విలుకాడు ధానుష్కుడు శిఖ కలిగింది శిఖి శిఖ అంటే చుంచు చుంచు కలిగింది కాబట్టి నెమలి శిఖి శిఖ అంటే జ్వాల అని కూడా అర్థం జ్వాలలు కలిగింది అగ్ని శిఖి అంటే నెమలి అనీ అగ్ని అనీ అర్థం అట్లాగే కేకి కేకారావం కలిగింది కాబట్టి కేకి, నెమలి

శాఖలు కలిగినటువంటిది శాఖి కొమ్మలున్నది చెట్టు దంతాలున్నది దంతి ఏనుగు హస్తం అంటే తొండం ఉన్నది హస్తి మనీష కలవాడు మనీషి మనీష అంటే బుద్ధి తెలివిడి మనీషి అంటే పండితుడు కపటం కలవాడు కపటి శ్రేష్ఠమయిన ధనం ఉన్నవాడు శ్రేష్ఠి అట్లాగే శాస్త్రి పరదేశి స్వదేశి, విదేశి కర్మ కలవాడు కర్మి అట్లాగే జన్మి సుఖం కలిగినవాడు సుఖి దుఃఖం కలిగినవాడు దుఃఖి హలం ఆయుధంగా కలిగినవాడు హలి, బలరాముడు శీలంగా కలవాడు శీలి పఠనశీలి, రచనాశీలి అని వాడవచ్చు

అర్థ- అర్థి అవుతుంది విద్యను అర్థించేవాడు విద్యార్థి ధాన్యం అర్థించేవాడు ధాన్యార్థి తన వద్ద లేని దానిని కోరేవాడు

బలం కలిగినవాడు బలి ఉత్సాహం కలిగినవాడు ఉత్సాహి వివేకం కలవాడు వివేకి వ్యతిరేకార్థంలో అవివేకి అట్లాగే ఉద్రేకి సాహసం కలవాడు సాహసి అదే విధంగా కోపి కురూపి బహురూపి మొదలయినవి ఇటువంటివే

దండం కలవాడు దండి ఇక ప్రత్యయంచేరి దండికుడు కూడా అవుతుంది ధనం కల వాడు ధని, ధనికుడు కుటుంబం కలవాడు కుటుంబి కుటుంబికుడు ప్రయాణం చేసే వాడు ప్రయాణి, ప్రయాణికుడు కుటుంబికుడు, ప్రయాణికుడు అన్న మాటలను కుటుంబీకుడు, ప్రయాణీకుడు అని రాస్తూ ఉండడం చూడవచ్చు కుటుంబికుడు, ప్రయాణికుడు సరయిన రూపాలు

నౌ' శబ్దం నుండి నావి, నావికుడు ఏర్పడతాయి మాయ నుండి మాయి, మాయికుడు ఏర్పడతాయి

మేధా, మాయా వంటి మాటల మీద 'వి' ప్రత్యయం వస్తుంది మేధ కలవాడు మేధావి అట్లాగే మాయావి తపస్వి, యశస్వి, తేజస్వి, వర్చస్వి వంటి మాటలన్నీ 'వి' ప్రత్యయం చేరి ఏర్పడ్డవే ఊర్జస్వి అనికూడా వాడవచ్చు

ఇత ప్రత్యయిం తారకా, పుష్ప, కుసుమ వంటి మాటలమీద చేరుతుంది తారకితం అంటే తారకలు కలిగినది నక్షత్రాలు కలిగింది ఆకాశం తారకితం అంటే ఆకాశం తరంగితం అంటే తరంగాలు కలిగింది తిలకితం అంటే తిలకం కలిగినది కుసుమితం అంటే పూవులు పూచినటు వంటిది జ్వరం నుండి జ్వరితుడు జ్వరం కలిగినవాడు జ్వరితుడు దీక్ష వహించినవాడు దీక్షితుడు ఫలితం అంటే పండ్లు పండిన చెట్టు అని కూడా అర్థం గర్వితుడు అంటే గర్వంకలవాడు

ఇల ప్రత్యం కూడా మత్వర్థంలో వచ్చే ప్రత్యయమే పంకం నుండి పంకిలం ఏర్పడుతుంది పంకిలం అంటే బురద కలది పాపపంకిలం అనే సమాసాన్ని ఎక్కువగా వాడుతుంటాం

పిచ్ఛిలం అంటే చిక్కనైనది  పేనిలం అంటే ఫేనం – నురుగు కలది  గందిలర్ అంటె గంధం కలది

వాక్ మీద మి' ప్రత్యయం వచ్చి వాగ్మి అవుతుంది  వాగ్మి అంటే చక్కగా మాట్లాడగలిగిన వాడు  మంచివాక్కు కలవాడు  మాటకారి  మలినంలో 'ఇన' ప్రత్యయం  మురికి కలిగింది మలినం  మలీమసం అన్నా ఇదే అర్థం

ల ప్రత్యయం చాలా మాటలమీద వస్తుంది, జంఘాలశాస్త్రిలో 'ల' ప్రత్యయమే  జంఘాలం అంటే వేగంగా పోయేది  జంఘాలుడు అంటే వేగంగా నడిచేవాడు  జంఘ అంటే కాలిపిక్క జంఘాలుడు అంటే పిక్కబలం ఉన్నవాడు  శుండాలం అంటే ఏనుగు, తొండం కలిగింది

శీతలం అంటే చల్లదనం కలిగింది  అట్లాగే మృదులం, సురభిళం, బహుళం, శ్యామలం, పేశలం  పృథులం, మంజులం మొదలయిన మాటలు  పేశలం అంటే మృదువైనది  కుసుమ పేశలం అంటాం  కేరళలోని ళకారం కూడా 'ల ప్రత్యయమే  కేరం అంటే కొబ్బరిచెట్టు  కొబ్బరి చెట్లు కలిగినది కాబట్టి కేరళ/కేరళం

మధురం, కుంజరం వంటి మాటల్లో 'ర' ప్రత్యయం  మధువు/మాధుర్యం కలిగినది మధురం తియ్యనిది  కుంజాలు కలిగింది కుంజరం  కుంభస్థలానికి దిగువన ఉండే గుంతలు కుంజాలు

కృషీవలుడు, దంతావళం, రజస్వల వంటి మాటల్లో ప్రత్యయం 'వల'. హృదయాలువు అంటే మంచి మనస్సు కలిగినవాడు  ఇక్కడ ప్రత్యయం ఆలు'  దయాళువు, కృపాళువు అంటే దయ కలిగినవాడు

రూప్యంలో  య' ప్రత్యయం  రూపాయికి మూలం ఇదే  రూప్యం అంటే ముద్రితమయిన నాణెం

☆

# తర తమ ప్రత్యయాలు

ఎవరైనా తమ స్థాయికి మించి వ్యవహరిస్తే తరతమ భేదాలు తెలియకుండా ప్రవర్తిస్తున్నా డంటాం అంటే తాను ఎవరిలో వ్యవహరిస్తున్నాడో అతను తనకంటె పెద్దవాడన్న గౌరవం లేకుండా ప్రవర్తిస్తున్నాడన్న మాట ఎక్కువ తక్కువలు లేకుండా, చిన్నా పెద్ద తెలియకుండా అని అర్థం అట్లాగే తారతమ్యం అనే మాటను కూడా వాడుతూ ఉంటాం దానికీ దీనికీ తారతమ్యం ఏమిటి? మొదలయిన విధంగా ఇక్కడ భేదం అని అర్థం తర తమ అనేవి ప్రత్యయాలు పోలి కలో వచ్చే ప్రత్యయాలు ఇవి రెండు వస్తువులలో ఒకదాని అతిశయాన్ని అంటే గొప్పదనాన్ని తెలపడానికి తర ప్రత్యయాన్ని వాడతాం అనేక వస్తువులలో ఒకదాని అతిశయాన్ని, శ్రేష్ఠత్వాన్ని తెలపడానికి ఉపయోగించే ప్రత్యయం తమ ఇంగ్లీషులో er అనేది తరతో సమానమయింది est అనేది తమతో సమానమయింది high higher highestలాగా వాడతాం ఘనం, ఘనతరం, ఘనతమం అని వాడవచ్చు తెలుగులో కూడా ఇటువంటి భేదాన్ని సూచించే పద్ధతి ఉంది కంటే లో అనే ప్రత్యయాలు తరతమ భేదాన్ని సూచించడానికి తెలుగులో ఉపయోగపడతాయి

అతని కంటె ఇతను పొడుగు అన్నప్పుడు తర భేదం క్రికెట్ ఆటగాళ్ళలో టానీగ్రెగ్ పొడుగు అంటే తమ భేదం అయితే అందరికంటే ఆయన పెద్దవాడు, అందరిలో ఆయన పెద్ద వాడు అన్న విధంగానూ మా ఇద్దరిలో ఆయన పెద్దవాడు అన్న విధంగానూ కూడా తెలుగులో వాడుక ఉంది

తర, తమ ప్రత్యయాలు సంస్కృత ప్రత్యయాలు విశేషణాల మీద, నామవాచకాల మీద కూడా ఈ ప్రత్యయాలు వస్తాయి నిమ్నతరం, నిమ్నతమం, లఘుతరం, లఘుతమం, సూక్ష్మ తరం, సూక్ష్మతమం, సుందరతరం, సుందరతమం శీతలతరం, శీతలతమం, క్లేశతరం, క్లేశ తమం, సుఖతరం, సుఖతమం, దుఃఖతరం, దుఃఖతమం, ఉచ్ఛైస్తరం, ఉచ్ఛైస్తమం – ఈ విధంగా తరతమ ప్రత్యయాలను చేర్చి మాటలను తయారు చేసుకోవచ్చు

రాజకీయ నాయకుల ఉపన్యాసాలు వింటే వాళ్ళెప్పుడూ జనం మీద గురుతరమైన బాధ్య తను మోపుతూ ఉండడం గమనించగలం బరువైన బాధ్యత అన్నమాట గురుతరం అన్న మాటను ఇతరులకు ఉపదేశాలిచ్చేటప్పుడు ఎక్కువగానే వాడుతూ ఉంటారు

ఈ తర, తమ ప్రత్యయాల అర్థంలోనే ఈయస్, ఇష్ఠ అనే ప్రత్యయాలను కూడా వాడుతూ ఉంటాం గరీయసం అంటే బరువైనది, గొప్పది జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి అన్న రామాయణ వాక్యంలో ఈ గరీయస్ ఉంది జనని జన్మభూమి స్వర్గం కంటే కూడా గొప్పవి. మహీయసం అన్నా గొప్పదనే అర్థం మహత్ శబ్దం మీద ఈయస్ ప్రత్యయం చేరింది గరీ యస్‌లో గురు శబ్దం అదేవిధంగా లఘు శబ్దం మీద ఈయస్ చేరిస్తే లఘీయస్ అవుతుంది శ్రేయసం అంటే మంగళకరమైనది నిశ్శ్రేయసం అని ఉపసర్గతో కూడా వాడవచ్చు. నిశ్శ్రేయసం అంటే ముక్తి, మోక్షం అని కూడా అర్థం ఉంది

ఈయస్ ప్రత్యయంతో సంస్కృతంలోఅనేక పదాలు ఏర్పడుతున్నా తెలుగులో వాటి వాడుక విరళమే. ఇష్ఠ ప్రత్యయంతో తెలుగులో చాలా సంస్కృత పదాలు వాడుకలో ఉన్నాయి కనిష్ఠం అంటే అతి చిన్నది గరిష్ఠం అంటే అతి పెద్దది కనిష్ఠుడు వయస్సు చేత మిక్కిలి

కనిష్ఠుడు చివరి తమ్ముడు కనిష్ఠ సోదరుడు, కనిష్ఠ పుత్రుడు అని విశేషణంగా వాడతాం అట్లాగే కనిష్ఠ పరిమితి, గరిష్ఠ పరిమితి అని కూడా వాడతాం కనిష్ఠిక అంటే చిటికెన వేలు

తెలుగులో కనీసం అన్న మాట సంస్కృత కనీయస్ నుంచే వచ్చింది కనాకష్టం అన్నది కనిష్ఠం నుంచి వచ్చిందేమో కనిష్ఠుడులాగానే గరిష్ఠుడనీ వాడవచ్చు అయితే దీన్ని విడిగా కాకుండా విద్యాగరిష్ఠుడు వంటి సమాసాలలో రెండో మాటగా వాడతాం కనిష్ఠం అన్న మాటకు సమానార్థకాలుగా అల్పిష్ఠం, అణిష్ఠం అన్న మాటలను కూడా వాడవచ్చు

స్వాదిష్ఠం అంటే మిక్కిలి రుచికరమైనది ద్రాఘిష్ఠం అంటే చాలా పొడవైంది హ్రసిష్ఠం అంటే మిక్కిలి పొట్టిది క్షోదిష్ఠం అంటే మిక్కిలి క్షుద్రం ప్రేష్ఠం అంటే చాలా ప్రియమైనది వరిష్ఠం అంటే మిక్కిలి విరివి అయినది

జ్యేష్ఠుడు అంటే అన్న, పెద్దవాడు శ్రేష్ఠం అంటే చాలా ప్రశస్తమైంది శ్రేష్ఠుడు అంటే ప్రశంసనీయుడు, కొనియాడదగిన వాడు, ఉత్తముడు

కర్మిష్ఠుడు అంటే క్రియయందు నేర్పరి క్రియా నిపుణుడు ద్రఢిష్ఠం అంటే మిక్కిలి దృఢమైనది

భూయిష్ఠం అంటే మిక్కిలి బహుళమైనది లోపభూయిష్ఠం అంటే ఎన్నో లోపాలతో కూడుకున్నది అట్లాగే దోషభూయిష్ఠం

చాలా గొప్పది అని చెప్పడానికి కూడా తరతమ ప్రత్యయాలు ఈయస్, ఇష్ఠ ప్రత్యయాలు చేరిన మాటలమీద చేరతాయి శ్రేష్ఠతరం, శ్రేష్ఠతమం మొదలయిన విధంగా వాడవచ్చు తర, తమ ప్రత్యయాల వాడుక ఎక్కువ కాబట్టే తెలుగు మాటల మీద కూడా వీటిని చేర్చడం అక్కడక్కడా కనిపిస్తుంది మేల్తరం, మేల్తమం వంటి వాడుక ఉంది

☆

# సంస్కృత సంఖ్యా వాచకాలు

తెలుగు సంఖ్యావాచక పదాలతోపాటు చాలా సందర్భాలలో మనం సంస్కృత సంఖ్యావాచక పదాలనుకూడా వాడుతూ ఉంటాం అంకెలలో తెలుగు అంకెలు వేయడం ఈనాడు దాదాపు పూర్తిగా మానివేశాం ఆరబిక్ అంకెలు వాటితోపాటు అంకెలలో తేడా అవసరమయినప్పుడు రోమన్ అంకెలూ వాడుతున్నాం ఉపవిభాగాలు సూచించవలసి వచ్చినప్పుడు రోమన్ అంకెలూ పూర్వం అఆ ఇఈ లు వాడేవాళ్ళు ఇప్పుడు ఎబిసిడిల వాడకం ఎక్కువయిపోయింది కనీసం తెలుగు అంకెలు, వరుసగా తెలుగు అక్షరాలు నేర్చుకోవలసిన నేర్పవలసిన, వాడవలసిన అవసరం ఉంది

ప్రస్తుతం మనం వాడుతున్న కాలందరు కూడా మనది కాదు అయితే సకల శుభాశుభ కార్యాలకు, పండగలు పబ్బాల నిర్ణయానికి మాత్రం పంచాంగం వాడుతున్నాం పంచాంగం వాడుకవల్ల తప్పనిసరిగా సంస్కృత సంఖ్యావాచకాలను ఉపయోగించవలసిన అవసరం ఏర్పడుతూ ఉంది సంస్కృత సమాసాలతో సంఖ్యావాచక పదాలను వాడినప్పుడూ సంస్కృత సంఖ్యావాచకాలను వాడవలసి వస్తుంది తెలుగుమాటల బదులు సంస్కృతం మాటలు వాడే అలవాటు కూడా మనకు ఉంది కదా ముఖ్యంగా శైలీపరమయిన విశిష్టతకోసం ఆ విధంగా వాడుతూ ఉంటాం అప్పుడూ సంస్కృత సంఖ్యావాచక పదాల అవసరం ఉంటుంది తెలుగు వ్యాకరణాలలో విభక్తులు చెప్పవలసి వచ్చినప్పుడూ ఏడు వరకు సంస్కృత సంఖ్యావాచక పదాలను వాడుతున్నాం.

మనం సంస్కృత సంఖ్యావాచక పదాలను వాడుతున్నప్పటికీ అది ఒక పరిమిత స్థాయిలో మాత్రమే వాడుతున్నాం పెద్ద సంఖ్యలను వాడవలసి వచ్చినప్పుడు మాత్రం తెలుగు మాటలనే వాడవలసివస్తుంది సంస్కృత పదాలతో ఎక్కువ మందికి పరిచయం ఉండదు

ఏక అంటే ఒకటి దీనికి పూరణ వాచక రూపం ప్రథమం. ప్రథమం అంటే మొదటిది దీనికే ఆదిమం అన్నది పర్యాయ వాచకం అగ్రిమం అని కూడా అనవచ్చు తెలుగులో మొదటిది అన్నమాటకు సమానంగా ప్రథమం, ఆదిమం, అగ్రిమం అన్న సంస్కృత పదాలను వాడవచ్చు

ద్వి అంటే రెండు ద్వితీయం అంటే రెండవది అద్వితీయం అనేమాటను వాడతాం అద్వితీయం అంటే రెండవది కానిది, అంటే మొదటిది అద్వితీయుడు అంటే మొదటివాడు, సాటిలేనివాడు త్రి అంటే మూడు తృతీయం అంటే మూడవది తృతీయుడు అంటే మూడోవాడు

చతుస్ అంటే నాలుగు చతుర్థం అంటే నాలుగోది దీనికి తురీయం, తుర్యం అని రూపాంతరాలున్నాయి చతుర్ధ పురుషార్థం అనడానికి బదులు తురీయ పురుషార్థం అని కూడా అనవచ్చు నాలుగో పురుషార్థం మోక్షం అన్నమాట పంచ అంటే అయిదు పంచమం అంటే అయిదవది పంచముడు అంటే అయిదోవాడు

షట్ అంటే ఆరు. షష్ఠం అంటే ఆరవది సప్త అంటే ఏడు సప్తమం అంటే ఏడవది అష్ట అంటే ఎనిమిది. అష్టమం అంటే ఎనిమిదవది నవ అంటే తొమ్మిది నవమం అంటే తొమ్మిదవది దశ అంటే పది. దశమం అంటే పదవది అల్లుడికి దశమగ్రహం అని పేరు కదా

తెలుగులో పది తరువాతి సంఖ్యలను పదకొండు, పన్నెండు అని లెక్కిస్తాం అంటే పదికి

ఒకటి కలిపితే పదకొండు పదికి రెండు కలిపితే పం(డ్రెండు, ఇదే పన్నెండు అయింది సంఖ్యలో అంకెలు వేసిన క్రమంలోనే అంటే ఎడమవైపు సంఖ్యాపదాన్ని ముందుగా, కుడివైపు సంఖ్యా పదాన్ని తరువాత వాడతాం వేలు, వందలు, పదులు, ఒకట్ల వరుస పాటిస్తాం సంస్కృతంలో అట్లాకాదు ఒకట్లు, పదులు, వందల వరుసలో ఉంటుంది ఏకాదశ అంటే పదకొండు ఏకాదశం అంటే పదకొండవది ద్వాదశి అంటే పన్నెండు ద్వాదశం అంటే పన్నెండవది త్రయోదశ అంటే పదమూడు త్రయోదశం అంటే పదమూడవది. చతుర్దశ అంటే పధ్నాలుగు చతుర్దశం అంటే పధ్నాలుగవది

ఇంతవరకు మన తిధులకు సరిపోతాయి. తిధులలో మొదటి నాలుగు వికృతులు, ప్రధమ పాడ్యమి ద్వితీయ విదియ తృతీయ తదియ. తదియకు తద్దె అని రూపాంతరం అట్ల తద్దె ఉంది కదా చతుర్థి చవుతి చౌతి, చవితి అని కూడా వాడుక ఉంది చతుర్థి చవితి రెండూ వాడుకలో ఉన్నాయి తక్కిన వాటికి తత్సమ రూపాలే వాడుకలో ఉన్నాయి పంచమి, షష్ఠి, సప్తమి, అష్టమి, నవమి, దశమి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి అని

పంచదశ అంటే పదిహేను పంచదశం అంటే పదిహేనవది. షట్‌దశ అంటే షోడశ అవుతుంది షోడశ అంటే పదహారు షోడశం అంటే పదహారవది మనకు షోడశ మహారాజులున్నారు అష్టాదశ అంటే పద్దెనిమిది అష్టాదశం అంటే పద్దెనిమిదవది

పందొమ్మిదిని చెప్పడానికి రెండు పద్ధతులున్నాయి అష్టాదశలాగానే నవదశ అనడం ఒక పద్ధతి నవదశం అంటే పందొమ్మిదవది ఇరవయికి ఒకటి తక్కువ అని చెప్పడం రెండో పద్ధతి ఏ కోన వింశతి అంటే ఒకటి తక్కువ ఇరవై ఏక అంటే ఒకటి ఊన అంటే తక్కువ వింశతి అంటే ఇరవై ఊన వింశతి అని కూడా అనవచ్చు

☆

# వింశతి నుండి మహాభూరి దాకా

వింశతి అంటే ఇరవై వింశం అన్నా వింశతి తమం అన్నా ఇరవయ్యవది తెలుగులో హంస వింశతి అని కథాకావ్యం కూడా ఉంది అయ్యలురాజు నారాయణామాత్యుడు రచించిన ఈ కావ్యంలో హంస చెప్పిన ఇరవయి కథలున్నాయి నాటి ప్రజల జీవనాన్ని గురించి తెలుసు కోవడానికి ఇటువంటి కథా కావ్యాలు ఎంతగానో ఉపయోగపడుతున్నాయి వింశతి తరువాతి సంఖ్యలు ఏకదశ ద్వాదశ లాగానే ఉంటాయి ఏక వింశతి అంటే ఇరవై ఒకటి ద్వావింశతి అంటె ఇరవై రెండు పంచ వింశతి ఇరవై అయిదు భేతాళ పంచవింశతి అని ఇరవై అయిదు కథల కథాకావ్యం ఉంది ఇరవై తొమ్మిదిని నవ వింశతి, ఏకోన త్రింశత్, ఊన త్రిశంత్, ఏకాన్న త్రింశత్ అనవచ్చు నవ వింశత్ అంటే తొమ్మిది+ఇరవై ఏకోన త్రిశంత్ అంటే ఒకటి తక్కువ ముప్పయి తక్కినవీ ఇంతే త్రింశత్ అంటే ముప్పై ద్వాత్రింశత్ అంటే ముప్పై రెండు తెలుగులో కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక అనే కథాకావ్యం రచించాడు ద్వాత్రింశిక అంటే ముప్పై రెండు కలది అంటే ఇందులో ముప్పై రెండు కథలుంటాయి

చత్వారింశత్ అంటే నలభై నవ త్రింశత్ అన్నా, ఏకోన చత్వారింశత్ అన్నా ఊన చత్వా రింశత్ అన్నా ముప్పై తొమ్మిది వందదాకా ఈవిధంగా సాగుతుంది పంచాశత్ అంటే యాభై షష్టి అంటే అరవై షష్టి, షష్ఠి అనే మాటలకు అర్ధభేదం ఉంది షష్ఠి అంటే ఆరు షష్టి అంటే అరవై షష్టి పూర్తి అంటే అరవయ్యేళ్ళు నిండినప్పుడు చేసుకొనే పండగ అరవయ్యేళ్ళు బతకడం కష్టమయిన రోజుల్లో ఈ పండగ చేసుకోవడం మొదలుపెట్టి ఉంటారు తరువాత బతికిన కాల మంతా అధిక లాభమే తరువాత ప్రతి పదేళ్ళకీ ఒక్కో పండగ చేసుకుంటున్నాం

చతుష్షష్టి అంటే అరవై నాలుగు చతుష్షష్టి కళలు అనేమాట ఎక్కువ వాడుకలో ఉంది కళలు అరవై నాలుగే అయితే అవి ఏ అరవై నాలుగు అనే విషయంలో అభిప్రాయ భేదాలు న్నాయి ఈ అరవై నాలుగుకు సంబంధించి ఏడెనిమిది రకాల పట్టికలున్నాయి ఇవి అసంఖ్యాకం అనేవాళ్ళూ ఉన్నారు కళలు ఎన్ని అయినా చతుష్షష్టి అన్నది రూఢి అయిపోయింది

సప్తతి అంటే డెబ్భై పాలవేకరి కదరీపతి అనేకవి శుకసప్తతి అనే కథాకావ్యం రాశాడు ఇందులో చిలుక చెప్పిన డెబ్భై కథలుంటాయి షష్టి పూర్తిలాగానే సప్తతి తమ జయంతి కూడా జరుపుకుంటారు

అశీతి అంటే ఎనభై. అశీతితమం అంటే ఎనభయ్యవది పద్మనాయకులలో సింగమనేనికి అశీతి వరాల సింగమనేడు అనిపేరు నవతి అంటే తొంభై షణ్ణవతి అంటే తొంభై ఆరు

శతం అంటే నూరు శతతమం అంటే నూరవది నూటికంటే ఎక్కువ సంఖ్యను తెలుప వలసిన అవసరం వచ్చినప్పుడు ఉత్తర, అధిక అనేమాటలను వాడతారు అష్టోత్తర శతం అంటే నూట ఎనిమిది అష్టశతం, అష్టాధికశతం అనికూడా అనవచ్చు. ఉపనిషత్తులు నూట ఎనిమిది తెలుగు శతకాలలో పేరుకు శతకం అంటే నూరు పద్యాల రచన అన్న అర్ధమే అయినా సాధార ణంగా నూట ఎనిమిది పద్యాలుంటాయి

ద్విశతి అంటే రెండు వందలు. త్రిశతి అంటే మూడు వందలు విశ్వనాథ సత్యనారాయణ గారు వరలక్ష్మీ త్రిశతి రచించారు సప్తశతి అంటే ఏడు వందలు గాధాసప్తశతి సుప్రసిద్ధమైన

రసరస దీనికి శాలివాహన సప్తశతి అనికూడా పేరు అనేకమంది కవులు కవయిత్రులు చెప్పిన రసవంతమయిన ఏడువందల ప్రాకృత శ్లోకాలు ఈ గ్రంథంలో ఉన్నాయి శ్రీనాధుడు దీన్ని తెలుగులోకి అనువదించాడు కాని ఇప్పుడు లభ్యంకావడంలేదు ఆధునికుల్లో రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారు అనువదించారు

సహస్రం అంటే వేయి అష్టోత్తర సహస్రం అంటే ఒకవేయి ఎనిమిది శతతమం అంటే నూరవది సహస్రతమం అంటే వెయ్యవది తెలుగులో వెయ్యి వరకు సంఖ్యలకు పేర్లున్నాయి ఆపైన సంస్కృతం నుండి అరువు తెచ్చుకున్నవే నూరు వేలు లక్ష నూరు లక్షలు కోటి నూరు కోట్లు అర్బుదం పది అర్బుదాలు ఒక న్యర్బుదం పది న్యర్బుదాలు ఒక ఖర్వం. పది ఖర్వాలు ఒక మహాఖర్వం, పది మహాఖర్వాలు ఒక పద్మం పది పద్మాలు ఒక మహాపద్మం పది మహాపద్మాలు ఒక క్షోణి పది క్షోణులు ఒక మహా క్షోణి పది మహాక్షోణులు ఒక శంఖం పది శంఖాలు ఒక మహాశంఖం పది మహాశంఖాలు ఒక క్షితి పది క్షితులు ఒక మహాక్షితి పది మహాక్షితులు ఒక క్షోభం పది క్షోభాలు ఒక మహాక్షోభం పది మహాక్షోభాలు ఒక నిధి పది నిధులు ఒక పర్వం పది పర్వాలు ఒక పరార్ధం పది పరార్ధాలు ఒక అనంతం పది అనంతాలు ఒక సాగరం పది సాగరాలు ఒక అవ్యయం పది అవ్యయాలు ఒక అచింత్యం. పది అచింత్యాలు ఒక అమేయం, పది అమేయాలు ఒక భూరి పది భూరులు ఒక మహాభూరి మహాభూరి అంటే ఒకటి తర్వాత ముప్పై నాలుగు సున్నాలు

మహాపద్మనందుడికి ఆ పేరు అంత ధనం కూడబెట్టడం వల్లనేనంటారు మహాపద్మం అంటే కోటి కోట్లు. ఈ సంఖ్యలన్నీ భారతీయుల అభివృద్ధి స్థాయికి నిదర్శనం

మనవాళ్ళ కాలగణనం కూడా విస్మయావహంగా ఉంటుంది. ఇదంతా ఒకప్పటి కాలంలో భారతదేశంలో జరిగిన వివిధ శాస్త్రాల అభివృద్ధికి అద్దం పడుతుంది

☆

# సంకేతాలు

మనకు సంఖ్యల ప్రాధాన్యం చాలా ఉంది చాలా సంఖ్యలు సంకేతాలుగా వాడుకల్లో ఉన్నాయి వీటిని వివరించే సంకేత పదకోశాలు కూడా ఉన్నాయి ఛందస్సు, అలంకారశాస్త్రం, మతం, తత్త్వ శాస్త్రం, భాషలు, పదార్థాలు అవీ ఇవీ అనిలేదు సర్వ విషయాలకూ సంబంధించి రూఢమైన సంఖ్యలున్నాయి పూర్వం సంఖ్యలను చెప్పడానికి కూడా సంకేతాలను ఉపయోగించేవాళ్ళు సూర్యుడు, చంద్రుడు, భూమి మొదలయినవి ఒకటికి సంకేతాలు నేత్రాలు రెండు, మూర్తులు ముగ్గురు, సముద్రాలు నాలుగు, బాణాలు అయిదు, రుచులు ఆరు, స్వరాలు ఏడు, వసువులు ఎనిమిది మంది, రసాలు తొమ్మిది, ఆకాశం శూన్యం ఇవేకాదు ఒక్కొక్క అంకెకూ ఒకటికంటే ఎక్కువే సంకేతాలున్నాయి హిమకరాంగవియత్‌శశి అంటే హిమకరుడు చంద్రుడు– ఒకటి, అంగాలు– ఆరు, వియత్, ఆకాశం– శూన్యం, శశి చంద్రుడు– ఒకటి సంస్కృత లేఖన పద్ధతిలో దీన్ని తిరగవేస్తే ఆ సంవత్సరం వస్తుంది హిమకరాంగ వియత్‌శశి అంటే 1061 ముని వసునిధి అంటే మునులు ఏడుగురు– సప్తర్షులు, వసువులు అంటే ఎనిమిది, నిధులు తొమ్మిది తిరగవేస్తే 987 ఇట్లా సంఖ్యలకు వస్తువులు సంకేతాలుగానూ, మళ్ళీ వస్తువులకు సంఖ్యలు సంకేతాలు గాను వాడతారు ఉదాహరణకు త్రయి మూడు మూడు వేదాలన్నమాట ఇది చాలా విస్తృత మయిన ప్రక్రియ

కొన్ని కొన్ని అంశాలు నిశ్చితంగా ఉండవు ఉదాహరణకు సప్తవ్యసనాలూ ఉన్నాయి, అష్ట వ్యసనాలూ ఉన్నాయి దశ వ్యసనాలూ ఉన్నాయి, అష్టాదశ వ్యసనాలు కూడా ఉన్నాయి షట్చక్ర వర్తులు, ద్వాదశ చక్రవర్తులు, షోడశ చక్రవర్తులూ ఉన్నారు అట్లాగే అష్టాంగాలు ఇరవై రకా లున్నాయి

మన ఛందస్సులో ద్విపద అంటే రెండు పాదాల పద్యం త్రిపద అంటే మూడుపాదాల పద్యం తెలుగులో అంతగా వాడుకలోలేదు తెలుగుపద్యాలు సాధారణంగా చతుష్పాదులు వృత్తాలన్నింటినీ మరోపాదం కలిపి పంచపాదులుగా రాయవచ్చు సి నారాయణరెడ్డి గారి ప్రపంచ పదుల్లాంటివి ఆరు పాదాల పద్యం షట్పద కన్నడంలో ఈ పద్యానికి వాడుక ఎక్కువ ఎనిమిది పాదాలుంటే అష్టపది. జయదేవుని అష్టపదులు సుప్రసిద్ధం కదా

కావ్య భేదాలలో కూడా ఒక పద్యం నుండి అనేక పద్యాలదాకా వివిధ సంఖ్యలతో కొన్ని కావ్యాలేర్పడతాయి ఉదాహరణకు అష్టకం అంటే ఎనిమిది పద్యాల రచన శతకం అంటే నూరు పద్యాల రచన

ద్వయం అంటే రెండిటి సమూహం, త్రయం అంటే మూడింటి సమూహం, చతుష్టయం అంటే నాల్గింటి సమూహం అట్లాగే ద్వికం, త్రికం, చతుష్కం, పంచకం, షట్కం, సప్తకం, అష్టకం, నవకం, దశకం వగైరా ద్వితయం, త్రితయం, పంచతయం, షట్టయం అనికూడా అన వచ్చు

కవిద్వయం అని నోరి నరసింహశాస్త్రిగారి నవల. శ్రీనాథ పోతనల ఇతివృత్తం ఆధారంగా ఈ నవల రచించాడు తెలుగు వారిలో కవిత్రయం అంటే తెలియని వారుండరు. మనకు నన్నయ, తిక్కన, ఎర్రనల లాగా కన్నడంలో పంప, పొన్న, రన్నలతో రత్నత్రయం ఉంది సంస్కృ

ంలో పాణిని, కాత్యాయనుడు పతంజలి మునిత్రయం తెలుగు వ్యాకరణంలో నన్నయ, ఆథర్వణుడు, అహోబల పండితుడు ఆచార్యత్రయం

కొన్ని మాటలు సంకేతాలయినా అవి చెప్పే సంకేతాలకు ప్రాధాన్యం పోయి స్థూలంగా ఒక యాదృచ్ఛికార్థం ఏర్పడుతుంది ఉదాహరణకు తాపత్రయం అనే మాటను తీసుకోవచ్చు తాపత్రయం అంటే ఆధ్యాత్మికం, ఆదిభౌతికం, ఆధి దైవికం కాని ఈ మాటను వాడేటప్పుడు వీటి స్పృహ ఉండదు వాడు మహా తాపత్రయ పడిపోతున్నాడు అంటాం తపించిపోవడం, తొందరపడి పోవడం అన్న అర్థంలో వాడుతున్నాం దుష్టచతుష్టయం భారత కథలో సుప్రసిద్ధం కాని నలుగురు దుష్టులు కలిస్తే వారిని దుష్ట చతుష్టయం అని వ్యవహరిస్తాం వాడి మొహం చూస్తేనే పంచమహాపాతకాలూ చుట్టుకుంటాయని అంటూ ఉంటారు ఈ అయిదూ ఏమిటన్నది తెలిసి వాడవలసిన అవసరమేమీలేదు ఘోరమైన పాపం అన్న అర్థం సరిపోతుంది. పంచ మహాపాత కాలు అంటే– బంగారం దొంగిలించడం, సురాపానం, బ్రహ్మహత్య, గురుపత్నీ సంగమం అనే నాలుగు పాతకాలూ, ఈ పాతకాలు చేసిన వాడితో స్నేహం అన్న అయిదో పాతకం. మరో విధంగా బ్రహ్మహత్య, భ్రూణహత్య, బాలహత్య, గోహత్య, స్త్రీహత్య

త్రికరణ శుద్ధిగా అన్న మాటకు మనస్సు, వాక్కు, కర్మ ఈ మూడింటి పరంగానూ పవిత్రంగా అని అర్థం నిజాయితీగా అన్న అర్థంలో వాడుతున్నాం పంచభక్ష్య పరమాన్నాలు అన్నమాటను కూడా మనవాళ్ళు ఎక్కువగా వాడతారు పంచభక్ష్యాలు అంటే భక్ష్యం, భోజ్యం, లేహ్యం, చోష్యం, పేయం వివిధ వంటకాలతో చక్కని విందు అన్న అర్థంలో వాడుతున్నాం పంచాంగం అంటే తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలను తెలిపేది

సప్త వ్యసనాలు అన్నమాట కూడా ఇటువంటిదే స్త్రీ, మద్యం, వేట, జూదం, వాక్పారుష్యం, అర్థదూషణం, దండపారుష్యం అన్నవి సప్త వ్యసనాలు అన్ని రకాల దురలవాట్లూ అని నేటి అర్థం అష్టకష్టాలు అన్న మాటా ఇటువంటిదే దేశాంతరం, భార్యావియోగం, ఆపత్కాల బంధు దర్శనం, ఉచ్ఛిష్ట భక్షణం, శత్రుస్నేహం, పరాన్న ప్రతీక్షణం, భంగం, దారిద్ర్యం అన్నవి అష్ట కష్టాలు అనేకరకాల కష్టాలు, దుర్భరమయిన కష్టాలు అన్న అర్థంలో వాడుతున్నాం. అష్టైశ్వ ర్యాలూ ఇలాంటిదే దాసీజనం, భృత్యులు, పుత్రులు, మిత్రులు, బంధువులు, వాహనం, ధనం, ధాన్యం అన్నవి ఎనిమిది ఐశ్వర్యాలు మహాసంపన్నత అన్న అర్థంలో వాడుతున్నాం ఇట్లా ఎన్నో సంకేతాలు

☆

# స్త్రీ ప్రత్యయాలు

మాటలను పురుష బోధకాలుగాను, స్త్రీ బోధకాలుగానూ వాడే పద్ధతి భాషలన్నిటిలోనూ ఉంటుంది పురుష బోధక ప్రత్యయం చేరితే ఆ మాట పురుషుణ్ణి బోధిస్తుంది స్త్రీ బోధక ప్రత్యయం చేరితే స్త్రీని బోధిస్తుంది తెలుగులో అమ్మ, ఆలు, ఆడి వంటి ప్రత్యయాలు చేరి స్త్రీ బోధక పదాలు ఏర్పడతాయి పెద్దమ్మ, పేదరాలు, వగలాడి లాంటివి సంస్కృతంలో ఈ ప్రక్రియ విస్తారంగా ఉంది అయితే సంస్కృతంలో స్త్రీ లింగ శబ్దాలన్నీ స్త్రీ వాచకాలు కావు వాక్య నిర్మాణంలో వాటి ప్రయోజనం ఉంటుంది తెలుగులో సంస్కృత పదాలను వాడేటప్పుడు స్త్రీ బోధక శబ్దాలు తప్ప తక్కిన వాటికి తేడా ఏమీ ఉండదు ఉదాహరణకు ఆయన మాటల్లో చాలా చాతుర్యం ఉంది అనీ అనవచ్చు, ఆయన మాటల్లో చాలా చాతురి ఉంది అనీ అనవచ్చు చాతురీ అన్న స్త్రీ ప్రత్యయాంత శబ్దానికి తెలుగులో ప్రత్యేకత ఏమీలేదు చాతుర్యం, చాతురి రెండూ తెలుగులో అమహత్తులే పాండిత్య స్ఫోరకం అనీ, పాండితీస్ఫోరకం అనీ అనవచ్చు

ఔచిత్యం– ఔచితి, నైపుణ్యం– నైపుణి, మాధుర్యం– మాధురి, వైదగ్ధ్యం– వైదగ్ధి, పారంపర్యం– పారంపరి వంటివి ఇటువంటివి– శైలి, మైత్రి, సామగ్రి వంటివి స్త్రీ ప్రత్యయాంతాలుగానే తెలుగులోకి వచ్చాయి

కూతురు, భార్య అన్న అర్థంలో స్త్రీ ప్రత్యయం చేరి పదాలేర్పడతాయి కైకయ రాజు కూతురు కైకేయి విదేహరాజు కూతురు వైదేహి, పాంచాల రాజు కూతురు పాంచాలి సత్రాజిత్తు కూతురు సాత్రాజితి, భీష్మకుని కూతురు భైష్మి (రుక్మిణి), భీముని కూతురు భైమి గాంధార రాజు కూతురు గాంధారి

ఇంద్రుని భార్య ఐంద్రి రుద్రుని భార్య రౌద్రి, బ్రహ్మ భార్య బ్రాహ్మి, గోపుని భార్య గోపి

ఇంద్రుని భార్యను ఇంద్రాణి అని కూడా అనవచ్చు దీనిలాగే రుద్రాణి, శర్వాణి, భవాని, శక్రాణి, మృడాని, బ్రహ్మాణి, వరుణాని

విష్ణు వంటి ఉ కారంత శబ్దాల మీద 'వ' ఆగమంగా వస్తుంది విష్ణువు భార్య వైష్ణవి, శంభుని భార్య శాంభవి అట్లాగే మాధవి, వాసవి మొదలయినవి

కూతురు, భార్య అన్న ఈ రెండు సంబంధాలు గాక సోదరి, అత్త, కోడలు వంటి సంబంధాలను బోధించడం వాక్యరూపంలో తప్ప సాధ్యపడదు ఇంద్రాణి, మాధవి వంటివి పేర్లుగా వాడుతున్నామే తప్ప వాటిని ఇంద్ర, మధు సంబంధమైన వాటిగా మనం వాడడం లేదు కావ్యాలలో ఈ మాటల ప్రయోగాలు ఎక్కువ ఒకే వ్యక్తిని బోధించడానికి అసలు పేరుతో పాటు, దేశం, తండ్రి, వంశం, భర్త, విశిష్ట గుణగణాల వంటి వాటి సంబంధంతో ఎన్నో పేర్లు కావ్యాలలో వాడుకలో ఉన్నాయి కృష్ణ, పాంచాలి, ద్రౌపదిలాగా

పతి అంటే భర్త దీని స్త్రీ వాచక పదం పత్ని ఏకపత్ని, వీరపత్ని, సపత్ని అని సమాసంలో వాడవచ్చు

జనన శబ్దం నుండి జనని ఏర్పడుతుంది

సాధు శబ్దం నుండి సాధ్వి, ప్రభు శబ్దం నుండి ప్రభ్వి ఏర్పడతాయి

నేతృ పదం నుండి నేత్రి ఏర్పడుతుంది నేత్రి అంటే నాయకురాలు జనయితృ నుండి జనయిత్రి, కవయితృ నుండి కవయిత్రి కవి నుండి కవయిత్రి రాలేదు. రచయిత నుండి రచయిత్రి రాలేదు కర్తృ నుండి కర్త్రి వచ్చింది దాతృ నుండి దాత్రి దాత్రి అంటే దానశీల

మాతృ శబ్దం నుండి మాత్రి ఏర్పడదు పితృ- పిత అయినట్లుగా మాతృ- మాత అవు తుంది దుహితృ నుండి దుహిత ఏర్పడింది కూతురు అని అర్థం

ఈ ప్రత్యయం చేరి చాలామాటలు ఏర్పడతాయి గౌర- గౌరీ, లక్ష్మ- లక్ష్మీ అవుతాయి తెలుగులోకి వచ్చినప్పుడు గౌరి, లక్ష్మి అని అవుతాయి పుత్ర- పుత్రి, నద- నది, దేవ- దేవి, తాపస- తాపసి, ఛాత్ర- ఛాత్రి, దూత-దూతి, నట- నటి, విట- విటి, చేట- చేటి, తరుణ- తరుణి రమణ- రమణి, సుకుమార- సుకుమారి, అనుచర- అనుచరి, గాయన- గాయని, నర్తక- నర్తకి, భిక్షుక- భిక్షుకి, పితామహ- పితామహి, మాతామహ- మాతామహి, నర- నారి మొదలయిన మాటలన్నీ 'ఈ' ప్రత్యయం చేరి ఏర్పడ్డవే విద్వాంసురాలు విదుషి

యశస్విని, స్వామిని, రాగిణి ఇటువంటివే రాగిణి అంటే అనురక్తురాలు సంగీతంలో ఒక ప్రధాన రాగం నుండి పుట్టిన రాగం అన్న అర్థం కూడా ఉంది రాగరాగిణి అన్న ప్రయోగం కూడా ఉంది

పక్షులు, జంతువులలో ఆడపక్షులు ఆడ జంతువులను సూచించడానికి కూడా 'ఈ' ప్రత్యయం చేరుతుంది సింహ- సింహి అవుతుంది మృగ- మృగి అవుతుంది హంస- హంసి, చక్రవాక- చక్రవాకి, మయూర- మయూరి, భుజంగ- భుజంగి, మహిష- మహిషి, వ్యాఘ్ర- వ్యాఘ్రి, కురంగ- కురంగి, విహంగ- విహంగి, నాగ- నాగి అవుతాయి నాగి అంటే ఆడ ఏనుగు

మన కావ్యాలలో స్త్రీ వర్ణన చాలా ప్రధానంగా ఉంటుంది స్త్రీకి పర్యాయ వాచక పదాలు కొల్లలు అవయవ వాచకాలయిన పదాలతో స్త్రీ వాచక పదాలెన్నో కావ్యాలలో దర్శనమిస్తాయి ముఖ శబ్దంతో చంద్రముఖి, పద్మముఖి ఏర్పడతాయి చంద్రముఖ, పద్మముఖ అని కూడా వాడ వచ్చు లతాంగి అనవచ్చు లతాంగ అనీ అనవచ్చు సుదంతి అనీ అనవచ్చు, సుదంత అనీ అన వచ్చు అట్లాగే బింబాధరి/ బింబాధర దొండపండు వంటి అధరం (కింది పెదవి) కలిగిన స్త్రీ బింబోష్ఠి/ బింబోష్ఠ కూడా అంతే మృగనయని/మృగనయన, కంఠ, గాత్ర, ఉదర వంటి పదాలతో కూడిన చాలా మాటలు ఏర్పడతాయి

పద్మనేత్ర, కమలనేత్ర, మృగనేత్ర మొదలయినవి అకారాంతాలుగానే ఉంటాయి. పద్మనేత్రి వంటి ప్రయోగాలు తెలుగు కావ్యాలలో అక్కడక్కడా కనిపిస్తాయి అక్ష శబ్దం అక్షిగానే ఉంటుంది జలజాక్షి, మీనాక్షి, మృగాక్షి, చంచలాక్షి మొదలయినవి

కోమల/ కోమలి, మనోహర/ మనోహరి రెండు రూపాలూ ఉన్నాయి

పంతులు గారి భార్యను పంతులమ్మ అనవచ్చు ఉపాధ్యాయురాలినీ పంతులమ్మ అన వచ్చు సంస్కృతంలోనూ కొన్ని పదాలు ఇంతే. ఉపాధ్యాయి అంటే ఉపాధ్యాయుని భార్య ఉపా ధ్యాయురాలూ కూడా ఉపాధ్యాయ అంటే ఉపాధ్యాయురాలు మాత్రమే ఆచార్యాని అంటే ఆచార్యుని భార్య ఆచార్య అంటే ఉపాధ్యాయురాలు

మత్ ప్రత్యయం చేరిన మాటల మీద 'ఈ' ప్రత్యయం చేరి స్త్రీ వాచక పదాలు ఏర్పడతాయి. బుద్ధిమతి, సరస్వతి జ్ఞానవతి, యశస్వతి, ఆయుష్మతి, గర్భవతి మొదలయినవి

జ్యేష్ఠ, బాల, సుత, తనయ, ధీర, ప్రియ, అబల వంటివి 'ఆ' ప్రత్యయం చేరినవి క ప్రత్యయం చేరిన మాటల్లో దానికి ముందు అకారం ఇకారం అవుతుంది బాలక- బాలిక, గాయిక, నాయిక, పరిచారిక, పుత్రిక వంటివి.



# ఉపసర్గలు

భాషలో కొత్త పదాలను కల్పించుకోవడమన్నది చాలా ముఖ్యమయిన ప్రక్రియ ఏ భాష అయినా అభివృద్ధి చెందడమన్నది ఈ పదకల్పనా ప్రక్రియ మీదే ఆధారపడి ఉంటుంది ప్రతిభాషకూ ఈ సామర్థ్యం ఉంటుంది అయితే పదకల్పనలో భాషలు ప్రత్యేకమయిన విధానాలను అవలం బిస్తాయి ఈ విషయంలో తెలుగుకూ, సంస్కృతానికీ భేదం ఉంది కృత్తద్ధితాలూ, సమాస నిర్మాణం వంటివి రెండు భాషలకూ సమానమే కాని సంస్కృతంలో ఉపసర్గలు ఒక విశిష్టమైన ప్రక్రియ

పద నిర్మాణంలో ధాతువు మూలం ధాతువుకు ఒక అర్థం ఉంటుంది దానికి ప్రత్యేక అర్థాలు కల్పించడానికి ఉపసర్గలు చేరతాయి ఉపసర్గ ధాతువుకు ముందు చేరుతుంది హృ అనేది ధాతువు దీనికి బలవంతమని అర్థం సంహారం, విహారం, ఆహారం, ప్రహారం వంటి మాటలన్నీ ఈ 'హృ ధాతువునుండే ఏర్పడుతున్నాయి ఈ మాటలన్నిటికీ అర్థాలు వేరు ఈ వేరు వేరు అర్థాలు, సం, వి, ఆ, ప్ర మొదలయిన ఉపసర్గలు చేరడంవల్ల ఏర్పడుతున్నాయి కాబట్టి సంస్కృతంలో ఉపసర్గలు చేరి వివిధ అర్థాలలో పదాలు ఏర్పడడం అన్నది చాలా విస్తృతమయిన ప్రక్రియ

సంస్కృతంలో ఇరవై రెండు ఉపసర్గలున్నాయి అవి 'ప్ర, పరా, అప, సం, అను, అవ, నిస్, నిర్ దుస్, దుర్, వి, ఆజ్, ని, అధి, అపి, అతి, సు, ఉత్, అభి, ప్రతి, పరి, ఉప' ధాతువులకు ఈ ఉపసర్గలుచేరి ఎన్నో మాటలు ఏర్పడతాయి

ప్ర' అనే ఉపసర్గను తీసికుంటే ప్రయోగం, ప్రవాదం వంటి మాటలెన్నో దీనితో ఏర్పడతాయి యోగం అనే మాటకు యుక్తి, కూర్పడం, నిగ్రహం వంటి అనేకార్థాలున్నాయి ప్రయోగం అంటే వాడడం, కూర్చడం, అర్పణం వంటి అర్థాలున్నాయి ప్రయోగం అన్న మాటను ఇంగ్లీషు ఎక్స్‌పరిమెంట్‌కు సమానార్థకంగా కూడా వాడుతున్నాం విషప్రయోగం చేశారు, అణ్వస్త్రాలను ప్రయోగించారు. బలప్రయోగం చేశారు, నాటకప్రయోగం జరిగింది వంటి వాక్యాలలో ప్రయోగ శబ్దానికి అర్థచ్ఛాయలున్నాయి. నాటక ప్రయోగంలో ప్రయోగానికి ప్రదర్శన అని అర్థం ఈ ప్రయోగ శబ్దం నుండి ప్రయోక్త- ప్రయోగించేవాడు అన్న పదం ఏర్పడింది ప్రయోగి అన్నా ఇదే అర్థం ప్రయోగ్యం, ప్రయోజ్యం, ప్రయోజనం, ప్రయోజకుడు మొదలయిన మాటలు ఈ విధంగా ఏర్పడ్డవే నాటకాల పరిభాషలో ప్రయోగాతిశయం అనే మాట ఉంది

సాధారణంగా ఈ 'ప్ర' అనే ఉపసర్గకు మిక్కిలి అని అర్థం కంపం, కంపనం అన్న మాటలకు ప్ర' చేరి ప్రకంపం, ప్రకంపనం ఏర్పడతాయి మిక్కిలి వణకడం అని అర్థం ప్రకంప నాలు కలిగాయి అని ప్రయోగం కాండం- ప్రకాండం అవుతుంది చెట్టు బోదె అని అర్థం వేళ్ళ దగ్గరినుండి కొమ్మలదాకా ఉండే వృక్షభాగం ప్రకోపం అంటే తీవ్రమైన కోపం ఉద్రేకం, అతిశయం అని కూడా అర్థం

ప్రక్రియ అంటే మంచిపని, చేయదగినపని, పని విధానం అని అర్థం క్షాళనం- ప్రక్షా ళనం అవుతుంది బాగా కడగడమని అర్థం శుద్ధి చేయడం

ప్రఖ్యాతి అంటే మిక్కిలి ప్రసిద్ధి చెందినది ప్రఖ్యాతి అంటే కీర్తి ప్రగాఢం అంటే ఎక్కువ

ప్రఘోష అంటే పెద్ద ధ్వని తప్తం అంటే వేడి చేయబడింది ప్రతప్తం బాగా వేడి చేసింది ప్రతాపం అంటే కూడా వేడి అనే అర్థం పరాక్రమం, శక్తి అనే అర్థాలూ ఉన్నాయి

ప్రదక్షిణం అంటే దక్షిణం, కుడివైపుకు తిరగడం దేవతల చుట్టూ తిరగడాన్నే ప్రదక్షిణ చేయడం అంటున్నాం ఎక్కువగా తిరగడం అన్న అర్థంలో ప్రదక్షిణకు చాలా ప్రాచుర్యం వచ్చింది

ప్రదర్శనం అంటే విశదపరచిచూపడం ప్రదానం అంటే గొప్పదానం ప్రదాత అంటే గొప్ప దాత ప్రస్తుతం ప్రదానం అంటే ఇవ్వడం అనీ, ప్రదాత అంటే ఇచ్చేవాడనీ ప్రయోగం బహుమతి ప్రదానం జరిగింది అంటున్నాం బహుమతి ప్రదాత అన్నప్పుడు బహుమతిని నెల కొల్పి ఇచ్చేవాడితోపాటు, సభలో ఔపచారికంగా బహుమతిని అందించే వ్యక్తీ స్ఫురిస్తున్నాడు

పితామహుడు అంటే తాత ప్రపితా మహుడు అంటే ముత్తాత ప్రప్రపితామహుడు అంటే ముత్తాత తండ్రి పౌత్రుడు అంటే మనుమడు ప్రపౌత్రుడు అంటే మునిమనుమడు ప్రఫుల్లం అంటే బాగా వికసించింది ప్రబంధం అంటే ప్రకృష్టమైన బంధం కావ్యమనీ అర్థం శ్రీకృష్ణ దేవరాయల కాలంలో వర్ణనాప్రధానంగా వచ్చిన కావ్యాలను ప్రబంధాలు అంటున్నాం బలం-ప్రబలం అవుతుంది చాలా బలం కలిగింది అనీ, గొప్పదనీ, ముఖ్యమైనదనీ అర్థం ఎక్కువ అని కూడా అర్థం ప్రబలసాక్ష్యం అంటే చాలా బలమైన సాక్ష్యమని అర్థం బాధకం అంటే బాధిం చేది ప్రబాధకం ఎక్కువగా బాధించేది

ప్రబోధం అంటే చక్కగా బోధించడం, వివరించడం, మెలకువ అనీ, జ్ఞానం అనీ కూడా అర్థాలున్నాయి ప్రబోధనం అన్నా ఇదే అర్థం ప్రబోధించు, ప్రబోధితుడు, ప్రబోధకుడు దీని నుండి ఏర్పడ్డవే

ప్రభాస అంటే మిక్కిలి కాంతి 'భా' అనే ధాతువుకు కాంతి అని అర్థం ఈ ధాతువు నుండి భాస శబ్దం ఏర్పడింది భాసుడని సంస్కృతంలో గొప్ప నాటకకర్త ఉన్నాడు ప్రభేదం అంటే విభ జించడం, వేరుపరచడం చిన్న చిన్న విభాగాలు చేయడం ప్రమత్తుడు అంటే మిక్కిలి మత్తు పొందినవాడని అర్థం ఏమరుపాటు కలిగినవాడనీ అర్థం దీనికి వ్యతిరేకార్థంలో అప్రమత్తుడు, అప్రమత్తం అని వాడుతున్నాం జాగరూకుడు, జాగరూకత అని అర్థం

ప్రమోదం అంటే ఎక్కువ సంతోషం. ప్రయత్నం అంటే మిక్కిలి యత్నం ప్రలోభం అంటే మిక్కిలి లోభం ప్రోషితుడు అంటే దేశాంతరానికి పోయినవాడు శృంగార నాయికల్లో ప్రోషిత భర్తృక అని ఒక నాయిక ఉంది భర్త దేశాంతరంలో ఉంటే బాధపడే నాయిక ఈమె ప్రవాదం అంటే ఎక్కువగా వ్యాపించినమాట ప్రభువు అంటే స్వామి ప్రభవం అంటే పుట్టుక, ప్రభూతం అంటే పుట్టినది ప్రసన్నం అంటే నిర్మలం, తేట అయినది, సంతుష్టి కలిగింది ప్రసన్నం చేసు కోవడం అంటే సుముఖత కలిగేట్లు చేసుకోవడం, సంతోషింపజేయడం ప్రకృష్టం అంటే గొప్పది ప్రజననం అంటే పుట్టుక ప్రకర్ష అంటే అతిశయం ప్రకారం అంటే పోలిక ప్రకిరణం అంటే చెదరినది. ప్రజ్వలనం అంటే మండడం ప్రగతి అంటే ముందుకు పోవడం, అభివృద్ధి

☆

# పరాకాష్ఠ - అపవాదం

పరాజయం పరాక్రమం వంటి మాటలను మనం ఎక్కువగానే వాడుతూ ఉంటాం ఈ మాటల్లో ముందు ఉన్న పరా అన్నది ఉపసర్గ ఈ పరా' అన్న ఉప సర్గకు వెనుక అనీ, వ్యతిరేకం అనీ పోవడం అనీ, అత్యంతం అనీ అర్థాలు ఈ ఉపసర్గ చేరి ఎన్నో మాటలు ఏర్పడుతున్నాయి

పరాకరణం అంటే నిరాకరణ పరాక్రమం అంటే శౌర్యం, బలం, ప్రయత్నం క్రము అనె ధాతువుకు పరా అనే ఉపసర్గ చేరినప్పుడు ఏర్పడినమాట క్రము ధాతువుకు పాద విక్షేపమని అర్థం పరాక్రమించడం అన్న అర్థంలో పరాక్రాంతి అన్న మాటనూ వాడవచ్చు ఇక్కడ కూడా అదే ఉపసర్గ పరాక్రమ పరాక్రమవంతుడు, పరాక్రమశాలి, పరాక్రాంతుడు అన్న మాటలకు పరాక్రమం కలవాడు అని అర్థం

పరాగతం అంటే మృత్యువు పరాగమం అన్నా మృత్యువే పరాగమం అంటే శత్రువుల దండయాత్ర అని కూడా అర్థం ఉంది పరావృత్తం అంటే వెనక్కు మరలినది పరావర్తనం అంటే వెనుకకు మరలడం భౌతికశాస్త్రంలో ఎక్కువగా వాడేమాట కాంతి పరావర్తనం పరావర్తం అన్నా ఇదే అర్థం పరావృత్తం పరావృత్తి, పరాగమం, పరాగతం అన్న మాటలను వెనుకకు మరలినది అన్న అర్థంలో వాడవచ్చు

పరామర్శ అంటే వివేచన స్మరణ గ్రంథాలయాల్లో పరామర్శ గ్రందాలు అని కాటలాగులో ఒక విభాగం ఉంటుంది ఇంగ్లీషులో రెఫరెన్సు అన్న అర్థంలో ఈ పరామర్శను వాడడం జరి గింది అట్లాగే క్షేమ సమాచారాలను విచారించడం కూడా పరామర్శే బాగా వివేచించడం పరా మృష్టం అంటే చక్కగా వివేచింపబడిందని అర్థం మృశ్ ధాతువు. విమర్శలో కూడా ఇదే ధాతువు

పరాభవం అన్నా పరాభూతి అన్నా అవమానం పరాహతం బాగా కొట్టబడింది, వెనుకకు కొట్టబడింది అని అర్థం

పరాజయం అంటే ఓటమి ఇక్కడ 'పరా'కు వ్యతిరేకార్థం 'జయం'కు వ్యతిరేకం పరా జయం పరాజితుడు అంటే ఓడిపోయినవాడు పరాజిష్ణువు అంటే ఓడించినవాడు, ఓడిపోయిన వాడు అని రెండర్థాలూ ఉన్నాయి అంటే ఇక్కడ ఎక్కువ, వ్యతిరేకం అన్న రెండర్థాలలోనూ పరా ను ఉపయోగించామన్నమాట

పరాసువు అంటే చనిపోయినవాడు. ఇక్కడ 'పరా'కు పోవడమని అర్థం అసువులు పోయినవాడు

పరాధీనుడు అంటే అస్వతంత్రుడు ప్రాధాన్యం లేనివాడు పలాయనంలో కూడా 'పరా' అన్న ఉపసర్గే ఉంది 'అయ' ధాతువుకు గతి అని అర్థం దక్షిణాయనం, ఉత్తరాయణాలలో ఉన్న దిదే పరిగెత్తడం, పారిపోవడం అని అర్థం పారిపోవడం అన్న అర్థంలోనే తెలుగులో ఈ మాటను ఎక్కువగా వాడుతున్నాం పలాయనం చిత్తగించాడు అంటాం

పరాకాష్ఠ అంటే తుది హద్దు కాష్ఠ అంటే మేర అనీ, అతిశయం అనీ అర్థం పరాకాష్ఠ అంటే అంతకు మించింది లేదన్నమాట

అప' అన్న ఉపసర్గతో మనం ఎన్నో మాటలు వాడుతున్నాం ఇది తెలుగు మాటలకు కూడా వ్యాపించింది ఈ ఉపసర్గకు విపరీతం/వ్యతిరేకం, గతితప్పడం, చెడ్డ అనే అర్థాలున్నాయి కొన్నిచోట్ల అర్థ భేదం లేకుండా కూడా ఇది వస్తుంది

అపకీర్తి, అపఖ్యాతి, అపయశం, అపజయం, అపప్రథ, అపరాగం మొదలయిన మాటల్లో అప వ్యతిరేకార్థంలో వస్తుంది అపరాగం అంటే ద్వేషం అపచ్ఛాయ అంటే అశుభమయిన నీడ

అపగుణం అంటే గుణం లేనిది అపఘనం అంటే మబ్బు లేనిది ఘనం అంటే మబ్బు ఘనశ్యాముడు అంటే మేఘశ్యాముడు మబ్బులాగా నల్లనయిన వాడు అపక్రమం అంటే క్రమం తప్పడం అపనయం అంటే నీతిలేకపోవడం అపనయం అంటే తొలగించడమన్న అర్థం కూడా ఉంది అపభయం అంటే భయం లేకపోవడం అపవ్యయం అంటే వ్యయం లేనిది అక్షయం అన్నమాట అపాశ్రయం ఆశ్రయం లేకపోవడం అపార్థం అంటే అర్థం లేకపోవడమూ, దురర్థమూనని కూడా అర్థం

అపద్రవ్యం అంటే చెడ్డ వస్తువు అపమృత్యువు అంటే చెడ్డచావు అపవాదం అంటే చెడ్డ వాదం అంటే నింద వ్యాకరణంలో ఒక అపవాదం ఉంది వ్యాకరణంలో సామాన్య విధికి వ్యతిరేకమయినది అపకారం, అపకృతి అంటే చెడ్డపని హాని, కీడు, ద్రోహం అపవ్యయం అంటే దుర్వ్యయం అపశకునం అంటే చెడ్డ శకునం

అపమార్గం అంటే తప్పుతోవ అపాధ్వం అన్నా అదే అర్థం అపనామం అంటే తప్పు పేరు అపప్రయోగం అంటే తప్పు ప్రయోగం అపరాధం అంటే తప్పు, నేరం. అపచారం అంటే పెద్దలపట్ల చేసే తప్పు అపశబ్దం అంటే తప్పు మాట అప స్వరం తప్పు స్వరం అపకర్షణం, అపనయనం, అపనోదనం, అపసరణం, అపసారణం అంటే తొలగించడం అపస్మారం, అపస్మరణం, అపస్మృతి అంటే స్మృతి తొలగడం అపాదానం అన్నా తొలగడమే వ్యాకరణంలో కారకాలలో అపాదాన కారకం ఒకటి చెట్టు నుండి కాయను కోయడం అంటే చెట్టు నుండి దాన్ని తొలగించడం అన్నమాట ఇది అపాదాన కారకం

అపవర్గం అంటే మోక్షం అపకర్ష అంటే తగ్గించడం అర్థాపకర్ష అంటే అర్థం తగ్గడం ఉత్కర్షకు ఇది వ్యతిరేకం

అపదిశం అంటే రెండు దిక్కుల మధ్య ప్రదేశం, అయిమూల అపచయం అంటే పూలు మొదలయినవి కోయడం తెలుగు ప్రబంధాలలోని వర్ణనలలో పుష్పాపచయ వర్ణన ఒకటి అపదేశం అంటే మిష అన్యాపదేశంగా మట్లాడడం అంటాం

అపసర్పణం అంటే గూఢచర్య అని అర్థం అపసవ్యం అంటే జందాన్ని కుడిభుజం మీదుగా ఎడమచేతి కిందికి వేసుకోవడం

అపస్నానం అంటే చనిపోయిన జ్ఞాతులు మొదలయిన వారికోసం చేసే స్నానం మృతునికి చేయించే స్నానం

అపహాస్యం అంటే ఎగతాళి, వెకిలినవ్వు అపహస్తం అంటే గెంటడం కోసం మెడమీద వేసినచేయి అపహ్నవం అంటే కప్పిపుచ్చడం దీన్ని అలంకారంగా వాడతాం అపాంగం అంటే అంగహీనమనీ, కడకన్ను అనీ అర్థం కంటిచివర అపాంగ వీక్షణం అంటే కడకంటి చూపు

అపచ్యుతం, అపభ్రంశం, అపక్షయం, అపమార్జనం, అపభ్రష్టం, అపవిద్ధం, అపహరణం వంటి మాటలలో గుర్తింపదగిన అర్థభేదం లేదు హరణం అన్నా దొంగిలించడమే అపహరణం అన్నా దొంగిలించడమే అపహర్త అంటే దొంగ హర్త అన్నా దొంగే సుభాషితాలలో విద్య గురించి చెప్తూ హర్తకు కాదు గోచరము అన్నాడు

నిందకు తెలుగు మాట దూదు అపదూదు అంటే అపనింద అట్లాగే నమ్మకం, నమ్మిక, నెపం, పాడి అన్న మాటలు తెలుగు మాటలు 'అప'తో అపనమ్మకం, అపనమ్మిక, అపనెపం, అపపాడి వంటి మాటలు ఏర్పడ్డాయి ☆

# సంకోచం - సంకలనం

మన ప్రబంధాలలో 'సుఖ సంకథా వినోదంబున నుండ' వంటి ప్రయోగాలు కనిపిస్తాయి ఇక్కడ సంకథ అంటే సంభాషణ పరస్పరం మాట్లాడుకోవడం సుఖంగా కూర్చుని మాట్లాడుకుంటూ ఉండగా అని అర్థం ఆ సమయంలో ఎవరో రావడమో, లేకపోతే ఒకళ్ళు మరొకరిని ఏదో అడగడమో జరుగుతుంది సంకథ అన్న మాటలో సం ఉపసర్గ ఈ 'సం ఉపసర్గతో వందలాది పదాలు ఏర్పడతాయి ఈ ఉప సర్గకు మిక్కిలి అనీ, చక్కగా అనీ అర్థం సమగ్రం అని కూడా అర్థం సంకథలో లాగే సంభాషణలో కూడా 'సం' ఉపసర్గ సంజల్పం, సంలపనం, సంలాపం సంవాదం అన్నా సంభాషణే

సంకటం అన్నమాటను ఇబ్బంది, కష్టం అన్న అర్థాలలో వాడుతున్నాం సంకటం అంటే ఇరుకయిన చోటు అని అర్థం సంకుచితం అన్నా ఇరుకయినది అనే అర్థం ఈ మాటను అలంకారికంగా వ్యక్తి మనస్తత్వాన్ని, ఆలోచనలను వర్ణించడానికి కూడా వాడుతున్నాం సంకుచిత మనస్తత్వం, సంకుచితమైన ఆలోచనలు అని ఆలోచనలోని ఇరుకుతనాన్ని వ్యక్తం చేస్తున్నాం సంకోచం అన్నా ఇదే అర్థం ముడుచుకోవడం, భయం, జంకు అని కూడా అర్థం అర్థ పరిణామంలో అర్థ సంకోచం ఒకటి అర్థ వ్యాకోచానికి అర్థ సంకోచం విరుద్ధమైనది వ్యాకోచం విస్తృతి సంకోచం పరిమితం పత్రం అన్నమాటకు ఆకు అని అర్థం తాటి ఆకు మీద రాసేవాళ్ళు పూర్వం అది పత్రమయింది తాటాకు బదులు కాగితం వచ్చింది కాగితానికీ పత్రం అనే పేరు ఏర్పడింది చివరికి ఇప్పుడు అప్పుతీసుకుని రాసిచ్చే ప్రామిసరీ నోటు అన్న అర్థం పత్రానికి ఏర్పడింది ఋణపత్రం అన్నా కేవలం పత్రం అన్నా అదే అర్థం పత్రం రాసిచ్చాను అంటాం కదా ఆకు అన్న విస్తృతార్థం నుండి ఋణపత్రం అన్న సంకుచితార్థంలోకి పరిణామం జరిగింది ఇటువంటి సంకోచాన్ని అర్థ సంకోచం అంటాం చీర, ఆరాధ్యుడు, వస్తాదు వంటి మాటల్లో కూడా అర్థ సంకోచం జరిగింది పూర్వం చీర అంటే వస్త్రమని అర్థం ఇప్పుడు స్త్రీలు ధరించే వస్త్రమయింది. కోక అన్న మాటలోనూ ఇటువంటి మార్పే జరిగింది శ్రీనాథుడు 'కోక చుట్టితి'నన్నాడు

సంకరం అంటే కలయిక వర్ణసంకరం వంటి సమాసాలలో దీనికి ఎక్కువ వాడుక చీపురుతో ఊడ్చి పోగుచేసిన దుమ్మును కూడా సంకరం అంటారు సంకర్షణం అన్నా కలపడమనే అర్థం ఈ మాటకు దున్నడం అన్న అర్థం కూడా ఉంది బలరాముడికి సంకర్షణుడు అని పేరు. నాగలి ధరించేవాడు కదా. నాగలితో దున్నే వాడన్నమాట

సంకలనం, వ్యవకలనం అన్నమాటలు గణితశాస్త్రంలో వాడుతున్నాం సంకలనం అంటే కూడిక పోగు చేయడం సంకలం అన్నా ఇదే అర్థం కవితా కథా సంకలనాలు ఈ అర్థంలోనే సంకల్పం అంటే మనోనిశ్చయం, కోరిక సంకల్పం చెప్పుకోవడం అంటే కోరిక చెప్పుకోవడమే సంకల్పసిద్ధి అంటే కోరిన కోరిక తీరడం సంకీర్ణం అంటే నానావిధమయినది వ్యాపించినటు వంటిది కలసిపోయినది సంకులం అంటే కలవరపడినది అని అర్థం సంకులపడడం అంటే కలవరపడడం గుంపు, దొమ్మి అనే అర్థం కూడా ఉంది సంకుల సమరం అంటే దొమ్మి యుద్ధం అనేకమంది ఒక్కసారిగా యుద్ధం చేయడం సంకీర్తనం అంటే స్తోత్రం పొగడడం

సంస్తుతి, సంస్తవం, సంశ్లోకం మొదలయిన మాటలకు కూడా స్తోత్రమనే అర్థం

సంక్రందనుడు అంటే ఇంద్రుడు శత్రువులను మొర పెట్టించేవాడు ఆక్రందనంలోని క్రందనమే ఈ మాటలోనిది

సంక్లిష్టం అంటే గాయపడడం నలగగొట్టబడడం సంక్షయం అంటే సంపూర్ణ నాశనం, ధ్వంసం

సంక్షిప్తం అంటే పోగుచేయబడినది అని అర్థం తగ్గింపబడినది అని కూడా అర్థం ఈ అర్థంలోనే ఎక్కువగా వాడుతున్నాం సంక్షేపం అన్నా ఇదే అర్థం

సంక్షోభం అంటే చిత్తక్షోభ కలత సంచలనం అన్నా కలతే, సంచలనవార్త అని వాడుతున్నాం కలత కలిగించే వార్త అయి ఉండాలి ఇంగ్లీషులో సెన్సేషనల్ అన్నమాటకు సమానార్థకంగా దీన్ని వాడుతున్నాం సంగతం, సంగతి కూడిక సంగతం అంటే చక్కగా పొసగినది, తగినది అన్న అర్థం కూడా ఉంది సంగమం అన్నా కూడికే

సంగీతం అంటే చక్కగా పాడబడినది సంగూఢం – సంగుప్తం అంటే చక్కగా దాచబడినది సంజ్వరం అంటే అధికతాపం సంతాపం, సంతపనం మిక్కిలి బాధపెట్టడం సంప్రాప్తం అంటే చక్కగా పొందబడినది సంభారం అంటే చక్కగా భరించడం ఈ మాటకు సామగ్రి అని కూడా అర్థం

సంఘర్షణ– సంఘట్టన అంటే రాపిడి, ఒరపిడి సంచయం, సంచయనం అంటే పోగు చేయడం అస్థి సంచయనం అన్న సమాసంలో దీన్ని ఎక్కువగా వాడుతున్నాం

సందర్భం అంటే సమయం సందర్శనం అంటే చూడడం. సంతర్పణ, సంతుష్టి, సంతోషం అన్న మాటలకు తృప్తని అర్థం సంతర్పణ చేయడం అంటే తృప్తి పరచడమని అర్థం

సంపృక్తం, సంయుక్తం, సంయోగం కలయిక సంపుటం అంటే బరణి అనీ, గ్రంథమనీ అర్థం సంప్రదానం మంచి ఈవి దానం చేయడం వ్యాకరణంలో కారకాలలో సంప్రదాన కారకం ఒకటి సంప్రోక్షణం అంటే చల్లడం పూజలలో వాడతాం సంవాసం అంటే సహవాసం. సంశ్లిష్టం అంటే చక్కగా కలపబడింది వాక్యభేదాలలో సంశ్లిష్టవాక్యం ఒకటి అనేక వాక్యాలను ఒక వాక్యంగా కలపడం సంశ్లేషం అంటే కౌగిలింత సంస్కారం అంటే చక్కబరచడం సంస్కృతం అంటే చక్కబరచినది సంస్కృత భాషకు ఆ పేరు ఈ విధంగానే వచ్చింది సంస్కారం వంటిదే సంస్కృతి

సంహారం అంటే చంపడమూ, పోగుచేయడమూ వేణీ సంహారంలో జుట్టు ముడవడం అని అర్థం

సన్నిధి, సన్నిధానం సామీప్యం సన్నిధిలోనూ సన్నిధానంలోనూ 'సం' ఉపసర్గ చేరింది సమాగమం అంటే కలయిక సముఖం అంటే ఎదురు సముద్యోగం అంటే మహాప్రయత్నం సమ్మతం అంటే అంగీకారం సమ్మోహనం అంటే ఆకర్షణ సమ్రాట్టు అంటే చక్రవర్తి ఈ మాటల్లోనూ ఉపసర్గ 'సం'యే

# అనుక్షణం - అనూరాధ

భయం అనుక్షణం వెంటాడుతూనే ఉంది అంటాం ఇక్కడ అనుక్షణం అంటే క్షణక్షణం ప్రతిక్షణం అని అర్థం అనుక్షణంలో అను ఉపసర్గ ఈ ఉపసర్గకు ఈ మాటలో మళ్ళీ మళ్ళీ అని అర్థం అనుక్షణంలాగానే అనుదినం ప్రతిరోజూ అని అర్థం అనుదినం, అన్వహం అన్నా అదే అర్థం అనువాసరం అన్నా, ప్రతిరోజూ అనే అర్థం అనుమాసం అంటే ప్రతినెలా అని అర్థం శబ్దాలంకారాలలో అనుప్రాస అన్న అలంకారం ఉంది పోతనగారు ఈ అలంకారం ప్రయోగించడంలో ప్రసిద్ధులు ఒకే హల్లుగాని, హల్లుల సంయోజనం కాని మళ్ళీమళ్ళీ వస్తే అది అనుప్రాసాలంకారం అవుతుంది అనుప్రాస అన్న మాటలోని అను ఉపసర్గే అనురణనం అంటే నిరంతరమూ మ్రోగుతూ ఉండడం అనుచింత, అనుచింతన, అనుచింతనం అంటే ఆలోచించడం. ఎడతెగకుండా ఆలోచించడం అనులాపం అంటే ఎడతెగకుండా సంభాషించడం విమర్శ రంగంలో అనుశీలన అన్నమాటను వాడుతూ ఉంటారు అనుశీలనం అంటే నిరంతర అభ్యసనం నిరంతర ఆచరణ అనుసంతతి అంటే ఎడతెగని క్రమం, అవిచ్ఛిన్న పరంపర అనుస్యూతం అన్నమాట కూడా ఉంది అనుస్యూతంగా వస్తూ ఉన్నది అంటాం ఎడతెగకుండా అని అర్థం వరుసగా కూర్చడం, కలిపి కుట్టడం అన్నమాట అనూచానం అన్న మాటను కూడా ఇదే అర్థంలో వాడుతూ ఉన్నాం సంప్రదాయంగా, తరతరాలుగా అన్న అర్థంలో ఈ మాటను వాడుతున్నాం అనూచానుడు అంటే వినయం కలిగినవాడనీ, గురుముఖంగా సాంగవేదాధ్యయనం చేసినవాడని అర్థం అనుసేవి అంటే ఎప్పుడూ సేవించేవాడనీ, ఎప్పుడూ ఆచరించేవాడనీ అర్థం

రామానుజుడు లక్ష్మణుడు భరత శత్రుఘ్నులు కూడా రామానుజులే అయినా లక్ష్మణుడికి ఈ పేరు రూఢం విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకుడైన రామానుజుడూ సుప్రసిద్ధుడే ఈ పేరులోని అనుజ శబ్దానికి తరువాత పుట్టినవాడని అర్థం అనుజుడు, అనుజన్ముడు అనుభ్రాత తమ్ముడిని సూచించే మాటలు అదే స్త్రీ వాచకం అంటే చెల్లెలయ్యేటట్లయితే అనుజ, అనుజన్మ, అనుజాత అంటాం అనుమాసం అంటే తరువాతి నెల అనుప్రయోగం అంటే తరువాత ప్రయోగించడం అనురాధ అన్న నక్షత్రం ఉంది ఇరవయ్యేడు నక్షత్రాలలో ఇది పదిహేడోది రాధ తరువాతిది అనురాధ రాధ నక్షత్రానికే విశాఖ అని పేరు అనురాధను అనూరాధ అని కూడా అంటారు ఈ మాటల్లో 'అను' ఉపసర్గకు తరువాత అని అర్థం

అనుకాలం అంటే కాలానికి తగినటువంటిది అని అర్థం దేశకాలానుగుణంగా నడచుకోవాలి అంటుంటారు దేశానికి, కాలానికి తగిన విధంగా, అర్హమైన రీతిలో అని అర్థం అనురూపం అంటే రూపానికి తగినది అని అర్థం ఈ మాటల్లో అను'కు అర్హమైంది, తగినది అని అర్థం

అన్వర్థం అంటే అర్థాన్ని పొందినటువంటిది అని అర్థం సార్థకం అన్నమాట. అన్వర్థ నామధేయుడు అంటాం పేరులో ఏముందో దాన్ని పొందినవాడు అనుభవం అంటే ప్రత్యక్ష జ్ఞానం అనుభూతి అన్నా అదే అర్థం అనుభోగం అనికూడా అనవచ్చు అనుభోగం అంటే మాన్యక్షేత్రం, ఈనాం అని కూడా అర్థం ఉంది

అనుపాతకం అంటే మహాపాతకాన్ని పోలిన పాతకం దొంగతనం, హత్యవంటి పాపాలు

ఇటువంటి అనుపాతకాల సంఖ్య వివిధ గ్రంధాలలో భిన్నబిన్నంగా ఉంది మనుస్మృతిలో ముప్ఫయి అయితే విష్ణు స్మృతిలో ముప్ఫయి అయిదు అని ఉంది అనుగర్జితం అంటే ప్రతిధ్వని ధ్వనిని పోలిన ధ్వని అనునాదం అన్నా ఇదే అర్థం ఈ మాటల్లో అను'కు పోలిన అని అర్థం అనుజీవి అంటే ఆశ్రయించుకొని జీవించేవాడు, ఆశ్రితుడు అనుజీవ్యుడు ఆశ్రయింపదగిన వాడు, యజమాని, ప్రభువు ఈ మాటల్లో 'అను'కు ఆశ్రయం అని అర్థం అనుకల్పం అంటే మొదట కావలసిన పదార్థం దొరకనప్పుడు దానికి బదులుగా ఉపయోగించే మరో పదార్థం ఇది ప్రత్యామ్నాయం మాత్రమే మొదటిదే ముఖ్యం రెండోది ప్రధానం కాదుకాని పని గడుపు కోవడానికి ఉపయోగపడుతుంది అనుశస్త్రం అంటే శస్త్రానికి బదులుగా వాడేది అన్వాచయం అంటే ఒక ముఖ్యమైన పనిచెప్పి దానితోపాటే మరో అముఖ్యమైన పనిని కూడా చెప్పడం బడికి వెళ్ళి పిల్లవాణ్ణి తీసుకురండి, అట్లాగే ఒక కిలో పంచదార కూడా తెండి అనడం ఈ అప్రధాన మయిన రెండో పనికి అన్వాచితం అని పేరు

అనునాసికం అంటే ముక్కుతో పలికే ధ్వని ఈ ధ్వనిని ఉచ్చరించడంలో సాధారణ ప్రయత్నంతోపాటు ముక్కును కూడా ఉపయోగిస్తాం అనుపానం అంటే మందుతోపాటు పుచ్చుకొనేది అనుమరణం అంటే సహగమనం ఈ మాటల్లో అను'కు తో, కూడా అని అర్థం

అనుక్రమణి, అనుక్రమణిక అన్న మాటలను పుస్తకాలలో విషయ సూచిక అన్న అర్థంలో వాడుతున్నాం ఇక్కడ వరుస అని అర్థం అనుజ్యేష్ఠుడు అంటే వరుసలో పెద్దవాడి తరువాతి వాడు, అంటే రెండోవాడు

అనువాదం అన్నమాటను భాషాంతరీకరణం అన్న అర్థంలో వాడుతున్నాం ఒక భాషలోని విషయాన్ని మళ్ళీ మరొభాషలో చెప్పడం అనువాదం అంటే మళ్ళీ చెప్పడమే గురువు చెప్పిం దాన్ని మళ్ళీ చెప్పడం అనుప్రవచనం అన్వీక్ష అంటే మళ్ళీ ఆలోచించడం, వెదకడం అన్వేషణ అన్నా వెదకడమే అనుకరణం అంటే మళ్ళీ చేయడం అనుకర్త అంటే అనుకరించే వాడు అనుద్యూతం అంటే మళ్ళీ ఆడిన జూదం 'అను'కు ఒక ప్రధానమైన అర్థం అనుసరించి అని అనుకూలం అంటే కూలాన్ననుసరించి, కూలం అంటే తీరం, ఒడ్డు తీరం వెంబడే అని అర్థం అనుగుణం అన్నమాట అనువర్తనం అంటే అనుసరించి నడచుకోవడం అనుచరుడు అంటే అనుసరించి నడచుకొనేవాడు అనుయాయి అన్నా, అనుసరించేవాడే పల్లవి వెంటనే పాడేది అనుపల్లవి అనుభావం అంటే ముఖంలో భావాలను తెలిపేది అనుపథం అంటే అనుకూల మయిన మార్గం అనులోమం అంటే క్రమాన్ని అనుసరించి ఉండేది విలోమం దీనికి వ్యతిరేకం అనుశ్రుతం అంటే వేద సంప్రదాయాన్ని అనుసరించి వచ్చింది అనుపతనం, అనుపాతం అంటే ఒకదాని వెనుక ఒకటి పడడం. అనువనం అంటే వనసమీపం అని అర్థం అనుకనీయుడు అని ఒకమాట ఉంది కనీయుడు అంటే కనిష్ఠుడు అనుకనీయుడు అంటే కనిష్ఠునికంటే ముందు వాడు ఐదుగురు కొడుకులుంటే అందులో నాలుగోవాడు కనిష్ఠునికి దగ్గరగా ఉన్నవాడు అనులేపం అంటే పూత అనుకీర్తనం అంటే కీర్తనం అనురాగం అంటే ప్రేమ అనుశాసనం అంటే ఆజ్ఞ అనుసంధానం అంటే కూర్చడం అనుస్మరణం అంటే జ్ఞప్తికి తెచ్చుకోవడం ఈ మాటల్లో అనుచేర్చడం వల్ల ఏర్పడే విశిష్టార్థమేమీ ఉండదు

అనుకంప అంటే దయ కొంచెం కదిలింపచేస్తుంది కాబట్టి అనుకంప ☆

# కవివతంసుడు - అవమానం

సంస్కృతంలో శ్రేష్ఠతావాచక శబ్దాలెన్నో ఉన్నాయి కవి వృషభుడు అంటే కవి శ్రేష్ఠుడు అట్లాగే కవి వతంసుడు అనికూడా అనవచ్చు ఈ వతంస శబ్దం శ్రేష్ఠతా వాచకం పండితావతంసుడు అంటే పండిత శ్రేష్ఠుడు ఇక్కడ అవతంసుడు అని రూపం అవతంసం అంటే కర్ణాభరణం, శిరోభూషణం కుండలాలు ధరించడం, కిరీటం పెట్టుకోవడం గొప్ప ఆ ఆభరణాలూ గొప్పవే తసి ధాతువుకు అలంకారం అని అర్థం దీనికి 'అవ' అన్న ఉపసర్గ చేరి అవతంసం అన్నమాట ఏర్పడింది అవతంసం అనీ అనవచ్చు వతంసం అనీ అనవచ్చు కొన్ని మాటల్లో 'అవ'లో 'అ' లోపించవచ్చు అవధానం అన్నమాటకు కూడా వధానం అన్నరూపం ఉంది అవధానం అంటే ఏకాగ్రత అవధాని అంటే అవధానం కలవాడు వధాని అని కూడా అనవచ్చు తెలుగుదేశంలో అవధానం, అవధాని సుప్రసిద్ధమైన పదాలు రకరకాల అవధానాలున్నాయి సాహిత్యంలో అష్టావధాన, శతావధాన, సహస్రావధానాలున్నాయి నేత్రావధానం, నాట్యావధానం కూడా ఉన్నాయి ఏకాగ్రత ప్రధానమయిన ఏ విషయంలోనయినా అవధానం చేయవచ్చు కొన్ని కొత్త అవధాన ప్రక్రియలు వెలిశాయి ఇంకా వెలుస్తాయి కొంతమంది పేర్లలో కూడా ఈ అవధాని చేరిపోయింది రెడ్డి, శాస్త్రిలాగా పేరు చివర అవధాని ఉన్నంత మాత్రాన అవధాని కాకపోవచ్చు

దేశ నాయకులు మరణించినప్పుడు జాతీయ పతాకాన్ని కొంచెం కిందికి దించుతారు దీన్ని అవనతం చేయడం అంటారు అవనతం అంటే వంగినది ఈ మాటలోని అవ ఉపసర్గకు వంగడం అని అర్థం అవాగ్రం అన్నా అవనతం అనే అర్థం అవక్రమం అంటే కిందికి దిగడం అవతరణం, అవతారం, అవతీర్ణం, అవరోహం, అవరోహణం ఈ మాటలన్నిటికీ కిందికి దిగడమనే అర్థం గంగావతరణం అంటే గంగ ఆకాశం నుండి కిందికి దిగడం అవతారం అన్న మాటను దేవుడు కిందికి దిగి మానవ రూపమో మరో రూపమో ధరించడం అన్న అర్థంలో వాడుతున్నాం అవరోహణ క్రమం అంటే క్రిందికి దిగే విధానం దీనికి వ్యతిరేకం ఆరోహణ క్రమం, పైకి ఎక్కే విధానం మనం వాడడం లేదుకాని అవమూర్ధుడు అనేమాట కూడా ఉంది తల దించినవాడు అని అర్థం

'అవ' ఉపసర్గతో వాడే మాటల్లో చాలా ప్రచారంలో ఉన్నమాట అవమానం మానం అంటే గౌరవం సమ్మానంలో కూడా ఇదే మన ధాతువుకు తెలియడం అని అర్థం నలుగురికీ తెలిసి ఉండడం గౌరవమేకదా అవమానంలో 'అవ' విరుద్ధార్థంలో వచ్చింది గౌరవానికి విరుద్ధం అగౌరవం అట్లాగే అవమానం పరాభవం, అగౌరవం అని అర్థం అవమర్యాద అవలక్షణం అంటే చెడు లక్షణం అవరూపం అంటే చెడురూపం అవకరం అంటే చెడ్డపని అవగుణం అంటే తప్పు, దోషం అవజ్ఞ, అవజ్ఞానం అన్నా అవమానమే అవజ్ఞ చేశాడు అంటే అవమానించాడు అని అర్థం అవగీతం అంటే వికృతంగా పాడినపాట

గణన చేయడం అంటే లెక్కించడం లక్ష్యపెట్టడం అవగణనం అంటే లక్ష్య పెట్టకపోవడం అవక్షేపం, అవక్షేపణం అంటే నిందించడం, ఎగతాళి చేయడం అవశకునం అంటే అపశకునం అవదాయం అంటే తప్పుడు ఆట జూదంలో మోసం చేయడం ఒక పందెం పడితే మరో పందెమని బుకాయించడం వంటిది

అవదాహం అంటే తాపాన్ని పోగొట్టేది వట్టివేరుకు అవదాహమని పేరు అవక్రియ అంటే చెయవలసినటువంటి/ విహితమయిన క్రియలు చేయకపోవడం క్వణం అంటే మోత అవ క్వణం అంటే అపస్వరం, అపధ్వని

అవకర్ణనం అంటే వినడం అయితే ఈ వినడంలో అనాదరం ఉన్నా అవకర్ణనం అనే అంటారు ఇక్కడ 'అవ'కు అనాదరమని అర్థం అవహేల అన్నా అనాదరమే అవహేళన అని వాడతాం అనాదరణ, వెక్కిరింత అని అర్థం

అవగతం అయింది అంటే తెలిసింది, అర్థమయింది అని అర్థం అవగతి, అవగమం అన్నమాటలకు తెలివి, తెలియడం అని అర్థం అవగాహం అంటే తెలిసికోవడం అని అర్థం అవ గాహన అన్నమాటను ఎక్కువగా వాడుతున్నాం అవగాహన చేసికోవడం అంటే తెలిసికోవడం

క్లిన్నం అంటే తడిసినది అవక్లిన్నం అంటే బాగా తడిసినది అవసానం అంటే సమాప్తి చావు అవసానదశ అంటాం

చాలా మాటల్లో అర్థంలో గణనీయమయిన విశేషం లేకుండానే 'అవ' చేరుతుంది. ఆప్తి అంటే పొందడం అవాప్తి అన్నా పొందడమే కర్తనం అంటే కత్తిరించడం అవకర్తనం అన్నా కత్తి రించడమే కుంచనం అంటే ముడుచుకోవడం అవకుంచనం అన్నా ముడుచుకోవడమే

అవకుంఠనం, అవగుంఠనం అంటే ముసుగు గుంఠనం అంటే కప్పడం అవగుంఠితం అంటే ముసుగు వేసినది, కప్పినది అని అర్థం. క్రందనం అంటే ఏడుపు అవక్రందనం అన్నా ఏడుపే

అవకాశం అంటే ఎడం రెండిటి మధ్య ఉండే ఎడం, తెరపి ఒక ప్రదేశానికీ మరో ప్రదేశా నికీ మధ్య ఉండే ఎడం కావచ్చు ఒక కాలానికీ మరో కాలానికీ మధ్య ఉండే ఎడం కావచ్చు ఈ రెండో అర్థంలో ఎక్కువగా వాడుతున్నాం అవకాశం కల్పించుకొని రండి అంటే వీలు చేసుకొని రండి అని అర్థం తెరపి చేసుకొని రమ్మని అర్థం ప్రస్తుతం ఇంగ్లీషులో ఆపర్చ్యూనిటీ అన్న మాటకు సమానార్థకంగా ఈ మాటకు వాడుక ఎక్కువగా కనిపిస్తుంది ఇది జరిగే అవకాశం ఉంది అన్నప్పుడు సంభావ్యం అన్న అర్థం కూడా ఉంది అవక్రయం అంటే వెల, అద్దె అవ గ్రహం, అవగ్రహణం అంటే అడ్డపాటు అవగ్రహం అంటే వానకరువు అనికూడా అర్థం గ్రహ విరోధం వల్ల వానపడకపోవడం

సంస్కృతంలో రెండు మాటల మధ్య ఽ అనే గుర్తును చూస్తుంటాం. ఈ గుర్తుకు అవ గ్రహం అని పేరు ఆ గుర్తు స్థానంలో ఉచ్చారణలో స్వల్ప విరామం ఇవ్వాలన్నమాట అవగ్రహాన్ని వగ్రహం అనికూడా అనవచ్చు

ఘాతం అంటే దెబ్బ అవఘాతం అన్నా దెబ్బే. అవదారితం అంటే చీల్చబడిందని అర్థం అవదాహం అంటే తాపాన్ని పోగొట్టేది అన్న అర్థంతోపాటు వేడిమి అన్న అర్థం కూడా ఉంది. ఇక్కడ దాహానికీ, అవదాహానికీ అర్థభేదం లేదు. అవబోధం అంటే మేలుకోవడం, తెలిసికోవడం. అవరోధం అంటే అడ్డు అవలీల అంటే చులకన లీల అన్నా అదే అర్థం లీలగా ఎత్తాడు తేలికగా, కష్టం లేకుండా అని అర్థం అవలేపం అంటే పూత

యజ్ఞయాగాదులలో యజ్ఞ సమాప్తిలో చేసే స్నానం అవభృథ స్నానం అవభృథ స్నానం చేస్తే యజ్ఞం పూర్తి అయినట్లు దీక్షావ్రతం పూర్తవుతుంది ☆

# నిరశనం- నిరసనం, నిర్దిష్టం- నిర్దుష్టం

నిర్, నిస్ అనే ఉపసర్గలు రూపాంతరాలు నిర్ అనేది అచ్చుల ముందు వస్తుంది హల్లుల్లో గ, ఘ, జ, ఝ, డ, ఢ, ద, ధ, న, బ, భ, మ, య, ర, ల, వ, హ ల ముందు కూడా నిర్ వస్తుంది తక్కిన హల్లుల ముందు నిస్ వస్తుంది ఈ ఉపసర్గ చేర్చినప్పుడు కూడా భిన్నార్థాలు వస్తాయి చాలా ఎక్కువగా కనిపించే అర్థం మాత్రం అభావార్థం అంటే లేనిది అని అర్థం

నిరంకుశం అంటే అంకుశం లేనిది అడ్డులేనిదన్నమాట నిరంకుశుడు అంటే అడ్డులేని వాడు నిరంకుశ పరిపాలన, నిరంకుశ పరిపాలకుడు అని ఎక్కువగా వాడుతుంటాం నిరంజనం అంటే అంజనం లేనిది అంటే కాటుక లేనిది నిరంజనుడు అంటే పరమాత్మ నిరంతరం అంటే అంతరంలేనిది ఎడం లేకుండా ఎల్లప్పుడూ అని అర్థం నిరత్యం అంటే అపాయం లేనిది నిరపాయం అనీ అనవచ్చు అత్యం అంటే అపాయం అనునాసికం అంటే ముక్కుతో పలికే ధ్వని నిరనునాసికం అనునాసికం లేనటువంటిది అపరాధి అంటే నేరం చేసినవాడు నిరపరాది నేరం చేయనివాడు, అపరాధం చేయనివాడు

నిరపేక్ష అంటే అపేక్ష లేనిది ఆయన నిరపేక్షంగానే ఈ పని చేసిపెట్టాడు అన్నప్పుడు ఏమీ కోరకుండానే పనిచేసి పెట్టాడని అర్థం నిరర్గళం అన్నా అడ్డులేకుండా అనే అర్థం అనర్గళంగా ఉపన్యసించాడు అన్నట్లుగానే నిరర్గళంగా మాట్లాడాడనవచ్చు నిరర్థకం అంటే వ్యర్థం అవకాశం అంటే ఎడం, ఖాళీ నిరవకాశం అంటే ఎడంలేకుండా నిరవధిక సమ్మె జరుగుతూ ఉంది అంటాం అవధి అంటే మేర, హద్దు నిరవధికం అంటే అవధి లేనటువంటిది ఇన్ని రోజులు, ఇంత సమయం అని నిర్ణయించనిది పరీక్షలు నిరవధికంగా వాయిదా వేశారు అంటాం ఫలానా రోజువరకు అన్న అవధిని నిర్ణయించలేదన్నమాట. నిరవశేషం అంటే అవశేషం లేకపోవడం సంపూర్ణంగా అని అర్థం నిరవలవంబం అంటే అవలంబం లేనిది ఆధారం లేనిదన్నమాట అవలంబం అన్నమాటను అవలంబించు అనే క్రియగా ఎక్కువగా వాడుతున్నాం

నిరశనం, నిరసనం అన్న రెండు మాటలూ తెలుగులో ఎక్కువగా వాడుకలో ఉన్నాయి అయితే వీటిని ఒకదాని బదులు ఒకటి వాడడం కూడా అక్కడక్కడా కనిపిస్తూ ఉంటుంది అశనం అంటే భోజనం నిరశనం అంటే భోజనం లేకుండా ఉండడం, ఉపవాసముండడం నిరశనదీక్ష అంటే నిరాహారదీక్ష నిరసనం అంటే తోసివేయడం, నిరాకరించడం, తిరస్కారం మొదలయిన అర్థాలున్నాయి చంపడం, ఉమ్మివేయడం అన్న అర్థాలు కూడా ఉన్నాయి కాని ఈ అర్థాలలో మనం ఈ మాటను వాడడంలేదు ఎదుటివాడి అభిప్రాయాన్ని ఖండించడం, వ్యతిరేకాభిప్రాయాన్ని వ్యక్తపరచడం నిరసనం నిరసన తెలుపుతూ నిరశనదీక్ష చేపట్టవచ్చు నిరశన వ్యక్తం చేశారు అనడం సరికాదు నిరసన వ్యక్తం చేశారు అనాలి

నిరహంకారి అంటే అహంకారం లేనివాడు నిరాకారం అంటే ఆకారం లేకపోవడం నిరాఘాటం అంటే అడ్డులేకపోవడం నిరాటంకం అన్నా అదే అర్థం నిరాడంబరుడు అంటే ఆడంబరం లేనివాడు నిరాధారం అంటే ఆధారం లేనిది నిరాధారమయిన ఆరోపణలు చేస్తున్నారంటాం నిరాయాసం అంటే ఆయాసంలేనిది అనాయాసం నిరాయుధుడు, నిరాశ్రయుడు ఆయుధం లేనివాడు, ఆశ్రయం లేనివాడు

నిర్మలం అంటే మాలిన్యం లేనిది, మచ్చలేనిది, స్వచ్ఛమైనది నిర్మక్షికం అంటే ఈగలు లేనిది నిర్భయం అంటే భయం లేకపోవడం నిర్జనం అంటే జనంలేనిది. నిర్జరులు అంటే దేవతలు జర అంటే ముసలితనం లేనివారు నిర్వ్యాజం అంటే కపటం లేనిది, సహజమైనది, శుద్ధ

ప్రవది నిర్వ్యాపారం అంటే వ్యాపారం లేకపోవడం, వ్యాపారం అంటే పని వాడు నిర్వ్యాపారంగా ఉన్నాడు అంటే పనిలేకుండా ఉన్నాడని అర్థం

నిశ్శేషం అంటే శేషం లేకుండా ఉండడం సంపూర్ణంగా అని అర్థం నిశ్చేష్ట అంటే చేష్టలేక పోవడం నిశ్శబ్దం, నిష్ఫలం, నిస్సంశయం, నిస్సంకోచం, నిస్సందేహం, నిస్సందిగ్ధం, నిష్కారణం ఇటువంటివి నిష్కామం అంటే కోరిక లేకపోవడం నిస్తేజం అంటే తేజం లేకపోవడం నిర్హేతుకం అంటే హేతువు లేనిది నిర్హేతుకమైన విమర్శలు చేశారు అన్నప్పుడు కారణం లేకుండా, ఆధారం లేకుండా అని అర్థం నిర్లజ్జ అంటే లజ్జలేకపోవడం

నిరాకులం అంటే మిక్కిలి కలత చెందినది అని అర్థం మిక్కిలి వ్యాప్తమైనది అని కూడా అర్థం ఆకులం అన్నమాటకు కలత చెందినది అనీ వ్యాపించినది అనీ అర్థం ఈ మాటలో 'నిర్' ఉపసర్గకు అతిశయం, ఎక్కువ అని అర్థం నిర్గాఢం అంటే మిక్కిలి గూఢమైనది నిర్ఘోష అంటే మహాధ్వని నిర్దళనం అంటే పూర్తిగా చీల్చడం

నిర్ధాతం అంటే బాగా కడగబడినది నిర్బంధం అంటే గట్టిగా బంధించడం బలాత్కారం నిర్భగ్నం అంటే ముక్కలు చేయబడినది నిర్భరం అంటే నిండినది, తీవ్రమైనది, అధికం అని అర్థాలు నిర్జయం అంటే సంపూర్ణ విజయం నిర్మాణం అంటే సృష్టి, కూర్పు. నిర్ముక్తుడు అంటే సన్యాసి, సంసారాది బంధాలను విడిచిపెట్టినవాడు నిష్పీడనం అంటే పిసకడం నిష్ఠురం అంటే గట్టిదని అర్థం నిష్ఠురాలు ఆడారు అన్నప్పుడు పరుష వచనాలని అర్థం నిష్ఠూరం అని వాడుతూ ఉంటారు

నిర్వాణం అంటే ఆరిపోయినది, అస్తమించినది అని అర్థం నిర్యాణం అంటే వెడలడం అని అర్థం శరీరం నుండి ప్రాణవాయువు బయటికిపోవడం మరణం, ముక్తి నిర్వాణం అన్న ప్పుడు దుఃఖాదులు తొలగిపోవడం శాంతమవడం. బుద్ధుని అస్తమయాన్ని మహా పరినిర్వాణం అంటారు నిశ్శ్రేయసం అంటే ముక్తి నిర్ఝరం అంటే సెలయేరు, కొండవాగు

నిర్ఘాతం అంటే దెబ్బ నిర్ణయం, నిశ్చయం, నిర్ధారణలు స్థూలంగా ఒకే అర్థంలో వాడుకలో ఉన్నాయి నిర్దేశం అంటే ఆజ్ఞ.

నిర్దిష్టం అంటే చూపబడింది, ఏర్పరచినది, ఆజ్ఞాపించబడినది, చెప్పబడింది నిర్దుష్టం అంటే దోషం లేనిది ఈ రెండు మాటలను కూడా ఒకదాని బదులు ఒకటి వాడుతూ ఉండడం అక్కడక్కడా కనిపిస్తుంది

నిష్కృతి అంటే ప్రాయశ్చిత్తం

నిర్' ఉపసర్గతో వచ్చిన మాటలకు కొన్నిటికి రెండర్థాలు ఉంటాయి ఉదాహరణకు నిర్వచనం అంటే వచనం లేనిది. తిక్కన నిర్వచనోత్తర రామాయణం నిర్వచన కావ్యం కేవలం పద్యాలే ఉంటాయి వచనం ఉండదు ఈ మాటకు నిర్వచనం ఏమిటి అన్నప్పుడు అర్థాన్ని వివ రించి చెప్పడం అని అర్థం నిరుక్తం అంటే నిర్వచనమే అయితే ఇక్కడ వచనం లేకపోవడమన్న అర్థం ఉండదు వివరించి చెప్పడమనే అర్థం వేదంలోని మాటలకు అవయవార్థాన్ని వివరించి చెప్పే గ్రంథం యాస్కుడు రచించిన నిరుక్తం

నిర్'కు దాటినది అనే అర్థం కూడా ఉంది నిర్దశం అంటే పదిని దాటినది నిస్త్రింశం అంటే ముప్పైని దాటినది

నిష్కాసం అంటే వెళ్ళగొట్టడం నిష్కాసితుడు అంటే వెళ్ళగొట్టబడినవాడు వ్యాసుడు కాశి నుండి నిష్కాసితుడు నిష్క్రమణం అంటే బయటికిపోవడం.

'నిస్'ను తెలుగుమాటలకు, అన్యదేశ్యాలకు చేర్చి వాడడం కూడా కనిపిస్తుంది ఇటువంటి మాటల్లో నిస్సిగ్గు, నిష్పూచీ అన్నమాటలకు చాలా వ్యాప్తి ఉంది ☆

# దుర్యోధన, దుశ్శాసనులు

మహాభారతంలో కౌరవులు వందమంది వందమంది పేర్లూ తెలుసుకోవాలంటే భారతం చూడక తప్పదు అయితే కౌరవుల్లో దుర్యోధనుడు, దుశ్శాసనుడు తెలియని వాళ్ళు మాత్రం ఉండరు దుష్టచతుష్టయంలో ఇద్దరు వీళ్ళు కీచకునిలాగా దుశ్శాసనుడి పేరూ దుర్మార్గానికి ప్రఖ్యాతమయిపోయింది దుర్మార్గులయిన రాజకీయ నాయకుల్ని కీచకులు, దుశ్శాసనులూ అనడం పరిపాటి తమిళనాడు శాసనసభలో డియంకె సభ్యులు జయలలిత కొంగులాగినప్పుడు వాళ్ళను దుశ్శాసనులుగా అభివర్ణించడం జరిగింది దుర్యోధనుడి నేతృత్వంలోనే దుశ్శాసనుడు నడచుకొన్నా, దుశ్శాసనుడికి వచ్చినంత చెడ్డపేరు దుర్యోధనుడికి రాలేదు దురభిమాని అని తప్ప దుర్యోధనుడిలో చాలామందికి కొన్ని సల్లక్షణాలు గోచరిస్తాయి తెలుగువారికి దుర్యోధనుడంటే ఇష్టమే మనవాళ్ళు ఏకపాత్రాభినయం చేయాలంటే దుర్యోధనుణ్ణే ఎన్నుకుంటారు

దుర్యోధనుడు, దుశ్శాసనుడు అనగానే మనకు ఏదో చెడు వినిపిస్తుంది కృష్ణుడి వల్లా పాండవ పక్షపాతం వల్ల కౌరవులది అన్యాయమని అనుకుంటాం అందువల్ల వాళ్ళు చెడ్డవాళ్ళు వాళ్ళ పేర్లలోని దుర్, దుస్ చెడుని బోధిస్తున్నట్లనిపిస్తుంది ఏ అమ్మానాన్నా మాత్రం పిల్లలకు చెడు అర్థమిచ్చే పేర్లు పెట్టుకుంటారు అందువల్ల దుర్యోధనుడు, దుశ్శాసనుడు చెడ్డపేర్లేమీ కాదు ఈ పేర్ల ముందున్న దుర్, దుస్ ఉపసర్గలు దుర్యోధనుడు అంటే యుద్ధం చేయ శక్యంకానివాడు అంటే అతనితో ఎవరూ యుద్ధం చేయలేరు అని అంత వీరుడని పేరు పెట్టుకున్నారు దుశ్శాసనుడు అంటే శాసింపశక్యం కానివాడు అతనినెవరూ శాసించలేరన్నమాట ఈ అన్నదమ్ములింతటి వాళ్ళు కావాలని తల్లిదండ్రుల కోరిక

దుస్, దుర్–నిస్, నిర్‌లాంటివి నిస్ వచ్చే పరిసరాల్లో దుస్ వస్తుంది అంటే కఖ చఛ టఠ తథ పఫ శషసల ముందు దుస్ వస్తుంది తక్కినచోట్ల అంటే అచ్చులముందూ, ఇతర హల్లుల ముందూ దుర్ వస్తుంది దుస్, దుర్‌లు ప్రధానంగా చెడు అన్న అర్థంలోనే వస్తాయి అందుకే దుర్యోధనుడు, దుశ్శాసనుడు అన్నప్పుడు చెడు తోస్తుంది

జలియన్‌వాలాబాగ్ దురంతం అందరికీ గుర్తుండేదే ఇక్కడ దురంతం అంటే చెడుగా అంతమయినది, అమంగళంగా అంతమయినది విషాదాంతం, ట్రాజెడీ దురదృష్టం అంటే చెడ్డ అదృష్టం దుర్భాగ్యం అన్నా అదే అర్థం దురభిమానంలో అభిమానం అంటే గర్వం. దురభిమానం ఉన్నవాడు దురభిమాని దురభిమానాన్ని దుర్గర్వం అనికూడా అనవచ్చు దురహంకారం కూడా ఇటువంటిదే దురవస్థ అంటే చెడ్డ స్థితి దురాక్రమణ అంటే చెడ్డ ఆక్రమణ, అన్యాయమయిన ఆక్రమణ దురాచారం అంటే దుష్ట ఆచారం దురాచారమన్నమాట రాగానే ఇప్పుడు తోచేది వరకట్న దురాచారం దుర్మరణం అంటే చెడ్డచావు

దురాత్ముడు చెడ్డవాడు దురాశ చెడ్డ ఆశ దురాశయం సదాశయానికి వ్యతిరేకం దుర్ణయం అన్నా దుర్నీతి అన్నా చెడ్డనీతి దుర్గతి, దుర్దశ, దుస్థితి ఒకటే. దుర్గంధం దుర్వాసన ఒకటే దుష్కర్మం, దుష్కృతం, దుష్క్రియ, దుష్కృతి ఒకటే చెడ్డపని అని అర్థం. దుష్కాలం అంటే చెడ్డకాలం ప్రళయం అని కూడా అర్థం దుశ్శకునం అంటే అపశకునం. దుర్నిమిత్తం అన్నా అదే దుశ్చరితం అంటే చెడ్డ నడవడి. దుష్ప్రకృతి దుస్స్వభావం ఒకటే. దుస్స్వప్నం అంటే చెడ్డ

ఉ. దుర్దినం అంటే చెడ్డరోజు మబ్బు కమ్మిన రోజు దుర్దివసం అన్నా అదే అర్థం

దురతిక్రమం అంటే దాటరానిది దుర్లంఘం అన్నా దుస్తరం, దురత్యయం అన్నా అదే అర్థం దుర్వారం అంటే వారింపరానిది దురవబోధం అంటే తెలుసుకోవడం కష్టమైనది పారం దురవబోధంగా ఉంది అంటే అర్థంకాకుండా ఉందని దుర్గమం పోవడానికి కష్టమైనది పోలేని స్థలం దుర్గం అన్నా అదే అందుకే కోటకు దుర్గం అనిపేరు దుర్జయుడు అంటే జయింపరాని వాడు దుర్భరం అంటే భరింపరానిది దుర్భేదం అంటే భేదింపరానిది దుర్భేద్యం అన్నా అదే

సుకరానికి వ్యతిరేకం దుష్కరం దుస్సహం అంటే సహింపరానిది దుర్బలుడు అన్నప్పుడు దుర్ కు అల్పమని అర్థం దుర్బలుడు అంటే అల్పబలం కలవాడు

దుర్భిక్షం అంటే భిక్షలేనిది ఇక్కడ 'దుర్'కు అభావం అని అర్థం లేకపోవడం మనకు తినడానికే లేకపోతే భిక్ష ఎక్కడవేస్తాం భిక్ష దొరకని సమయం కరువుకాలం అందువల్ల దుర్భిక్షం అంటే కరువు అని అర్థం దుర్మర్యాద అంటే మర్యాద లేకపోవడం దుర్వినీతుడు అంటే వినయం లేనివాడు

దుర్మిత్రుడు అంటే శత్రువు దురోదరం అంటే జూదం

దుర్మూల్యం అంటే ఎక్కువ వెల అని అర్థం ఉండవలసిన దానికంటే ఎక్కువగా ధర ఉన్నా దుర్మూల్యం అనే అంటారు అన్యాయమయిన వెల అన్నమాట

దుర్గతుడు అంటే పేదవాడు ఇక్కడ 'దుర్'కు అసంపత్తి అని అర్థం దుర్గతుడు అంటే సంపత్తిలేనివాడు

దురితం అంటేపాపం నిందితమయిన నడత కలిగినది దుర్వర్ణం అంటే బంగారం కంటే నికృష్టమైన వర్ణం కలిగినది ఇక్కడ దుర్వర్ణం అంటే వెండి

దుర్, దుస్ ఒకటి కంటే ఎక్కువ అర్థాలలో కూడా చేరతాయి. ఉదాహరణకు దుర్వాదం అంటే అపవాదం అని ఒక అర్థం చెడ్డవాదం అని మరొక అర్థం చెడ్డవాదం అంటే అశాస్త్రీయ మయిన వాదం అన్నమాట దుర్మేధసుడు అంటే మందబుద్ధి కలవాడని ఒక అర్థం దుష్టబుద్ధి కలవాడని మరొక అర్థం దుర్విద్యుడు అంటే దుష్టమయిన విద్య కలవాడు అనీ, విద్యలేనివాడు అనీ అర్థాలు దుర్మనస్కుడు అంటే వ్యాకులమయిన మనస్సు కలిగినవాడు, చెడ్డ మనసు కలిగిన వాడు అని అర్థాలు దుర్గతి అంటే దౌర్భాగ్యం అనీ, దారిద్ర్యం అనీ అర్థాలు దురుత్తరం అంటే దాటరానిది అని అర్థం చెడ్డ ఉత్తరం అని కూడా అర్థం దురుక్తం అంటే పరుషోక్తి అనీ, చెడ్డమాట అనీ అర్థాలు

☆

# విచక్షణ - విచారణ

జయ విజయులు అనేవాళ్ళు విష్ణువు ద్వారపాలకులు శాపంవల్ల వీళ్ళే రావణ కుంభకర్ణులూ హిరణ్యాక్ష హిరణ్య కశిపులూ వగయిరాగా జన్మనెత్తడమూ విష్ణువు అవతారాల చేతిలో మృతి పొంది వైకుంఠం చేరడమూ అందరికీ తెలిసిందే జయం అంటే గెలుపు జయుడు అంటే గెలుపు పొందినవాడు జయించేవాడు విజయుడు అన్నమాటలో జయ శబ్దానికి ముందు 'వి' వచ్చి చేరింది దీనికి విశేషమయిన జయం అని అర్థం అంటే మిక్కిలి జయం, గొప్ప జయం అని అర్థం విజయుడు అంటే గొప్ప జయం కలిగినవాడు అందుకే అర్జునుడు విజయుడు చేమకూర వేంకటకవి విజయవిలాసం లో విజయుడు అర్జునుడే కదా వి' ఉపసర్గచేరి సంస్కృతంలో కొన్ని వందల మాటలు ఏర్పడతాయి ఈ మాటల్లో ఎన్నో తెలుగులోనూ వాడుకలో ఉన్నాయి 'వి ఉపసర్గ కూడా తక్కిన ఉపసర్గల లాగానే కొన్ని అర్థభేదాలతో వస్తుంది అంటే ఈ ఉపసర్గ చేరినప్పుడు ఒకే మాటకు ఒకటికంటే మించిన అర్థాలూ రావచ్చు ఒక మాటతో కలిపితే ఒక అర్థమూ మరో మాటతో కలిపితే మరో అర్థమూ రావచ్చు

వి ఉపసర్గ చేరినప్పుడు కలిగే ప్రధానమైన అర్థాలలో మిక్కిలి, అతిశయం, ఎక్కువ అన్న అర్థం ఒకటి కంపం అంటే కదలిక వికంపం అంటే మిక్కిలి కదలిక చంచలం వికంపం అంటే ఒణికేది అని కూడా అర్థం కరాళం అంటే భయంకరం కరాళ వక్త్రుడు అంటే భయంకరమయిన నోరు కలిగినవాడు కరాళానికి వి' చేరిస్తే వికరాళం అవుతుంది అంటే మిక్కిలి భయంకరమయినదని అర్థం

చలం చలనం అంటే కదలడం అచలం అంటే కొండకదా కదలనిది అని అర్థం అదే విచలం, విచలనం అంటే మిక్కిలి కదలిక ఆయన విచలిత హృదయుడు అంటాం అంటే బాగా చలించిన గుండె కలిగినవాడు కలత చెందినవాడు

క్లిన్నం అంటే తడిసినది విక్లిన్నం అంటే మిక్కిలి తడిసినది అట్లాగే క్లిష్టం అంటే బాధింపబడింది విక్లిష్టం అంటే మిక్కిలి బాధింపబడింది

వికాసం అన్నా వికసనం అన్నా విప్పారడం, విరియడం వృద్ధి అనికూడా అర్థం వ్యాప్తి అనీ చెప్పవచ్చు వికసితం అంటే వికసించినది వికస్వరం అంటే వికసించే స్వభావం కలిగినది

విక్రమం అంటే అడుగు, అంగ విక్రమణం అంటే విష్ణువు అంగ 'క్రము అనే ధాతువుకు పాదవిక్షేపం, అడుగుపెట్టడం అని అర్థం విష్ణువు త్రివిక్రముడు మూడు అంగలు వేసినవాడు మూడు అడుగులతో ముల్లోకాలనూ ఆక్రమించిన వాడు విక్రమం అంటే పరాక్రమమనీ అర్థం విక్రముడు అన్నా విష్ణువనే అర్థం విక్రమాదిత్యుడు, విక్రమార్కుడు అని భట్టి విక్రమార్క కథలలో సుప్రసిద్ధుడయిన ఉజ్జయినీ రాజు తెలుగులో జక్కన 'విక్రమార్క చరిత్రము' అనే కావ్యం రాశాడు ఈ కావ్యంలో ఇతడే నాయకుడు విక్రమాదిత్యుణ్ణి కూడా విక్రముడు అంటారు ఈ 'క్రము' దాతువు నుండే క్రాంతి అన్న మాట కూడా విక్రాంతం అంటే దాటబడినదని అర్థం ఆక్రమించినది అని అర్థం గెలిచినది, బలమైనది అన్న అర్థాలూ ఉన్నాయి అందువల్ల విక్రాంతుడు అంటే వీరుడు, యోధుడు అని అర్థం విక్రాంతి అంటే అడుగువేయడం, పరాక్రమం గుర్రం నడకను కూడా విక్రాంతి అంటారు

గూఢం అంటే దాచబడినది, రహస్యం విగూఢం అన్నా రహస్యమే ఘాతం అంటే

...ం ఘాతుకం అనివాడుతూ ఉంటాం విఘాతం అంటే నాశనం అయితే తెలుగులో ఘాతం అన్న మాటను అడ్డంకి అన్న అర్థంలో ఎక్కువగా వాడుతున్నాం

ఘాతం అంటే దెబ్బ అన్న అర్థం కూడా ఉంది ఈ అర్థంలో విఘాతం అంటే పెద్ద దెబ్బ

విచక్షణుడు అంటే సూక్ష్మదృష్టి గల వాడు, దూరదృష్టి కలవాడు అని అర్థం నీతి విచక్షణుడు అని ప్రయోగం ఉంది పండితుడు, విద్వాంసుడు బుద్ధిమంతుడు, వివేకం కలిగినవాడు, ...కి అని అర్థం విచక్షణ శబ్దానికి నేర్పు, పాండిత్యం అని అర్థం చెప్పుకోవాలి విచక్షణ అనే మాటకు విశేషంగా చెప్పడం అని మరొక అర్థం ఈ అర్థంలోనే ఈ మాటను ఎక్కువగా వాడుతున్నాం జాతి విచక్షణ అన్నప్పుడు జాతిని వేరుచేసి చెప్పడం విచక్షించు అంటే విమర్శించు అని ...ం ఇంగ్లీషులో డిస్క్రిమినేషన్ అన్నమాటకు సమానార్థకంగా విచక్షణను వాడుతున్నాం డిస్క్రిమినేషన్ అన్నా వివేకం అనే అర్థం ఒక వ్యక్తి, ఒక జాతి, ఒక వర్గం వీటికి వ్యతిరేకంగా నీ వివేకాన్ని ఉపయోగించడం దక్షిణాఫ్రికాలో అపార్తీడ్ అంటారు నల్లవాళ్ళను వేరుగా చూడడం, వేరుచేసి చూడడం, దీన్ని జాతి విచక్షణవాదం అంటున్నాం ఈ అర్థంలో వివక్ష అనే మాటను కూడా వాడుతున్నారు వివక్ష అంటే చెప్పాలనే కోరిక విజిగీషలాంటిది జిగీష అన్నా విజిగీష అన్నా గెలవాలనే కోరిక వర్ణ వివక్షలాంటి ప్రయోగాలు అర్థవంతమయినవి కావు వివక్షించడం అంటే చెప్పాలని కోరుకోవడం వివక్షితం అంటే మనం ఏం చెప్పాలనుకున్నామో అది ఉద్దేశం అన్నమాట వివక్షువు అంటే మాట్లాడాలన్న కోరికున్నవాడు. మాట్లాడడానికి సిద్ధంగా ఉన్నవాడు విచక్షణకు బదులుగా వివక్షను వాడడం సరయింది కాదు విచక్షణరహితంగా అన్నప్పుడు వివేకరహితంగా అని అర్థం ఈ మాటలను వాడడంలోనూ విచక్షణ చూపించాలి

విచారం అన్నమాటను బాధ, దుఃఖం అన్న అర్థాలలో వాడుతున్నాం కాని చర ధాతువుకు గతి అని అర్థం మరో చర ధాతువుకు సంశయం అని అర్థం ఈ సంశయమన్న అర్థంలోనే విచారం వంటి మాటలు ఏర్పడ్డాయి విచారించడం అంటే పరీక్షించడం, పరిశోధించడం, సంశయనివృత్తికోసం ఈ పరిశీలన అందువల్ల విచారం అనే మాటకు పరీక్ష, పరిశోధన, సత్యం తెలుసుకోవడానికి చేసే పరిశీలన అని అర్థం ఆలోచన, వివేకం, సందేహం అన్న అర్థాలూ ఉన్నాయి దూరదృష్టి అన్న అర్థం కూడా ఉంది విచారణ అన్నా విచారమే విచారకుడు అంటే విచారించేవాడు, న్యాయాధికారి విచారణీయం అంటే విచారింపదగింది విచారశీలుడు అంటే వివేకి విచారించు అన్నప్పుడు పరిశీలించడం అనీ, ఆలోచించడం అనీ, పరామర్శించడం అనీ, సంతాపించడం అనీ అర్థాలున్నాయి పరామర్శించడం అన్న అర్థంలో ఈ మాట కొన్ని ప్రాంతాల లోనే వాడుకలో ఉంది విచారపడు అన్నప్పుడు మాత్రం దుఃఖపడు, సంతాపం చెందు అని అర్థం ఆ విధంగా తెలుగులో విచారం అన్న మాటకు సంతాపం, దుఃఖం అన్న అర్థం ఏర్పడింది

జ్ఞానం అంటే తెలివి విజ్ఞానం అన్నా తెలివే అయితే లౌకిక జ్ఞానం విజ్ఞానంగా వ్యవహృతం జ్ఞానం అంటే బ్రహ్మజ్ఞానం విజ్ఞానం అంటే దానికి భిన్నమయిన జ్ఞానం ఈ అర్థంలోనే విజ్ఞానశాస్త్రం, విజ్ఞాన శాస్త్రజ్ఞుడు, విజ్ఞాని, వైజ్ఞానికుడు మొదలయిన మాటలు ఏర్పడ్డాయి జ్ఞాపన అంటే తెలియజేయడం. విజ్ఞాపన, విజ్ఞప్తి అంటే మనవి, విన్నపం

దళనం అంటే ఛేదనం విదళనం అంటే మిక్కిలి ఛేదించడం విదారణం అన్నా ఛేదనమే విదూరం అంటే మిక్కిలి దూరం వినీతి, వినమ్రం అంటే అడకువ విమోచన, విముక్తి, విమోక్షణ ఒకే అర్థంలో వాడుకలో ఉన్నాయి ☆

# వినియోగం - విమర్శ

వినియోగం అన్నమాటను ఉపయోగం ప్రయోజనం అనే అర్థంలో ఎక్కువగా వాడుతున్నాం. వినియోగదారుల సంఘాలున్నాయి కదా ఒక వస్తువు లేదా సేవను ఉపయోగించుకొనేవాళ్ళు వినియోగదారులు వినియోగం అన్నమాటకు విడదీయడం, ఉద్యోగం, విఘ్నం, అన్న అర్థాలు కూడా ఉన్నాయి రాజులవద్ద గురువు, మహాప్రధాని, మాండలికులు, సామంతులు సేనాపతి మొదలయిన డెబ్బైరెండు వినియోగాల వారుండేవారట ఇక్కడ వినియోగం అన్నమాటకు ఆశ్రితుడు పరివారజనం అని అర్థం

తిక్కనగారు భారతాన్ని తెనుగుబాస వినిర్మింప దివురుట' అన్నారు వినిర్మించడం అంటే సృజించడం భారతాన్ని తెలుగులో నిర్మించడం సృజించడం తిక్కనగారు చేసినపని

వినాశం/వినాశనం అంటే పూర్తిగా నశించడం వినాశనుడు అంటే లయకారుడయిన శివుడు వినిహతం అంటే మిక్కిలి కొట్టబడినది, చంపబడినది అని అర్థం పూర్తిగా జయింపబడినది అని కూడా అర్థం ఉత్పాతం అనే అర్థం కూడా ఉంది

నూతనం అంటే కొత్తది నూత్న/నూతన విశేషణాలుగా వాడతాం ఈ మాటకు వి ఉపసర్గను చేర్చి వినూత్న అని విశేషణంగా వాడుతున్నాం నూత్న వినూత్న పరికరాలు వంటి ప్రయోగాలలో నూత్న, వినూత్న రెండింటినీ విశేషణాలుగా వాడుతున్నాం నూత్నం అంటేనే అభినవం వినూత్నం అంటే మరింత కొత్తది

విన్యాసం అంటే ఉంచడం, కూర్పు, రచన అని అర్థం నాట్యంలో హస్త విన్యాసం, పాద విన్యాసం అని వాడతాం సమూహం, నివాసస్థలం అన్న అర్థాలు కూడా ఉన్నాయి విపరిణామం అంటే మారడం విపర్యస్తం అంటే తారుమారైనది విరుద్ధమైనది విపర్యాసం అంటే మార్పు, ప్రతికూలత, వినిమయం, తప్పు

విబుధుడు అంటే పండితుడు దేవత అనీ, చంద్రుడనీ కూడా అర్థం విబోధం అంటే మెలకువ, తెలివి విభక్తం అంటే భాగాలుగా చేయబడింది అని, పంచబడింది అనీ అర్థం విభక్త కుటుంబం అంటే భాగాలు పంచుకొని విడిపోయిన కుటుంబం విభక్తి అంటే విడదీయడం దాయభాగం వ్యాకరణంలో ప్రాతిపదికాదులకు చేరే ప్రత్యయం విభక్తి పంచుకుంటారు కాబట్టి సోదరులను విభక్తులు అనవచ్చు విభజనం అంటే విభజించడం వేరుకావడం విభాగం అంటే భాగం, పంపకం, అంశం, ముక్క

మత్తుడు అంటే మదించినవాడు విమత్తుడు అంటే బాగా మత్తెక్కినవాడు, మదించినవాడు విమర్దనం అంటే చంపడం, పొడి చేయడం

విమర్శ అనే మాటను చాలా ఎక్కువగా వాడుతున్నాం విమర్శ అంటే పరిశీలన, సమీక్షణం యుక్తియుక్తంగా వాదించడం, సాహిత్య రంగంలో ఈ అర్థమే ప్రచారంలో ఉన్నా వ్యవహారంలో తప్పు పట్టడం, తిట్టడం అన్న అర్థంలో స్థిరపడిపోయింది ఆయన తీవ్రంగా విమర్శించారు అన్నప్పుడు పరిశీలన వంటి అర్థానికి అవకాశం లేదు నిందించడమనే అర్థం

విముగ్ధుడు, విమూఢుడు అన్న మాటలకు బొత్తిగా తెలివిలేనివాడని అర్థం. వ్యాకులత చెందినవాడని కూడా అర్థం విమోహం మిక్కిలి మోహం

విరచన అంటే ఏర్పాటు, కల్పన, సృజించడం, గ్రంధ రచన నన్నయ విరచితం అంటే నన్నయచేత రచింపబడింది విలక్షణం అంటే విశేష లక్షణాలు కలిగినటువంటిది, అసాధారణ మయినది భిన్నమయినది

వివాహంలో వహ' ధాతువు పొందడం అని అర్థం విశేషంగా పొందబడేది వివాహం అంటె పెండ్లి పూర్వం ఇది ఎనిమిది రకాలు బ్రాహ్మ్యం, దైవం, ఆర్షం, ప్రాజాపత్యం, ఆసురం, గాంధర్వం, రాక్షసం, పైశాచం దాదాపు ఈ విధానాలన్నీ న్యాయసమ్మతంగానో, అసమ్మతంగానో ఎంతో కొంత జరుగుతూనే ఉన్నాయి

వికల్పం అంటే సంశయం కలగడం, కలగకపోవడం వ్యాకరణంలో ఎక్కువగా వాడే మాట వికల్పం, వైకల్పికం, విభాష, వైభాషికం అన్నవి వ్యాకరణంలో ఎక్కువగా కనిపిస్తాయి ఒక వ్యాకరణ సూత్రం వర్తించిన రూపమూ, వర్తించని రూపమూ రెండూ ఉండేటట్లయితే ఆ సూత్రం వికల్పంగా వర్తించినట్లు వికల్పం అంటే కల్పన అని కూడా అర్థం మరో వికల్పం లేదా అన్నప్పుడు విధం పద్ధతి అని అర్థం ఊహ, భావన అనికూడా అనవచ్చు వికారం అంటే మార్పు ఇదే అర్థంలో వికృతం, విరూపం అన్న మాటలను కూడా వాడవచ్చు ప్రకృతి వికృతు లున్నాయి కదా ప్రకృతి సహజం, మూలం వికృతి మార్పు పొందిన రూపం తెలుగు వ్యాకర ణాలలో ప్రకృతిని తత్సమం అన్న అర్థంలోనూ వికృతిని తద్భవం అన్న అర్థంలోనూ వాడతారు సంస్కృతం నుండి తెలుగు పుట్టిందని భావించేవాళ్ళు తెలుగునే వికృతి అనడమూ ఉంది

వికిరణం/వికీర్ణం అంటే వ్యాప్తి అని అర్థం వితతం అంటే విస్తరించినది అని అర్థం విగ ళితం అంటే చెదరినది విక్షేపం అంటే తొలగించడం. విక్షిప్తం అంటే తొలగించబడినది విత రణం అంటే దానం తరణం అంటే దాటడం వితరణం నరకాన్ని దాటిస్తుంది కాబట్టి వితరణం వితీర్ణి అన్నా వితరణమే

విధురం అంటే కార్యభారం లేనిది భయం, అపాయం, హాని అనికూడా అర్థాలున్నాయి విధురుడు అంటే భార్య పోయినవాడు

వికర్షణ అంటే దూరంగా లాగడం ఆకర్షణకు వ్యతిరేకం వికృష్టం అంటే దూరంగా లాగబడింది విప్రకర్ష అంటే దూరం

విప్రలంభం, విప్రయోగం, వియోగం, విరహం సమానార్థకాలు ఎడబాటు అని అర్థం శృంగారం సంయోగం వియోగం అని రెండు రకాలు ఈ వియోగ శృంగారాన్నే విప్రలంభ శృంగారం, విప్రయోగ శృంగారం అనికూడా అనవచ్చు ప్రలంభం అంటే లాభం పొందడం విప్రలంభం అంటే వంచించడం అనికూడా అర్థం కలహం అనికూడా అర్థం ఉంది విప్రలబ్ధ అన్నప్పుడు ఈ వంచించడమన్న అర్థమే ఉంది ఎనిమిది రకాల శృంగార నాయికల్లో విప్రలబ్ధ ఒకతి ఒక సంకేతాన్ని ఏర్పరచి వస్తానని మాట ఇచ్చిన ప్రియుడు రాకపోవడం వల్ల బాధపడే నాయిక. ప్రియునిచేత వంచింపబడిన నాయిక విప్రలబ్ధ ప్రయోగం అన్న మాటకు సంయోగం, కూడిక అన్న అర్థం ఉంది విప్రయోగం దానికి వ్యతిరేకం ఎడబాటు యోగం అంటే కూడిక వియోగం అంటే ఎడబాటు రహం అంటే కూడిక. విరహం అంటే ఎడబాటు

విక్షతం అంటే గాయపరచబడింది విక్షోభం అంటే కలవరపాటు కల్లోలం, గందరగోళ పరిస్థితి అన్న అర్థంలో విక్షోభం అన్నమాట ప్రచురంగా ఉంది మానసిక విక్షోభం అన్నప్పుడు

కలత అని అర్థం విచికిత్స అంటే సంశయం

విచ్ఛేదం, విచ్ఛేదనం నరకడం విచ్ఛిన్నం అంటే నరకబడినది విచ్ఛిత్తి అంటే నరకడ... ...పజించడం అనికూడా అర్థం కనపడకపోవడం సమాప్తి చెందడం అన్న అర్థమూ ఉం... విచ్ఛేదం అంటే విఘాతం, ఆటంకం అన్న అర్థం కూడా ఉంది వంశం అంతం కావడం, ఇం... టితో ఆగిపోవడాన్ని కూడా విచ్ఛేదం అంటారు విచ్యుతం అంటే భ్రష్టం విఘ్నం అంటే కార్య... చెడడం ఆటంకం విఘ్న నాయకుడు, విఘ్నేశ్వరుడు అని గణపతికి పేర్లు విఖండితం అంటే ఖండింపబడింది విఖ్యాతి అంటే గొప్ప కీర్తి విచర్చితం అంటే పూయబడింది విజృంభణ అంటే వ్యాపించడం చెలరేగడం విత్రాసం అంటే భయం విద్వేషం అంటె పగ విజితుడు అంటే ఓడిపోయినవాడు విజితాత్ముడు అంటే తనను తాను లోబరచుకొన్నవాడు విమాత అంటే సవతి తల్లి విజాతి అంటే వేరే జాతి విదేశం అంటే అన్యదేశం వీటినుండే విజాతీయుడు, విదేశీయుడు అన్న మాటలు వచ్చాయి

☆

# విగ్రహం - వివాహం

'వి' ఉపసర్గకు వ్యతిరేకార్థం కూడా ఉంది ఈ ఉపసర్గను చేర్చినప్పుడు వ్యతిరేకార్థం ఏర్పడు తుంది విజనం అంటేజనం లేనటువంటిది విజన పథం అంటే మనుష్యులు లేని త్రోవ వికచం అంటె వెంట్రుకలు లేనిది ఇక్కడ కచ ధాతువుకు బంధనం అని అర్థం క్రయం అంటే కొనడం విక్రయం అంటే అమ్మడం క్రయ విక్రయాలు అంటే కొనడం, అమ్మడం విక్రయి అన్నా విక్రయికుడు అన్నా వ్యాపారి విక్రేత అంటే అమ్మేవాడు పణ ధాతువుకు వ్యవహారం అని అర్థం ద్రవ్య వినిమయం విపణం అంటే అమ్మడం విపణి అంటే అంగడి, అంగడి వీధి

విగుణం అంటే గుణాలు లేనటువంటిది

విగ్రహం అంటే శరీరం అని అర్థం విశేషంగా ఆత్మచేత గ్రహింపబడింది కాబట్టి విగ్రహం యుద్ధంలో శత్రువులను పట్టుకుంటారు కాబట్టి విగ్రహం అంటే యుద్ధం శత్రువుకు యుద్ధ రూపమైన అపకారం విగ్రహం పంచతంత్రంలో ఇది ఒకటి మిత్రలాభం, మిత్రభేదం, సంధి - విగ్రహం, లబ్ధనాశం, అసంప్రేక్ష్య కారిత్వం అన్నవి ఈ అయిదు సంస్కృతంలో విష్ణు శర్మ రచించిన పంచతంత్రం ప్రపంచ ప్రసిద్ధమై అనేక భాషలలోకి అనువదితమయింది తెలుగులో దూబగుంట నారాయణకవి పంచతంత్రము' పద్యకావ్యం చిన్నయసూరి వచనంలో నీతిచంద్రికగా మిత్రలాభ, మిత్రభేదాలను రచించాడు చిన్నయసూరి విశిష్టమయిన శైలివల్ల తెలుగులో ఇది విస్తృత ప్రచారం పొందింది సంధి విగ్రహాలు ఒకే తంత్రంగా పంచతంత్రంలో కనిపిస్తాయి రాజాస్థానాలలో సంధి విగ్రహి అనే అధికారి ఒకడుండేవాడు రాజనీతికి సంబం ధించి ఆరుగుణాలు పేర్కొంటారు అవి (1) సంధి, (2) విగ్రహం, (3) యానం, (4) ఆసనం, (5) ద్వైధం, (6) ఆశ్రయం వీటిలో విగ్రహం యుద్ధమే ఇది మూడు రకాలు (1) ప్రకాశ యుద్ధం (2) కూట యుద్ధం, (3) పార్ష్ణి యుద్ధం ప్రకాశ యుద్ధమంటే ఎదురుపడి చేసే యుద్ధం కూట యుద్ధం అంటే కపటయుద్ధం పార్ష్ణి అంటే మడమ పార్ష్ణియుద్ధం అంటే మడమ తొక్కే యుద్ధం వెనుక నుండి ముట్టడించడం

విస్తృతి, విస్తారం, విగ్రహం, వ్యాసం అన్నవి విరివి అన్న అర్థంలో సమానార్థకాలు విస్తృతి విస్తారాలలో స్తృఞ్ అనే ధాతువుకు ఆచ్ఛాదనమని అర్థం విశేషంగా ఆచ్ఛాదించడం విగ్రహం అంటే విశేషంగా గ్రహించడం వ్యాసం అంటే అనేక రకాలుగా ఉండడం ఆస అన్న ధాతువుకు ఉపవేశనం ఉండడం అని అర్థం ఆ విధంగా ఈ మాటలకు వ్యాప్తి, విరివి అని అర్థం ఏర్పడింది విస్తార పదమే శబ్ద సంబంధమయినప్పుడు విస్తరం అవుతుంది

ఘటనం అంటే కూర్చడం విఘటనం అంటే విడగొట్టడం విఘట్టనం అన్నా ఇదే అర్థం వికర్మం అంటే అన్యాయకార్యం అనీ, నిషిద్ధ కార్యమనీ అర్థం వికల్మషం అంటే కల్మషం లేక పోవడం విచక్షుడు అంటే కళ్ళు లేనివాడు, గుడ్డివాడు విచేతనం అంటేచేతనం లేనిది జర అంటే ముసలితనం విజరం అంటే ముసలితనం లేనిది

వితంతువు అంటే తంతువు లేనటువంటిది ఇక్కడ తంతువు అంటే మంగళసూత్రం తంతువు అంటే నూలు నూలు అన్న ఈ సామాన్యార్థం ఉన్న తంతువుకు మంగళసూత్రమన్న విశిష్టార్థం ఏర్పడడం వల్ల వితంతువు అంటే విధవ అన్న అర్థం ఏర్పడింది సూత్రం తెగింది, తాడు తెగింది వంటి ప్రయోగాల అర్థం అందరికీ తెలిసిందే ఉత్తర భారతదేశంలో ఈ వితంతు

కష్టం వాడుకలో లేకపోవచ్చు వాళ్ళకు మంగళసూత్రం లేదు కదా విధవ అంటే ధవుడు/భర్త లేని స్త్రీ

వితంత్ర అంటె తీగలు లేనిది అయితే తెలుగులో నిస్తంత్రి అన్న మాటకున్న ప్రచారం దీనికి లేదు తథ్యం అంటే సత్యం వితథ్యం అంటే అసత్యం వితథం అన్నా అసత్యమే వినాయకుడు అంటే గణపతి, బుద్ధుడు, గరుత్మంతుడు, గురువు అని అర్థాలు పోగొట్టేవాడు, శిక్షించేవాడు, హితాన్ని బోధించేవాడు

వరణం అంటే ఆచ్ఛాదన, కప్పు అని అర్థం వివరణం అంటే ఆచ్ఛాదన లేకుండా, కప్పు లేకుండా విశదం అని అర్థం వివరం అన్నా వివరణమనే అర్థం వివరంగా చెప్పమన్నప్పుడు అర్థమిదే వివరం అంటే రంధ్రమన్న మరో అర్థం కూడా ఉంది

విపక్షం అన్నమాట ఇటీవల కొంత వాడుకలోకి వచ్చింది తెలుగులో ప్రతిపక్షం అన్నమాటకున్న ప్రచారం దీనికి లేదు ప్రతికూలమైన వర్గం అని అర్థం

పథం అంటే త్రోవ విపథం అంటే చెడ్డత్రోవ, తప్పుత్రోవ విప్రయాణం అంటే పారిపోవడమని అర్థం

విప్రతిపత్తి అంటే పరస్పరం విరోధం విప్రియం అయిష్టం విఫలం అంటే వ్యర్థం వ్యర్థం అంటే అర్థంలేనిది ఈ మాటల్లో 'వి' వ్యతిరేకార్థాన్నిస్తుంది విమలం, వియోగం, విరక్తి వంటి మాటలిటువంటివే విమలం అంటే మాలిన్యం లేనిది, స్వచ్ఛమైనది, తెల్లనైనది యోగం అంటే కలయిక వియోగం అంటే ఎడబాటు విరక్తి అంటే రక్తి లేకపోవడం విరాగం అన్నా ఇదే అర్థం

విమానం అంటే అనేకార్థాలున్నాయి మానం అంటే గౌరవం కాబట్టి విమానం అంటే అగౌరవం, అవమానం అన్న అర్థం కూడా ఏర్పడింది మానం అంటే కొలత అన్న అర్థమూ ఉంది అందువల్ల విమానం అంటే పరిమాణం అన్న అర్థం ఏర్పడింది గమనంలో పక్షితో పోలిక ఉంది కాబట్టి విమానం అంటే దేవతలు ఆకాశంలో విహరించే వాహనం ఆ మాటనే ఇప్పుడు విమానంగా వాడుతున్నాం వాహనం కాబట్టి దీనికి గుర్రమన్న అర్థమూ ఏర్పడింది ఏడంతస్తుల మేడను కూడా విమానం అంటారు విమానం అంటే దేశాంతరవాసం వివాసితుడు అంటే దేశ భ్రష్టుడు

విశేషంగా వహించడం వివాహం. ఈ వివాహం బ్రాహ్మ్యం, దైవం, ఆర్షం, ప్రాజాపత్యం, ఆసురం, గాంధర్వం, రాక్షసం, పైశాచం అని ఎనిమిది రకాలు పురాణాల్లో ఈ అన్ని రకాల వివాహాలూ కనిపిస్తాయి అయితే వీటిలో అన్నీ ఆనాడైనా ప్రచురంగా ఉన్నవికావు చివరి నాలుగు రకాల వివాహాలూ మంచివి కావని మనుస్మృతి నాడే చెప్పారు పైశాచం అధమం అని కూడా చెప్పారు కన్యాశుల్కం పిల్లను అమ్ముకోవడమేననీ, అది పాపమనీ, ఈ పాపం చేసినవారు అధోగతి పాలవుతారనీ మనుస్మృతి చెప్పింది విలోమం అనులోమానికి వ్యతిరేకం విపరీతం, విపర్యయం, విపర్యాయం, విపర్యాసం వీటన్నిటికీ తలక్రిందులు అని అర్థం వ్యతిరేకంలోనూ 'వి' ఉపసర్గ ఉంది విదూషకుడు అంటే మలినంగా చేసేవాడు, దూషించేవాడు, చమత్కారి సంస్కృత నాటకాలలో ఉండే పాత్ర తన రూపం, వేషం, ప్రవర్తనల ద్వారా నవ్వు పుట్టించే పాత్ర ఇది తిండి యావ చూపిస్తూ ఉంటాడు

విపంచి అంటే స్వరాలను విస్తరింపజేసేది విచిత్రం, వివిధం అన్నప్పుడు 'వి' ఉపసర్గకు నానా అని అర్థం వివిధం అంటే నానా విధాలు



# ఆచంద్ర తారార్కం

పూర్వం శాసనాలు వేసిన రాజులు ఆ శాసనాల ద్వారా తాము చేసిన దానం ఆ చంద్ర తారార్కం నిలిచి ఉండాలని కోరుకునేవారు ఈ ఆకాంక్షను శాసనంలో వ్యక్తంచేసేవారు రాజులూ, కవులూ, కళాకారులూ ఆచంద్ర తారార్కమయిన కీర్తిని పొందాలని కాంక్షించే వారు కీర్తి కాంక్ష ఏకాలంలోనూ ఉండేదే ఆచంద్ర తారార్కం అంటే చంద్రుడూ, నక్షత్రాలూ, సూర్యుడూ ఉండేంత వరకూ అని అర్థం సూర్యచంద్రులూ, నక్షత్రాలూ శాశ్వతంగా ఉండేవని నమ్మకం కాబట్టి తాము చేసిన కార్యం శాశ్వతంగా నిలిచిపోవాలని వారి భావం ఆరవి సుధాకర తారకం, ఆఖరకర జలజారి తారకం మొదలయిన విధంగా సూర్యచంద్రాదులకు పర్యాయపదాలను కూడా వాడ వచ్చు ఆచంద్రార్కం అని కేవలం సూర్యచంద్రులను, ఆచంద్ర తారకం అని చంద్రుణ్ణి నక్షత్రా లనూ, ఆరవితారకం అని కేవలం సూర్యుణ్ణి, నక్షత్రాలనూ కూడా పేర్కొంటారు ఈ మాటలలో మొదట ఉన్న 'ఆ' – 'ఆఙ్' అనే ఉపసర్గ ఇక్కడ పర్యంతం, హద్దు అని ఈ ఉపసర్గకు అర్థం ఆకల్పం అంటే కల్పం ఉన్నంతవరకు, కల్ప పర్యంతం అని అర్థం ఆమరణాంతం అంటే మరణం వరకూ అని అర్థం ఆమరణ నిరాహారదీక్ష బాగా వాడుకలో ఉన్న ప్రయోగం

ఆజన్మం అంటే పుట్టుక నుండీ అని అర్థం ఆజన్మ బ్రహ్మచారి అంటే పుట్టిన నాటినుండి బ్రహ్మచారిగా ఉన్నవాడు ఆపాదం అంటే పాదాలు మొదలుకొని అని అర్థం ఆపాద మస్తకం అంటే పాదాల నుండి మస్తకం వరకు అని అర్థం ఆమూలం అంటే మూలంనుండీ అని అర్థం ఆమూలాగ్రం అంటే మొదటినుండి చివరిదాకా అని పూర్వం దినపత్రిక అంతా చదివానన డానికి ఆంధ్రపత్రిక నుండి అమృతాంజనం దాకా అనేవాళ్ళు. ఆంధ్రపత్రిక అన్న పేరుతో మొదలుపెట్టి అమృతాంజనం అడ్వర్టయిజుమెంటు దాకా ఏమీ వదలకుండా అక్షరాక్షరం చది వారన్నమాట ఆమూలాగ్రం సమగ్రంగా పరిశీలించారంటాం ఆబాల గోపాలం వచ్చారు అన్నప్పుడు పిల్లల నుండి గోపాలుర దాకా అందరూనని అర్థం

శాసనాలలో ఈ 'ఆ' లేకుండానే శశితారకంబుగా అనీ, దినేశ సుధాకర తారకంబుగా అనీ, వారి జాప్త చంద్రతారముగా అనీ కూడా ప్రయోగించారు ఆగర్భ శ్రీమంతుడు, ఆగర్భ శత్రువు వంటి ప్రయోగాలెన్నో ఉన్నాయి గర్భంలో ఉన్నప్పటి నుండీ, పుట్టకముందు నుండీ అని అర్థం

తాత్కాలికం అంటే ఆ సమయానికి మాత్రమే సంబంధించింది ఆకాలికం అంటే పుట్టిన వెంటనే నశించేది ఇక్కడ 'ఆఙ్' ఉపసర్గకు కొంచెం అని అర్థం ఆకులం అన్నమాటకు ఇంచు కంత కూడి ఉండేది అని అర్థం వ్యాకులం అన్న అర్థం కూడా ఉంది వ్యాకులంలో కూడా వి+ ఆకులం అని 'వి' అనే ఉపసర్గ చేరింది 'ఆఙ్' ఉపసర్గకు మొత్తం, అంతటా అన్న అర్థం కూడా ఉంది ఆ అర్థంలో ఆకులం అంటే వ్యాప్తి అని అర్థం ఆపక్వం అంటే కొంచెం ఉడికినది ఆపాకం అన్నా అదే అర్థం

మొత్తం, అంతటా అన్న అర్థంలో 'ఆఙ్'కు చాలా ప్రయోగాలున్నాయి ఆకరం అన్న మాటలో ఇదే అర్థం ఆకరం అంటే గని, సమూహం, నెలవు అని అర్థాలు రత్నాకరం అంటే రత్నాలకు ఆకరమయినది, సముద్రం శబ్ద రత్నాకరం అంటే శబ్దసాగరం. తెలుగు భాషకున్న

అకారాది నిఘంటువులలో ముఖ్యమైనది శబ్ద రత్నాకరం దీన్ని బహుజనపల్లి సీతారామాచార్యులుగారు రచించారు ఈయనే ప్రౌఢవ్యాకరణం కూడా రచించారు

ఆకాశం అంటే సూర్యచంద్రాదులు ప్రకాశించేది దేనియందు సూర్యచంద్రాదులు ప్రకాశిస్తారో అది ఆకాశం కాశృధాతువుకు కాంతి, వెలుగు అని అర్థం ఆజ్ కు అంతటా అని అర్థం ఆకీర్ణం అంటే వ్యాప్తం, చిమ్మబడినది అని అర్థం జనాకీర్ణం అంటే జనంతో నిండి ఉన్నది అంతటా జనం ఉన్నది అని అర్థం

ఆఖువు అంటే అంతటా తవ్వేది ఎలుక అని అర్థం కన్నాలువేసి దొంగతనాలు చేసే కాలంలో దొంగకు కూడా ఆఖువు అన్న పేరుండేది

ఆచ్ఛేదనం అంటే పూర్తిగా ఛేదించడం అని అర్థం ఆచ్ఛిన్నం అంటే పూర్తిగా ఛేదించబడింది

ఆతపం అంటే ఎండ అంతటా తపింపచేస్తుంది కాబట్టి ఎండకు ఆతపం అని పేరు చంద్రుడి వెన్నెలను కూడా చంద్రాతపం అని అంటారు కావ్యాల్లో విరహులను తపింపజేసేది కాబట్టి ఇది ఆతపం కావచ్చు

ఆపద అంటే అంతటా పొందబడేది ఆపత్తి, ఆపత్తు అన్నా అదే అర్థం విపత్తు అని అర్థం ఆపూరణం అంటే అంతటా నిండినది ఆపూర్ణం, ఆపూర్తి అని కూడా అనవచ్చు ఆపూరం అంటే ప్రవాహం ఆప్లావం అంటే అంతటా తడవడం స్నానమనీ, మునగడమనీ అర్థం ఆభరణం అంటే అంతటా భరింపబడేది నగ ఆభూషణం అన్నా ఆభరణమే ఆసారం అంటే అంతటా పడేది ధారాపాతంగా వర్షించేది, జడివాన

ఆజ్ ఉపసర్గకు మిక్కిలి, అధికమైన అనికూడా అర్థం ఉంది ఆకంపనం అంటే మిక్కిలి వణకడం ఆక్రందం, ఆక్రందనం అంటే బిగ్గరగా ఏడ్వడం, పెద్ద ఏడుపు జనుల ఆక్రందనాలు మిన్నుముట్టాయి వంటి ప్రయోగాలు సర్వసాధారణం ఆక్రందనం అంటే బొబ్బరింత అన్న అర్థం కూడా ఉంది దాడి చేసేముందు చేసే పెద్ద ధ్వని ఆక్రందుడు అంటే మిత్రుడు దండెత్తిపోయే రాజుకు వెనుక ఉండే శత్రువుకు వెనుక ఉన్నవాడు ఆక్రందుడు ఆక్రందికుడు అంటే ఆర్త రక్షకుడు

ఆక్రుష్టి అంటే పెద్దగా పిలవడం ఆక్రోశం, ఆక్రోశనం అన్న మాటలకు తిట్టు, నింద అని అర్థం ఉంది పెద్దగా అరవడం అనికూడా అర్థం రక్షణకోసం పెద్దగా అరవడం ఆక్రోశం, ఆక్రోశనం ఆక్రోశం, ఆక్రోశించు నామవాచకంగానూ, క్రియగానూ కూడా వాడుకలో ఉన్న మాటలు పీన అంటే బలిసిన ఆపీనం అంటే బాగా బలిసినది అని అర్థం బంధం అంటే కట్టు ఆబంధం అంటే గట్టి కట్టు ఆబద్ధం అంటే గట్టిగా కట్టబడింది

భీరుడు అంటే పిరికివాడు ఆభీరుడు అంటే మిక్కిలి పిరికివాడు

ఆఘాతం అంటే దెబ్బ విద్యుదాఘాతం అంటే ఎలక్ట్రిక్ షాక్

ఆఖం, ఆఖరం, ఆఖనం ఆఖానం అంటే గడ్డపార ఆఖనికం అంటే గడ్డపార అన్న అర్థంతోపాటు పంది, ఎలుక అన్న అర్థాలూ ఉన్నాయి ఆఖనికుడు అంటే కన్నపు దొంగ

☆

# ఆశ్రమం - ఆగ్రహం

శ్రమకు తపస్సు అని అర్థం ఆశ్రమంలో తపోనిష్ఠులవుతారు కాబట్టి ఇది ఆశ్రమం శ్రము ధాతువు ఈ ధాతువుకు తపస్సు, ఖేదం అర్థాలు భారతీయ సంప్రదాయంలో చతురాశ్రమాలు సుప్రసిద్ధం నాలుగు ఆశ్రమాలలో మొదటిది బ్రహ్మచర్యం బ్రహ్మ అంటే వేదం వేదాధ్యయన వ్రతాన్ని కూడా బ్రహ్మ అంటారు ఈ బ్రహ్మ వ్రతాన్ని ఆచరించేవాడు బ్రహ్మచారి నాలుగువిధాల బ్రహ్మచారులున్నారు గాయత్రీ బ్రహ్మచారి, ప్రాజాపత్య బ్రహ్మచారి వైదిక బ్రహ్మచారి, నైష్ఠిక బ్రహ్మచారి గృహస్థుడు అంటే గృహం కలిగినవాడు ఇక్కడ గృహం అంటే భార్య గృహస్థులు కూడా నాలుగు రకాలు వార్తా వృత్తి, శాలిన వృత్తి, యాయావరుడు, ఘోరసన్న్యాసి వనంలో ఉండే వాడు వానప్రస్థుడు వానప్రస్థులు కూడా నాలుగు రకాలు ఔదుంబరుడు, ఖేనసుడు, సంప్రక్షాళి, పౌర్ణముడు నాలుగో ఆశ్రమం భిక్షు/సన్యాసి యాచించి జీవించేవాడు ఈ సన్న్యాసి కూడా నాలుగు విధాలు కుటీచకుడు, బహూదకుడు, హంసకుడు, పరమ హంసకుడు మనిషి జీవితంలో ఇవి నాలుగు దశలు ఇదొక వ్యవస్థీకృత జీవితం

ఆముక్తం అంటే విడిచిపెట్టబడినది శ్రీకృష్ణదేవరాయల ప్రౌఢ ప్రబంధం ఆముక్తమాల్యద పెట్టుకొని విడిచిన మాలను భగవంతునికి ఇచ్చినది ఆముక్తమాల్యద గోదాదేవి తమిళంలో చూడికుడుత్తనాచ్చియార్ అంటారు

ఆభాస అంటే కాంతి, ప్రతిబింబం అన్న అర్థాలతోపాటు అవాస్తవం అన్న అర్థం కూడా ఉంది అలంకార శాస్త్రాలలో రసాభాసం గురించి ఉంటుంది శృంగార రసాభాసం, వీరరసా భాసం అన్నట్లుగా అన్ని రసాలకూ ఈ ఆభాసం ఉంటుంది ఉదాహరణకు శృంగార రసాభాసాన్ని తీసికుంటే యువతీయువకులలో ఒకరికే అనురాగం ఉండి రెండవవారికి లేకపోతే రసాభాసం అవుతుంది జంతువులు, పక్షుల శృంగారాన్ని వర్ణించడమూ, మనకు పూజనీయులయిన వారి శృంగారాన్నీ వర్ణించడమూ కూడా శృంగార రసాభాసమే అనుచితమయినదంతా రసాభాసమే ప్రస్తుతం రసాభాస అన్నమాటను గందరగోళం చెడిపోవడం అన్న అర్థంలో వాడుతున్నాం సభ అంతా రసాభాస అయిపోయింది, కార్యక్రమం రసాభాస అయింది అనడం మామూలే రసాభాస చేశారు అన్నప్పుడు పాడుచేశారు, గొడవచేశారు అని అర్థం ఆఖ్య అంటే పేరు దీనితో పిలు స్తారు కాబట్టి ఆఖ్య మనుచరిత్రలో ప్రవరాఖ్యుడున్నాడు కదా ప్రవరుడు అన్న పేరు గలవాడన్న మాట ఆఖ్యాత అంటే చెప్పేవాడు వ్యాఖ్యాతలో ఆఖ్యాతకు 'వి' ఉపసర్గ చేరింది ఈ మాటలో రెండు ఉపసర్గలున్నాయన్న మాట ఆఖ్యానం అంటే చెప్పబడేది, కథ ఆఖ్యానకం అంటే చిన్న కథ ఆఖ్యాయిక అన్నది ఒక గద్యకావ్య భేదం ఇందులో వాస్తవంగా జరిగిన కథ ఉంటుంది బాణభట్టు హర్షచరిత్ర ఆఖ్యాయిక

ఆగ్రహం అంటే పట్టుదల. గాంధీగారి సత్యాగ్రహంలోని ఆగ్రహానికి అర్థం ఇదే అయితే తెలుగులో ఈ అర్థంలో ఈ మాట వాడుకలో లేదు మన వాడుకలో ఆగ్రహం అంటే కోపం కావ్యాల్లో కూడా ఈ అర్థంలోనే ఆగ్రహాన్ని ఉపయోగించారు

ఆచమనంలో నీళ్ళు తాగుతారు కాబట్టి ఆచమనం ఆచరణం అంటే నడవడి అని అర్థం ఒక పని చేయడం కూడా ఆచరణం ఆచారం అంటే పరంపరగా వచ్చే వాడుక ఆజీవం అన్నా

ఆజీవనం అన్నా ఆజీవిక అన్నా జీవికే, బ్రతుకుతెరువు రూపాజీవ అంటే రూపమే జీవన సాధనంగా కలిగినది శస్త్రా జీవుడు అంటే శస్త్రమే సాధనంగా కలవాడు ఆతర్పణం అంటే తృప్తి పరచడం ఆదర్శం అంటే అద్దం దీనిలో తన నీడ కనిపిస్తుంది కాబట్టి ఆదర్శం అట్లాగే చూసి నేర్చుకోదగింది కూడా ఆదర్శమే అద్దం అన్న అర్థంలో కాక నేర్చుకోదగింది అన్న అర్థంలోనే దీనికి తెలుగులో వాడుక ఎక్కువ

ఆదీపనం అంటే మండించడం, పురికొల్పడం ఈ మాటకు అలంకరించడం అన్న అర్థం కూడా ఉంది అయితే ఆదీపకుడు అన్నమాటకు ఇళ్ళు తగులబెట్టేవాడు అని అర్థం ఆదేశం అంటే ఆజ్ఞ ఆదేష్ట అంటే ఆదేశించేవాడు యజ్ఞంలో ఋత్విజులను నియమించేవాడు ఆదేష్ట యజ్ఞం చేసేవాడు. యజమాని

ఆధారం అంటే కట్టకట్టి నీళ్ళు నిలిపిన ప్రదేశం

ఆమ్రేడితం అంటే రెండుమూడు సార్లు పలికిన మాట ఎక్కువగా చేసినది అని కూడా అర్థం వ్యాకరణాలలో ఆమ్రేడితం అన్నమాటకు రెండుసార్లు పలికినమాటలో రెండవది అని అర్థం `మ్రేదృ ధాతువుకు ఉన్మాదం/పిచ్చి అని అర్థం ఒకేమాట మాటిమాటికీ అనడం పిచ్చివాడి లక్షణం అన్న అభిప్రాయంతో ఆమ్రేడితం అన్నమాటకు ఈ అర్థం వచ్చింది

ఆయుధం - దీనితో యుద్ధం చేస్తారు కాబట్టి ఆయుధం ఆపృచ్ఛ అంటే కుశలప్రశ్న ఆపణం అంటే అంగడి ఇక్కడ వ్యవహారం జరుగుతుంది

ఆపానం/ఆపానకం అంటే అనేకులు ఒక్కచోట కూడి కల్లుతాగడం ఆసవం అంటే చెరకు నుండి తీసిన కల్లు. ద్రాక్షాసవం అని కూడా అంటారు. ఇక్కడ ద్రాక్ష నుండి తీసిన కల్లు

ఆశంక అంటే సంశయం ఆశంస అంటే కోరిక ఆశ్రయం అంటే ఇల్లు ఆశ్లేషం అంటే కౌగిలింత

'ఆఙ్' ఉపసర్గకు వ్యతిరేకార్థం కూడా ఉంది దత్తం అంటే ఇవ్వబడింది అని అర్థం ఆదత్తం అంటే తీసికొనబడింది అని అర్థం హిందీలో ఆదాన్ ప్రదాన్ అనే మాట ఇచ్చిపుచ్చుకోవడం అన్న అర్థంలో వాడుకలో ఉంది ఇందులో ఆదాన్ అంటే తీసుకోవడం, ప్రదాన్ అంటే ఇవ్వడం భాషా శాస్త్రంలో పదాదానం అన్న పరిభాష ఉంది అంటే పదాలు అరువు తెచ్చుకోవడం ఆదాత అంటే తీసికొనేవాడు దాత అంటే ఇచ్చేవాడు కదా ఆదేయం అంటే తీసికొనదగింది దాయం అంటే విభజన చేయదగిన ధనం దాయాదులు అంటే ఆ విధంగా ధనం పంచుకొని తినేవాళ్ళు ఆదాయం అంటే రాబడి

యాతాయాతాలు అని ఒక ప్రయోగం ఉంది ఇందులో యాతం అంటే పోవడం ఆయాతం అంటే రావడం యాతాయాతాలు అంటే రాకపోకలు

☆

# నిపుణుడు - నిదానం

కామ, కామన అన్నమాటలకు ఇచ్ఛ, కోరిక అని అర్థం వీటికి 'ని' ఉపసర్గను చేర్చినప్పుడు తీవ్రమయిన ఇచ్ఛ అనే అర్థం కలుగుతుంది ఈ ఉపసర్గకు మిక్కిలి, అధికం అన్న అర్థంలో వాడుక ఉంది నిదాఘం అంటే వేడి దీనిలో జనం అధికమయిన తాపం పొందుతారు కాబట్టి ఇది నిదాఘం వేసవిని నిదాఘం అనవచ్చు వేడి వలన చెమట పుడుతుంది కాబట్టి నిదాఘం అన్నమాటకు స్వేదం అన్న అర్థం కూడా ఉంది నిపాకం అంటే ఎక్కువగా ఉడకడం. నిపుణుడు అన్నమాటను నేర్పరి అన్న అర్థంలో వాడుతున్నాం నిపుణుడు అంటే ప్రకృష్టమయిన వీణ కలవాడు ఈ మాటకు రూఢివల్ల నేర్పరి అన్న అర్థం ఏర్పడింది నిపుణుడు అంటే మిక్కిలి శుభ కర్మనుచేసేవాడు నిపుణ శబ్దం నుండే నైపుణ్యం ఏర్పడింది నిభం అంటే మిక్కిలి ప్రకాశించేది సదృశం, సమానం అన్న అర్థం కూడా ఉంది

నిరతి/నిరతం అంటే అత్యంత ఆసక్తి అని అర్థం అయితే తెలుగులో నిరతం అన్నమాటకు ఎల్లప్పుడూ అన్న అర్థంలో ప్రయోగం ఎక్కువ ముఖ్యంగా నిరతాన్నదాత వంటి ప్రయోగాలలో ఈ అర్థం కనిపిస్తుంది నిశాతం అంటే మిక్కిలి వాడి అయినది నిశితం అంటే వాడి చేయబడి నది పదునుపెట్టిన ఖడ్గం నిశిత పరీక్ష, నిశిత విమర్శ, నిశిత పరిశోధన మొదలైన విధంగా నిశిత శబ్దాన్ని విశేషణంగా వాడుతున్నాం తీవ్రమయిన, సూక్ష్మమయిన, వాడి అయిన అన్న అర్థాలలో వాడుతున్నాం నిహీనుడు అంటే మిక్కిలి నీచుడు అని అర్థం నిరూఢి అంటే మిక్కిలి ప్రసిద్ధి ఈ మాటకు ప్రావీణ్యం అన్న అర్థంకూడా ఉంది నితంబం అంటే పిరుదు నితాంతం అంటే అధికం

నికటం అంటే ఎడం లేనిది సమీపంలో ఉన్నది నివిష్టుడు అంటే కూర్చున్నవాడు, దండు విడిసినవాడు ఇక్కడ సమీపం అని అర్థం

నికేతనం, నికార్యం, నికాయ్యం, నివసతి, నివసనం, నివాసం, నివేశనం, నిలయం ఈ మాటలన్నిటికీ ఇల్లు అని అర్థం సారస్వత నికేతనం.

నికారణం, నిశారణం, నిబర్హణం, నిషూదనం, నిహింసనం, నిహననం అన్నమాటలకు చంపడమని అర్థం నిధనం అంటే చావు

నికరం అంటే రాశి. న్యాయంగా ఇచ్చిన డబ్బు, నిధి నికర ఆదాయం అని వాడుక ఇంగ్లీషులో నెట్ ఇన్‌కమ్ అన్న అర్థంలో ఈ మాటను వాడుతున్నాం చివరకు తేలిన ఆదాయం అన్నమాట నికరం అన్నమాటకు గుంపు అన్న అర్థమూ ఉంది నికాయం అన్నా గుంపే నిచయం, నిచాయం అన్నా సమూహమే. నివహం అన్నా సమూహమే

నికృతం అంటే అవమానించబడడం నికృష్టం అంటే హీనం దుష్టకార్యం నికృష్టుడు అంటే హీనుడు

'ని' ఉపసర్గకు అభావార్థం కూడా ఉంది అంటే లేనిది అని అర్థం నివాకువు అంటే మాటలు లేనివాడు నివాతం అంటే గాలిలేనిది గాలి చొరరానిది, సురక్షితమయినది నియుద్ధం అంటే ఆయుధాలు లేని యుద్ధం, బాహుయుద్ధం నియోధనుడు అన్నా నియోద్ధ అన్నా బాహు యుద్ధం చేసేవాడు నివర అంటే అవివాహిత అయిన స్త్రీ. నికర్షణం అంటే దున్నని నేల నివాస

స్థలం నిధనుడు అంటే డబ్బులేనివాడు

నివారణం నివర్తనం నివృత్తి, నివృత్తం అంటే మరలడం తొలగించడం, విరమించడం సందేహం నివృత్తి చేసుకొవడం అంటాం

నిశ అంటే రాత్రి పనులు చేయడం మానడం కాని, తగ్గడంకాని జరుగుతుంది కాబట్టి నిశ

ని' ఉపసర్గకు పూర్తిగా అని కూడా అర్థం నిలయం అంటే పూర్తిగా లయంకావడం నిలీనం అంటే నిశ్శేషంగా లీనం కావడం నిబందం అంటే కట్టు మలమూత్రాలను కట్టివేయడం కూడా నిబందం పోతనగారు నిరయంబైన నిబంధమైన అని ప్రయోగించారు నిరయం అంటే నరకం నరకం వస్తే రానీ, మలమూత్రాలు కట్టువడితే పడనీ ఏమయినా మాట తప్ప నంటాడు బలి చక్రవర్తి నిబంధం అంటే సంకెల అని కూడా అర్థం నిర్మించడం ఏర్పాటు, రచన అనే అర్థాలున్నాయి హిందీలో నిబంధ్ అంటే వ్యాసం అని అర్థం ఈ అర్థంలో తెలుగులో వాడుక లేదు నిబంధన అంటే నియమం అన్న అర్థం తెలుగులో ఎక్కువ ప్రచారంలో ఉంది నిఖిలం అంటే సర్వం అని అర్థం నిపానం అంటే మొత్తం తాగడం నీళ్ళతొట్టి, పాలు పితికే కుండ

నికషం అంటే ఒరయిక, ఒరగల్లు గీటురాయి పరీక్ష అన్న అర్థంలో కూడా వాడు తున్నారు నివేశం అంటే తుల్యం నికుంజం అంటే పొదరిల్లు నికుంభం అంటే ఏనుగు నికు రుంబం అంటే సమూహం శ్రీనాథునికి ఇష్టమయిన మాట ఇది సరస సద్గుణ నికురుంబ శార దాంబ వంటి ప్రయోగాలెన్నో చేశాడు

నిక్వణం, నిక్వాణం అంటే ధ్వని నిక్షిప్తం అంటే పాతబడినది నిక్షేపం అంటే నిధి కదల కుండా స్థిరంగా ఉండేది అన్న అర్థంవల్ల నిక్షేపం అంటే సురక్షితంగా, భద్రంగా ఉండడమన్న అర్థం ఏర్పడింది ఆయనకేం నిక్షేపంగా కాలక్షేపం చేస్తున్నాడు అంటాం

నిఖననం అంటే తవ్వడం నిగళం అంటే సంకెల నిగూఢం అంటే గుప్తం నిగూహనం అంటే దాచడం అని అర్థం నిగ్రహం, నిగ్రహణం అంటే అడ్డగించడం, చెరపట్టడం నిఘర్షం, నిఘర్షణం అంటే రాపిడి నిడీనం అంటే పక్షులు ఆకాశం నుండి కిందికి దిగడం నిజం అంటే తన అనీ, నిత్యం అనీ అర్థం నిచోళం అంటే పరుపుమీద పరిచే వస్త్రం

నిదర్శనం అంటే చూపించేది, నిరూపించడం ఉదాహరణం, దృష్టాంతం అని కూడా అర్థం. నిదానం అంటే ముఖ్య కారణం దీనిచేత కార్యం పుట్టించబడుతుంది కాబట్టి నిదానం చక్కగా విచారించడం రోగనిదానం అంటే రోగానికి మూలకారణం. తెలుగులో నిదానం అంటే మెల్లగా, జాగ్రత్తగా అన్న అర్థం ఏర్పడింది

నిద్రలో ఇంద్రియాలు అణగి ఉంటాయి కాబట్టి నిద్ర నిద్రాణం అంటే నిద్రించేది నిద్రా ళువు అంటే నిద్రపోతు

నిపతనం నిపాతం, నిపాతనం అంటే కిందికి పడడం వ్యాకరణంలో ఒక నిపాతం ఉంది వ్యాకరణ సూత్రానికి విరుద్ధంగా విధించిన శబ్దం నిపాతం

నిమంత్రణం అంటే పిలుపు. నిమజ్జనం అంటే మునగడం, లీనం కావడం నిమిత్తం అంటే కారణం, చిహ్నం

నియోగం/నియోజనం అంటే అధికారంలో నియమించడం. నియోగం అనే మాటకు

పరివారం అన్న అర్థం కూడా ఉంది ఇది తెలుగులో మాత్రమే పూర్వం సంతానప్రాప్తికి అవలం బించే మార్గాలలో నియోగం ఒకటి నియోగి అంటే అధికారి బ్రాహ్మణులలో ఒక తెగ వారికే ఈ పేరు ఉంది తెలగాణ్యులు, ఆరువేల నియోగులు, నందవరీకులు మొదలయిన భేదాలున్నాయి నియోగుల్లో

నిరోధం అంటే అడ్డగింత నివేదన తెలియజేయడం నివేదించుకోవడం అన్నప్పుడు తెలుపుకోవడం అని అర్థం నివేదన అంటే సమర్పణ అన్న అర్థమూ ఉంది ఈ అర్థంలోనే నైవేద్యం, దేవతలకు సమర్పించదగింది

నియమం, నియామం, నియతి, నియమనం సమానార్థకాలు నియమం అంటే వ్రతనిష్ఠ అనికూడా అర్థం నియమస్థుడు అంటే వ్రతనిష్ఠలో ఉన్నవాడని అర్థం

☆

# అధికారం - అధిష్ఠానం

'అది అనే ఉపసర్గ ప్రధానంగా అదికం అన్న అర్థాన్నిస్తుంది అధికర్మం అంటే గొప్పకార్యం ఈ మాటకు అధికారం అన్న అర్థం కూడా ఉంది అధికృత్యం అన్నా ఇదే అర్థం అధిక్రియ, అధికృతి, అధికారం ఈ మాటలన్నీ ఒకే అర్థంలో వాడుకలో ఉన్నాయి అధికారం అంటే అధ్యక్షత, దొర తనం, స్వామ్యం అదికారం అంటే అర్హత అన్న అర్థమూ ఉంది. ఆశ్రయం అన్న అర్థం కూడా ఉంది అధికారి అంటే అధికారం ఉన్నవాడు అందరి మీద నియోగింపబడినవాడు అధికరణం అన్నా అధికారమన్న అర్థం ఉంది అధికారంలో ఉంచడాన్నీ అధికరణమనవచ్చు న్యాయ విచారణ స్థలాన్నీ అదికరణం అనవచ్చు అధికరణం అంటే ఆధారం కూడా వ్యాకరణాలలో కారక ప్రకరణంలో చెప్పే కారక భేదాలలో అధికరణ కారకం ఒకటి ఇక్కడ ఆధారమనే అర్థం మూడురకాల ఆధారం చెప్తారు ఒకటి ఔపశ్లేషికం ఔపశ్లేషికం అంటే సమీప సంబంధం ఘట మందు జలమున్నది అని ఉదాహరణ రెండవది వైషయికం విషయ సంబంధం మోక్షమందిచ్ఛ కలదు అని ఉదాహరణ మూడవది అభివ్యాపకం అంతటా వ్యాపించి ఉండడం అన్నింటియం దీశ్వరుడు కలడు అని ఉదాహరణ మొదటిదానిలో నీటికి ఆధారం కుండ రెండవదానిలో ఇచ్ఛకు ఆధారం మోక్షం మూడవదానిలో ఈశ్వరుని అభివ్యాప్తికి ఆధారం అన్నీ ఆధారమయిన వస్తువుకు సప్తమీ విభక్తి వస్తుందని వ్యాకరణం చెప్తున్నది అయితే ఆధునిక భాషలో ఈ సప్తమీ విభక్తి ప్రత్యయానికి బదులు షష్ఠీ విభక్తి ప్రత్యయం 'లో' వాడుతున్నాం

అధికారం, అధికరణం అన్న రెండు మాటలనూ లక్షణ గ్రంధాలలో పరిచ్ఛేదం, ప్రకరణం అన్న మాటలకు పర్యాయంగా కూడా ప్రయోగించారు గ్రంధ భాగం అన్నమాట ఆ భాగంలో ఆ ప్రత్యేక విషయానికి సంబంధించిన నియమాలుంటాయి

అధికరించు అని క్రియగా నేర్చు, వహించు, ప్రధానంగా చేసికొను అన్న అర్థాలలో వాడవచ్చు అధిక్రమం అంటే ఎక్కడం, దండెత్తడం అధిక్షేపం అంటే నింద, తిరస్కారం. స్థాపన, ప్రేరణ అన్న అర్థాలు కూడా ఉన్నాయి కాని ప్రచారంలో లేవు అధిక్షేపించడం అంటే నిందించడం, ధిక్కరించడం, ఆక్షేపించడం

అధిగమం అంటే పొందడం అధిగమించు అంటే పొందు, ధరించు, చదువు, తెలిసికొను, ప్రవర్తించు, చొచ్చు మొదలయిన అర్థాలున్నప్పటికీ దాటడం అన్న అర్థం ప్రచారంలో ఉంది ఈ సమస్యను అధిగమించడం ఎలా? వంటి వాక్యాలలో ఈ అర్థమే ఉంది కష్టాలను, అవరోధాలను అధిగమించవలసి ఉంటుంది

అధి కామం అంటే తీవ్ర వాంఛ అధిగుణం అంటే గొప్ప గుణం గుణం అంటే వింటినారి అని కూడా అర్థం. ఈ అర్థంలో అధిగుణం అంటే ఎక్కుపెట్టబడినది అని అర్థం. అధిజిహ్వ అంటే కొండనాలుక అధి జిహ్వం అంటే పాము ఎక్కువ నాలుకలు ఉన్నది ఇక్కడ పాముకు రెండు నాలుకలు కాబట్టి అధిజిహ్వం అధిజ్యం అంటే ఎక్కుపెట్టిన విల్లు. జ్యా అంటే వింటినారి కాల క్రమాన శిధిలమవుతుంది కాబట్టి దీనికి జ్యా అని పేరు.

అధి దంతం అంటే పంటి మీద మొలిచిన పల్లు దంతం అంటే పల్లు పన్ను అన్నమాట సరయింది కాదు. కన్ను-కళ్ళు, పల్లు-పళ్ళు కన్ను సామ్యంవల్ల ఏకవచనంలో పన్ను ఏర్పడింది

ఖదిదేవత అంటే అభిమాన దేవత, సర్వాధిపతి అధినాధుడు అంటే సర్వాధికారి అధిపతి ...న్నా అధిపుడు అన్నా, అధిభువు అన్నా ప్రభువు అధి పురుషుడు అంటే పరమేశ్వరుడు ...దిభూతం అంటే పరమాత్మ అధిపతి నుండే ఆధిపత్యం

అధి మంధనం అంటే నిప్పుకోసం కర్రను త్రచ్చడం. అరణి అని కూడా అర్థం అగ్ని పుట్టే కట్టె అధిమాత్రం అంటే ఎక్కువ ప్రమాణం ఉన్నటువంటిది అధిమాసం అంటే అధిక మాసమే అధియోధుడు అంటే గొప్ప వీరుడు. మేటిజోదు అధిరధుడు అంటే రధం మీద ఉన్నవాడు

అధిరాజు, అధిరాట్టు, అధీశుడు, అధీశ్వరుడు చక్రవర్తికి పర్యాయపదాలు అధిరాజ్యం అంటే గొప్పరాజ్యం అధిరోహణం అంటే ఎక్కడం సింహాసనం అధిరోహించాడు, ఎవరెస్టు శిఖరం అధిరోహించాడు వంటి వాక్యాలు ఉదాహరణలు అధిరోపణం అంటే ఎక్కించడం అధిరోహిణి అంటే నిచ్చెన, మెట్లవరుస

అధివాసం అంటే ఉనికిపట్టు అధ్యశనం అంటే ఎక్కువగా తినడం అధ్యస్థి అంటే ఎముక మీద పెరిగిన ఎముక

అధివిన్న అంటే పెద్ద భార్య అధివేదం అంటే భార్య ఉండగా మరో స్త్రీని పెళ్ళిచేసికోవడం బహుభార్యాత్వం నేరమయిన ఈనాడు ఈ మాటల అవసరం లేదు అధిశ్రయం అంటే ఆశ్రయం అధిశ్రయణి అంటే పొయ్యి అధిశ్రయణం అంటే పొయ్యిమీద వండడం

అధిష్ఠాత అంటే అధ్యక్షుడు, నియామకుడు, అధి దేవత అధిష్ఠానం అంటే దగ్గరగా ఉండడం, ఉనికిపట్టు, ఆశ్రయం, ప్రాభవం, ఏలుబడి అధిష్ఠానవర్గం అన్నమాటను పత్రికలలో ఎక్కువగా వాడుతున్నారు రాజకీయ పార్టీలలో అన్ని నిర్ణయాలు చేసే అధికారం చేతిలో ఉన్న వారు అధిష్ఠానవర్గం ప్రాభవం కలిగిన, అధికారం కలిగిన వర్గం

అధ్యక్షుడు అందరిమీదా వ్యాపించి ఉండేవాడు పనులు కనుపెట్టి చూస్తూ ఉండేవాడు అధ్యక్ష శబ్దం నుండి ఆధ్యక్షం ఏర్పడింది అధ్యయనం అంటే చదవడం. అధ్యవసాయం అంటే ప్రయత్నం

అధ్యాత్మం అంటే ఆత్మ స్వభావం అధ్యాత్మ రామాయణం ఉంది. అధ్యాత్మ రామాయణ కీర్తనలూ ఉన్నాయి. పరమాత్మకూ జీవునికీ సంబంధాన్ని రామ కధారూపంలో చెప్పిన రచన అధ్యాత్మ రామాయణం అధ్యాత్మ విద్య అంటే బ్రహ్మవిద్య అధ్యాత్మ నుండే ఆధ్యాత్మిక అనే విశేషణం ఏర్పడింది.

అధ్యాపనం అంటే వేదం నేర్పడం, చదువు చెప్పడం అధ్యాపకుడు చదువు చెప్పేవాడు

అధ్యుష్ట్రం అంటే ఒంటెలు లాగే బండి అధ్యూఢుడు అంటే శివుడు. అధ్యేషణ అంటే అధిక ప్రార్థన అధ్యూఢం అంటే సమృద్ధి

అధ్యాహారం అంటే ఊహా, తర్కం లేనిదానిని ఊహించి తెలుసుకోవడం అధ్యాహారం

'అపి' అనే ఉపసర్గతో ఏర్పడే పదాల వాడుక తెలుగులో చాలా తక్కువ దీనికి కూడా ఎక్కువ అనే అర్థం ఉంది అపిధానం అంటే మిక్కిలి మరుగుపరచేది, మూత అపిధానం అన్నా తిరోధానం అన్నా అర్థం ఒకటే అపిహితం అన్నా అపిధానమే అపినద్ధం అంటే కట్టబడినది. కట్టిన వస్త్రం ధరించబడినది

☆

# అతిక్రమం - అతిపరిచయం

సంస్కృతంలో అతి ఒక ఉపసర్గ ఇది మాటగా తెలుగులో చాలా వ్యాప్తిలోకి వచ్చింది అతిగా తినవద్దు, అతిగా మాట్లాడవద్దు మొదలయిన వాక్యాలలో క్రియా విశేషణంగా ఎక్కువగా అన్న అర్థంలో అతి'ని వాడుతున్నాం వాడు మరీ అతైపోయాడు, మరీ అంత అతి పనికి రాదు, అతికి పోతే ఇలాగే అవుతుంది వంటి వాక్యాలు తరచుగా వినబడుతూ ఉండేవే అతిపెద్ద నగరం అతిచిన్న వాక్యం అని విశేషణంగా కూడా దీనికి వాడుక ఉంది ఎక్కువ అన్న అర్థంలో అతి కి విస్తృతమయిన వాడుక ఉంది

ఉపసర్గగా అతి' ఎక్కువ, మీరడం, దాటడం అన్న అర్థాలు ఇస్తుంది ఉదాహరణకు అతి కాయుడు అంటే పెద్ద శరీరం కలవాడు అసాధారణమయిన కాయం అన్నమాట రావణాసు రుని కొడుకుల్లో ఒకడు అతికాయుడు

అతికథ అంటే మితిమీరిన వర్ణన, అధిక ప్రసంగం అతికథం అంటే అధికంగా వర్ణించ బడింది అని ఒక అర్థం మరో అర్థం కథ నుండి దాటిపోయింది అని నశించిపోయింది అని కూడా అర్థం వాడి కథ ముగిసింది అంటాం కదా కథ ముగియడం అంటే నాశనమవడం అతి కథం అన్నమాటకు ఈ అర్థమూ ఉంది

కర్షణ అంటే రాపిడి అతికర్షణ అంటే మిక్కిలి రాపిడి అతికష్టం అన్నా అతికృచ్ఛ్రం అన్నా మిక్కిలి కష్టం అని అర్థం.

అతికృతి అంటే మితిమీరి చేసిన పని అతికృతం అన్నా అదే అర్థం అతికేసరం అంటే ఎక్కువ కేసరాలున్నది అతికేశరం అనికూడా అనవచ్చు కేసరాలకు కింజల్కాలని కూడా పేరు అతికేసరం అంటే గొజ్జంగి గొజ్జంగి నీరు పన్నీరు

అతిక్రమం, అతిక్రమణం అంటే దాటడం, ఉల్లంఘించడం సమయాతిక్రమణం జరి గింది అన్నప్పుడు వేళ దాటింది అని అర్థం కాలాతిక్రమం, వేళాతిక్రమం అని కూడా అనవచ్చు అతిక్రాంతం అంటే అతిక్రమించినది అని అర్థం మర్యాదాతిక్రమం అంటే హద్దు మీరడం అనాదరం చేయడం అతిక్రూరం అంటే మిక్కిలి క్రూరం వక్రగతి కలిగిన క్రూర గ్రహం అని కూడా అర్థం ఈ అర్థంలో శని, అంగారకుడు

అతిక్షిప్తం అంటే దూరంగా చిమ్మబడినది అతిగండం అంటే పెద్ద చెంపగలిగినది గండం అంటే చెంప గండ స్థలం అని కూడా అంటాం కపోలం అనీ, చెక్కిలి అనీ కూడా అర్థం

అతి గంధం అంటే ఎక్కువ వాసన కలిగినటువంటిది గంధకానికీ ఈ పేరు ఉంది చంపకానికీ ఈ పేరు సరిపోతుంది చంపకం అంటే సంపెంగ సంపెంగ మొగ్గకు గంధ ఫలి అని పేరు

అతిగవుడు అంటే గోవునతిక్రమించిన వాడు మూర్ఖుడని ఒక అర్థం వాక్కులకు అగో చరుడు, పరమాత్మ అని మరొక అర్థం

గహనం అంటే అడవి అని అర్థం దుష్టమృగాలచేత కలచబడేది కాబట్టి గహనం గహ్వరం అంటే కొండబిలం దుష్ట మృగాలతో కూడి ఉండడంచేత అడవిలో ప్రవేశించడమూ కష్టమే కొండబిలంలోకి ప్రవేశించడమూ కష్టమే అతిగహనం, అతిగహ్వరం అంటే మిక్కిలి చొరరానిది అని అర్థం గహనం అంటే చొరరానిది అన్న అర్థంతోపాటు తెలిసికొనలేనిది అన్న

ర్థం కూడా ఉంది అతిగహనం అన్నప్పుడు అర్థం చేసుకోవడానికి చాలా కష్టమయినది అని అర్థం గహ్వరం అంటే గుహ అన్న అర్థంతోపాటు కపటం అన్న అర్థం కూడా ఉంది మిక్కిలి లోతైనది, చొరరానిది అని అతిగహనానికి అర్థం చెప్పుకోవచ్చు

అతిగ్రహం అంటే గ్రహింపశక్యం కానిది, తెలిసికోలేనిది విస్తారంగా గ్రహించేది అన్న అర్థం కూడా ఉంది ఆ విధంగా గ్రహించేది ఇంద్రియాలు కాబట్టి అతిగ్రహం అంటే ఇంద్రియం అతిగ్రహం అంటే సరిగా గ్రహించడం కూడా

అతిఘం అంటే మిక్కిలి హింసించేది ఆయుధమనీ, కోపమనీ అర్థం అతిచారం అంటే మేరమీరి ప్రవర్తించడం

అతిజాగరం అంటే ఎల్లప్పుడూ మేలుకొని ఉండేది నల్లకొంగ అట అతిజాతుడు అంటే తండ్రికంటే ఎక్కువ అయిన వాడు అతితారం అంటే పెద్ద ధ్వని తార అంటే అత్యుచ్చ స్వరం అందువల్ల తారస్థాయి అనాలి తారా అంటే నక్షత్రం తారస్థాయిలోని తార వేరు, చుక్క అన్న అర్థ మున్న తారవేరు నక్షత్రమన్న అర్థంలోనే తారాస్థాయి అని ఏర్పడుతుంది తారస్థాయి అన్నప్పుడు అత్యుచ్చ స్వరస్థాయి అని అర్థం కాబట్టి తారాస్థాయి కాదు

అతితీవ్రం అన్నా అతి తీక్షణం అన్నా ఒకటే

అతిదేశం అంటే ఒకదాని ధర్మాన్ని వేరొక దానిలో ఆరోపించడం అతి ధన్వుడు అంటే మిక్కిలి గొప్ప విలుకాడు అతిధృతి అంటే అత్యంత ధైర్యం ఒక ఛందస్సు పేరుకూడా అతిధృతి ఈ ఛందస్సులో పాదానికి పందొమ్మిది అక్షరాలుంటాయి. శార్దూలం, మేఘ విస్ఫూర్జితం, తరల వృత్తాలు ఈ ఛందస్సులో పుట్టినవే

అతినిద్రుడు అంటే మిక్కిలి నిద్రపోయేవాడు నిద్రలేనివాడినీ అతినిద్రుడనవచ్చు అతిపత్తి అంటే జరిగిపోవడమనీ, జరగకపోవడమనీ కూడా అర్థం కాలాతిపత్తి అంటే కాలం గడచి పోవడం, క్రియాతిపత్తి అంటే పని జరగకపోవడం

అతిపత్రం పెద్ద ఆకు కలిగినటువంటిది టేకు చెట్టు వంటిది అతిపథం అంటే మార్గాన్ని అతిక్రమించింది అతిపంథ అంటే మంచి మార్గం

అతి పరిచయం అంటే మితిమీరిన చనువు

అతి పరిచయాదవజ్ఞా, సంతత గమనాదనాదరోభవతి
మలయే భిల్లపురంధ్రీ, చందన తరుకాష్ఠ మింధనం కురుతే.

అని ఒక చాటు పద్యం ఉంది అతి పరిచయం వల్ల అవజ్ఞ కలుగుతుంది బంధువుల ఇంటికి అరుదుగా వెళ్ళడం, వెళ్ళినప్పుడు ఒకరోజో, రెండు రోజులో ఉండడం వారికి సంతోష కరంగా ఉంటుంది అదే మాటిమాటికీ వెళ్ళి రోజుల తరబడి తిష్టవేస్తే వాళ్ళకు ఇబ్బందికరం గానూ ఉంటుంది అనాదరం కలగకమానదు మలయ పర్వతం మీద ఉన్న భిల్ల స్త్రీలు గంధపుచెక్కతో వంట చేస్తారు ఎక్కువ లభిస్తుంది కాబట్టి వారికి గంధపు చెక్క విలువ తెలియదు అలభ్యమయిన వస్తువు మీద ఉండే ప్రీతి, గౌరవం తేలికగానూ, చవకగానూ దొరికే వస్తువు మీద ఉండదు కదా అతి సమీపంలో ఉండడం కూడా గౌరవాన్ని తగ్గిస్తుంది

పరోక్షం అంటే కన్నుల ముందు ఉండకపోవడం ప్రత్యక్షం అంటే కన్నుల ముందు ఉండడం అతి పరోక్షం అంటే చూపుకు చాలా దూరంలో ఉండడం అతి పరోక్షం అంటే కను క్కోలేనిది ☆

# అతిరథుడు - అతివాదం

'అతి' ఉపసర్గ ఎక్కువ, అతిక్రమించి అన్న రెండు అర్థాలలోనూ ప్రయుక్తమవుతుంది అతిభారం అంటే ఎక్కువ బరువు అతిభారగం అంటే కంచరగాడిద దీన్ని వేసడం అని కూడా అంటారు ఎక్కువ బరువును మోస్తుంది కాబట్టి అతిభారగం అతిప్రసక్తి, అతి ప్రసంగం అంటే మిక్కిలి మాట్లాడడం అత్యాంతసక్తి ఎడతెగని కూడిక అని కూడా అర్థం

అతిప్రశ్నం అంటే మర్యాద మీరిన ప్రశ్న ప్రశ్నకు జవాబు చెప్పినా మరీమరీ అడగడం అతిభోజనం అంటే తిండిపోతుతనం అతిభూమి అంటే కడపటి హద్దు వృద్ధి-ప్రవృద్ధి- అతిప్రవృద్ధం అతిప్రవృద్ధుడు అంటే చాలా ఎక్కువగా పెరిగినవాడు పొగరుబోతు అని కూడా అర్థం అతిపాతం అంటే క్రమం తప్పి తొలగిపోవడం

అతిమానుషం, అతిమర్త్యం ఈ రెండు మాటలకు అర్థం ఒకటే మనుష్యశక్తికి మించినది అని అర్థం దైవికమైనదని అర్థం ఎవరైనా మానవశక్తికి మించిన గొప్పకార్యం సాధించినప్పుడు వారు అతి మానుషమయిన కార్యం నిర్వహించారంటాం మనుష్యులకు సాధ్యం కానిపని చేశారన్నమాట

అతిమాత్రం అంటే అధికం అతిమాత్రమైన తెలివిని చూపించాడు అంటే గొప్ప తెలివిని చూపించాడని అతిమానం అంటే దురభిమానం, గర్వం అని అర్థం ఇక్కడ వ్యతిరేకార్థం అతి మారుతం అంటే పెద్దగాలి తుఫాను అతిమిత్రుడు అంటే అత్యంత స్నేహితుడు

అతిమృత్యువు అన్నప్పుడు మృత్యువును జయించినవాడని అర్థం రక్తం అన్న మాటకు ఎర్రనిది, రాగం అంటే ప్రేమ కలిగినది అని అర్థం అతిరక్తం అంటే మిక్కిలి ఎర్రనిది, మిక్కిలి ప్రేమకలది

అతిరథ మహారథులన్నది జాతీయమయిపోయింది అతిరథుడు అంటే అనేకమంది రథికులతో ఒంటరిగా పోరాడగల యోధుడు మహారథుడు అంటే పది వేలమంది విలుకాళ్ళతో అసహాయుడుగా పోరాడే మహాయోధుడు సమరథుడంటే ఒక విలుకానితో పోరాడేవాడు అర్ధరథుడు ఈ ముగ్గురికంటే తక్కువవాడు భీష్ముడు కర్ణుణ్ణి అర్ధరథుడిగా వర్గీకరించాడు. కర్ణుడు అలిగి భీష్ముడు చనిపోయేవరకు యుద్ధం చేయనన్నాడు ఇప్పుడు అతిరథ మహారథులన్న మాటను గొప్ప నాయకులు అన్న అర్థంలో వాడుతున్నాం

అతిరభసం అంటే అతివేగం అతిరాత్రం అంటే జ్యోతిష్టోమంలో ఒక భాగమయిన యజ్ఞం

అతిరేకం అంటే అధికం, హెచ్చు. దీనినుండే అతిరిక్తం అతిరిక్తం అంటే హెచ్చినది మితిమీరినది, గొప్పది అని అర్థం వ్యతిరిక్తమన్న అర్థం కూడా ఉంది రిక్తం అంటే శూన్యం, వ్యర్థం అన్న అర్థం ఉంది రిక్తహస్తుడు చేతిలో ఏమీలేనివాడు అతిరిక్తం అంటే మిక్కిలి శూన్యమైనది అని కూడా అర్థం

అతివక్త అంటే ఎక్కువగా మాట్లాడే వాడు, వదరుబోతు. మాటలమారి అతివర్తనం అంటే మితిమీరి ప్రవర్తించడం అతివర్తులం అంటే మిక్కిలి వర్తులమయినది, గుండ్రనైనది

అతివాదం అంటే వాదాన్ని అతిక్రమించింది అధికవాదం ఈ మాటకు పరుషవాక్యం అనీ, అతిశయోక్తి అనీ కూడా అర్థం ఉంది మన రాజకీయ పరిభాషలో మితవాదం అతివాదం అన్నమాటలు స్థిరపడిపోయాయి ఈ శతాబ్దం ప్రారంభంలో కాంగ్రెసు పార్టీలోనే మితవాదులు, అతివాదులు అని రెండు వర్గాలుండేవి గోపాలకృష్ణ గోఖలే వంటివారు మితవాదులు, తిలక్, లాలాలజపతిరాయ్, బిపిన్ చంద్రపాల్ వంటివారు అతివాదులు ఈ అతివాదుల్నే జాతీయ వాదులని కూడా అనేవారు ఇది తర్వాత రాజకీయ పార్టీల వర్గీకరణానికి వ్యాపించింది మిత వాద పార్టీలు అతివాద పార్టీలు అని తరువాతి కాలంలో రాజకీయ పక్షాలలో విభేదా లేర్పడినప్పుడు సంప్రదాయవాదులు మితవాదులుగానూ, వారికి వ్యతిరేకులు అతివాదులుగానూ గుర్తింపు పొందారు తర్వాత అతివాదులంటే తీవ్రవాదులు, ఉగ్రవాదులన్న అర్థం ఏర్పడింది అతివాద రాజకీయాలన్నమాటా ఏర్పడింది

అతివృష్టి అంటే మిక్కుటమయినవాన అధికవర్షం దీనికి వ్యతిరేకం అనావృష్టి వానలేక పోవడం ఈ రెండు మాటలనూ వానకే కాక ఇతర సందర్భాలలోనూ వాడుతున్నాం సమతౌల్యం లేని విషయాలలో, స్థిరత్వం లేని సందర్భాలలో అయితే అతివృష్టి లేకపోతే అనావృష్టి అంటాం అతివేలం అంటే మేర మీరినది

అతివ్యాప్తి అంటే మితిమీరి వ్యాపించడం లక్షణశాస్త్రాలలో అతివ్యాప్తి, అవ్యాప్తి అన్న రెండు మాటలు కనిపిస్తాయి. అతివ్యాప్తి అంటే లక్ష్యం కాని దానికి కూడా లక్షణం వర్తించడం. అవ్యాప్తి అంటే లక్ష్యం అయిన దానికి కూడా లక్షణం వర్తించకపోవడం. మనం ఒక నిర్వచనం చెప్తే ఆ నిర్వచనానికి అతివ్యాప్తి అవ్యాప్తి దోషాలుండకూడదు

అతిశయం అంటే అధికం అన్నింటినీ దాటినటువంటి ఔన్నత్యం అతిశయోక్తి అలం కారం కూడా ఉంది వాస్తవం కంటే చాలా ఎక్కువగా వర్ణించడం ఇది అందంగా ఉంటే అలం కారం అవుతుంది అతిశయం అంటే గర్వం అన్న అర్థం కూడా ఏర్పడింది వాడికి చాలా అతిశయం అన్నప్పుడు గర్వమనే అర్థం దీనికి అతిశయనం అన్న రూపాంతరం కూడా ఉంది అతిశయనం అంటేమితిమీరి పరుండడం అని కూడా అర్థం అతిసర్గం అంటే నిత్యం అనీ, దానం అనీ అర్థం

అతిసారం అంటే ఎక్కువగా విరేచనాలు అయ్యే జబ్బు. అతిసారవ్యాధి అతిసారవ్యాధితో బాధపడుతున్నవాడు అతిసారి, అతిసారకి

అతిసౌరభం అంటే మిక్కిలి పరిమళం అతిస్నేహం అంటే మిక్కిలి ప్రేమ అతిస్పర్శుడు అంటే పిసినారి, లోభి, అధముడు

అలంకారశాస్త్రాలలో నవ్వు ఆరురకాలని చెప్పారు స్మితం, హసితం, విహసితం, అవహ సితం, అపహసితం, అతిహసితం అన్నవి ఈ ఆరు రకాల హాసాలు, వీటిలో మొదటి రెండూ ఉత్తములలోనూ, తరువాతి రెండూ మధ్యములలోనూ, చివరి రెండూ అధములలోనూ చూపిం చాలి శరీరం కంపించేటట్లు నవ్వడం అతిహసితం పొట్టచెక్కలయ్యేట్లు నవ్వడం అంటామే అది అతిహసితం

అతీంద్రియం అంటే ఇంద్రియాలకు గోచరించనిది అతీంద్రియ శక్తులు అంటాం

ఇంద్రియాలకు మించినటువంటి శక్తులు అని అర్థం

అత్యంకుశం అంటే అంకుశానికి లొంగనిది అత్యంతగతుడు అంటే మళ్ళీ తిరిగి రాకుండా పోయినవాడు అత్యంతగామి అంటే ఎక్కువగా నడిచేవాడు వేగంగా నడిచేవాడిని అత్యంతగామి అనవచ్చు

అత్యంతం మనం చాలా ఎక్కువగా వాడేమాట అత్యంత అని విశేషణంగా దీన్ని ప్రచురంగా వాడుతున్నాం అత్యంతం అంటే అంతంలేనిది, అధికం

అత్యంతవాసి అంటే శాశ్వతంగా గురువు దగ్గరే నిలిచి ఉండే శిష్యుడు అత్యగ్ని అంటే అగ్నిని అతిక్రమించింది, జబ్బువల్ల కలిగే అధికమయిన ఆకలిని కూడా అత్యగ్ని అంటారు అత్యమ్లం అంటే మిక్కిలి పుల్లనిది అందువల్ల చింతచెట్టుకు కూడా ఈ పేరు వచ్చింది అత్యయం అంటే అతిక్రమించడం, అపాయం, దోషం, దుఃఖం, బాధ

అత్యాచారం అంటేవిహితాచారాలను విడిచినది, అనుచితమయిన ప్రవర్తన, మత విరుద్ధంగా నడవడం, ఉల్లంఘన, మిక్కుటమయిన ఆచారం నేటి పత్రికలలో స్త్రీలపై అత్యాచారం అన్న సందర్భంలో ఎక్కువగా వాడుతున్నారు హత్య, అత్యాచారం రెండూ కలిసి అక్కడక్కడా హత్యాచారం అన్న ప్రయోగమూ కనిపిస్తుంది అత్యాశ అంటే పేరాస అత్యాహితం అంటే మహాభయం, సాహసం అత్యుక్తి అంటే అతిశయంగా చెప్పడం

☆

# స్వాగతం - సురభి

తెలుగులో మంచి అనే విశేషణాన్ని ఏ పదం ముందయినా చేర్చి వాడినట్లుగా సంస్కృతంలో 'సు' అనే ఉపసర్గను మంచి అన్న అర్థంలో విస్తృతంగా వాడవచ్చు ఈ ఉపసర్గను మంచి, మిక్కిలి అన్న రెండు అర్థాలలో ఎక్కువగా వాడుతున్నాం మనం ప్రతి సభలోనూ వాడే పదం స్వాగతం ఇందులో ఆగతం అనే మాటకు 'సు'ను చేర్చాం మంచి ఆగమనం అని అర్థం కుశలప్రశ్న వేయడం ఈ స్వాగతంలో ఒక 'సు' ఉపసర్గ ఉంది కాబట్టి దానికి మరో 'సు' చేర్చి సుస్వాగతం చెయవలసిన అవసరంలేదు పైగా సుస్వాగతం అన్న మాటను ఒక ప్రత్యేక సందర్భంలో వాడే సంప్రదాయం ఉంది కాబట్టి, దాన్ని మామూలు సందర్భాలలో వాడకపోవడం మంచిది

సుకృతం అంటే మంచిపని విడిగా ఈ మాటను ఎక్కువగా వాడం కాని, పూర్వజన్మ సుకృతం అని సమాస రూపంలో మాత్రం బాగా వాడుకలో ఉంది గత జన్మలో చేసిన మంచి పనుల ఫలితం అని అర్థం. సుకర్మం అన్నా మంచిపనే సుకర్ముడు అంటే విశ్వకర్మ అని అర్థం

సుకరం అంటే సులభం ఈ రెండు మాటల్లోనూ 'సు' ఉంది సుకర అంటే సాధువయిన ఆవు సుఖాన్ని కలిగించేది సులభం చక్కగా లభించేది ఈ రెండు మాటల నుండీ సౌకర్యం, సౌలభ్యం ఏర్పడ్డాయి

సుకుమారం అంటే మెత్తనిది, మృదువయినది సుఖం అంటే అశుభాన్ని పోగొట్టేది, ఇంద్రియాలను సంతోషపెట్టేది సుగమం అంటే సుఖంగా పొందదగింది, సుకరమూ, సులభమూ సుగతుడు అంటే మంచి జ్ఞానం కలవాడు బుద్ధునికి సుగతుడని పేరు సుగృహీతం అంటే బాగుగా గ్రహింపబడింది సముచితమైనది సుగృహీత నామధేయుడని వాడుతూ ఉంటాం పేరుకు తగినవాడని అర్థం సార్థక నామధేయుడని కూడా అంటాం

సుగ్రీవం అంటే మంచి మెడ కలిగినది సుగ్రీవుడు అంటే మంచి మెడ కలిగినవాడు సుగంధి అంటే మంచి గంధం, వాసన కలిగినది

సుచరిత్ర అంటే మంచి నడవడిక కలిగిన స్త్రీ పతివ్రత. పేర్లలో ఈ 'సు' ఉపసర్గకు ఎక్కువ వాడుక సుదతి అంటే మంచి దంతాలు కలిగిన స్త్రీ సుజాత అంటే ఉన్నత వంశంలో పుట్టిన స్త్రీ సుశీల అంటే మంచి గుణం కలిగినది సుభద్ర అంటే సురక్షితం సుమతి అంటే మంచి బుద్ధి కలిగినది సుమధ్య అంటే మంచి నడుము కలిగినది సుకేశిని మంచి కేశాలు కలిగినది సుస్మిత అంటే మంచి చిరునవ్వు కలిగిన స్త్రీ. సులోచన అంటే మంచి కన్నులు కల స్త్రీ ఈ విధంగా ఎన్నో పేర్లు ఈ ఉపసర్గతో ఏర్పడ్డవే స్త్రీల పేర్లలాగానే ఈ ఉపసర్గతో పురుషుల పేర్లు కూడా అసంఖ్యాకంగా ఏర్పడతాయి

సుచిరం అంటే చాలాకాలం సురుచిరం అంటే మిక్కిలి కాంతివంతమైనది సుజన్మం అంటే మంచి పుట్టుక సుజనుడు అంటే మంచి వ్యక్తి, సాధువు

సుతంత్రి అంటే మంచి తీగెలు కలిగినది ఇంపైన శబ్దాన్ని కలిగించే వాద్యం సుతనువు అంటే మంచి శరీరం కలిగిన వాడు సప్త పాతాళాలలో ఒకటి సుతలం సుదర్శనం అంటే మంచి దర్శనం కలిగినది విష్ణువు ఆయుధం సుదర్శన చక్రం

సుత్రాముడు అంటే ఇంద్రుడు లోకాలను బాగా రక్షించేవాడని అర్థం. సుదాయం అంటే

పెళ్ళిలో కూతురుకూ, అల్లుడికీ ఇచ్చే వస్తువు

సుదూరం అంటే మిక్కిలి దూరం సుదీర్ఘం అంటే మిక్కిలి పొడవైనది సుదీర్ఘమైన ప్రసంగం అంటాం సుదృఢం అంటే మిక్కిలి గట్టిది సుదుర్లభం అంటే మిక్కిలి దుర్లభం లభించనిది

సుధర్మ అంటే మంచి ధర్మం కలిగినది దేవసభకు సుధర్మ అనిపేరు

సుధ అంటే సుఖంగా తాగబడేది, అమృతం బాగా పుచ్చుకుంటారు కాబట్టి కల్లుకు సుర అని పేరు

సుధీ అంటే మంచి మేధాశక్తి ఉన్నవాడు, విద్వాంసుడు సుందరం అంటే మిక్కిలి సంతోష పెట్టేది సుపంథ అంటే మంచిమార్గం

సుపర్ణుడు అంటే మంచి రెక్కలు కలవాడు, గరుత్మంతుడు సురులు అంటే బాగా ప్రకాశించేవారు, హవిస్సులను స్వీకరించేవారు శుభాన్ని చెప్పేవారు, చక్కగా కోరిన కోర్కెలు తీర్చేవారు సుపర్వులన్నా ఇదే అర్థం సుమనస్సులు అంటే మంచి మనస్సు కలవారు సుపార్శ్వం అంటే మంచి పార్శ్వములు కలిగినది, జువ్విచెట్టు సుప్రతీకం అంటే మంచి అవయవాలు కలిగినది అష్టదిగ్గజాలలో సుప్రతీకం ఒకటి ఐరావతం, పుండరీకం, వామనం, కుముదం అంజనం, పుష్పదంతం సార్వభౌమం, సుప్రతీకం అన్న ఎనిమిదీ అష్టదిగ్గజాలు

దేశం పాడిపంటలతో సుభిక్షంగా ఉందంటాం ఆహార సమృద్ధి ఉండడం సుప్రతిష్ఠ అంటే కీర్తి అని ఒక అర్థం స్థాపన అని మరొక అర్థం ఆయన సుప్రతిష్ఠితుడు అంటే కీర్తి కలిగినవాడని అర్థం సుబోధం అంటే మంచివార్త, హితవు స్పష్టంగా తేలికగా అర్థమయ్యేది, తెలిసేది అన్న అర్థంలో ఎక్కువగా వాడుతున్నాం

సుముఖం అంటే అనుకూలమైనది సురభి అంటే సువాసనగల వస్తువు వసంత ఋతువుకు సురభి అని పేరు ఉంది శుభకార్యాలు ఆరంభించే ఋతువు కాబట్టి సురభి

సుశ్రుతం అంటే చక్కగా వినబడేది సుశ్రుతుడు సుప్రసిద్ధ ఆయుర్వేద విద్వాంసుడు అతని వైద్యశాస్త్ర గ్రంథాన్ని సుశ్రుతం అంటారు

స్వర్గం అంటే బాగా ప్రకాశించేది సువర్ణం అంటే మంచి వర్ణం కలిగినది బంగారం అని అర్థం

సువాసిని అంటే పేరంటాలు వితంతువులను పూర్వ సువాసినులు అంటుంటారు సుషమ అంటే శ్రేష్ఠమైన కాంతి స్వస్తిక అంటే శుభం కలిగించే ఇల్లు తూర్పు వాకిలి ఉన్న ఇల్లు

సుహృత్తు, సుహృదుడు, సుహృదయుడు అంటే మిత్రుడు

☆

# ఉత్తరం - ఉదాసీనం

అనేక పదాల కల్పనలో ఉపయోగపడే ఉపసర్గలలో 'ఉత్' ఒకటి ఈ ఉపసర్గ చాలా అర్థాల నిస్తుంది వాటిలో ఒక ముఖ్యమైన అర్థం ఊర్ధ్వం, పైకిలేవడం ఉచ్చం అంటే పైకి పెరిగేది ఉచ్చం నీచం అని రెండు మాటలు వాడుతూ ఉంటాం రెండింటినీ కలిపి ఉచ్చనీచాలు అని కూడా వాడతాం ఉచ్చం అంటే పొడవైనది ఉచ్చం నీచం పైది కిందిది ఉచ్చక్షువు అంటే కళ్ళు పైకెత్తినది అని అర్థం కళ్ళు పోయినది, గుడ్డిది అన్న అర్థం కూడా ఉంది

ఉచ్చరణం అంటే మీదికి పోవడం ఉచ్చరించడం పైకి పలకడం అనికూడా అర్థం ఉచ్చారణం, ఉచ్చారం అని కూడా అనవచ్చు ఉచ్చారణ అంటున్నాం ఉచ్చిత్రం అంటే పైన చిత్తరువులు రచించిన వస్త్రం ఉచ్చిరుడు అంటే ఎత్తిన తల కలవాడు తల ఎత్తుకొని ఉన్నవాడు

ఉత్కర్షం అంటే పైకి లాగినది. ఉత్కర్ష అంటే శ్రేష్ఠత్వం, అతిశయం అని అర్థం. ఉత్కృష్టం అంటే శ్రేష్ఠం

ఉత్కీర్ణం అంటే పైకి చిమ్మబడినది ఉత్క్షేణం అంటే ఎగజిమ్మడం

ఉత్తరం అనేమాటకు చాలా అర్థాలున్నాయి ఉత్తరం అంటే మీదిది అని అర్థం ఉత్తరం అన్నది ఒక దిక్కు. ఈ దిక్కునందు సూర్యుడు ఉత్తరాయణం చేత మీదికి వస్తాడు. మేరువు మొదలయిన వాటిని దాటుతాడు కాబట్టి ఉత్తరం ఉత్తరం అంటే శ్రేష్ఠమని కూడా అర్థం లోకోత్తరుడు వంటి మాటల్లో ఈ అర్థం ఉంది ఉత్తరం అంటే తరువాతిది అనికూడా అర్థం సమాసంలో పూర్వపదం ఉత్తరపదం అంటాం తరువాతి మాట అని అర్థం దక్షిణ హస్తం అంటే కుడిచేయి దక్షిణ అన్నమాటకు కుడి అని అర్థం ఉంది దక్షిణకు వ్యతిరేకం ఉత్తర ఎడమ అని అర్థం అష్టోత్తర శతం అన్నప్పుడు నూటికి పైన ఎనిమిది, నూటికి ఎనిమిది ఎక్కువ అని అర్థం శరీరంలో పైభాగాన్ని ఉత్తర కాయం అంటారు కాయం అంటే శరీరం. ఉత్తర అంటే పైది

ఉత్తరం అంటే సమాధానం అని కూడా అర్థం అడిగిన శంకను దీనితో దాటుతారు కాబట్టి ఉత్తరం అడిగిన దానికి చెప్పే జవాబు సంశయం దీని వల్ల తీరుతుంది

ఉత్తర పూర్వపదంగా చాలా మాటలు ఏర్పడతాయి వ్యవహారంలో నాలుగు పాదాలుంటాయి వాటిలో ఒకటి ఉత్తరపాదం. పూర్వపక్షం, ఉత్తరం, క్రియ, తీర్పు అన్న నాలుగు పాదాలలో పూర్వపక్షం అంటే వ్యాజ్యెం తేవడం, ఉత్తరం అంటే ప్రతివాది సమాధానం, క్రియ అంటే సాక్ష్యం వినడం, తీర్పు అంటే నిర్ణయం చెప్పడం

ఉత్తర పక్షం అంటే కృష్ణపక్షం వాదంలో పూర్వపక్షానికి వ్యతిరేకం ఉత్తరపక్షం పూర్వపక్షం ఖండన ఉత్తరపక్షం సిద్ధాంతం ఉత్తరకాండ అంటే రామాయణంలో ఏడో కాండ ఉత్తర పటం అన్నా, ఉత్తరీయం అన్నా పైపంచె

ఉత్తరక్రియ అంటే అపరకర్మ మరణానంతరం మృతులనుద్దేశించి చేసే కార్యం ఉత్తర మీమాంస అంటే వేదాంత శాస్త్రం పూర్వ మీమాంస, ఉత్తర మీమాంసలలో పూర్వ మీమాంస కర్మకాండ, ఉత్తర మీమాంస జ్ఞానకాండ

ఉత్తరపూర్వ దిశ అంటే ఈశాన్యం ఉత్తర దిక్కుకూ తూర్పు దిక్కుకూ మధ్యనున్న మూల ఉత్తర పశ్చిమం అంటే వాయవ్యం ఉత్తరాయణం అంటే సూర్యుడు ఉత్తర దిక్కుగా ప్రయాణించే

ఆరు నెలల కాలం

ఉత్తరం అంటే లేఖ అని కూడా అర్థం ఉత్తర ప్రత్యుత్తరాలు అంటే లేఖ ప్రతి లేఖలు ఉత్తర వయస్సు అంటే ముసలితనం

ఉత్తరాధికారం అంటే దాయాదిత్వం వారసత్వం ఉత్తరాధికారి అంటే దాయాది ఉత్తరోత్తరం అంటే తరువాత్తరువాతది

ఉత్పతనం అంటే పైకి ఎక్కడం, ఎగరడం ఉత్పతం అన్నా ఇదే అర్థం పైకి ఎగిరేది పక్షి కాబట్టి పక్షికి ఉత్పతం అని పేరు ఉత్పలం అంటే పైకి వచ్చేది ఉత్పలం అంటే కలువ అని అర్థం పద్మమని కూడా అనవచ్చు నీలోత్పలం అంటే నల్లకలువ ఉత్పలమాల అంటే కలువదండ తెలుగు వృత్తాలలో ఉత్పలమాల వృత్తానికి చాలా ప్రచారం ఉంది

ఉత్పశ్యుడు అంటే మీదుగా చూసేవాడు ఉత్పాతం అంటే పైకిపోవడం గొప్ప ఉత్పాతాన్ని మహోత్పాతం అంటారు. ఉత్పాతం అంటే శుభ అశుభాలను సూచించే మహాభూత వికారం ఉత్పాతాలు మూడు రకాలుగా ఉంటాయి సూర్యగ్రహణం, చంద్రగ్రహణం వంటివి దివ్యాలు ఉల్కాపాతం వంటివి అంతరిక్ష సంబంధాలు భూకంపం వంటివి భౌమాలు అంటే భూమికి సంబంధించినవి

ఉత్ప్రాసం ఉత్ప్రాసనం అంటే ఎత్తి పొడుపు ఉత్ప్రేక్షణం అంటే పైకి చూడడం ఊహించడం అనికూడా అర్థం ఉత్ప్రేక్ష అంటే ఊహ అలంకారాలలో ఉత్ప్రేక్షాలంకారం ఒకటి

ఉదర్చి అంటే పైకి ఎగసే జ్వాలలు కలిగినది అగ్ని అని అర్థం ఉదాసీనుడు అంటే పైన కూర్చుండేవాడు ఈ ఉదాసీనుడు ఉపకారమూ చేయడు, అపకారమూ చేయడు శత్రువూ కాదు, మిత్రుడూ కాదు ఉదాసీనుడు వహించే వైఖరి ఉదాసీన వైఖరి పట్టించుకోకపోవడం మనకు పక్క నుండే రాజు శత్రువు ఈ శత్రువుకు ఆవతల ఉండేవాడు మనకు మిత్రుడు ఆ మిత్రునికి అవతల ఉండేవాడు ఉదాసీనుడు శత్రు మిత్ర దేశాలకు ఆవల ఉపకార అపకారాలు చేయక ఊరకుండే వాడు ఉదాసీనుడు.

ఉద్గమం అంటే పైకిపోవడం ఉద్గమనం అన్నా అదే అర్థం ఉద్గతి అన్నా అర్థమదే ఉద్బంధకుడు అంటే వేలాడదీసేవాడు ఉరితీసేవాడు ఉద్వర్తం, ఉద్వర్తనం అంటే పైకి పోవడం అని అర్థం నీతిమీరిన వర్తనం కలిగినది అనికూడా అర్థం

ఉద్వీక్షణం అంటే మీదికి చూడడం ఉద్వేల్లితం అంటే మీదికి చిమ్మబడినది ఉత్సర్పం అంటే పైకి పాకడం

ఉత్ప్లవం అంటే నీరు వంటి వాటిలో పైకి తేలడం ఈ మాటకు దాటడం అని కూడా అర్థం నీటిమీద తేలుతుంది కాబట్టి పడవకు ఉత్ప్లవం అని కూడా పేరు

ఉదీచి అంటే ఉత్తరదిశ ఉదీచీనం అంటే ఉత్తర దిక్కున ఉన్నది ఉదీచ్యం అన్నా ఉత్తర దిక్కున ఉన్న వస్తువనే అర్థం

☆

# ఉత్కంఠ - ఉద్ధరణ

ఉత్థానం అంటే పైకి లేవడం ఈ మాటకు నిలవడం మేల్కోవడం అని కూడా అర్థం కార్తీక శుక్ల పక్షంలోని ఏకాదశిని ఉత్థాన ఏకాదశి అంటారు ఈ ఏకాదశినాడు శ్రీ మహావిష్ణువు నిద్రనుండి 'మేల్కొంటాడు కాబట్టి ఈ ఏకాదశికి ఉత్థాన ఏకాదశి అని పేరు వచ్చింది ఉత్థాపకం అంటే లేవదీసేది ఉత్థితం అంటే లేచినది ఉత్థానం అన్నమాటకు పుట్టుక అన్న అర్థం కూడా ఉంది

ఉత్కంఠ అంటే తహతహ పైకి వచ్చిన శోకం ఉత్కత, ఉత్సుకం అన్నా తహతహ అనే అర్థం ఉద్గతమయిన శోకం, ఇష్ట వస్తుప్రాప్తి కోసం పొందే వేగిరపాటు ఉత్కంఠ కలిగినది ఉత్కంఠిత, ఉత్కంఠితం కావ్యంలో శృంగార నాయికలు ఎనిమిది విధాలుగా ఉంటారు అష్టవిధ శృంగార నాయికలు అని వాడుక స్వాధీనపతిక, ఖండిత, అభిసారిక, కలహాంతరిత, విప్రలబ్ధ, ప్రోషిత భర్తృక, వాసక సజ్జిక, విరహోత్కంఠిత అన్న అష్టవిధ శృంగార నాయికలలో విరహోత్కం ఠిత చివరిది ప్రియుడు రావడానికి పూనుకుని కూడా ఏ కారణం చేతనో సమయానికి రాన ప్పుడు, అతను రాకపోవడం వల్ల బాధపడే దుఃఖించే నాయిక విరహోత్కంఠిత విరహం చేత శోకించేది ఉత్కత అంటే ఉత్కంఠ ఉత్కం అంటే కుతూహలం కలిగింది, ఉవ్విళ్ళూరేది ఉత్కంఠం అంటే ఎత్తిన మెడ కలది అని కూడా అర్థం

ఉత్కలిక అన్నా ఉత్కంఠ అన్న అర్థం ఉంది ఇక్కడ కల ధాతువుకు సంఖ్య అని అర్థం ఉత్కలిక అంటే మొగ్గ అనీ, హేల, విలాసం అనీ కూడా అర్థం కలిక, ఉత్కలిక అని ఛందో భేదా లున్నాయి ఉదాహరణ కావ్యంతో ఈ ఛందస్సులుంటాయి. వీటిని గేయ రూపమయిన గద్యా లన్నారు కళికకు ఎనిమిది పాదాలుంటాయి కళిక పాదంలో ఎన్ని మాత్రలుంటాయో వాటిలో సగం ఉత్కళిక పాదంలో ఉంటాయి ఇదీ ఎనిమిది పాదాలుంటుంది సంస్కృతంలో గద్య కావ్యాలు నాలుగు రకాలు ముక్తకం, వృత్తగంధి, ఉత్కలికాప్రాయం, చూర్ణకం అని దీర్ఘ సమాస బహుళమయిన రచన ఉత్కలికాప్రాయం సమాసాలూ, కటువైన అక్షరాలూ ఉంటాయి

ఉత్సాహం అంటే ఉద్గతమైన సహనం ప్రయాసను ఓర్వడం, శ్రమించడం ఒక మహా కార్యాన్ని నిర్వహించాలనే కోరికతో ఆ పనికి పూనుకోవడం. ఉత్సాహం అన్న మాటకు ప్రయత్నం, అభిలాష, శుభం అన్న అర్థాలున్నాయి ఛందస్సులో ఉత్సాహం అన్న పేరుగల వృత్తం ఉంది అలంకార శాస్త్రాలలో నవరసాలున్నాయి ఈ రసాలకు స్థాయి భావాలుంటాయి. శృంగార రసానికి రతి స్థాయి భావం అట్లాగే వీరరసానికి ఉత్సాహం స్థాయి భావం.

ఉత్కర్ణం అంటే ఎత్తిన చెవులు కలది ఉత్క్రమం అంటే అతిక్రమించడం అని అర్థం మీదికి కాని, వెలికి గాని పోవడం ఉత్క్రమణం, ఉత్క్రాంతి, ఉత్క్రామం, ఉత్క్రమం సమానార్థకాలు.

ఉత్కులుడు అంటే కులమర్యాదలు దాటినవాడు కులభ్రష్టుడు ఉత్కూలం అంటే కూలాన్ని దాటి ప్రవహించేది ఉత్తటం అన్నా అంతే గట్టును దాటి పారడం

ఉత్తమం అంటే అత్యంత ఉత్కృష్టమైనది శ్రేష్ఠమైనది, గొప్పది అధమానికి వ్యతిరేకం ముఖ్యమైనది అని కూడా అర్థం ఉత్తమాంగం అంటే తల. అన్నిటికంటే శ్రేష్ఠమైనది ఉత్తమం వ్యాకరణంలో పరిభాషగా ఉత్తమం అనే మాటను వాడతారు రెండుకంటే ఎక్కువ అక్షరాలున్న మాటలో చివరి అక్షరానికి ఉత్తమం అని పేరు

ఉత్తరణం అంటే దాటడం ఉత్తారం అంట దాటించడం ఉత్తారణం అంటే దాటించ డమూ, దాటించినదీ కూడా ఈ దాటించడం ప్రవాహాన్ని దాటించి అవతలి ఒడ్డుకు చేర్చడమూ కావచ్చు ఆపద నుండి కాపాడడమూ కావచ్చు తెలుగులో గట్టెక్కించాడన్న జాతీయం ఉంది కదా ఒడ్డున పడేయడం అనికూడా అంటారు కష్టం తప్పించడం ఉత్తీర్ణం అంటే దాటబడినది కృతార్థం ఉత్తీర్ణత, ఉత్తీర్ణుడు బాగా వాడుకలో ఉన్న మాటలు పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడంటే కృతార్థుడయ్యాడన్నమాట పాస్ కావడం

ఉత్పధం అంటే పధాన్ని అతిక్రమించడం అంటే మార్గాన్ని దాటిపోవడం నడవవలసిన మార్గంలో నడవకపోవడం తప్పుతోవలో నడవడమన్నమాట అన్యాయమార్గం

ఉద్ధరణం వెలికి తీయడం, పైకి ఎత్తడం. ఉద్ధారణం అన్నా ఇదే అర్థం ఉద్ధరణ, ఉద్ధారణ అనివాడతాం ఉద్ధారం అనికూడా అనవచ్చు ఉన్నయం అన్నా పైకెత్తడమే ఉన్నాయం అన్నా అంతే ఉన్నమనం అన్నా పైకి ఎత్తడమే ఉద్ధరించడం ఎర్రనగారు 'అరణ్యపర్వ శేషోన్నయ మాచరించి' అన్నారు అరణ్యపర్వ శేషాన్ని ఉద్ధరించి అని అర్థం వేదాల తిరువేంగళాచార్యులు గారు ఈ ప్రయోగాన్ని ఆధారం చేసుకొనే ఎర్రన అరణ్య పర్వాన్ని పూరించలేదు, శేషోద్ధరణమే చేశారని వాదించారు అరణ్య పర్వంలో కొంత భాగం పాడయిపోతే ఆ భాగాన్ని ఎర్రన ఉద్ధరించాడు అని అయన వాదం ఉద్ధరించడం అంటే రక్షించడం అని కూడా అర్థం ఉద్ధర్త, ఉద్ధారకుడు అంటే ఉద్ధరించేవాడు ఉద్ధారం అంటే మరొక అర్థం కూడా ఉంది దాయపు సొత్తులో జ్యేష్ఠునికి ఎక్కువ భాగం ఇస్తారు జ్యేష్ఠునికి లభించే ప్రత్యేక భాగాన్ని ఉద్ధారం అంటారు యుద్ధంలో అవతలి పక్షాన్ని కొల్లగొట్టడం వగైరా ఉంటుంది ఇటువంటి సందర్భంలో లభించిన ధనంలో ఆరోవంతు రాజుకు చెందుతుంది దీన్నికూడా ఉద్ధారం అనే అంటారు

ఉద్ధరణి అంటే నీళ్ళు ఎత్తి చేతిలో పోసుకోవడానికి ఉపయోగించే సాధనం ఉద్ధృతం, ఉద్ధృతి అంటే ఉద్ధరింపబడింది. పైకి ఎత్తబడినది అని అర్థం కాని ఈ మాటను వరద ఉద్ధృతంగా ఉంది' వంటి వాక్యాలలో వాడుతున్నారు విజృంభణ, చెలరేగు అన్న అర్థం ఈ మాటకు లేదు బహుశా ఉద్ధతి సామ్యం వల్ల ఈ మాటకు ఇటువంటి ప్రయోగం ఏర్పడి ఉండవచ్చు. ఈ వాక్యం మహాభారతం నుండి ఉద్ధృతం అంటాం. మహాభారతం నుండి ఎత్తి తీసికొన్నది అని అర్థం కోట్ చేయడం అన్న అర్థంలో ఉద్ధరించు అని వాడుతున్నాం

☆

# ఉద్దేశం - ఉద్దేశ్యం

నా అభిప్రాయం అదికాదు అని చెప్పడానికి కొందరు నా ఉద్దేశ్యం ఇది కాదు అంటుంటారు. ఈ సందర్భంలో ఉద్దేశం అన్నమాటను వాడడం సముచితంగా ఉంటుంది ఉద్దేశం అంటే లక్ష్యం, గురి, ఉపదేశం, అభిప్రాయం, అభిలాష అని అర్థాలు ఉత్ అంటే ఎత్తయిన అన్న అర్థమూ ఉంది కాబట్టి ఉద్దేశం అంటే ఎత్తయిన ప్రదేశమనీ, శ్రేష్ఠమయిన ప్రదేశమనీ కూడా అర్థం గురిగా చేయదగినది, వివరింపదగినది, ఉపదేశింపదగినది, అభిలాషకు అభిప్రాయానికి విషయ మయిన వస్తువు ఉద్దేశ్యం ఉద్దేశం – ఉద్దేశ్యం రెండు మాటలకు అర్థం వేరు అందువల్ల వీటిని ఒక దాని స్థానంలో ఒకదాన్ని వాడకూడదు ఉద్దిష్టం అంటే కోరబడింది, ఉద్దేశింపబడింది

ఉద్దీపనం అంటే జ్వలించడం, ప్రకాశించడం ఈ మాటకు పురికొల్పడం అని కూడా అర్థం ఉద్దీపింపజేయడం అంటే ప్రకాశింపజేయడం ఉద్దీప్తం అంటే వెలిగినది అని అర్థం. రేగినది అన్న అర్థమూ ఉంది క్రోధం ఉద్దీప్తమయింది అని వాడవచ్చు. ఉద్యోతం అంటే ప్రకా శింపజేసేది ఉత్తేజం అంటే ఉద్దీపనమని అర్థం ఈ మాటకు ప్రేరణ, సాన పట్టడం అన్న అర్థాలు కూడా ఉన్నాయి ఆయన చాలా ఉత్తేజకరంగా మాట్లాడాడు అన్నప్పుడు ప్రేరణ కలిగేట్లుగా మాట్లాడాడని అర్థం

ఉత్పత్తి అంటే పుట్టడం ఉత్పాదం, ఉద్భవం, ఉద్భవనం అన్న మాటలు పర్యాయపదాలు ఉత్పాదన, ఉత్పాదనం అంటే పుట్టించడం, ఉత్పాద్యం అంటే పుట్టింపదగింది. ఉత్పాదకం అంటే పుట్టించేది ఉత్పన్నం అంటే పుట్టినది. ఉత్పన్నభక్షి అని ఒక మాట ఉంది వీడు కష్టపడి జీవించేవాడు ఎప్పుడు దొరికింది అప్పుడు తినేవాడు

ఉత్ ఉపసర్గకు బిగ్గరగా అన్న అర్థం ఉంది ఉత్క్రోశం అంటే మొరపెట్టడం బిగ్గరగా పిలవబడినది ఉత్క్రుష్టం ఉత్కృష్టం అంటే శ్రేష్ఠం ప్రధానమైనది

ఉత్స్వనం అంటే పెద్ద ధ్వని ఉదగ్రం అంటే ఎత్తయినది. గొప్పది, పెద్దది ఈ మాటకు భయంకరమయినది అన్న అర్థం కూడా ఉంది. ఉదీర్ణం అంటే గొప్పది

ఉద్గీతి అంటే గట్టిగా పాడడం, సామగానం చేయడం ఉద్ఘోష అంటే గట్టిగా చాటడం క్రియాపదంగా ఉద్ఘోషించారు అని వాడుతున్నాం.

ఉద్ధూతం అంటే గట్టిగా పిలవబడినది ఈ మాటకు చెదరగొట్టబడినది అన్న అర్థం కూడా ఉంది ఉన్ముఖరం అంటే పెద్దగా మోగేది. ఉత్కీర్తనం అంటే బిగ్గరగా పలకడం

ఉత్‌కు అధికం అన్న అర్థం కూడా ఉంది ఉత్కటం అంటే మిక్కిలి తీక్షణమైనదని, పెద్దదని, బలమైనదని అర్థాలు తాపం అంటే వేడి ఉత్తాపం అంటే మిక్కిలి వేడి ఉత్తారం అంటే మిక్కిలి ధ్వని

ఉద్దంతురం అంటే మిక్కిలి పొడవైనది. విపరీతమైన ఎత్తు పల్లాలుండడం కూడా ఉద్దం తురమే ఉద్దంతురం అంటే ఎత్తుపళ్ళు కలిగిందని కూడా అర్థం ఉద్దాంతం అంటే మిక్కిలి అణచ బడింది

ఉద్భలుడు అంటే చాలా బలం కలిగినవాడు ఉన్మయూఖం అంటే మిక్కిలి మెరిసేది. ఉత్ప్రభ అంటే మిక్కిలి కాంతి ఉచ్చండం అంటే మిక్కిలి వేడి అయినది. మిక్కిలి ఉగ్రమయినది.

ఉత్తరంగం అంటే పైకి తరంగాలు కలిగినది తటాలున ఎగిరిపడేది ఉత్తుంగం అంటే ఎత్తయినది ఉద్గాఢం అంటే అధికం, ఎక్కువ

ఉత్కృతి అంటే గొప్ప పని కృతి అంటే కావ్యం అనికూడా అర్థం అందువల్ల ఉత్కృతి గొప్ప కావ్యం, రచన అని అర్థం ఉద్గ్రంథం అన్నా గొప్ప పుస్తకమే ఉత్ప్రబంధం అన్నా గొప్ప గ్రంథమే

ఉద్ఘాటన అంటే పైకి లాగడం హిందీలో ఈ మాటను ప్రారంభోత్సవం అన్న అర్థంలో వాడుతున్నారు పైకిలాగడం అన్న అర్థంవల్ల నీళ్ళు చేదే సాధనానికి కూడా ఉద్ఘాటన అని పేరు వచ్చింది ఉద్ఘాతం అంటే దెబ్బ ఈ మాటకు ఆరంభం అన్న అర్థమూ ఉంది నాటకంలో ఉద్ఘాత్యకం అన్న అంగం ఉంది ప్రథమాంక ఆరంభ విధానాన్ని ఇది సూచిస్తుంది ప్రస్తావన నుండి తొలి అంకంలోకి ప్రవేశించే పద్ధతులలో ఇది ఒకటి ప్రస్తుతానికి సంబంధించని సంభాషణను ఆధారం చేసుకొని ప్రస్తుతానికి సంబంధించే అర్థాన్ని అన్వయిస్తూ పాత్ర ప్రవేశం చేస్తుంది విశాఖదత్తుడు ముద్రా రాక్షసంలో ఉద్ఘాత్యకాన్ని ప్రయోగించాడు ఈ నాటక ప్రస్తావనలో సూత్రధారుడు 'క్రూర గ్రహమయిన ఆ కేతువు అసంపూర్ణ మండలుడయిన చంద్రుణ్ణి బలవంతంగా మింగాలనుకుంటున్నాడు' అని అంటాడు అప్పుడు ఆ ఎవడురా వీడు నేనుండగానే అని విని పిస్తుంది 'ఆ ఎవడురా వీడు నేనుండగానే చంద్రగుప్తుని బలాత్కారంగా ఆక్రమించదలచే వాడు అంటూ ప్రథమాంకంలో చాణక్యుడు ప్రవేశిస్తాడు సూత్రధారుని మాటల్లోని చంద్రుణ్ణి చంద్రగుప్తునిగా భావించాడు చాణక్యుడు

ఉపోద్ఘాతం అంటే కథా ప్రారంభం ముందుమాట ను కూడా ఉపోద్ఘాతమంటున్నాం ఉద్గ్రహణం అంటే పైకెత్తి పట్టుకోవడం ఉద్గ్రీవుడు అంటే మెడ పైకెత్తినవాడు ఎవడు మెడ పైకెత్తుకొని ఉంటాడు? గర్వి. గర్వం కలిగినవాడన్నమాట

ఉద్ఘరణం, ఉద్ఘట్టనం ఈ రెండింటికీ ఒరపిడి అని అర్థం ఉత్పీడం, ఉత్పీడనం అన్నా రాపిడే.

ఉద్దండం అంటే ఎక్కువ అనీ, భయంకరమనీ అర్థం ఉద్దండం అన్నమాటకు నేటి వ్యవహారంలో ఎక్కువ ప్రచారం లేకపోయినా ఉద్దండుడు అన్నమాటను మాత్రం విస్తృతంగానే వాడుతున్నారు, ఈ మాటను ప్రశంసాత్మకంగానూ, వ్యంగ్యంగానూ వాడతారు

ఉద్దాముడు అన్నమాట కూడా ఉంది భయంకరుడని అర్థం ఉద్దాముడు స్వతంత్రుడు, ఎటువంటి కట్టూ లేనివాడు గర్వితుడు, గంభీరుడు ఉద్ధతి, ఉద్ధతం అన్నమాటలు కూడా గర్వించినది, అణకువ లేనిది అన్న అర్థంలో వాడుకలో ఉన్నాయి ఉద్ధతుడు అనికూడా వాడుతున్నాం ధీరోదాత్తుడు, ధీరోద్ధతుడు, ధీరలలితుడు, ధీరశాంతుడు అని నాయకులు నాలుగు రకాలు నాయకుడిలో ధీరోదాత్త లక్షణమూ, ప్రతి నాయకుడిలో ధీరోద్ధత లక్షణమూ కనిపిస్తుంది సాధారణంగా. భీముడు, దుర్యోధనుడు వంటి వారిని నాయకులుగా చేస్తే ధీరోద్ధత నాయకులవుతారు శ్రీరాముడు, ధర్మరాజు వంటివారు ధీరోదాత్తులు

ఉన్మాదం అంటే ఎక్కువ మదం ఉన్మాదం కలవాడు ఉన్మాది ఉన్మాదికే మరో రూపం ఉన్మత్తుడు వెర్రెత్తినవాడు ఉమ్మెత్త మదాన్ని కలిగిస్తుంది కాబట్టి దానికి ఉన్మత్త అని పేరు

☆

# ఉత్పత్తి - ఉద్యోగం

'ఉత్' ఉపసర్గకు శ్రేష్ఠమన్న అర్థం వస్తుంది ఉత్తంసం అంటే శ్రేష్ఠమని అర్థం ఉత్తంసుడు అంటే శ్రేష్ఠుడు ఉత్తంసం అంటే శిరోభూషణమని కూడా అర్థం ఉద్భటుడు అన్నా శ్రేష్ఠుడనే అర్థం ఉద్భటం అంటే శ్రేష్ఠం సంస్కృతంలో ఉద్భటుడనే కవి ఉన్నాడు భక్తుడూ ఉన్నాడు ఇతని కథే ఉద్భటారాధ్య చరిత్రం ఉన్నామం అంటే ఉత్కృష్టమయిన పేరు

ఉత్కరం అంటే పొడవైనదని అర్థం రాశి, గుంపు అన్న అర్థం కూడా ఉంది ఉద్ధరం అంటే నిండినది దృఢమనీ దట్టమనీ కూడా అర్థం ఉద్ధురమనే మాటకు బరువు దించినది అన్న అర్థమూ ఉంది ఇక్కడ వ్యతిరేకార్థం ఇటువంటిదే ఉన్నిద్రం అనేమాట నిద్రలేనిది అని అర్థం ఉచ్చక్షువు అంటే కన్నులు లేనిది, గుడ్డిదని అర్థం ఉచ్ఛృంఖలం అంటే శృంఖలం లేనిది కట్టు లేనిది ఉన్మజ్జనం అంటే తేలడం ఉన్మార్గం అంటే తప్పుతోవ

లంచం అన్నమాటకు ఉత్కోచం అనే పర్యాయపదం ఉంది లంచం పుచ్చుకొనేవాణ్ణి, లంచగొండిని ఉత్కోచకుడు అనవచ్చు

ఉత్ఖాతం అంటే పెల్లగింపబడినది ఉత్తపితం అంటే తాపబడినది ఉత్కంపం అన్నా ఉత్కంపనం అన్నా వణకడం ఉత్కర్తనం అంటే తెంచడం, కత్తిరించడం ఉత్క్లేశం అంటే వ్యధ ఉత్కషణం అంటే దున్నడం ఉత్కారం అంటే తూర్పెత్తడం ధాన్యాన్ని ఎత్తుగా రాశిపోయడాన్ని కూడా ఉత్కారం అంటారు ఉత్కాసనం ఒక విధమయిన దగ్గు శ్లేష్మం పడిపోయే దగ్గు కీలితం అంటే మేకు/మేకులు కొట్టబడినది ఉత్కీలితం అంటే మేకులు కొట్టబడింది అన్న అర్థం ఉంది ఉత్కూజం అంటే కూత ఉత్కూటం అంటే గొడుగు ఉద్ధూపనం అంటే పొగవేయడం ఉద్బాష్పం అంటే కన్నీరు కార్చేది ఉద్భాసం అంటే కాంతి

భూ ధాతువుతో ఏర్పడే మాటలకు 'ఉత్' చేర్చి చాలా మాటలు తయారు చేయవచ్చు ఉద్భవం అంటే పుట్టుక ఉద్భావం అని కూడా అనవచ్చు ఉద్భవనం, ఉద్భావనం అన్నా పుట్టుక అనే అర్థం ఉద్భూతం అంటే పుట్టినది ఉద్భూతి అన్నా అదే అర్థం

ఉత్పత్తి అన్నా పుట్టుకే. ఉత్పాదన అంటే పుట్టించడం. ఉత్పాద్యం అంటే పుట్టింపదగింది ఉత్పత్తి, ఉత్పాదన అన్న మాటలకు నేడు చాలా వాడుక ఉంది వ్యవసాయ ఉత్పత్తులు, పారిశ్రామిక ఉత్పత్తులు అని వాడుతున్నాం ప్రొడక్టు అన్న ఇంగ్లీషు మాటకు సమానార్థకంగా ఈ మాటను వాడుతున్నాం విద్యుదుత్పాదన అంటున్నాం ఉత్పాదకం అంటే పుట్టించేది ఉత్పత్తి, ఉత్పాదన అన్న రెండు మాటలను పుట్టుక, పుట్టించుట అన్న అర్థాలలో వాడవచ్చు.

వివాహం లాంటిదే ఉద్వాహం ఈ మాటలో వహ' అన్నది ధాతువు ఈ ధాతువుకు మోయడం అని అర్థం. ఉద్వహం, ఉద్వాహం, ఉద్వహనం, ఉద్వాహనం ఈ మాటలన్నింటికీ పెళ్ళి అని అర్థం దీనినుండే ఉద్వహ అన్నమాట ఏర్పడింది ఉద్వహ అంటే కూతురు ఉద్వహుడు అంటే వంశం మొదలయినవి క్షయం పొందకుండా ఉద్ధరించేవాడు, ముఖ్యుడు బుధ ధాతువుకు తెలియడం అని అర్థం ఉద్బోధం, ఉద్బోధనం అంటే మేలుకోవడం ఉద్బోధకం అంటే మేలుకొల్పేది ఉద్బుద్ధం అంటే మేలుకున్నది ఉద్బోధించు అని క్రియగా ఈ మాటను తెలుగులో ప్రచురంగా వాడుతున్నాం

ఉద్భేదం, ఉద్భేదనం అంటే చీల్చడం అని అర్థం ఉద్భిన్నం అంటే చీల్చబడినది ఉద్భిదం అంటే చెట్టు, పొద, లత, గడ్డి మొదలయిన వాటిలో ఏదైనా భూమిని ఛేదించుకొని, ప్రక్క

లించుకొని పుడతాయి అవి  అందువల్ల వీటికి ఉద్భిదాలని పేరు  ఉద్భిత్తు అని కూడా అనవచ్చు ఉద్భిజ్జం అని కూడా అనవచ్చు

ఉద్ధృతి ఉద్ధృతం అంటే పైకెత్తబడినది  యత్నించినది అనికూడా అర్థం  ఉద్యమం అన్నా అదే అర్థం  ఉద్యమం అంటే ప్రయాస అనీ అర్థం  ప్రయత్నం  మూవ్‌మెంట్ అన్న ఇంగ్లీషు మాటకు సమానార్థకంగా ఈ మాటను విస్తృతంగా వాడుతున్నాం  ఉద్యోగం అన్నమాటను కూడా ఉద్యమానికి సమానార్థకంగా వాడవచ్చు  క్రియగా ఉద్యమించారు, ఉద్యోగించారు సమానార్థకాలు  ప్రారంభించారు అని అర్థం  ఉద్యోగం అంటే ఉత్సాహం అన్న అర్థమూ ఉంది  కాని ప్రయత్నం, పూనిక  పని, పాటుపడడం అన్న అర్థాలలో వాడుక ఎక్కువ  జాబ్, ఎంప్లాయ్‌మెంట్ అన్న ఇంగ్లీషు మాటలకు సమానార్థకంగా విస్తృత ప్రచారంలో ఉంది  హిందీలో ఈ మాటను పరిశ్రమకు సమానార్థకంగా వాడతారు  లఘు ఉద్యోగ్ అంటే చిన్న పరిశ్రమ  ఉద్యోగి అంటే వ్యాపారం/పనికలవాడని అర్థం  తెలుగులో ఎంప్లాయీ అన్న అర్థంలో వాడుతున్నాం  ఉద్యోగస్థుడు అని కూడా అంటాం  ఉద్యుక్తం అంటే పూనినది అని అర్థం

ఉద్యాపన అంటే విడిచిపెట్టడం  వ్రతాలు, పూజలు ముగించడాన్ని ఉద్యాపనం అంటారు ఉద్యాపన చేయు అని క్రియగా కూడా వాడతాం  ఉద్యాపితం అంటే ముగింపబడింది  ఉద్వాపం అంటే పారవేయడం, వేళ్ళతోసహా పెకలించటం  ఉద్వాసం, ఉద్వాసనం అంటే తొలగించడం ఉద్వాసం అన్నమాటకు ఊరినుండిగాని, ఇంటినుండిగాని వెళ్ళగొట్టడం అని అర్థం  ఉద్వాసన చెప్పడం అని వాడతాం  వెళ్ళగొట్టడం, ఉద్యోగం నుండి తొలగించడం అని అర్థం  ఉద్వాస్యం అంటే ఉద్వాసం చేయదగింది  ఉద్రేకం అంటే అతిశయమనీ, విజృంభణమనీ అర్థం  ఉద్వేగం అంటే భయం, వణకు, వేగంగా పోయేది

ఉద్భ్రమం అంటే చుట్టూ తిరగడం  ఉద్వేష్టం, ఉద్వేష్టనం అంటే చుట్టుకోవడం  ఉన్నతి, ఉన్నతం అంటే ఎత్తయినది  ఉద్వేలం అంటే వేలను దాటినది  వేల అంటే గట్టు  ఉచ్ఛాస్త్రం అంటే శాస్త్రాన్ని మీరినది  అంటే శాస్త్ర విరుద్ధం

ఉద్యానం అంటే విహారం కోసం వెళ్ళడం  విహారం కోసం వెళ్ళే తోటకూడా ఉద్యానమే ఉద్యానవనం అని కూడా అంటాం

ఉచ్చయం అంటే పూవులు మొదలయినవి కోయడం  ఉచ్చయం అంటే సమూహం కూడా  సముచ్చయం అనికూడా అంటాం  ఉచ్చాటం, ఉచ్చాటనం అన్న మాటలకు పెల్లగించడం, స్వస్థానం నుండి వెళ్ళగొట్టడం అని అర్థం  ముఖ్యంగా పిశాచాదులను వెళ్లగొట్టడం అన్న అర్థంలో ఈ మాట బాగా వాడుకలో ఉంది

ఉచ్ఛిత్తి, ఉచ్ఛిన్నం అంటే నిర్మూలనం, నిర్మూలితం  ఉచ్ఛిష్టం అంటే తినగా మిగిలింది 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అని నానుడి  దిండును ఉచ్ఛీర్షకం అంటారు  తలను ఎత్తుగా ఉంచేది ఉచ్ఛ్వసనం, ఉచ్ఛ్వాసం గాలిని లోపలికి పీల్చడం  గ్రంథంలో ప్రకరణాన్ని కూడా ఉచ్ఛ్వాసం అంటారు.

ఉజ్జీవకుడు అంటే జీవింపజేసేవాడు  ఉజ్జ్వలం అంటే జ్వలించేది  ఉన్మార్జనం అంటే తుడిచివేయడం  ఉన్మిశ్రం అంటే సంకీర్ణం  ఉన్మీలనం అంటే కన్ను తెరవడం  ఉన్ముక్తం అంటే విడువబడినది  ఉన్ముఖం అంటే ఎదురు చూచేది  సిద్ధమైనది  ఉన్మూలం, ఉన్మూలనం అంటే అడుగంట చెరచేది  ఉన్మేషం, ఉన్మేషణం అంటే వికసించడం  ఉన్మోచనం అంటే విడవడం



# అభ్యాగతుడు - అభిసారిక

ఉపసర్గలు అనేకార్థాలను కలిగిస్తాయి ఒకే అర్థంలో అనేక ఉపసర్గలూ వస్తాయి 'అభి' ఒక ఉపసర్గ ఇది చేరినప్పుడు కూడా కొన్ని అర్థ విశేషాలు కలుగుతాయి కొన్ని సందర్భాలలో అర్థ భేదం లేకపోవడమూ గమనించవచ్చు

అభిక్రమం అంటే ఎదుర్కోవడం ఎదురుగా నడవడం ఇది శత్రువులకు ఎదురుగా పోవడం యుద్ధ యాత్ర ఇక్కడ 'అబి ఉపసర్గకు 'ఎదురు' అని అర్థం అభిక్రమణం, అభిక్రాంతి అన్న మాటలకు కూడా ఇదే అర్థం అబిగంత అంటే ఎదురుగా పోయేవాడు అభిగతం అంటే ఎదుర్కొబడింది అభిగమం అన్నా, అబిగమనం అన్నా ఎదురుగా పోవడమని అర్థం అభిగ మించు అని క్రియగా కూడా దీన్ని వాడవచ్చు అభిగమ్యం అంటే ఎదురుగా పోదగింది అభి గామి, అభిగాముకుడు అంటే ఎదురుగా పోయేవాడు అభిగ్రహం, అభిగ్రహణం అన్నా ఎదు రుగా పోవడమనే అర్థం యుద్ధంలో ఎదురుగా పోవడమే అయితే గ్రహధాతువుకు తీసుకోవడ మని కూడా అర్థం కాబట్టి అబిగ్రహణానికి ఎదురుగా పుచ్చుకోవడమనే అర్థమూ వచ్చింది చూస్తూ ఉండగానే దొంగతనం చేయడం దారికొట్టడం

అభిచారం, అభిచరణం అంటే హింసాకర్మ శత్రువులను హింసించడం కోసం చేసే కర్మ. ఇతరులను తిరస్కరించడం కోసం ఆచరించే కర్మ అధర్వణ వేదంలో చెప్పిన హోమాదికర్మ దీనికి ఫలం హింస పిశాచాదులను వదిలించడానికి చేసే కర్మను కూడా అభిచారం అంటారు. ఇటువంటి కర్మకాండ మీద ప్రపంచమంతటా నమ్మకాలున్నాయి ఏదో ఒకవిధి ప్రతి దేశంలోనూ ప్రచారంలో ఉంది జనంలో ఉన్న నమ్మకాలను ఆధారంగా చేసుకొని మోసం చేసే వారూ ఎందరో ఉన్నారు ఈ అభిచారకర్మ చేసేవాణ్ణి అభిచారి అనీ, అభిచారకుడు అనీ అంటారు. అభి చారం వల్ల కలిగే జ్వరాన్ని అభిచార జ్వరం అంటారు

అభిడీనం అంటే ఎదురుగా ఎగరడం.

అభినయం అంటే అర్థాన్ని వ్యక్తం చేసేది. హృద్గతమయిన భావ సూచన నాట్యంలో దీన్ని వాడతారు అభినయం నాలుగు విధాలుగా ఉంటుంది ఆంగికం, ఆహార్యం, వాచికం, సాత్త్వికం ఆంగికం అంటే అంగచలనం వల్ల భావవ్యక్తీకరణ ఆహార్యం వేషం వాచికం భాషణ. స్వేదబాష్పాదులు సాత్త్వికాలు సాత్త్వికాభినయం క్లిష్టమయింది అభినయించు అంటే నటించు అభినేత అంటే నటుడు రంగ స్థలానికి వర్తించే ఈ మాటలను సాధారణ సందర్భాలలోనూ వాడుతున్నాం

అభినిర్ముక్తుడు, అభ్యుదితుడు అని రెండు మాటలున్నాయి సూర్యుడస్తమిస్తూ ఉన్నప్పుడు నిద్రపోతూ ఉండే బ్రాహ్మణుడు అభినిర్ముక్తుడు సూర్యుడు ఉదయించినప్పుడు నిద్రపోతూ ఉండే బ్రాహ్మణుడు అభ్యుదితుడు ఇప్పుడు వాడదలిస్తే ఈ మాటలు ఎవరికయినా వాడవచ్చు

అభినిర్యాణం అంటే ఎదురుగా కదలిపోవడం దండెత్తడం, సైన్యంతో సహా శత్రువు మీదికి దండెత్తిపోవడం, అభిషేణనం అభినీతం అంటే ఎదురుగా తేబడినది యోగ్యమైనది అభి పతనం అంటే ఎదురుగా పోవడం అభి పత్తి అన్నా అదే అర్థం.

అభిభవం, అభిభవనం అంటే ఆక్రమించడం, తిరస్కారం ఈ మాటకు పరాజయం అన్న

ప్రయోగా ఉంది  అభిభవించు అంటే అవమానించు అని అర్థం  ఈ అర్థంలో అభిభావి అభి భావుకుడు అభిభావుకుడు అన్న మాటలను వాడవచ్చు  అభిభూతి అంటే అవమానం పరాభవం  అభిభూతుడు అంటే పరాభవింపబడిన వాడు  గర్వితుడై శత్రురాజు చేతిలో ఓడిపోయిన వాడు

అభిమనస్కుడు అంటే కార్యానికి అభిముఖమయిన మనస్సు కలవాడు  ఈ పని చేయాలి అని అనుకూల మనస్సు కలిగిన వాడు  అభిముఖం అంటే ఎదురుగా ఉన్నది  అభిముఖంగా ఉంది అంటే ఎదురుగా ఉంది అనీ, అనుకూలంగా ఉందనీ అర్థం  అభిముఖుడు అంటే అను కూలుడు  అభిముఖం నుండే ఆభిముఖ్యం అన్నమాట ఏర్పడింది  ఆభిముఖ్యం అంటే అను కూలత  ఆనుకూల్యం

అభియానం అంటే ఎదురుగా పోవడం  దీనినుండే అభియాత, అభియాతి అనే మాట లేర్పడ్డాయి  శత్రువని అర్థం  అభియోగం అనేమాటకు ఎదురుగా రావడమని అర్థం  అభియోగం అంటె వ్యాజ్యం, నేరంమోపడం అన్న అర్థాలు ఇప్పుడు ఎక్కువ ప్రచారంలో ఉన్నాయి  శత్రువును ఎదిరించడం  ముట్టడి అన్న అర్థం కూడా ఉంది  పూనిక, ఆసక్తి, పట్టుదల, శపథం అన్న అర్థాలూ ఉన్నాయి  పాండిత్యం అన్న అర్థమూ ఉంది  అభియోజనం అన్నా ఇదే అర్థం  అభి యోగి  అభియోక్త అంటే ఎదిరించేవాడు, నేరం మోపేవాడు  అభియుక్తుడు అంటే ఎదుర్కొన బడినవాడు

అభిలంఘనం అంటే దాటడం, మీద పడడం  అభివర్తనం అంటే ఎదురుగా రావడం  అభి వర్తి అంటె ఎదురుగా వచ్చేవాడు

అభిసంపాతం అంటే యుద్ధం  ఎదురెదురుగా వచ్చి తాకుతారు కాబట్టి అభిసంపాతం అభ్యామర్దం అన్నా యుద్ధమే  అభ్యాగమం అన్నా యుద్ధమే  అభ్యాగమనం అనికూడా అనవచ్చు ఈ మాటలకు ఎదురుగా రావడమన్న అర్థమూ ఉంది  అభ్యాగతుడు అనేమాట దీనినుండే ఏర్ప డింది  అభ్యాగతుడు అంటే వచ్చినవాడు  తిథి, పర్వం, ఉత్సవం మొదలయిన సందర్భాలలో వచ్చేవాడు  అతిథి, అభ్యాగతుడు అనే రెండు మాటల్ని కలిపి అతిథి అభ్యాగతులని వాడుతూ ఉంటాం  అభ్యాగతుడు రావడానికి ఒక సందర్భం ఉంటే అతిథికి అటువంటి సందర్భం ఉండదు  అనుకోకుండా ఊడిపడతాడు  అతిథి అంటే ఎప్పుడూ తిరిగేవాడు  అతిథిని ఆవేశి కుడు, ఆగంతువు అనికూడా అంటారు  ఆవేశికుడు అంటే తన ఇంటి నుండి వచ్చినవాడు  ఆగం తువు అంటే వచ్చినవాడు. ఇప్పుడు అభ్యాగతుడనే మాట అతిథి అభ్యాగతులన్న ద్వంద్వ సమా సంలో తప్ప విడిగా ఎక్కువగా వాడుకలో లేదు  ఈ రెండు మాటలకూ భేదాన్ని కూడా పాటిం చడం లేదు

అభిసరణం అంటే సంకేత స్థానానికి పోవడం  అభిసారిక అంటే అభిసరించే స్త్రీ  అష్టవిధ శృంగార నాయికలలో అభిసారిక ఒక నాయిక  స్వాధీనపతిక, ఖండిత, అభిసారిక, కలహాంత రిత, విప్రలబ్ధ, ప్రోషిత భర్తృక, వాసక సజ్జిక, విరహోత్కంఠిత అని శృంగార నాయికలు ఎనిమిది రకాలు  ప్రియుని తన వద్దకు రప్పించుకొనేది, తానే ప్రియుని వద్దకు వెళ్ళేది అభిసారిక  అభి సారికలు మూడు విధాలు  జ్యోత్స్నాభిసారిక వెన్నెలలో అభిసరించేది. తెల్లని దుస్తులు, తెల్లని పూలు, గంధం, తెల్ల ముత్యాల హారాలు ధరించి ఈమె అభిసరిస్తుంది  తమోభిసారిక చీకటిలో

అభిసరించేది నల్లని దుస్తులు, నల్ల కలువలు మొదలయినవి ధరించి అభిసరిస్తుంది ఈమెనే తమిస్రాభిసారిక అనికూడా అంటారు దివసాభిసారిక అందరూ ఏవో పనులలో మునిగి ఉండగా ఏదో ఒక వంక పెట్టుకొని అభిసరించేది ఈ అభిసారికలు స్వీయలూ కావచ్చు, పరకీయాలూ కావచ్చు, సామాన్యలూ కావచ్చు సామాన్య అయినప్పుడు ఉజ్జ్వలాభిసారిక అనికూడా అంటారు అభిసారికను అభిసారిణి అని కూడా అనవచ్చు

అభిసారం, అభిసారణం అనేమాటలకు నాయకుడు నాయికను గాని, నాయిక నాయకుని గాని సంకేత స్థానానికి రప్పించుకోవడం అని అర్థం అభిసారి అంటే అభిసరించేవాడు ఎదురుగా పోయేవాడు, ఎదుర్కొనేవాడు అభిసరుడు అభిసారుడు అంటే అనుచరుడని అర్థం

అభ్యుత్థానం అంటే లేవడం ఎదురు రావడం పెరగడం ఎవరయినా వచ్చినప్పుడు లేచి ఎదురు వెళ్ళి ఆహ్వానించడం అభ్యుత్థానం

☆

# అభిజ్ఞుడు - అభిజ్ఞానం

'అభి' ఉపసర్గకు సమీపం అన్న అర్థం కూడా ఉంది అభిగామి, అభిగాముకుడు అంటే సమీపించేవాడు అభినిధనం అంటే చావుకు సిద్ధంగా ఉన్నది అభిపత్తి అంటే సమీపించడం అభి పన్నుడు అంటే సమీపించినవాడు అభ్యగ్రం అంటే సమీపంలోనిది, అభ్యర్ణం సమీప దేశం లేదా సమీప కాలం అభ్యుపగతి, అభ్యుపగతం అంటే సమీపించినది అని అర్థం అభిగమం అభి గమనం అంటే సమీపించడం, అభిగతం అంటే సమీపించబడినది అభిగంత అంటే సమీపించే వాడు

'అభి కి అంతటా అన్న అర్థమూ ఉంది అభిచరించడం అంటే అంతటా తిరగడం అభి చరుడు అంటే అంతటా తిరిగేవాడు అభిజ్ఞులు అన్నమాటను విస్తృతంగా వాడుతున్నాం ఇందులో 'జ్ఞా' అంటే తెలియడం అభిజ్ఞుడు అంటే అంతటా వస్తుతత్వాన్ని ఎరిగినవాడు అని అర్థం బాగా తెలిసినవాడు, నిపుణుడు, పండితుడు అభిజ్ఞుల ఉవాచ అంటాం ఆ విషయం బాగా ఎరిగినవారు చెప్పారని అర్థం అభిప్రవర్తనం అంటే అంతటా ప్రవర్తించేది అభిప్రవృత్తం అంటే అంతటా వ్యాపించినది

అభిప్లవం అంటే అంతటా వెల్లివిరియడం ప్లవ శబ్దానికి తెప్ప అనీ, కప్ప అనీ, నీరుకోడి అనీ, తుంగముస్త అనీ అర్థాలున్నాయి దాటించేది, గంతులు వేసేది, నీటిలో తేలేది ప్లవ శబ్దానికి క్రూరకర్మకోసం పోయేవాడు, నిషాదుడన్న అర్థం కూడా ఉంది విప్లవం అన్నప్పుడు దేశోపద్రవం అన్న అర్థం ఉన్నట్లుగానే అభిప్లవం అన్నా ఉపద్రవం అన్న అర్థం ఉంది అభిప్లుతం అంటే అంతటా తడపబడింది అనీ, అంతటా వ్యాపించినది అనీ అర్థం

అభిరక్ష అంటే పూర్తిగా రక్షించడం అభిరక్షణం అన్నా అదే అర్థం అభిరక్షకుడు అంటే పూర్తిగా రక్షించేవాడు అభిరక్షితుడు అంటే రక్షింపబడేవాడు

అభిలీనం అంటే అణగి ఉన్నది అన్న అర్థంతోపాటు వ్యాప్తం అన్న అర్థమూ ఉంది. అభి వ్యాపకం అంటే అంతటా వ్యాపించేది అభివ్యాప్తి అంటే అంతటా వ్యాప్తి చెందడం ఈ మాటను విస్తృతంగా వాడుతున్నాం

అభిసంచారి అంటే అంతటా తిరిగేవాడు అభిసంచారం అంటే అంతటా తిరగడం

'అభి'కి మిక్కిలి అనికూడా అర్థం. అభితాపం అంటే మిక్కిలి వేడి అభినమ్రం అంటే మిక్కిలి వంగినది అని అర్థం వంగడం విధేయతకు కూడా చిహ్నం. అందువల్ల అభినమ్రం అంటే మిక్కిలి విధేయమైనది అనికూడా అర్థం

అభిరతి అంటే అత్యంత ఆసక్తి అభిరతుడు అంటే అత్యంతాసక్తి కలిగినవాడు అభిరాట్టు అంటే సామ్రాట్టు. మిక్కిలి ప్రకాశించేవాడు అభిరామం అంటే మిక్కిలి ప్రియమైనది, మనోహర మైనది దీనినుండే అభిరామ, అభిరాముడు అనే మాటలు ఏర్పడ్డాయి సుగుణాభిరాముడు అని వాడతాం

రుచి అంటే కాంతి ఈ మాటకు అత్యాసక్తి అనీ, ఇచ్ఛ అనీ కూడా అర్థం అభిరుచి అంటే అత్యంతమైన రుచి, అత్యంత ఆసక్తి, అత్యంత ప్రీతి అని అర్థం. రుచిరం అంటే కాంతిమంత మైనది అందమయిన వస్తువు అభిరుచిరం అన్నా మనోహరమయిన వస్తువు

అభివిఖ్యాతం అంటే మిక్కిలి ప్రసిద్ధమైనది అభిశోకం అంటే మిక్కిలి దుఃఖం అభిశోచం, అభిశోచనం అన్నా అదే అర్థం అభిష్వంగం అంటే అత్యాసక్తి, మిక్కిలి కలయిక అభిసంతాపం

అంటే మిక్కిలి బాధ  అభిస్ఫురితం అంటే పూర్తిగా వికసించినది

అభీక్ష్ణం అంటే మాటిమాటికీ అనీ, ఎల్లప్పుడూ అనీ అర్థం  అభ్యధికం అంటే మిక్కిలి అధికం, చాలా ఎక్కువ

ఘృ ధాతువుకు కరగడం అనీ, చల్లడం అనీ అర్థం  అభి చేరినప్పుడు అభిఘారం అనే మాట ఏర్పడుతుంది  అభిఘారణం అనికూడా అనవచ్చు  కొంచెం నేయి వేయడం  అభిఘరించు అని క్రియగా కూడా వాడవచ్చు  అన్నంమీద కొంచెం నేయి వేయడం  సంస్కారార్థం హవ్యం మొదలయిన వాటిమీద కొంచెం నేయి చల్లడం

అభిజనం అన్నమాటకు పరిజనం అన్న అర్థం ఉంది  దీనిలో పుడతారు కాబట్టి అభిజనం అంటే వంశం అన్న అర్థమూ ఉంది  అభిజనవంతుడు అంటే మంచి వంశంలో పుట్టినవాడు  అభిజాతి, అభిజాతుడు అన్న మాటలకు ఇదే అర్థం  వీటినుండే అభిజాత్యం అన్న పదం ఏర్పడింది  అభిజాత్యం అంటే ఉత్తమ వంశంలో పుట్టడం  వాడికి చాలా ఆభిజాత్యం ఉంది అన్నప్పుడు మంచి వంశంలో పుట్టానన్న అహం ఉంది అని అర్థం  కొన్నిసార్లు కేవలం గర్వం అన్న అర్థంలోనూ వాడుకలో ఉంది  అభిజాతం అంటే మనోహరం, మధురం  అభిజనుడు అంటే శ్రేష్ఠుడు

అభిజిత్తు అనేది ఒక నక్షత్రం  ఆ నక్షత్రంలో పుట్టినవాడిని కూడా అభిజిత్తు అనవచ్చు  విష్ణువన్న అర్థమూ, గెలిచేది అన్న అర్థమూ కూడా ఉన్నాయి  ఈ మాటకు అభిజిన్ముహూర్తం అనికూడా అర్థం  అభిజిన్ముహూర్తం అంటే సూర్యోదయం నుండి ఎనిమిదవ ముహూర్తం  పగలు పద్నాలుగు గడియలు దాటింతర్వాత రెండు గడియల కాలం

'జ్ఞా' ధాతువుకు తెలియడం అని అర్థం  అభిజ్ఞ అంటే గుర్తు పట్టడం, స్మరణం  అభిజ్ఞానం అంటే గుర్తు  మహాకవి కాళిదాసు అభిజ్ఞాన శాకుంతల నాటకంలో అభిజ్ఞానం గుర్తే  దుష్యంతుడు శకుంతలకు గుర్తుగా ఇచ్చిన ఉంగరం  ఈ నాటకంలో దుష్యంతుని వ్యక్తిత్వాన్ని కాపాడింది ఈ ఉంగరమే  అభిజ్ఞాపకం అంటే గుర్తు తెచ్చేది

అభిధ అంటే సంకేతం, పేరు  అభిధ, లక్షణ, వ్యంజన అన్నవి శబ్ద శక్తులు  సంకేతితమయిన అర్థాన్ని బోధించే శబ్ద శక్తి అభిధ  శబ్దానికీ దానికి ఉండే అర్థానికీ పరస్పర సంబంధాన్ని నిర్ణయించడం సంకేతం  అభిధాశక్తి చేత చెప్పబడే అర్థం అభిధేయం  అభిధానం అన్నా పేరే  అభిధాంతరం అంటే మారుపేరు  ప్రతిబింబం, సాటి  వాడు దానానికి మారుపేరు అంటామే అట్లా  అభిధాయకం అన్నా అభిధాయి అన్నా చెప్పేది అని అర్థం.

అభిధ్య అంటే కోరిక  పరధన విషయమయిన కోరికకు అభిధ్య అని పేరు

అభినందం, అభినందనం అంటే సంతోషమనీ, పొగడడమనీ, ప్రోత్సహించడమనీ అర్థం. అభినందన అని విరివిగా వాడుతున్నాం  అభినందించు అని క్రియగా కూడా బాగా ప్రచారంలో ఉంది  ప్రశంసించు అని అర్థం  అభినంది అంటే అభినందించేవాడు, అభినందింపబడిన వాడూ కూడా  అభినందనుడు అంటే అభినందించేవాడు  అభినందితుడు అంటే అభినందింపబడిన వాడు  అభినంద్యం అన్నా అభినందనీయం అన్నా అభినందింపదగింది  అభినందితం అంటే అభినందింపబడినది

అభినియోగం, అభినివేశం అంటే పట్టుదల  ఒక పనిని తప్పకుండా చేయాలనే పట్టుదల, అభినివిష్టుడు అంటే అభినివేశం కలవాడు  అభినివేశం అన్నమాటకు అభిలాష అన్న అర్థం కూడా ఉంది  అభినియుక్తుడు అన్నా పట్టుదలకలవాడనే అర్థం ☆

# అభినవం - అభిమానం

అభి చేరినప్పుడు కొన్ని మాటలకు ప్రత్యేకార్థమేమీ కలగకపోవచ్చు అభి కంపనం అంటే వణకడం కంపనం అన్నా వణకడమే అభికాంక్ష అంటే కోరిక కాంక్ష అన్నా కోరికే అభికాంక్షితం అంటే కోరబడినది అభికాంక్షి అంటే కోరేవాడు అభికామం అన్నా కోరికే అభిక్రందం అంటే కూత

అభిక్రోశం అంటే మొర అభిక్రోశకుడు అంటే మొరపెట్టేవాడు అభిఖ్య అంటే ప్రకాశం అభిఖ్య అంటే పేరు అభిఖ్యానం అంటే చెప్పడం ఈ మాటకు కీర్తి అని ప్రసిద్ధి అని కూడా అర్థం అభిఖ్యాతం అంటే చెప్పబడినది, ప్రసిద్ధమైనది అభిఖ్యాతుడు అంటె ప్రసిద్ధుడు ఖ్యా అంటే పలుకబడునది అందువల్ల అభిఖ్య అంటే పేరు

అభిగర్జనం అంటే గర్జించడం అభిగీతం పాడబడినది అభిగుప్తి అంటే రక్షణ అభిగోప్త అంటే రక్షకుడు అభిఘర్షణం అంటే రాపిడి, నూరడం అభిఘాతం అంటే కొట్టడం, నాశనం చేయడం అభిఘాతి అన్నా అభిఘాతకుడు అన్నా కొట్టేవాడు, నాశనం చేసేవాడు అని అర్థం అభిఘ్రాణం అంటే మూర్కొనడం, వాసన చూడడం

అభితప్తం అంటే కాల్చబడినది అభితర్పణం అంటే తృప్తిపడడం అభితాడనం అంటే కొట్టడం అభిదర్శనం అంటే చూడడం అభిద్రవం అంటే ఆక్రమణ, పరిగెత్తడం అభిద్రుతం అంటే ఆక్రమింపబడినది అభిద్రోహం అంటే ఆక్రోశం, నింద, అపకారం, కీడు తలవడం అభిదర్షణం అంటే పీడించడం, చరచడం భుజాలు చరచుకోవడాన్ని కూడా అభిధర్షణం అనవచ్చు అభిదర్షణం అంటే దయ్యం సోకడమన్న అర్థం కూడా ఉంది అభిధర్షణుడు అంటే రాక్షసుడు అభిధావనం అంటే ఆక్రమించడం, అభిధావకుడు అంటే ఆక్రమించేవాడు

అభినవం అంటే కొత్తది నవం, నవ్యం, నూతనం, నూత్నం, నవీనం, అభినవం ఈ మాటలన్నిటికీ కొత్తదనే అర్థం కొనియాడబడుతుంది కాబట్టి అభినవం 'అభినవ'ను విశేషణంగా ఎక్కువగా వాడుతున్నాం కొన్నేళ్ళ కిందట తమిళనాడు అసెంబ్లీలో కొందరు శాసన సభ్యులు జయలలిత పట్ల ప్రవర్తించిన తీరును అభినవ దుశ్శాసన పర్వంగా పత్రికలు అభివర్ణించాయి ఆ శాసన సభ్యుల్ని అభినవ దుశ్శాసనులని కూడా పేర్కొన్నాయి కొన్ని సందర్భాలలో అభినవ శబ్దాన్ని మంచి అర్థంలో వాడినా ఎక్కువగా నిందార్థంలోనే వాడుతున్నారు అభినవ కుంభకర్ణుడు లాగా - అభినవ ఆయం అంటే కొత్త రాబడి అభినవోద్భిదం అంటే మొలక అభినిర్వృతం అంటే నెరవేరినది అని అర్థం అభినిర్వృత్తి అన్నా అదే అర్థం అభినిష్పత్తి అంటే ఉత్పత్తి, పుట్టుక అభినిష్పన్నం అంటే పుట్టినది అభినుతి అంటే పొగడ్త అభినుతం అంటే పొగడబడినది అభినుతించు అంటే పొగడడం అభిప్రాయం అంటే పొందినది, ఆశయం అని అర్థం తలపు, ఉద్దేశం, భావం, తాత్పర్యం అని కూడా అర్థం అభిప్రీతి అంటే సంతోషం అభిప్రేతం అంటే ప్రియమైనది, కోరబడినది సమ్మతం అని కూడా అర్థం అభిభాషణం అంటే మాట్లాడడం ప్రసంగం అని కూడా అర్థం ఆయన అభిభాషించారు అంటాం అభిభాషి అంటే మాట్లాడేవాడు

అభిమంత్రం, అభిమంత్రణం అంటే పిలుపు అని అర్థం మంత్రించడం అన్న అర్థం కూడా

ఉంది అభిమంత్రింపు అన్నప్పుడు మంత్రించడమనే అర్థం అభిమంత్రకుడు, అభిమంత్రయిత అంటే అభిమంత్రించేవాడు అభిమంత్రితం అంటే అభిమంత్రింపబడినది అని అర్థం

అభిమతం అంటే అభీష్టం, కోరిక సమ్మతం అని కూడా అర్థం అభిమతి అన్నా అదే అర్థం అభిమతుడు అంటే ప్రియుడు, భర్త అని అర్థం అభిమర్దం, అభిమర్దనం అంటే రాపిడి, బాధ అభిమర్శం, అభిమర్శనం అంటే స్పర్శ అభిమర్శకుడు అంటే స్పృశించేవాడు అభిమానం అంటే ప్రేమ దర్పో బలమో ఉండడం వల్ల ఏర్పడే గర్వం దన బల కులాదుల వల్ల కలిగే అతిశయమన్న మాట తనను తాను ఉత్కృష్టునిగా తలపించేది అభిమానం అహంకారమన్న మాట ఈ అభిమానం పెద్దదయితే దురభిమానం అవుతుంది ఆత్మగౌరవం అన్న అర్థంలోనూ వాడుతున్నాం అభిమాన ధనుడు అని ప్రయోగం అభిమానవంతుడు అని కూడా వాడతాం అభిమాని అన్నా అదే అర్థం అభిమానం కలవాడు అభిమాని అంటే ప్రేమ కలవాడని కూడా అర్థం ఇక్కడ అభిమానానికి ప్రేమ అని అర్థం అభిమానులూ, అభిమాన సంఘాలూ ఈ అర్థం లోనే అభిమానానికి మరొక అర్థం కూడా ఉంది ప్రియురాలి అలక అభిమానం

అభిమృష్టం అంటే శుద్ధి చేయబడినది అభిరుతం అంటే కూత, ధ్వని అభిరూపం అంటే మంచిరూపం అనురూపమని కూడా అర్థం తగినటువంటిది, మనోహరమైనది అభిరూపుడు అంటే చంద్రుడనీ, శివుడనీ, విష్ణువనీ, మన్మథుడనీ అర్థాలు పండితుడన్న అర్థమూ ఉంది అభిలక్షితం అంటే చూపబడినది, గుర్తు కలది అభిలాష, అభిలషణం అంటే కోరిక అభిలషితం అంటే కోరబడినది, కోరిక అభిలషణీయం అంటే కోరదగింది అభిలషమాణం అంటే కోరబడు చున్నది అభిలషించడం అంటే కోరడం అభిలాషకుడు, అభిలాషుకుడు, అభిలాషి అన్నమాట లకు కోరేవాడని అర్థం అయితే వ్యక్తి స్వభావం చేతనే కోరేవాడు అయినప్పుడు ఈ మాటలను వాడతారు సాధారణంగా కూడా వాడవచ్చు అభిలూత అంటే ఒకరకమయిన సాలె పురుగు అభివర్ణనం అంటే వర్ణించడం, పొగడడం అభివర్ణించారు అని క్రియగా ఈ మాటను ఎక్కువగా వాడుతున్నాం అభివర్ణ్యం, అభివర్ణనీయం అంటే వర్ణింపదగింది అభివర్ణితం అంటే వర్ణింప బడింది

అభివర్షణం అంటే కురవడం అభివర్షి అంటే వర్షించేది అభివర్షించు అంటే వానకుర వడం అభివందనం అంటే నమస్కారం అభివాదం, అభివాదనం అన్నా నమస్కారమే దీనిచేత ఆశీర్వదింపబడుతుంది కాబట్టి అభివాదం గోత్రనామం చెప్పి మొక్కడం సంప్రదాయం అభి వాదకుడు అంటే నమస్కరించే వాడు నమస్కరించే స్వభావం ఉన్నవాడు అభివాద్యుడు అభి వాదనీయుడు అంటే నమస్కరింపదగినవాడు

అభివినీతుడు అంటే మంచి నడవడి కలవాడు అభివృద్ధి అంటే పెరుగుదల అభివేష్టించు అంటే చుట్టుకొనడం అభివ్యక్తం అంటే స్పష్టం అభివ్యక్తి అంటే బయటపడడం, స్ఫుటంకావడం, ప్రతిబింబం అభివ్యాహారం, అభివ్యాహరణం అంటే చెప్పడం అభిశంక అంటే సంశయం, భ్రమ, భయం అభిశంకితం అంటే సందిగ్ధం

అభిశంసనం అంటే దూషించడం, నిందమోపడం, నేరారోపణ అభిశంసి, అభిశంస కుడు అంటే దూషించేవాడు, నేరం మోపేవాడు ప్రస్తుతం చట్టసభల్లో అభిశంసన తీర్మానాలు

ప్రవేశపెడుతున్నారు అభిశాపం, అభిశాపనం అంటే శాపం, తిట్టు అది అతనికి గొప్ప అభిశాప మయింది వంటి వాడుక ఉంది లేని నేరం మోపడం అభిశాపం అట్లాగే అభిశస్తి, అభిశస్తుడు అంటే లేని నేరం మోపబడినవాడు అభిషంగం అభిషంజనం అన్నా ఈ అర్థం ఉంది అభిషవం అభిషవణం అంటే పిండడం అభిషేకం అంటే తడపడం, స్నానం పట్టాభిషేకం అంటే పట్టం కట్టడం అభిషిక్తుడు పట్టం కట్టబడినవాడు అభీష్టం, అభీప్సితం అంటే కోరిక అభ్యంగం అంటే తలంటు శరీరానికి నూనె రాయడం అభ్యంజన స్నానం అంటాం నూనె రాసి తలంటు కోవడం అభ్యంతరం అంటే లోపలిది అనీ ఆటంకం అనీ అర్థం అభ్యంతర మందిరం అంటే లోపలి మందిరం ప్రస్తుతం అడ్డు అన్న అర్థంలోనే దీన్ని ఎక్కువగా వాడుతున్నాం అభ్యర్థన అంటే ప్రార్థన అభ్యర్థి అంటే కోరేవాడు, యాచించేవాడు అభ్యసనం అంటే నేర్చుకోవడం అభ్యాసం అంటే ఆవృత్తి, అలవాటు, సాధన అభ్యాసి అంటే సాధన చేసేవాడు అభ్యుదయం అంటే ఉదయం, వృద్ధి, శుభం, ఇష్టప్రాప్తి, ఉత్సవం

☆

# ప్రతిబింబం - ప్రత్యాహారం

మనం విస్తృతంగా వాడే ఉపసర్గలలో ప్రతి ఒకటి అన్ని ఉపసర్గలలాగానే దీనికీ వివిధ అర్థాలున్నాయి విశిష్టమయిన అర్థమేమీ లేకుండా కూడా ప్రయోగాలున్నాయి ప్రతి'కి ఉన్న అర్థాలలో ఒక ముఖ్యమైన అర్థం సాదృశ్యం, సమానత్వం, పోలిక, సాటి ఉదాహరణకు ప్రతి కృతి అన్న మాటను తీసికోవచ్చు కృతికి ప్రతి ఉపసర్గగా చేరింది ప్రతికృతి అంటే ప్రతిగా చేయబడినది ఒకదానిని చూచి దానికి సమానంగా పోలినట్లు చేసిన వస్తువు కొన్ని సందర్భాలలో నకలు కాపీ అన్న మాట కూడా దీనికి సరిపోతుంది రాతితోకాని, కొయ్యతోకాని, మట్టితోకాని మరేదైనా పదార్థంతోకాని చేసిన బొమ్మ ఒకదానికి దీటుగా నిర్మించబడిన వస్తువు ప్రతిమ ప్రతిమానం అని కూడా అనవచ్చు అదే ప్రతియైన బింబం అంటే ప్రతిబింబం అవుతుంది ప్రతిగా ప్రయత్నించి నిర్మించింది కాబట్టి ప్రతియాతన అవుతుంది ప్రతియైన చాయ కాబట్టి ప్రతిచ్ఛాయా ప్రతిగా పెట్టబడేది బదులుగా పెట్టేది కాబట్టి ప్రతినిధి ప్రతికృతి, ప్రతిమ, ప్రతిమానం, ప్రతిబింబం, ప్రతియాతన ప్రతిచ్ఛాయ ప్రతినిధి అన్న ఈ మాటలన్నీ ప్రతిమను బోధిస్తాయి ఇవన్నీ సమానార్థకాలయినప్పటికీ కొంత అర్థ బేదంతోనూ, బిన్న సందర్భాలలోనూ వాడడం జరుగుతుంది

ప్రతికృతి చిత్రం కూడా కావచ్చు చిత్రానికి నకలు కూడా కావచ్చు ప్రతిబింబం అద్దంలోనో నీటిలోనో కనబడుతుంది ఏదైనా రూపాన్ని ప్రతిఫలించే వస్తువేదైనా ప్రతిబింబాన్నిస్తుంది ప్రతిమ అన్న మాటను విగ్రహం అన్న అర్థంలోనే ఎక్కువగా వాడుతున్నాం ప్రతిచ్ఛాయ ప్రతిబింబం వంటిదే ప్రతినిధి మనం ఎక్కువగా వాడేమాట. అయితే ప్రతిమ అన్న అర్థంలో దీన్ని మనం వాడటంలేదు ఒక దానికి బదులుగా నిలిచేది అన్న అర్థంలో వాడుతున్నాం ప్రజా ప్రతినిధి అన్నప్పుడు ప్రజలకు బదులుగా ఉండేవాడు రిప్రజెంటేటివ్ అన్న ఇంగ్లీషు మాటకు సమానంగా దీన్ని వాడుతున్నాం ఏనుగు కుంభస్థలానికి దిగువ భాగాన్ని ప్రతిమానం అంటారు

ప్రతికాశం అంటే తుల్యం, సమానం అని అర్థం ప్రతిద్వంద్వి అంటే సాటియయినవాడు, సమానుడు ఏదైనా పోటీలో ఒకరితో సమానంగా స్పర్థించేవాడు ప్రతిద్వంద్వి ప్రతిఫలనం అంటే ప్రతిబింబించడం ప్రతిఫలితం అంటే ప్రతిబింబించినది ప్రతిబంధువు అంటే బంధువుతో సమానుడయినవాడు బంధువుకాకపోయినా బంధువువంటివాడు

ప్రతిబలుడు అంటే సమానమయిన బలం కలవాడు సమానబలుడు ప్రతి యాతన అంటే తుల్యమయిన యాతన ప్రతిమానం అంటే మాదిరి అన్న అర్థంకూడా ఉంది ప్రతిరూపం ప్రతికృతి వంటిదే నకలు ప్రతిరూపకం అన్నా అదే అర్థం సమాన రూపం కలది అని ప్రతిబింబంలాగే విగ్రహం అన్న అర్థమూ ఉంది అనురూపమయినది, తగినది అనికూడా అర్థం ప్రతిబింబ వాదం అని ఒక వాదం ఉంది ఈ వాదం లక్ష్యం జీవుడు ఈశ్వరునికి ప్రతిబింబం అని నిరూపించడం ప్రతిమూర్తి అన్నా ప్రతిరూపమే

ప్రతివర్ణికుడు అంటే సమానుడు, సదృశుడు అని అర్థం ప్రతి వస్తువు అంటే తుల్యవస్తువు ప్రతివస్తూపమ అని ఒక అలంకారం ఉంది ఈ అలంకారంలో రెండు వాక్యాలుంటాయి ఒక వాక్యం రెండో వాక్యానికి ప్రతిగా ఉంటుంది అంటే సమానంగా ఉంటుంది 'తాపం చేత సూర్యుడు ప్రకాశిస్తున్నాడు చాపంచేత శూరుడు రాజిల్లుతున్నాడు' అని ఈ అలంకారానికి

ఉదాహరణ ఈ వాక్యాలలో ప్రకాశించడమన్నా, రాజిల్లడమన్నా అర్థం ఒకటే సూర్యుడు ఎండ చేత, శూరుడు విల్లుచేత ప్రకాశిస్తున్నారన్నమాట ఈ రెండింటి ధర్మం ఒక్కటే అర్థం ఒక్కటే మాటలు వేరు ప్రకాశించు, రాజిల్లు అని రెండు మాటలు వాడడం జరిగింది భిన్న ధర్మాలుంటే అలంకారం మారుతుంది అప్పుడు దృష్టాంతాలంకారమవుతుంది చంద్రుడే కాంతిమంతుడు నీవే కీర్తిమంతుడవు` అంటే దృష్టాంతం కాంతిమంతత్వం, కీర్తిమంతత్వం బిన్నధర్మాలు బింబ ప్రతిబింబ రూపంలో ఉన్నాయి విద్వాంసుని పరిశ్రమ విద్వాంసునికే తెలుస్తుంది వంధ్యకు ప్రసవవేదన తెలియదుకదా అంటే ప్రతివస్తూపమ

ప్రతి సంఖ్య అంటే చక్కగా లెక్కపెట్టడం సరిగా, సమానంగా లెక్కించడం

ప్రతిసర్గం, ప్రతిసృష్టి సమానార్థకాలు సమానమయిన సృష్టి అని అర్థం సృష్టికి ప్రతిసృష్టి చేశాడంటాం సమానమయిన, సాటి అయిన సృష్టి పురాణానికి అయిదు లక్షణాలుంటాయి సర్గం, ప్రతిసర్గం వంశం మన్వంతరం, వంశానుచరితం అన్నవి ఆ అయిదు లక్షణాలు వీటిలో ప్రతిసర్గం ఒకటి సర్గం అంటే ప్రపంచ ఉత్పత్తి అనీ, ప్రతిసర్గం అంటే బ్రహ్మాదులు చేసిన సృష్టి అనీ అర్థం

ప్రతిస్పర్ధ అంటే పోటీ ప్రతిస్పర్ధి అంటే పోటీపడేవాడు ప్రతి హస్తకుడు అంటే ప్రతినిధి ప్రత్యాకారం అంటే ఒర ఖడ్గాదులకు ఉపయోగించేది సమానమైన ఆకారం ఉంటుందనేమో

ప్రతి కి ఉన్న మరొక అర్థం తీసికోవడం ప్రతిగ్రహం అంటే తీసికోవడం, దానం పుచ్చుకోవడం దానం తీసుకునే వస్తువును కూడా ప్రతిగ్రహం అనవచ్చు వెనుక ఉండే సేన అని కూడా అర్థం రాజు తాను ఉన్నచోట ఈ సైన్యాన్ని చేపట్టి ఉంటాడు ముందు సైన్యం పోరాడుతూ ఉంటే వెనుక రెండు వందల ధనుస్సుల దూరంలో రాజుతోపాటు ఉండే సైన్యం ప్రతిగ్రహం ప్రత్యాసారం అని మరోమాట ఉంది ఇదీ సైన్యానికి సంబంధించిందే చిందరవందరయిన సైన్యాన్ని కూర్చుకొని వచ్చే సేన ప్రత్యాసారం ప్రతగ్రాహం అన్నా దానం పుచ్చుకోవడమే ప్రతి గ్రాహ్యం అంటే పుచ్చుకొనతగింది ప్రతిగ్రహించు అని క్రియగా వాడవచ్చు ప్రతి గ్రహీత అంటే దానం పుచ్చుకొనేవాడు భర్తను కూడా ప్రతిగ్రహీత అనవచ్చు కన్యాదానం పుచ్చుకుంటాడు కదా ప్రతి గ్రాహకుడు అన్నా దానం పుచ్చుకొనేవాడే

ప్రతిదానం అంటే కుదువపెట్టుకున్న వస్తువును తిరిగి ఇవ్వడం ప్రతిదేయం అంటే కుదువ, తాకట్టు తీసికొని మళ్ళీ ఇవ్వవలసిన వస్తువు ప్రతిపన్నం అంటే పొందబడినది, తెలియబడినది ప్రతిపాదనం అంటే దానమనీ, నిరూపణమనీ అర్థం ప్రతిపాదకం అంటే ఇచ్చేది, నిరూపించేది, ప్రాపకం ప్రతిపాదితం అంటే ప్రతిపాదింపబడింది ప్రతిపాద్యం అంటే ప్రతిపాదింపదగింది ప్రతిపాదయిత అంటే ప్రతిపాదించేవాడు

ప్రతిశ్రయం అంటే ప్రాపు, ఆశ్రయం ఇంటిని ప్రతి శ్రయం అంటారు ప్రతిశ్రయం అంటే సభ అన్న అర్థంకూడా ఉంది, ఉనికిపట్టు ప్రత్యాదానం అంటే తిరిగి తీసికోవడం ప్రత్యాహరణం అన్నా అదే అర్థం ప్రత్యాహృతం అంటే తిరిగి తీసికోబడింది ప్రత్యాహారం అన్నా తీసికోవడమే విషయాల నుండి ఇంద్రియాలను మరలించడం కూడా ప్రత్యాహారం వ్యాకరణంలో ప్రత్యాహార సూత్రాలున్నాయి మొదటి చివరి వర్ణాలతో వాటి మధ్యనున్న వర్ణాలను కూడా గ్రహించడం ప్రత్యాహారం ఉదాహరణకు 'అఇ ఉణ్' అనే సూత్రం ఉందనుకుంటే అణ్ అన్నది ప్రత్యాహారం అణ్ అంటే అఇఉ అని గ్రహించాలి ☆

# ప్రతిషేధం - ప్రతికూలం

ప్రతిహతుడు అంటే చంపబడినవాడు ఇక్కడ హింస అని అర్థం ప్రతిహతం అంటే మారుదెబ్బ పడినదనీ తోసిపుచ్చబడిందనీ, అడ్డగింపబడిందనీ అర్థం ఈ అడ్డగించడం అన్న అర్థంలోనే వ్యతిరేకార్థంలో అప్రతిహతం అన్నమాట చాలా వాడుకలో ఉంది అడ్డులేనిది అని అర్థం అడ్డగింపలేనిది అప్రతిహతుడు అంటే అడ్డగింపబడనివాడు ప్రతిఘాతం అన్నా ప్రతిఘాతనం అన్నా చంపడమని అర్థం ప్రతిఘాతం అంటే అడ్డగించడమన్న అర్థమూ ఉంది ప్రతిఘాతి అంటే పగ తీర్చుకొనేవాడు

ప్రతి సంవేదకుడు అంటే సవిస్తరంగా ఎరిగించేవాడు ఇక్కడ ప్రతికి వ్యాప్తి అని అర్థం ప్రతిఖ్యాతి అంటే ప్రసిద్ధి

ప్రతిక్షిప్తం అంటే అడ్డగింపబడింది ఇక్కడ ప్రతికి వారణం, అడ్డగించడమని అర్థం ప్రతినివర్తనం అంటే నివారణం మనకు ఇష్టమయిన వస్తువు నుండి నివర్తించడం ప్రతిబాధకం అంటే అడ్డగించేది ప్రతిబాది అన్నా ఇదే అర్థం ప్రతిబంధం అంటే అడ్డగింపు వాడికేమీ ప్రతిబంధాలు లేవు అంటే అడ్డగించే విషయాలేమీ లేవని అర్థం అడ్డంకులు లేవన్నమాట ప్రతిబంధకం అంటే అడ్డగించేది నేను నీకేమీ ప్రతిబంధకం కాదలుచుకోలేదు అన్నప్పుడు అవరోధం కాదలచుకోలేదని అర్థం ప్రతిబంధనం అంటే అడ్డగింత ప్రతిబంధి అంటే అడ్డగించేది ప్రతిబద్ధం అంటే కట్టబడినది అని అర్థం ప్రతియోగం అంటే కూడా అడ్డగించడమనే అర్థం ప్రతియోగి అంటే అడ్డగించేవాడు విరోధి

ప్రతిరోదం అంటే అడ్డగించడం ప్రతిరోధం అంటే ముట్టడి అనీ, బలాత్కారంగా దొంగిలించడమనీ కూడా అర్థం ప్రతిమధనం అన్నా అడ్డగించడమే ప్రతిరోధకుడు అంటే అడ్డగించేవాడు ఎదిరించేవాడు, ముట్టడించేవాడు ప్రతిరోధి అన్నా ఎదిరించేవాడనే అర్థం ఈ మాటకు బందిపోటు దొంగ అన్న అర్థం కూడా ఉంది ప్రతిరుద్ధం అంటే అడ్డగింపబడింది ముట్టడింపబడింది ప్రతిరోధనం లాగే ప్రత్యవరోధనం కూడా

ప్రతివారణం అంటే నివారణమని అర్థం ప్రతిషేధం అంటే నివారించడం, నిషేధం నిరాకరించడమని కూడా అర్థం నిరోధించడమనీ అర్థం ప్రతిషేధం అని ఒక అలంకారం కూడా ఉంది ప్రసిద్ధమైన నిషేధాన్ని మళ్ళీ చెప్పడం ప్రతిషేధాలంకారం యుద్ధం జరుగుతూ ఉంది. ఒక వీరునితో తలపడుతున్నాడొక జూదరి వీరుడంటున్నాడు 'జూదరీ! ఇది జూదం కాదు, వాడి అయిన బాణాలతో ఆడే ఆట' అని జూదం యుద్ధం కాదన్నది ప్రసిద్ధమయిన విషయం అందరికీ తెలిసిందే అయినా, ఇది జూదంకాదు యుద్ధం' అని చెప్తున్నాడు అందువల్ల ఇతి ప్రతిషేధాలంకారం జూదరికి జూదంలోనే నేర్పు తప్ప యుద్ధలో నేర్పులేదని వ్యంగ్యం యుద్ధానికి వస్తానన్న పిల్లవాణ్ణి చూచి ఇది యుద్ధం, గోలీలాట కాదు' అన్నట్లు ప్రతిషేధనం అంటే నిషేధం, నిరాకరణ, నివారణ. ప్రతిషిద్ధం అంటే నిషేధించబడింది ప్రతిషేధకుడు అంటే నిరోధించేవాడు, నివారించేవాడు ప్రతిషేద్ధ అన్నా ఇదే అర్థం ప్రతిష్టంభనం అంటే అడ్డగింత. ప్రతిష్టంభన అన్న మాట చాలా వాడుకలో ఉంది చర్చలలో ప్రతిష్టంభన ఏర్పడింది అంటాం అడ్డు, ఆటంకం ఏర్పడిందన్నమాట అభివృద్ధి లేక ఆగిపోయాయని అర్థం స్తంభనకు ప్రతిచేరి ప్రతిష్టంభన

ఏర్పడింది

ప్రతిసీర అంటే యవనిక, తెర అడ్డంగా కట్టబడేది కాబట్టి ప్రతిసీర ప్రతి కి ముఖ్యమైన అర్థాలలో ఒకటి విరోధమన్నది ఈ అర్థంలో ప్రతికి చాలా విస్తృతంగా వాడుక ఉంది ఉదాహరణకు కూలం అంటే ఒడ్డు అనుకూలం అంటే కూలాన్ని అనుసరించి దీనికి వ్యతిరేకం ప్రతికూలం ప్రతిస్పర్థియైన కూలం కలిగినది ప్రతికూలం అంటే అనుకూలం కానిది. అనుకూలం ప్రతికూలుడు అంటే వ్యతిరేకి అనుకూలంగా లేనివాడు ప్రతికూల పవనాలు వీస్తున్నాయి అంటాం వ్యతిరేకంగా పరిస్థితి ఉందని అర్థం ప్రతిద్వంద్వి అన్నా ప్రతికూలుడనే అర్థం వ్యతిరేకంగా పోటీచేసేవాడిని కూడా ప్రతిద్వంద్వి అంటాం

ప్రతికుంజరం అంటే శత్రువయిన ఏనుగు ప్రతినాయకుడు అంటే నాయకునికి వ్యతిరేకమయినవాడు నాటకంలో నాయకుడు, ప్రతినాయకుడు ఉంటారు ఇంగ్లీషులో విలన్ అన్న మాటకు ఇది సమానం ప్రతి ప్రయాణం ప్రయాణానికి వ్యతిరేకం తిరిగిరావడమని అర్థం ప్రతి ప్రస్థానం అంటే పోయి శత్రుపక్షంలో చేరడం రామాయణంలో విభీషణుడు చేసినపని యజ్ఞంలో ప్రతి ప్రస్తాత అన్న ఒక ఋత్విక్కు ఉంటాడు అధ్వర్యునికి సహాయం చేసే ఋత్విక్కుల్లో ప్రతి ప్రస్థాత ఒకడు

ప్రతిభటుడు ఎదురుపక్షం వాడు శత్రువు ప్రతిస్పర్ధి కూడా ప్రతిమల్లుడు అన్నా శత్రువే ప్రతిరథుడు అన్నా వ్యతిరేకి అనే అర్థం ప్రతియోధుడు, ప్రతిరథుడు, ప్రతివీరుడు సమానార్థకాలయిన పదాలు

ప్రతిసమం అంటే సమంకానిది, సదృశంకానిది విసదృశం ప్రతిసారి అంటే విరుద్ధంగా పోయేది ప్రతిసేన అంటే శత్రుసేన ప్రత్యర్థి అంటే మనకు ప్రతికూలంగా కోరేవాడు

ప్రతిపక్షం అంటే విరుద్ధపక్షం అధికారంలో ఉన్న పక్షాన్ని అధికార పక్షం అనీ, అధికారంలో లేనిపక్షం, అధికార పక్షానికి ప్రత్యర్థిపక్షాన్ని ప్రతిపక్షం అనీ అంటున్నాం విపక్షం అని కూడా అంటున్నారు ప్రతిపక్షి అంటే ప్రతికూలుడు ప్రతిపక్షంలోనివాడు

ప్రత్యవాయం అంటే విపరీతాచరణం ఆచరించవలసిన దానికి విరుద్ధంగా ఆచరించడం ప్రత్యాఖ్యానం అంటే ఎదురు చెప్పడం నిరాకరించడం, తొలగద్రోయడం, ఖండించడం ప్రత్యాఖ్యాతం అంటే నిరాకరింపబడింది, తోసిపుచ్చబడింది విరుద్ధంగా మాట్లాడినది ప్రత్యాగమనం అంటే తిరిగిరావడం ప్రత్యాగతి అని కూడా అనవచ్చు ప్రత్యాదేశం అంటే విరుద్ధంగా నియోగించడం ప్రత్యాదిష్టం అంటే విరుద్ధంగా నియోగించబడింది ప్రత్యాలీఢం అంటే భూమిని స్పృశించేది ఎడమకాలు ముందుకు చాచి కుడికాలు వెనుకకు పెట్టడం ప్రత్యాలీఢం ఇది ఆలీఢానికి వ్యతిరేకం ఆలీఢం అంటే కుడికాలు ముందుకు చాచి ఎడమకాలు వెనుకకు ఉంచడం, విలుకాడు నిలబడే పద్ధతులలో ఇవి రెండు రెండు కాళ్ళూ సరిగా నిలిపితే సమపదమనీ, రెండుకాళ్ళ మధ్య జానెడు ఎడం ఉండేట్లు నిలబడితే విశాఖం అనీ, రెండు కాళ్ళను మండలాకారంగా నిలపడం మండలం అనీ అంటారు ప్రత్యుత్థానం అంటే వచ్చిన వారిని ఆహ్వానించడంకోసం ఎదురు వెళ్ళినట్లుగా లేవడం ప్రత్యుత్థితుడు అంటే ప్రత్యుత్థానం చేసినవాడు ప్రత్యుదాహరణం అంటే ఒక ఉదాహరణకు వ్యతిరేకంగా చెప్పే మరొక ఉదాహరణ

☆

# ప్రతిధ్వని - ప్రతిభ

'ప్రతి కి మారు, బదులు అన్న అర్థం ఉంది ప్రతికరం అంటే బదులు చేయడం ఒకడు చేసిం దానికి బదులుగా సమాధానంగా మరొకడు చేయడం ప్రతికర్మం అన్నా ఇదే అర్థం ప్రతికారం అన్నా అదే ప్రతీకారం అనీ అనవచ్చు మారుచేత, పగతీర్చుకోవడం చికిత్స కూడా ఒక రకంగా ప్రతికారమే ప్రతిక్రియ అన్నా ప్రతికృతి అన్నా ఇదే అర్థం తగిన సమాధానం అన్నమాట ప్రతి కర్తవ్యం అంటే తిరిగి చేయదగిన పని ప్రతికృతం అంటే బదులుగా చేయబడినది ప్రతికర్త, ప్రతికారి అంటే బదులుగా చేసేవాడు పగతీర్చుకొనేవాడు ప్రతికారం చేసేవాడు శత్రువు

ప్రతిగర్జన అంటే గర్జనకు మారుగర్జన ప్రతిఘటన అంటే మారొడ్డటం ఎదురు తిరిగి నిలవడం ప్రతిఘటించు అని క్రియగా కూడా వాడతాం ప్రతిఘం అంటే మారుదెబ్బ ప్రతి ఘాతం అన్నా అదే ప్రతిఘాతి అంటే పగతీర్చుకొనే వాడు చికీర్ష అంటే చేయాలనే కోరిక ప్రతి చికీర్ష అంటే బదులు చేయాలనే కోరిక ప్రతిధ అంటే ప్రతీకారం ప్రతివిధి, ప్రతివిధానం అంటే మారుచేత, నివారణోపాయం

ప్రతిధ్వని అంటే ఒక ధ్వని కాగా దానికి ప్రతిగా వచ్చే ధ్వని ఇంగ్లీషులో రిసౌండు అన్నమాటకు సమానార్థకం అయితే దీన్ని ఆలంకారికంగా కూడా ఉపయోగిస్తాం ఒకరు చెప్పిన మాటల్నే మరొకరు కూడా అనుసరిస్తే, అంటే చిలకపలుకులు పలికితే దాన్నీ ప్రతిధ్వని అంటాం. సొంతగొంతుక లేకపోవడం ప్రతిధ్వానం, ప్రతిశబ్దం, ప్రతినాదం అన్నమాటలు ప్రతిధ్వనికి సమానార్థకాలు ప్రతిరవం అనికూడా అనవచ్చు ప్రతిరవం అంటే కలహం, ప్రతికూల శబ్దం అనికూడా అర్థం

ప్రతిపూజనం అంటే ఎదురుపూజ ఎదుటి వాడు మనకు చేసిన పూజకు మారుగా మనం ఎదుటివాడిని పూజించడం పరస్పర పూజ ప్రతి ప్రణామం అంటే ప్రణామానికి ప్రణామం ప్రతి నమస్కారం కూడా ఇంతే మనకు నమస్కరించిన వానికి మనం నమస్కరించడం ప్రత్యభివాదం అన్నా ఇదే అర్థం

ప్రతి ప్రశ్న అంటే ప్రశ్నకు మారు ప్రశ్న జవాబు అని కూడా అర్థం

ప్రతి ప్రహారం అంటే మారుదెబ్బ దెబ్బకు దెబ్బ అన్నమాట. ప్రతిఫలం అంటే తగినఫలం. చేసిన పనికి అనుగుణమైన ఫలం

ప్రతిభాష అంటే మారుపలుకు ఎదుటివాడి పలుకులకు బదులు చెప్పడం ప్రతియత్నం అంటే మారుయత్నం ప్రతియానం అంటే తిరిగిపోవడం, మరలిపోవడం, ప్రతియుద్ధం అంటే ఎదుర్కోవడం ప్రతియోధనం అనికూడా అనవచ్చు

ప్రతివచనం, ప్రతి వచస్సు, ప్రతివాక్యం, ప్రతివాదం అంటే మారుమాట, సమాధానం, వ్యతిరేకంగా చెప్పేమాట ప్రతివాది అంటే వాదానికి ఎదురు వాదం చేసేవాడు. న్యాయస్థానం భాషలో వాది అంటే వ్యాజ్యం తెచ్చినవాడు ఎవరిమీద వ్యాజ్యం వచ్చిందో వాడు ప్రతివాది ప్రతి వాది అంటే శత్రువన్న అర్థం కూడా ఏర్పడింది మన వాళ్ళలో ప్రతివాది భయంకరం అన్న ఇంటి పేరున్న వాళ్ళు కూడా ఉన్నారు ప్రతివాదించు అని క్రియగా కూడా ప్రయోగం ఉంది ప్రత్యుక్తి అంటే సమాధానం ప్రత్యుక్తం అంటే బదులు చెప్పబడింది

ప్రతివైరం అంటే పగతీర్చుకోవడం ప్రతివ్యూహం అంటే వ్యూహానికి ప్రతిగా పన్నిన వ్యూహం వ్యూహ ప్రతివ్యూహాలంటాం

ప్రతిశయనం అంటే ఎదురుగా పడుకోవడం కోరిన కోరికలు తీరడం కోసం భగవంతుని ముందు ఆహారాలు మాని పడుండడాన్ని కూడా ప్రతిశయనం అంటాం ప్రతిశయనం చేసే వాడు ప్రతి శయితుడు

ప్రతిశాపం అంటే శాపానికి మారుగా శాపం ఇవ్వడం ప్రతిసందేశం అంటే సందేశానికి మారుసందేశం ప్రతిహాసం అంటే మారు నవ్వు ఎదుటివాడు నవ్వితే మనమూ నవ్వడం ప్రతీక్ష ప్రతీక్షణ అంటే ఎదురు చూడడం ప్రతీక్షితుడు అంటే ఎదురుచూడబడిన వాడు గౌరవింపబడిన వాడు ప్రతీక్షుడు అంటే ఎదురుచూచేవాడు ప్రతీక్ష్యుడు అంటే ఎదురుచూడదగినవాడు

ప్రత్యభియోగం అంటే మారు అభియోగం ఒకడు మనమీద అభియోగం మోపితే వాడి మీద మనం అభియోగం మోపడం ప్రత్యాఘాతం అంటే మారుదెబ్బ ప్రత్యాహతం మారుదెబ్బ తగిలినది

ప్రత్యుజ్జీవనం అంటే చచ్చిబతకడం, బతికించడం పునర్జీవనం అన్నమాట ప్రత్యుత్తరం అంటే మారు సమాధానం ప్రత్యుత్పన్నం అంటే మరల పుట్టింది అప్పటికి స్ఫురించింది అని కూడా అర్థం ప్రత్యుత్పన్నమతి అంటే సమయానికి తగిన ఆలోచన కలిగేవాడు

ప్రత్యుపకారం అంటే మారు ఉపకారం చేసిన ఉపకారానికి బదులు మళ్ళీ ఉపకారం చేయడం ప్రత్యుపదేశం అంటే ఉపదేశానికి మారు ఉపదేశం

ప్రతిజిహ్వా అంటే కొండనాలుక

ప్రతిజ్ఞ అంటే ఒక పనిచేస్తానని గట్టిగా చెప్పడం, ఒట్టు ప్రతిజ్ఞానం అంటే అంగీకారం ప్రతిజ్ఞాతం అంటే ప్రతిజ్ఞ చేయబడినది ప్రతిజ్ఞాతవ్యం, ప్రతిజ్ఞేయం అంటే ప్రతిజ్ఞ చేయదగినది ప్రతిజ్ఞాహాని, ప్రతిజ్ఞా సన్యాసం అంటే ప్రతిజ్ఞ తప్పడం ప్రతిశ్రుతం అంటే ప్రతిజ్ఞ

ప్రతి తరం అంటే తెడ్డు దాటించేది ప్రతి దృష్టాంత సమం అంటే పనికిమాలిన జవాబు ప్రతిపాలనం అంటే రక్షించడం, ప్రతిపాలకుడు అంటే రక్షకుడు

ప్రతిభ అంటే స్ఫూర్తి, బుద్ధి, కాంతి 'నవనవోన్మేషశాలినీ ప్రజ్ఞాప్రతిభామతా', ఎప్పటి కప్పుడు కొత్త ఊహలు తోచే బుద్ధి కావ్యహేతువుల్లో ప్రతిభ ముఖ్యమైంది ప్రతిభాసం, ప్రతిభా సనం అంటే తటాలున తోచడం

ప్రతిముఖం అంటే అభిముఖం ప్రతివేశం అంటే పొరుగిల్లు ప్రతిశీర్షకం అంటే తాకట్టు

ప్రతిష్ఠ అంటే స్థానం, కీర్తి, నెలకొల్పడం ప్రతిష్ఠ అంటే ప్రసిద్ధం అన్న అర్థమూ ఉంది ప్రతిష్ఠాపనం అంటే నిలపడం ప్రతిష్ఠించు, ప్రతిష్ఠాపించు అని క్రియగా కూడా వాడతాం ప్రతిహారి, ప్రతీహారి అంటే కావలివాడు ప్రత్యామ్నాయం అంటే బదులుగా నియమింపబడేది ప్రతినిధి ప్రత్యేకం అంటే వేరువేరు ప్రత్యవేక్షణం అంటే ముందు వెనుకలు చూడడం

'ప్రతి' చేరినప్పుడు అర్థభేదంలేని సందర్భాలు కూడా ఉన్నాయి ప్రతిగర్హితం అంటే నిందింపబడినది ప్రతిజాగరం అంటే మేలుకోవడం ప్రతి నవం అంటే కొత్తది. ప్రతినియమం అంటే వ్యవస్థ

ప్రతి మళ్ళీ మళ్ళీ అన్న అర్థంలోనూ వస్తుంది దినదినం అన్న అర్థంలో ప్రతిదినం అట్లాగే ప్రతి సంవత్సరం 'ప్రతి'ని తెలుగులో ఈ అర్థంలో విశేషణంగా చాలా ఎక్కువగా వాడుతున్నాం ప్రతిరోజు, ప్రతినెల, ప్రతివాడు, ప్రతిఒక్కరూ, ప్రతిమాట, ప్రతిసారీ, ప్రతిరోడ్డు మొదలైన విధంగా అన్ని రకాల మాటలకూ దీన్ని విశేషణంగా వాడుతున్నాం ☆

# పరిపాలన - పరిమళం

'పరి' ఉపసర్గ కూడా ఎక్కువ మాటల్లో వాడేదే దీనికీ చాలా అర్థాలున్నాయి అతిశయం అన్నది ఒక అర్థం ఉదాహరణకు కృశం అంటే చిక్కినది దీనికి ముందు 'పరి' చేరిస్తే పరికృశం అవుతుంది పరికృశం అంటే మిక్కిలి చిక్కినదని అర్థం అట్లాగే పరికోపం పరికోపం అంటే మిక్కిలి కోపం పరిక్లేశం అంటే గొప్ప బాధ పరిక్లిష్టం అన్నా మిక్కిలి క్లేశమనే అర్థం క్వణనం అంటే మోగడం, ధ్వని పరిక్వణనం అంటే పెద్ద ధ్వని పరిక్షామం అంటే మిక్కిలి చిక్కినది. బాగా తాగి మత్తెక్కినవాణ్ణి పరిక్షీబుడు అంటారు ఖిన్నుడు అంటే దుఃఖం పొందినవాడు పరిఖిన్నుడు అంటే చాలా దుఃఖం పొందినవాడు గొప్ప దుఃఖం గర్హణం అంటే నిందించడం పరి గర్హణం అంటే తీవ్రంగా నిందించడం గహనం అంటే చొరరానిది అడవి అని కూడా అర్థం గహనమయిన విషయం అంటే తేలికగా అంతుబట్టని విషయం పరిగహనం అంటే మిక్కిలి గహనమయినది

గూఢం అంటే రహస్యం దాచబడినదని అర్థం పరిగూఢం అంటే మిక్కిలి రహస్యం గ్లాని అంటే బడలిక, పరిగ్లాని అంటే ఎక్కువ బడలిక పరిగ్లానం అంటే చాలా బడలిక పొందినటు వంటిది పరిఘోష అంటే మహాధ్వని తాపం అంటే వేడిమి పరితాపం అంటే మిక్కిలి వేడిమి ఆయన పరితపించాడు అన్నప్పుడు చాలా బాధపడ్డాడని అర్థం తుష్టి అంటే తృప్తి అనీ, సంతోష మనీ అర్థం పరితుష్టి అంటే గొప్ప తృప్తి, గొప్ప సంతోషం పరితోషం అన్నా అదే అర్థం పరితోషణం అంటే తృప్తి పరచడం, సంతోషపెట్టడం పరితుష్టుడు, పరితోషి, పరితృప్తుడు అంటే మిక్కిలి తృప్తి, సంతోషం పొందినవాడు పరితోషించడమంటే సంతోషించడం

పరిత్రస్తం అంటే మిక్కిలి భయం చెందినది పరిదీప్తం అంటే బాగా వెలిగినది పరిదృఢం అంటే చాలా గట్టిది

పరిపూజ అంటే గొప్పపూజ గొప్పపూజను, అదరాన్ని పొందిన వాడు పరిపూజితుడు. పరిపూజన, పరిపూజనం అని కూడా అనవచ్చు

పరిపాలన అంటే మంచి పాలన పరిపాలితం అంటే చక్కగా పాలింపబడినది పరిపాలకుడు అంటే పరిపాలన చేసేవాడు

పరిపూతం అంటే మిక్కిలి శుద్ధమయినది, పవిత్రమైనది అని అర్థం పరిపూరణం అంటే చక్కగా నిండించడం పరిపూర్ణం చక్కగా నిండినది నిండయినది పరిపూర్ణత అంటే నిండుతనం పరిపూర్తి అంటే పూర్తిగా నిండడం, సంపూర్తి, సమృద్ధి, సమాప్తి

పరిపృచ్ఛ అంటే చక్కగా ప్రశ్నించడం పరిప్రశ్న అన్నా అదే అర్థం పరిపోషితుడు అంటే చక్కగా పోషింపబడినవాడు .పరిపేలవం అంటే మిక్కిలి పేలవం

పరిప్రాప్తి అంటే చక్కగా పొందడం. పరిప్రేషణం అంటే పూర్తిగా పంపివేయడం పరిప్రేష్యుడు అంటే పంపదగినవాడు, సేవకుడు పరిభుక్తం అంటే చక్కగా భుజింపబడింది పరిభోక్త అంటే చక్కగా భుజించేవాడు చక్కగా అనుభవించేవాడు, పరిపాలకుడు

పరిమితం అంటే మిక్కిలి మితం పరిమితి అంటే హద్దు, పరిమందం అంటే మిక్కిలి మెల్లనిది

పరిమళం అంటే గంధం, మనోహరమయిన వాసన నానావిధ ద్రవ్యాలను మెదపడం

వల్ల పుట్టే ఒక మనోహరమయిన సువాసన ధరింపబడేది కాబట్టి పరిమళం కుంకుమాదుల గంధం

పరిమోక్షం అంటే పూర్తి విమోచన విడుదల తప్పించుకోవడం పరిమోక్షణం అంటే విడుదల పరిమోహనం అంటే ఆకర్షించడం మిక్కిలి మోహపెట్టడం మ్లానం అంటే వాడినది పరిమ్లానం అంటే మిక్కిలి వాడిపోయినది

పరిరక్షణం అంటే చక్కగా రక్షించడం పరిరక్షితం అంటే చక్కగా రక్షింపబడింది, ఈ అర్థంలోనే పరిరక్షకుడు పరి లఘువు చాలా తేలిక పరిలుప్తం అంటే బాగా లోపించినది

పరివర్ధనం అంటే చక్కగా పెరగడం పరివర్ధితం అంటే చక్కగా పెంచబడింది పరివాహం అంటే పొంగిపొర్లేది, నది పరిశోధన అంటే మిక్కిలి శోధించడం రిసెర్చి అనే ఇంగ్లీషు మాటకు సమానార్థకంగా వాడుతున్నాం పరిశీలనం కూడా ఇటువంటిదే పరిశీలించు, పరిశోధించు అని క్రియలుగా కూడా వాడతాం పరిశోషం బాగా ఎండడం, వాడిపోవడం పరిశుష్కం అంటే బాగా ఎండినది వాడిపోయినది పరిశూన్యం అంటే పూర్తిగా లేనిది, వట్టిది.

పరిశ్రమ అంటే మిక్కిలి శ్రమ, పరిశ్రమ అంటే వ్యాయామం అని కూడా అర్థం పరిశ్రమ అన్నమాటను ఇండస్ట్రీ అన్న ఇంగ్లీషు మాటకు సమానంగా వాడుతున్నాం

పరిశ్రాంతి అంటే మిక్కిలి ఆయాసం మిక్కిలి విశ్రాంతి అని కూడా అర్థం గట్టి ప్రయత్న మన్న అర్థం కూడా ఉంది పరిశ్రాంతం అంటే మిక్కిలి ఆయాసం చెందింది, ఊరట చెందింది

పరిసమాప్తం అంటే పూర్తిగా సమాప్తి చెందింది చక్కగా ముగిసింది పరిసమాప్తి అని కూడా అనవచ్చు పర్యాప్తం అంటే కూడా సమాప్తి అనే అర్థం పర్యాప్తి అన్నా అదే అర్థం పర్యాప్తం అంటే యథేష్టమని కూడా అర్థం పర్యాప్తి అన్నా ఈ అర్థం ఉంది

పరిస్ఫుటం అంటే మిక్కిలి స్ఫుటమయినది తేటతెల్లం చక్కగా వికసించినది పరిస్రవం అంటే ప్రవహించడం. పర్యాయం అంటే క్రమం తప్పకుండా రావడం

పర్యాయోక్తి అని ఒక అలంకారం కూడా ఉంది సూటిగా చెప్పకుండా మరోవిధంగా చెప్పడం రాహువు భార్య సౌందర్యాన్ని నిష్ఫలం చేసిన విష్ణువుకు నమస్కారం అని ఉదాహరణ ఆమె సౌందర్యం నిష్ఫలం కావడానికి కారణం రాహు మరణం. దానికి కారణం విష్ణువు రాహువును చంపిన విష్ణువుకు నమస్కారం అని చెప్పడానికి బదులు కవి ఇట్లా చెప్పాడు మీరు ఇక్కడే ఉండండి నేను పూజ చేసి వస్తాను అని నాయికా నాయకులను విడిచి స్నేహితురాలు వెళ్ళిపోయింది. నాయికా నాయకులకు ఏకాంతం కల్పించడానికి స్నేహితురాలు ఏర్పరుచుకున్న నెపం ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకోవడానికి అవకాశం కల్పిస్తూ మరోపని కల్పించుకొని అవతలికి పోవడం మామూలే కదా.

☆

# ఉపాసన - ఉపేంద్రుడు

'ఉప ఉపసర్గల్లో చివరిది ఇదికూడా అనేక అర్థాలలో వస్తుంది దగ్గర, చిన్న, అధికం, పోలిక మొదలైన అర్థాలలో ఉప చేరుతుంది ఉపసర్గ అన్నమాటలోనూ ఈ 'ఉప' ఉంది. బహుపద నిర్మాణానికి. సృజనకు ఆధారమిది

ఉపకంఠం అంటే కంఠానికి సమీపంలో ఉన్నదని అర్థం దగ్గరగా ఉన్నదని కూడా అర్థం సమీపకాలం, సమీపదేశం అన్న అర్థంలో ఈ మాటను వాడవచ్చు కనిష్ఠిక అంటే చిటికెన వేలు దానికి సమీపంలో ఉండేది ఉంగరపువేలు, అనామిక దీన్ని ఉప కనిష్ఠిక అంటారు ఉపకన్య అంటే చెలికత్తె ఉపక్రమణం అంటే ప్రారంభించడం ఉపక్రమణి, ఉపక్రమణిక అంటే పీఠిక ఉపక్రమించు అని క్రియగా కూడా వాడతాం ఉపగతి అంటే సమీపించడం ప్రాప్తి, జ్ఞానం అని కూడా అర్థం ఉపగమం అన్నా ఇదే అర్థం ఉపగాత అంటే తోడుగా పాడేవాడు ఉపగీతి అన్నది ఒక గీత భేదం ఉపగ్రహణం అంటే పట్టుకోవడం ఉపగ్రాహ్యం అంటే దగ్గర పెట్టుకోదగింది

ఉపచక్షుస్సు ఉపనేత్రం అంటే కళ్ళజోడు ఉపతటం అంటే తట సమీపంలో ఉపదశం అంటే పదికి దగ్గరగా ఉన్నది తొమ్మిదికాని, పదకొండు కాని ఉపద్రష్ట అంటే దగ్గర ఉండి చూసేవాడు యజ్ఞ నిర్వహణంలో మంచిచెడ్డలు కనిపెట్టి చూసే ఋత్విక్కు

వ్యాకరణంలో ఉపధ అన్న పరిభాష ఉంది పదంలో చివరి వర్ణానికి ముందు ఉండే వర్ణం. ఉపధానీయం అంటే దగ్గరగా ఉంచదగింది, తలగడ ఉపధావనం అంటే వెంటపడడం, మననం చేయడం

ఉపనతం అంటే సమీపించినది, వంగినది అని అర్థం ఉపనతి అన్నా ఇదే అర్థం ఉప నయనం అంటే దగ్గరకు తేవడం ఉపనయనం అంటే వడుగు వేదం చదివించడానికి పిల్లవాణ్ణి గురువు దగ్గరకు పంపటంకోసం చేసే సంస్కారం ఉపనయం అనీ అనవచ్చు. ఉపనాయం, ఉప నాయనం అనికూడా అనవచ్చు వడుగయినవాడు ఉపనీతుడు ఉపనేతవ్యుడు అంటే ఉపనయ చార్హుడు

ఉపన్యాసం అంటే దగ్గర ఉంచడం ఇల్లడ పెట్టడం ఒక విషయాన్ని విస్తరించి చెప్పడం కూడా ఉపన్యాసమే

ఉపపదం అంటే ఒక పదానికి ముందు అవ్యవహితంగా ఉండే పదం. పేరుకు వెంటనే తగిలి ఉండే బిరుదులాంటిది కూడా ఉపపదమే. శర్మ, శాస్త్రి, వర్మ లాంటివి

ఉపబంధం అంటే గట్టిగా ఉండడంకోసం వేసే రెండో ముడి ఉపయాచకుడు అంటే దగ్గరకు వచ్చి యాచించేవాడు ఉపవక్త అంటే వక్తకు సహాయం చేసేవక్త ఉప వ్యాఖ్యానం అంటే వ్యాఖ్యానం చాలని చోట రాసే వ్యాఖ్యానం ఉపశాఖ అంటే శాఖ నుండి పుట్టిన శాఖ. ఉప శిష్యుడు అంటే శిష్యునకు శిష్యుడు, ప్రశిష్యుడు ఉపసత్త దగ్గర ఉండే సేవకుడు ఉపసదనం గురువుల దగ్గర కూర్చోవడం, శిష్యుడు కావడం ఉపస్థితం అంటే దగ్గర ఉన్నది ఉపాంతం అంటే అంతానికి దగ్గరగా ఉన్నది

ఉపాధ్యాయుడు అంటే అధ్యాపకుడు ఇతని దగ్గరకు పోయి చదువుకుంటాం కాబట్టి ఉపాధ్యాయుడు వేదం చదివించేవాడు

సమీపంలో ఉండి సేవచేయడం ఉపాసన అగ్ని సమీపంలో ఆచరించే అనశనవ్రతం ఉపవాసం ఇప్పుడు తినకపోవడమే ఉపవాసం అయింది

వ్యాకరణంలో ఉత్తమం అంటే రెండక్షరాలకంటే ఎక్కువ అక్షరాలున్న మాటలో చివరి

అక్షరం ఉపోత్తమం అంటే ఉత్తమానికి ముందున్నది

ఉప అంటే చిన్న అన్న అర్థం ఉంది ఉపకీచకులు అంటే కీచకుని తమ్ములు ఈ అర్థంలోనే ఉపేంద్రుడు ఇంద్రుని తమ్ముడు విష్ణువు సుందోపసుందుల్లో ఉపసుందుడు సుందుని తమ్ముడు ఉపాఖ్యానం అంటే ప్రధాన కథలో నేపథ్యం చెప్పడానికి వచ్చే అవాంతర కథ

కుల్య అంటే కాలువ ఉపకుల్య అంటే చిన్న కాలువ ఉపనది పెద్ద నదిలో కలిసే చిన్ననది ఉపగ్రంథం అంటే పెద్ద గ్రంథానికి అనుబంధంగా రచించిన చిన్నగ్రంథం ఉపగణం అంటే చిన్న గణం గ్రహం చుట్టూ తిరిగే చిన్నగ్రహం ఉపగ్రహం ఉపరథ్య అంటే చిన్నదారి

ఉపపురం అంటే పేట అష్టాదశ పురాణాలతో పాటు మనకు ఉపపురాణాలు కూడా ఉన్నాయి పురాణాలు వ్యాసకృతాలు ఇతర మునులు రచించినవి ఉపపురాణాలు దశవిధ రూపకాలతో పాటు నాటిక, త్రోటకం, గోష్ఠి మొదలైన 18 రకాల ఉపరూపకాలున్నాయి

ఉపమంత్రి అంటే చిన్న మంత్రి ఉపాధ్యక్షుడు, ఉపప్రధాని మొదలైన మాటలెన్నో వాడుతున్నాం దాదాపు అన్ని పదవులకీ ఈ ఉపపదవులు తప్పవు.

ఉపనాయిక అంటే నాయిక కంటే కొంచెం తక్కువ ఉపపాతకం అంటే చిన్నపాపం ఉపరత్నం అంటే తక్కువ రకపు రత్నం ఉపనక్షత్రం అంటే అశ్విని మొదలైన నక్షత్రాలకుండే ఇరవయ్యేడేసి చిన్న నక్షత్రాలలో ఒకటి ఉపాహారం అంటే చిరుతిండి ఉపధర్మం అంటే అప్రధానమైన ధర్మం అవైదిక ధర్మం

'ఉప' పోలికను కూడా తెలుపుతుంది ఉపభూషణం అంటే భూషణం లాంటిది ఉత్తరీయం లాంటివి ఉపభూషణాలు ఉపమ అంటే ఇతర వస్తువు దేనితో పోల్చబడునో అది అలంకారాలన్నిటిలో ముఖ్యమైనది ఉపమాలంకారం ఉపమానం, ఉపమేయం, ఉపమావాచకం, సమాన ధర్మం అన్న నాలుగు భాగాలుంటాయి ఉపమాలంకారంలో 'ఉపమా కాళిదాసస్య' అని నానుడి ఉపమాలంకారానికి కాళిదాసు ప్రసిద్ధుడు ఉపమాత అంటే దాది మాతృ సమానురాలు ఉపవేదం అంటే వేద సదృశమైనది ఋగ్వేదానికి ఆయుర్వేదం ఉపవేదం, యజుర్వేదానికి ధనుర్వేదం, సామవేదానికి గాంధర్వవేదం, అధర్వవేదానికి స్థాపత్య, శస్త్ర వేదాలు ఉపవేదాలు ఉపాంగం అంటే వేదాంగ సదృశం. మీమాంస, న్యాయశాస్త్రం, పురాణం, ధర్మశాస్త్రం ఉపాంగాలు

ఉపతప్తం అంటే మిక్కిలి తపింపజేసేది ఇక్కడ 'ఉప'కు ఎక్కువ అని అర్థం

ఉపనిధి అంటే మరొకని వద్ద దాచిన నిధి అందులో ఏముందో, దానిరూపం ఏమిటో, ఎంత ఉందో చెప్పకుండా దాచేది ఉపనిక్షేపం అంటే చెప్పి, చూపించి దాచేది ఉపనిధిగా దాచినవాడు ఉపనిధాత

ఉపజ్ఞ అంటే మొదటిసారి చెప్పినది ఇతరుల ఉపదేశం లేకుండానే మొట్టమొదట కలిగే జ్ఞానం ఉపజ్ఞాతం అన్నా అదే

ఉపదిక్కు అంటే విదిక్కు మూల. ఉపాదానం అంటే తీసికోవడం ఉపహాసం అంటే పరిహాసం

ఒకేమాటకు ఒకటికంటే ఎక్కువ ఉపసర్గలను కూడా ఒకేసారి చేర్చవచ్చు అభినివేశంలో అభి, ని అనే ఉపసర్గలున్నాయి ఉపసంహారంలో ఉప, సం అనే ఉపసర్గలున్నాయి దురాగ్రహంలో దుర్, ఆజ్ అనే ఉపసర్గలున్నాయి సుపరిపాలనలో సు, పరి అనే ఉపసర్గలున్నాయి పరినిర్వాణంలో పరి, నిర్ అనే ఉపసర్గలున్నాయి

సంస్కృతంలో ఉపసర్గలు అనేక పదాల కల్పనకు ఉపయోగపడుతున్నాయి ☆

